# ఆంధ్ర సాహిత్యపరిషత్తు.

(1911 సం॥ స్థాపింపఁబడినది)

## ప్రతిష్ఠాపకులు.

౧. శ్రీపిఠాపురము రాజావారగు శ్రీమహారాజా శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు సి. బి. ఇ., గారు.

౨. కీ. శే. శ్రీవేంకటగిరిరాజావారగు శ్రీమహారాజా సర్ వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్రబహద్దరు జి. సి., ఐ. ఇ. పంచహాజారి మన్సబ్దారుగారు.

## యావజ్జీవాధ్యక్షులు.

శ్రీపిఠాపురము రాజావారగు శ్రీమహారాజా శ్రీరావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరు సి. బి. ఇ, గారు.

## కార్యనిర్వాహకసభాధ్యక్షుఁడు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

౧. గంటి లక్ష్మన్నగారు, బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలు.

౨. దర్భా వేంకట శివరామరాసుగారు, బి. ఏ, బి. ఎల్., హైకోర్టు వకీలు.

## కోశాధ్యక్షులు.

౧. న్యాయమూర్తులగు ది. ఆనరబుల్ వేపా రామేశము పంతులుగారు.

౨. దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు.

పరిషదుద్దేశములు.—తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధినొందించుటయు, ఆ పనులను బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈ పనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీ క్రిందఁ జూపఁబడుచున్నవి:—

i. తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటువొకటి రచించి ప్రచురించుట;

ii. తెలుఁగుభాషకును సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించు నొక వ్యాకరణమును రచించి ప్రచురించుట;

iii. ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి రించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv. ఆంధ్రదేశ ప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యము లయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశము యొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

v. సర్వవిషయములను గుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi. ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii. తెనుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట;

viii. తెలుఁగువాఙ్మయమునకు సంబంధించినవిషయములనుగుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట;

x. ఒకపుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుఁ గూడ నుండవలయును;

xi. తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్నికార్యములను జేయుట;

విశేషము.—ద్రవ్యసంపత్తిని స్థితిగతుల ననుసరించి పైఁజెప్పిన మార్గములను గాలక్రమమున నవలంబించి కొనసాగింపవచ్చును.

---

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

సంపుటము ౧౫. | క్షయనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు | సంచిక ౧.

## కార్యదర్శిగారి విజ్ఞప్తి.

ఆ॥ 1926-వ సం॥ ఫిబ్రవరి 7-వ తేదిని ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ గార్యదర్శిగా నెన్నుకోఁబడిన దర్భా వేంకట శివరా సరాసు విజ్ఞప్తి.

మహాశయులారా!

పరిషత్తుయొక్క పరిస్థితులు బాగుగ నుండలేదనియు సరియైనమార్గమున నుంచవలయు ననియు సభవారి యభిప్రాయమనియు, నందుకొఱకై యెక్కువ శ్రమపడఁగలందులకు న న్నెన్నుకొని రనియు నేనూహించుచున్నాఁడను. అట్లెన్నుకొనుటలోఁ దమశక్తివంచన లేకుండఁ దాము సహాయభూతు లగుదురని సభవారు నాకు వాగ్దానముచేసినట్టును నే ననుకొనుచున్నాఁడను.

ఆంధ్రసాహిత్యపరిషత్తువలని ప్రయోజనములు ౩-వ నిబంధనలోఁ దెలుపఁబడినవి. "తెనుఁగుభాషను వాఙ్మయమును అభివృద్ధి నొందించుట యు ఆవిషయమునఁ బరిశ్రమచేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుట కయి యవలంబింపఁ దగిన కొన్నిమార్గము లుదహరింపఁబడినవి. పై ప్రయోజనములు నెఱవేర్చుటకు ద్రవ్యము ముఖ్యావసరమని చెప్ప నవసరము లేదు. ప్రస్తుతము పరిషత్తునకు ధన మత్యావశ్యక మై యున్నది. ఇందువిషయమై నా విజ్ఞాపన మేమనఁగా:—

1. పరిషత్పత్రికను సరియైనస్థితిలోనికిఁ దెచ్చి వెనుకటివలెనే రెండుమాసముల కొకసంచికను బ్రచురించుట ముఖ్యావసరముగఁ గనఁబడుచున్నది. పరిషత్పత్రికవిషయమై కొన్నిమార్పులు జరుగవలసియున్నట్లు కొందఱు మిత్రుల తలంపువెంబడిని నాయభిప్రాయముగ నీక్రింది యంశములు తెలియఁ జేయుచున్నాఁడను. భిన్నాభిప్రాయము లున్నయెడలఁ గాని యింతకంటె మంచి మార్పులు సూచింపఁ గల్గినయెడలఁ గాని వాని నన్నిటిని నాకు శీఘ్రముగాఁ దెలియఁ జేయఁ గోరుచున్నాఁడను. ఎట్లైనను బత్రిక నౌన్నత్యస్థితికిఁ దెచ్చుటయే నాముఖ్యోద్దేశము గాన యీవిషయమై సభ్యుల భిన్నాభిప్రాయములను శీఘ్రముగాఁ దెలుపఁ గోరుచున్నాఁడను. ప్రస్తుతము నే నిట్లనుకొనుచున్నాఁడను.

1 పత్రిక 10 లేక 12 ఫారముల మధ్యమున నుండవలయును

2. ప్రథమమున 2 ఫారములు ప్రధానవ్యాసములకు వదలిపెట్టవలెను

3. రెండుఫారములు కావ్యమునకు

4. తరువాత రెండు ఫారములు వచనరచనకు

5. తరువాత రెండు ఫారములు కావ్య విమర్శనమునకు

6. 1 ఫారము గ్రంథవిమర్శనమునకు

7. 1 ఫారము హాస్యరచన చమత్కారకావ్యములు మొదలగువానికి

8. మిగిలిన రెండుఫారములు సంపాదకుని యభిప్రాయమునకు వినియోగింపఁబడును.

వీలయినంతవఱకుఁ జిత్రపటములు గూడఁ జేర్పఁబడును. చిత్రలేఖనము మొదలగు విషయముల చర్చయును జరుపఁబడును.

ఈవిధమునఁ బ్రారంభింపఁబడిన పత్రిక పరిస్థితులు బాగుపడి చందాదారులసంఖ్య కొంతవఱకు వృద్ధియైనప్పటినుండి వ్యాసములకు అవసరమైనచో సొమ్మిచ్చుటకుఁ గూడఁ బ్రయత్నింపఁగలమని యున్నది.

కార్యదర్శిగాఁ బ్రవేశించినవెంటనే పూర్వ[illegible] [illegible] రావలసిన చందాలవిషయమై తెలియఁజేయుచున్నాను. [illegible] సాధ్యమైనంతత్వరలో నాయొద్దకుఁ బంపునట్లు కోరుచున్నాను.

పత్రిక:—చందాదారులసంఖ్య 500 దాఁటినఁగాని పత్రికయుద్దేశములు సంపూర్ణముగా నెఱవేఱఁ జాలవని తోఁచుచున్నది. దానికై తగుప్రయత్నములలో వారివారిశక్తినిబట్టి సభ్యులందఱును సాయము చేయవలసి యున్నది.

సాహిత్యపరిషత్తు:—ఇది స్థాపింపఁబడి యిప్పటికి 14 సంవత్సరము లైనది. నేఁటికి సభ్యుల యనుమతి మీఁద నీకాకినాడ ముఖ్యకార్యస్థానమైనది. పరిషత్తునకు, ఒక్క శాశ్వతనివాసస్థాన మేర్పడినఁ గాని వృద్ధి కలుగ నేరదు. ఆవిషయమై శీఘ్రముననే యేర్పాటు కాఁగలదని నమ్ముచున్నాఁడను. ప్రాచీన గ్రంథములు తాళపత్రములయందే యుండి శిథిలస్థితికి వచ్చుచున్నవి. వానిని శుద్ధపఱిచి ప్రతులు వ్రాయించి యచ్చులోనికిఁ దెచ్చుటకుఁ జాలశ్రమపడవలసి యున్నది. ఆంధ్రసాహిత్యమును వృద్ధిపఱుచుటకును, ఆంధ్రపారస్వతమును బ్రకాశింపఁజేయుటకును అనేకకార్యములు చేయవలసి యున్నది. వీని కన్నిటికిని సభ్యుల వివిధరూపకమైన సహాయ మత్యావశ్యకమై యున్నది. వెనుదీయక శ్రమ యని యెన్నక యందఱును సహాయపడుదురను దృఢమైన నమ్మకముతో నే నాంధ్రసాహిత్యపరిషత్తువారి సేవకునిగ వర్తించుటకు సాహసించినాఁడను. కించిజ్ఞుఁడనైన నన్ను దయయుంచి యాదరించుటకు వేఁడుచున్నాఁడను.

వ. వేం. శివరామరాను.

# వృత్తాంతములు.

ఆంధ్రవిశ్వవిద్యాలయనిర్మాపకశాసనము గవర్నరుజనరలుగారి యంగీకారము వడసి స్థిరపడినదని వినుట కెంతయు సంతసించుచున్నారము. విశ్వవిద్యాలయ మచిరకాలముననే స్థాపింపఁబడి క్రమక్రమముగా వృద్ధి నొందుఁగాత!

ఓం

చక్కఁగాఁ బరిశీలింపఁగా నీవిశ్వవిద్యాలయనిర్మాణమందు రెండుమూఁడు లోపము లున్నవనక తప్పదు. బెజవాడ ముఖ్యకార్యస్థానముగా నేర్పఱచుట యాలోపములలో నొకటి. కార్యస్థాన మనఁగా రిజస్ట్రారును వ్రాయసకాండ్రు నుండుట కేర్పడినచోటే కాదు. అచ్చట గొప్పపుస్తకభాండాగార ముండవలయును. ఆయావిద్యలలోని విశేషాంశము లుపన్యసించుట కాచార్యులు (Professors) ఉండవలయును. ఈయాచార్యులును బుస్తకాలయమును విద్యార్థు లున్నచోట నుండవలయును. కానిచో వ్యర్థ మగునుగదా. బెజవాడలో విద్యాలయమే లేదు. విద్యాలయము పెట్టుట కేర్పాటును లేదు. అచ్చటఁ గార్యస్థానమును వేఱుచోటుల విద్యాలయములు నుండుట యేయొకచోటను చాకిరే వొకచోట నున్నట్లగును

ఓం

ఆంధ్రదేశ మంతకు నొక్కటే విద్యాలయ మేర్పఱిచి యక్కడకు విద్యార్థుల నందఱ రప్పించుటయే శాసనముఖ్యోద్దేశము. అట్లుచేసినచో బోధనాపద్ధతియందును విద్యార్థులప్రవర్తనమందును సత్సంప్రదాయము లేర్పడుననుటకు సందేహము లేదు. ఏకవిద్యాలయ ముంచుటకు రాజమహేంద్రవర మనేకవిధములఁ దగినది. కాని దత్తమండలములు (Ceded Districts) ప్రత్యేకఖండముగాను రాజమహేంద్రవరమునకు దూరముగాను నుండుటచేత నచ్చటివిద్యార్థుల సౌకర్యార్థ మనంతపురమున నొకవిద్యాలయమును, వృత్తిసంపాదన కనుకూలము లగు వైద్యాదివిద్యల నేర్పుటకు విశాఖపట్టణము మిక్కిలి యనుకూలముగా నుండునను నభిప్రాయముతో నాపట్టణమునం దొక విద్యాలయము నుంచుట కేర్పాటయినది. ఈమూఁడుచోటులఁ బ్రస్తుతము విద్యాలయము లున్నవి. వానినే ముందు వృద్ధిచేయవలసియున్నది.

ఓం

ఇవిగాక పెక్కుతావులయందు పట్టపరీక్షవఱకు విద్యాదానము చేయుటకై సామాన్యవిద్యాలయము లుంచుటకు శాసన మవకాశము కల్పించినది. ఆప్రకారము పెక్కువిద్యాలయములు బయలుదేఱుట యొకవిధముగా మంచిదే కాని దానివలన విద్యాభ్యాసమును కేంద్రీకరింపఁజేయవలయు ననుశాసనముఖ్యోద్దేశమునకు భంగము కలుగక మానదు.

ఓం

క్రమక్రమముగా విద్య లన్నియు దేశభాషలలోనే బోధింపవలయు నని శాసనముయొక్క రెండవయుద్దేశము. ఇది యెంతయు శ్లాఘ్యమే, కాని,

తెలుఁగు మాత్రమే కాక, కన్నడము, ఓఢ్రము, ఉర్దూ కూడ దేశభాషలుగాఁ బరిగణింపఁబడవలయు ననునిర్ణయము వింతగా నున్నది. తెలుఁగుదేశమునకు దేశభాష తెనుఁగే కదా. అనంతపురము, బళ్ళారి మండలములలోఁ, గొన్ని తాలూకాలలో, కన్నడమును, గంజాముమండలములోని కొన్ని తాలూకాలలో ఓఢ్రమును వాడుకలో నున్నవి. ఈదేశభాగములు చెన్నపట్టనపురాష్ట్రమునుండి విడిపోవుటకుఁ బ్రయత్నించుచున్నవి. ఇందలి జనసంఖ్య మిక్కిలి స్వల్పము. ఉర్దుభాషమాటలాడు మహమ్మదీయు లన్నిమండలము లందును గలరు, కాని, వారిసంఖ్యకూడ స్వల్పమే. కావున నీమూఁడుభాషలుగూడ నాంధ్రదేశభాషలుగా గణింపవలయు ననుట యేమాత్రము సమంజసము కాదు. ఒక్క తెలుఁగు భాషనైనను బ్రచారములోనికిఁ దెచ్చుటయే కష్టసాధ్యము. ఇప్పుడు లేని యనేకగ్రంథములు తెనుఁగులోఁ బుట్టినపిదపఁగాని యాభాషలోనే యన్ని విద్యలు నేర్పుట యసంభవము. అట్టిగ్రంథములు రచియించుట కధికధనమును గాలమును బట్టును. మఱి మూఁడుభాషలలోఁగూడ నింతపని జరుగవలెననిన భగీరథప్రయత్నము కావలసియుండును. అప్పటి కయినను సాధ్యమగునా యని సందేహింపవలసియున్నది. పుస్తకము లున్న వనుకొన్నను వానిని బోధించుట కాయాభాషలకుఁ బ్రత్యేకముగా నుపాధ్యాయుల నియమింపవలయును. ఇంత పని జరగుట యసంభవము.

ఃః

ఏది యెట్లున్నను ఆంధ్రదేశమునకుఁ బ్రత్యేకముగా విశ్వవిద్యాలయ మేర్పడుట మంచిది. దానిమూలముగా నాంధ్రభాషాభివృద్ధియు నాంధ్రవాఙ్మయవృద్ధియుఁ గలిగి వానిమూలమునఁ గ్రమముగా నాంధ్రదేశాభివృద్ధికూడఁ గలుగుటకు సందేహము లేదు. జ. రా.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

ఆ 1926-వ సంవత్సరము ఫిబ్రవరి 7-న తేది ఆదివారము ఉదయమున కాకినాడ అన్నదానసమాజమందిరములో జరగిన ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహక సభాసమావేశవిషయము.

సభ్యులు.

మ-రా-రా-శ్రీ, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు (అధ్యక్షులు.)
,, దివాన్ బహదరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు.
,, జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.
,, దర్భా వేంకటశివరామరాసుగారు, బి ఏ., బి. ఎల్.
,, త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరావుగారు.
,, బోడపాటి సత్యనారాయణగారు.
,, అయ్యంకి వేంకటరమణయ్యగారు.

మ-రా-రా-శ్రీ. శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు.
,, కొట్రశ్యామల కామశాస్త్రిగారు.
,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
, చర్ల నారాయణశాస్త్రిగారు.
,, గొల్లకోట వేంకటరామయ్యగారు. బి ఏ.
,, అనంతపంతులు రామలింగస్వామిగారు
,, మోచెర్ల హనుమంతరావుగారు.
,, వంక వేంకటరత్నశాస్త్రిగారు.
,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
,, నడకుదుటి వీరరాజుగారు (మొదలైనవారు).

## తీర్మానములు.

I. నలుబదితొమ్మిదిమందిని సాధారణసభ్యులనుగాఁ జేర్చుకొనుట యైనది.

II. పరిషత్సభ్యులుగా నుండిన సర్ పిట్టి త్యాగరాయసెట్టిగారును, దివాన్ బహాదరు ధర్మవరము శేషాచార్యులుగారును, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారును, చెదలువాడ సుందరరామశాస్త్రిగారును కాలధర్మము నొందినందున నీసభవారు మిగులఁ జింతించుచున్నారు.

మహావిద్వాంసులును బరిశోధకశిఖామణులు నై సుప్రసిద్ధిఁగాంచిన సర్ రామకృష్ణ భండార్కరుగారు కాలధర్మము నొందుటచే భరతఖండమున కంతకును లోటు వాటిల్లె నని యీసభవారు మిగుల దుఃఖించుచున్నారు

అధ్యక్షులచే నుపపాదింపఁబడి యందఱిచే నేకగ్రీవముగా నామోదింపఁబడెను.

III. రక్తాక్షిసంవత్సర కార్యనివేదనము చదువఁబడి యామోదింపఁబడినది.

ఉపపాదకులు - దర్భా వేంకట శివరామరాజుగారు.
ఆమోదకులు - అళక్కి వేంకటరామయ్యగారు

IV. ఆయవ్యయముల అంచనాపట్టిక క్షయసంవత్సరమునకు ఈదిగువను గనఁబఱుపఁబడిన వివరణప్రకారముగా సంగీకరించుటయైనది. మఱియు క్రోధనసంవత్సరాయవ్యయములు లెక్కప్రకారము అంగీకరించుటయైనది.

(a) క్షయసంవత్సరమునకు:—

| 1. ఆయము:— | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ఉద్ధారకులవలన - - | 7500 | 0 | 0 |
| పోషకులవలన - - | 700 | 0 | 0 |
| యావజ్జీవసభ్యులవలన - | 500 | 0 | 0 |
| సాధారణసభ్యులవలన - | 600 | 0 | 0 |
| పత్రికచందాలు - - | 200 | 0 | 0 |
| పుస్తకవిక్రయము - - | 100 | 0 | 0 |
| బ్యాంకివడ్డి - - - | 850 | 0 | 0 |
| | 10,460 | 0 | 0 |

| 2. వ్యయము:— | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| జీతములు - - | 1500 | 0 | 0 |
| ఇంటియద్దె - - | 500 | 0 | 0 |
| ప్రయాణవ్యయములు | 100 | 0 | 0 |
| ఏజెంటువ్యయములు | 300 | 0 | 0 |
| పుస్తకభాండాగారము | 300 | 0 | 0 |
| పత్రికకు - - | 800 | 0 | 0 |
| కాగితములు మొదలైనవి | 100 | 0 | 0 |
| ఇతరవ్యయములు - | 250 | 0 | 0 |
| | 3850 | 0 | 0 |

V. ఆ॥ 1924-వ సంవత్సరము అక్టోబరు 12-వ తేదిని తణుకులో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడిన 10-వ తీర్మానము గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట కవకాశముండుటచేతను ఈపరిషత్తువారికి గ్రామ్యవాద మసంగీకార మగుటను ఆతీర్మానమును త్రోసివైచి 1914-వ సంవత్సరము ఏప్రిల్ 19-వ తేదిని కాకినాడలో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడినట్టియు, ఆనందసంవత్సర పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినట్టియు తీర్మానమునే యీసభవారు స్థిరపఱుచుచున్నారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులుగారు

ఆమోదకులు - కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

మొదటిసవరణ —"గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట" మొదలుకొని "ఆతీర్మానమును త్రోసివైచి" అనువఱకు తగ్గించి "పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినట్టియు తీర్మానము" అనుదానికి తరువాత "తణుకుతీర్మానమునకు భిన్నము కానట్లు ఈసభవారు స్థిరపఱుచుచున్నారు." అని చేర్పవలెను.

ఉపపాదకులు - అయ్యంకి వెంకటరమణయ్యగారు.

ఆమోదకులు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు.

రెండవసవరణ.—తణుకుసభలో జరిగినతీర్మానమందు ప్రయోగింపఁబడిన కొన్నిపదములయర్థము కేవల గ్రామ్యవాదానుకూలమేమో అనికొందఱకు సందేహము కలుగుచున్నందునను ఈసభవారికి గ్రామ్యవాద మసంగీకార మగుట వలనను ఆసందేహము తొలఁగుటకు 1914-వ సంవత్సరములో జరిగిన కాకినాడ తీర్మానమును సంపూర్ణముగా నీసభవారామోదించుచున్నారు.

ఉపపాదకులు - దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు.

ఆమోదకులు - చేవలి రామసోమయాజులుగారు.

వీని నన్నిటి నాలోచించి సభవారు చేసిన సిద్ధాంతము.

ఆ॥ 1924-వ సంవత్సరము అక్టోబరు 12-వ తేదిని తణుకులో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడిన 10-వ తీర్మానము గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట కవకాశ ముండుట చేతను ఈపరిషత్తువారికి గ్రామ్యవాదమసంగీకార మగుట చేతను 1914-వ సంవత్సరము ఏప్రిల్ 19-వ తేదిని కాకినాడలో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడినట్టియు ఆనందసంవత్సరపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినట్టియు తీర్మానమునే యీసభవారు స్థిరపఱుచుచున్నారు.

ఈ తీర్మానమును నలుగురుతప్పఁ దక్కినసభ్యులందఱు నామోదించిరి.

(క) ఇఁక ముందెప్పుడైనను పైనుదహరింపఁబడిన తీర్మానము విషయమై పునర్విమర్శనము జరుగుట యావశ్యకమని కార్యనిర్వాహకసభవారికిఁ దోఁచి

వచ్చుడే గాని యట్టిపునర్విమర్శనము జరుగఁ గూడదనియు జరగినప్పుడు అప్పటికి పరిషత్సభ్యులుగా నుండి విషయనిర్ణయమునం దభిప్రాయ మిచ్చుట కధికారము గలిగిన సభ్యులందఱిలో 100కి 66 గురుగాని అంత కెక్కువమంది గాని ఆమోదించనిదే ఆతీర్మానమును మార్పఁగూడ దనియు నీసభ వారుతీర్మానించుచున్నారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులు గారు.

ఆమోదకులు - వంకాయలపాటి బంగారురాజుగారు.

అత్యధిక సంఖ్యాకులచే నామోదింపఁబడినది.

VI. పరిషత్కార్యస్థాన మాంధ్రదేశమధ్యమున నుండవలయునని యాంధ్రుల కభిప్రాయమై యుండుటచేతను కాకినాడ పట్టణమునం దున్నయెడల పరిషత్తు స్థిరపడి పురోభివృద్ధి నొందుటకుఁ దగిన హేతువు లుండుటచేతను పరిషత్కార్యస్థానము రాజమహేంద్రవరమునకు మార్పవలయునని 1924-వ సంవత్సరము అక్టోబరు 12-వ తేదిని తణుకులో చేయఁబడిన తీర్మానమును రద్దుపఱిచి దానికిఁ బూర్వసంవత్సరము అనఁగా 1923-వ సంవత్సరము అక్టోబరు 14-వ తేదిని తునిలోఁ జేయఁబడిన తీర్మానము ప్రకారము పరిషత్కార్యస్థానమును కాకినాడకే మార్పవలయునని యీసభ వారు తీర్మానించుచున్నారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులుగారు.

ఆమోదకులు - వంకాయలపాటి బంగారురాజుగారు.

అత్యధికసంఖ్యాకు లగుసభ్యులచే నామోదింపఁబడినది.

VII. శ్రీపిఠాపురము మహారాజావారగు శ్రీరావు వేంకట కుమారమహీపతి సూర్యరావు బహద్దరు సి. బి. ఇ. గారిని పరిషత్తునకు యావజ్జీవాధ్యక్షులుగా నీసభవా రెన్నుకొనుచున్నారు.

ఉపపాదకులు - కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు.

ఆమోదకులు - దర్భా వేంకట శివరామరాసుగారు.

VIII. ఇప్పు డున్న కార్యనిర్వాహకసభ్యులసంఖ్య అత్యధిక మగుటచేత, ఇఁకముం దాసభ్యులసంఖ్య 15 కంటె నెక్కువగా నుండఁ గూడ దనియు ఆ సభ్యులలో మూఁడవవంతు సభ్యులు యావజ్జీవాధ్యక్షునిచే నియమింపఁబడవలయుననియుఁ దక్కినవారిని పరిషత్సభ్య లెన్నుకొనవలయు ననియు నీసభ వారు తీర్మానించుచున్నారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులుగారు.

ఆమోదకులు - అయ్యంకి వేంకటరమణయ్యగారు.

ఏకగ్రీవముగా నంగీకరింపఁబడినది.

IX. పరిషత్కార్యస్థానము కాకినాడకువచ్చినది మొదలుకొని దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తినాయఁడుగారిని కోశాధ్యక్షునిగను

దర్భా వేంకట శివరామరాసుగారిని కార్యదర్శిగాను ఈసభ వారెన్నుకొనుచున్నారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులుగారు

ఆమోదకులు - అళక్కి వెంకటరామయ్యగారు.

సవరణ.— ఈపరిషత్తునకు ఇప్పటినుండియు దర్భా వేంకటశివరామరాసుగారిని గంటి లక్ష్మన్నగారిని కార్యదర్శులుగను పరిషత్తు కాకినాడకు వచ్చినది మొదలు దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు కోశాధ్యక్షులుగను నీసభ వారెన్నుకొనుచున్నారు.

ఉపపాదకులు - శ్రీ కాకొళపు వేంకటరావుగారు

ఆమోదకులు - కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

ఈసవరణసభ్యులందఱిచే నేకగ్రీవముగా నామోదింపఁబడినది.

X. దర్భా వేంకటశివరామరాసుగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, చేవలి రామసోమయాజులుగారు, దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు, గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఈయైదుగురను కార్యనిర్వాహకసభాసభ్యులుగా నీసభవారెన్నుకొనుచున్నారు.

ఉపపాదకులు - దర్భా వేంకట శివరామరాసుగారు.

ఆమోదకులు - త్రిపురాన సూర్యప్రసాదరావుగారు.

XI. ఈదినమునఁ జేయఁబడిన తీర్మానముల ననుసరించియుఁ బరిషత్కార్య సౌకర్యము ననుసరించియుఁ బరిషన్నిబంధనలలో నావశ్యకమైనమార్పులు చేసి రాఁబోవు వార్షికసభలో నిర్ణయించుటకు పంపుటకై ఈక్రిందివారి నొక యుపసంఘముగా నేర్పఱుచుట యైనది.

1. దర్భా వేంకటశివరామరాసుగారు. 2. కేశవరపు కామరాజుగారు. 3 అళక్కి వేంకటరామయ్యగారు. 4. త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు. 5 జయంతి రామయ్యపంతులుగారు.

ఉపపాదకులు - జయంతి రామయ్యపంతులుగారు.

ఆమోదకులు - మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

ఏకగ్రీవముగా నామోదింపఁబడినది.

XII. రాఁబోవు వార్షికోత్సవముగూడ కాకినాడలోనే జరుగవలయునని నిశ్చయింపఁబడినది.

ఉపపాదకులు - దర్భా వేంకట శివరామరాసుగారు.

ఆమోదకులు - జయంతి రామయ్యపంతులుగారు.

శ్రీకృష్ణాయనమః.

# స్వాగతము.

(కాకినాడలో—ఆహ్వానసంఘాధ్యక్షులచేఁ జదువఁబడినది)

సదాశయులారా!

స్వదేశగౌరవమును సంపాదింపనుపగు ఘనోద్యమములన్నిట ముఖ్యమనఁదగు నాంధ్రసాహిత్యపరిషత్తుయొక్క పదునాల్గవ వార్షికోత్సవ మీయేఁడు మాపురమున జరుగుట మాయొక్క మహాభాగ్యమని యెన్నఁదగును. ఇదివఱకీమహాసభ మాపట్టణమున నానందవత్సరమున నత్యానందముగఁ గావింపఁబడియున్న సంగతి మీకెల్లరకు విశదమే. అప్పు డాంధ్రగీర్వాణాంగ్లభాషల నాఱితేఱి సర్వవిధముల సమర్థులై కీర్తిశేషులైన పోలవరం జమీందారులగు కె. ఆర్. వి. కృష్ణారావు బహద్దరుగా రీ సభ కాహ్వానసంఘాధ్యక్షపదవి నలంకరించి సభను జయప్రదముగఁ గొనసాగించియుండిరి. అట్టి విద్వాంసులు నేఁ డీసభాభవనమునఁ గానరామి కెంతయుఁ జింత వొడముచున్నది. మున్నంతటి పండితులచే మీకొసంగఁబడిన స్వాగతము నేఁడేవిధమునఁ జూచినను సమర్థత గానరాని నేను గావింపఁబూనుటఁ జూడ సభ్యులకు వింతగొలుపకమానదు

ఈ పట్టణమున విద్యాధన వివేకాదులచే నాకన్నఁ బేరెన్నికఁ గన్నవారు పెక్కురున్నను వారినందఱ విడిచి, నేను మీయట్టి విద్యానిధులకు స్వాగత మొసఁగసాహసించి ముందునకు వచ్చినందుకు ముందు నన్ను క్షమింప వేఁడుచున్నాను. వేదాంత జ్ఞానమావంతయు లేకున్నను తనకుఁ గల యవ్యాజ భక్తి నాధారముగఁ దీసికొని యగమ్యుఁడగు భగవంతునిఁ బూజింప నెంచిన సుమతికుమారునివలె, నే నాంధ్రభాషాజ్ఞానము నంతగా సంపాదించినవాఁడను గాకున్నను నాకు గల మాతృభాషాభిమానమును సాహాయ్యముగాఁ గైకొని సభకు విచ్చేయు మీయట్టి పెద్దలకు నోపినకొలఁది నతిథిపూజఁ జేయఁబూనితిని. నాయీ యుద్యోగము సరసముగ సాగించుటకు నేను సంపాదింపవలసిన పదార్థములంతగా దుర్లభములుగావని యెంచియును, మీ గొప్పతనమును భావించియును, నేనీమూలముగా మాతృభాషాసేవను, పండితపూజను, జేయఁదలపెట్టితిని. కావున భక్తితో మే మొసఁగు సపర్యను ప్రేమతో నంగీకరించి, మా యేర్పాటులయందు లోపములున్నచో మఱవ వేఁడుచున్నాను.

నిజభాషాభిమానులారా! మానవాభివృద్ధికై చేయఁబడుచున్న సభలన్నిటను నీపరిషత్తత్యంతాదరణీయమై వెలయుచున్నది. మనుజులు సగౌరవముగఁ గార్యముల సాగించుటకు ముఖ్యసాధనము వివేకము. అట్టి జ్ఞానమును సమకూర్పఁజాలునది యుత్తమవిద్య. అట్టి విద్యాసంపద యభివృద్ధిఁ జెందు మార్గముల నారయునది సాహిత్యసభ యగుటచే నీపరిషత్తునకు సకలసభలలో నగ్రస్థాన మొసఁగవలయును.

పదునాల్గు వత్సరములనుండి యీసభ పనిచేయుచున్నను స్వభాషాభిమానులెల్లరు పూనికతో దీని సాగింప నంతగాఁ గృషిసలుపుచున్నట్లు కానవచ్చుటలేదు. భాషాభిమానుల కిది ధర్మముకాదు. సాహిత్యపరిష త్తిదినములలో నీక్రింది కారణములచే నత్యవసరమై యున్నది.

i. ఇప్పుడు భాషావిషయమై మన యాంధ్రలోకమున భిన్నాభిప్రాయములు బయలుదేఱియున్నవి. గ్రాంథిక భాషావాదులని, వ్యావహారిక భాషావాదులని, రెండుపక్షములు విడివడి యున్నవి. బాగుగా నాలోచించి విద్వాంసులు గ్రంథములందుఁ బ్రయోగించు సలక్షణభాషను బుస్తకములందువలె వ్రాయవలె ననువారు గ్రాంథికభాషావాదులు; లోకవ్యవహారమునఁ జెల్లుచుండు పదముల నెల్లఁ బ్రయోగింపవచ్చు ననువారు వ్యావహారిక భాషావాదులు. ఈ యుభయుల వివాదము కొంతకాలమునుండి వచ్చుచున్నది. ఈ వాదములలో నేది శ్రేయస్కరమో నిర్ణయముచేయుటకై పండితుల యభిప్రాయముల వెల్లడించుటకొక సాహిత్యపరిష త్తవసరమై యున్నది. దైవానుగ్రహముచే నట్టి యీపరిషత్తిదివఱకే యేర్పడియున్నది. కావునఁ బండితులు దీని ద్వారముగ నేది యవలంబనీయమో పరిష్కరించుట యగత్యమైయున్నది.

ii. పద్యరచనావిషయమునఁ గూడ నభిప్రాయభేదములు బయలువెడలుచున్నయవి. శాస్త్రమర్యాదలతో సలక్షణ పద్యనిర్మాణ మార్గమును నేర్చుకొనుట యిదివఱకు వాడుకయైయున్నది. యతిప్రాసముల తీసివేసి, ఛందస్సుల నిచ్చవచ్చినట్లు త్రుంచివైచి, పద్యములనల్లుట కవిత్వమను వాదము నూతనముగా బయలుదేఱినది. ఇదియుఁ గ్రమక్రమముగా వ్యాపించుచున్నది. ఈ రెంటిలో నేమార్గము మంచిదో తేల్చుటకై యిట్టిపరిషత్తు లత్యవసరము.

iii. ఆంధ్రపదముల లోకసామాన్యమైన వాడుక ననుసరించి వాడుటయే కాక విదేశ భాషాపదములను, వాక్యములను నిరంకుశముగ వాడుట యాంధ్రభాషను బోషించుట యను వాదమొకటి బయలువెడలినది. ఇది భాషకు

నిజముగు పోషణముగునా! కాదా! యనుచర్చ భాషాభిమానులు త్వరలోఁ గావించుకొనవలసియున్నది. అట్లు కావింపకున్న నచిరకాలములోనే యాంధ్ర, భాషాసంపద తొలఁగిపోవు ననుటకు సందేహము లేదు. కావునఁ బండితులెల్లరిట్టి పరిషత్తులలోఁ గర్తవ్య మాలోచింపనగును.

iv. దైవకృపచే మన యాంధ్రదేశమునకుఁ బ్రత్యేకముగా నొక విశ్వవిద్యాలయము లభించినది. దానినెట్లు వాడుకొనిన మనకు నిజముగు లాభము చేకూరునో దేశాభిమానముగల పండితులందఱు బాగుగ నాలోచింపవలసియున్నది. అది యిట్టి పరిషత్తుమూలముగా నిశ్చయమగుట మిక్కిలి లాభకరము. కావున మనభాషను గాపాడుకొనవలెనను తలఁపున్నయెడల మనకీ పరిషత్తు ముఖ్యావసరము.

ఈపరిషత్తేర్పడిన పిమ్మట మన సారస్వతమునకు నపూర్వలాభము లనేకములు కలుగుచున్నవి. (a) ఈపరిషత్తుయొక్క ప్రేరేపణము చేతనే యత్యుదారులును, భాషాభిమానమాననీయులును నగు శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజావారు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు వను నపూర్వవిపులనిఘంటువును బండితులచే రచియింపించుచున్నారు. ఇది మన యాంధ్రసారస్వతమునకు ననుపమానాపూర్వలాభమని నిస్సంశయముగఁ దెలుపవచ్చును. (b) అనేకములగు నముద్రితగ్రంథములు పరిషత్తువారిచే వ్యయప్రయాసములకోర్చి సంపాదింపఁబడి పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడియున్నవి. ఇది యపూర్వాభివృద్ధిగాదా? (c) ఇతర సారస్వతములందుఁ గల ప్రకృతిశాస్త్రాదికము లాంధ్రీకరింపఁబడి పరిషత్పత్రికలో ముద్రింపఁబడుచున్నవి ఇది దేశాభ్యుదయహేతువు కాదా? (d) పురాతన శాసనము లనేకములు భాషాభిమానులు కనిపెట్టి వాని ప్రతిబింబసహితముగ నందున్న విశేషములఁ బరిషత్పత్రికలో నచ్చొత్తించుచున్నారు వీని మూలమున ననేకాపూర్వవిషయములు తేలుచున్నవి. ఇది జ్ఞానాభివృద్ధికి హేతువు కాదా? (e) దేశమున భాషాభిమానమును బురికొల్పుటకై యాయాతావుల వార్షికోత్సవములు గావింపఁబడుచున్నవి. ఆయాసమయములందు నానాప్రదేశములనుండి యేతెంచిన పండితవరులచే నానావిషయములంగూర్చి ఘనోపన్యాసములు గావింపఁబడుచున్నవి. ఇది యపూర్వభాగ్యము కాదా?

మంచితలంపుతోఁ బండితకవివరులెల్లరును దీనికి సాహాయ్యమునొసంగిన నీసాహిత్యపరిషద్రసాలమునుండి యింకను నెన్నియో యమూల్యఫలములఁ బడయనగును. ఇట్టి యీపరిషద్వార్షికోత్సవమును జయప్రదముగఁ గొనసా

గింప మాతృభాషాభిమానప్రేరితులై మీరెల్లరును, దూరమనక భారమనక, నాయాహ్వానము నామోదించి యిచ్చటికి విచ్చేసియున్నారు. ఇట్టి భాషాభిమానులగు మీకెల్లరకు మరల హృదయపూర్వక స్వాగతమర్పించుచున్నాను. శబరి యడవిపండ్లతో సమకూర్చిన యతిథిపూజను శ్రీరామచంద్రుఁడు దయతో నందుకొనినరీతినే మే మొసఁగు సత్కారమును బ్రేమతోఁ జేకొని మమ్ముఁ గృతార్థులుగాఁ జేయుఁడు. తగినసభాపతి నెన్నుకొని, కార్యక్రమమును జయప్రదముగా నడపింపుఁడు. చిరకాలమునుండి మనమపేక్షించుచున్న పరిషత్కార్యాలయము వేగముగా నాంధ్రదేశమునకు వచ్చునట్లు చేయఁబడుఁగావుత. భాషాభిమానులెల్లరును నీసభకుఁ దగుసాహాయ్యముఁ జేసియభివృద్ధిలోనికిఁ దీసికొనివత్తురుగాక. దయామయుఁడగు సర్వేశ్వరుఁడు మనమనోరథముల నీడేర్పుంగావుత.

కో॥ సూర్యనారాయణమూర్తి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# మాతృభాషాసందేశము.

(కాకినాడ పరిషత్సభలోఁ జదువఁబడినది)

---

సీ. అవనీజనంబుల కన్యోన్యసఖ్యహృద్భావ మవగతంబుగఁ జేయునట్టిచతుర
తనుఁ గొల్చువారి కిందును నందు భవ్యపదావాప్తి సమకూర్చునట్టివరద
సంసారగహనసంచరణఖిన్నము లైన జనచిత్తములకు విశ్రామభూమి
విబుధజిహ్వాసింహపీఠికాసీన యై లోక మేలెడుసర్వలోకరాజ్ఞి
యఖిలలోకకుటుంబిని యైనవాణి, గీతసాహితీరసమయక్షీరములను
దొలఁకుచుండెడుతనచన్నుదోయిఁగుడిపి, తనదుబిడ్డలనాంధ్రులఁదనుపుగాత.

క. సోదరులలోనఁ బొడమువి, వాదముఁ గని తల్లి యాంధ్రవాగ్దేవి విషా
దాదరకోపకృపాకలి, తాదేశం బిడియె నిటు నిజాత్మభవులకున్. ౨

ఆ. మన్ననమునఁదనదుమహితాశయముఁదోఁపఁ, జేసిమీకుఁదెలియఁజెప్పుమనియె
నంబనుడులు గాఁ దదాదేశమును మీకు, విన్నవింతు వినుఁడీ యన్నలార. ౩

ఉ. పుత్రకులార నాదుపెనుపున్ మదిఁ గోరెడు మీర లీగతిన్
మైత్రిఁ దొఱంగి యొండొరులు మాటికి వ్యర్థవివాదమగ్ను లై
ధాత్రిని బైపయిం బెనుపు దాల్చెదు నాసరివారిలో మహా
పత్రప నాకుఁగూర్చు టిది పాడియె యే మనుదాన మి మ్మయో. ౪

క. వాదులుఁ బ్రతివాదులు నవుఁ, గా దని డీకొనుటె కాని కర్తవ్యాంశం
బేది యొ యెఱుంగ రైతిరి, గాదిలిసుతులార బుద్ధి గలదో లేదో. ౫

తే. గ్రాంథికము మేలు గ్రామ్యంబుకంటె ననుచు
గ్రాంథికముకంటెఁ గడు మేలు గ్రామ్య మనుచు
నుభయవాదులు వాదించు చొండొరులను
దిట్టికొంటయు కాక నన్ దిట్టుచుంద్రు. ౬

క. గ్రామ్యగ్రాంథికవాదము, భూమ్యాకాశముల నిండిపోయె నవుర ని
ష్కామ్యగతిఁ దిట్టుకొంటయు, సమ్యక్ఫల మయ్యె నీను సను నే మీకున్. ౭

క. మీ కిఁక వాదము వలవదు, నాకలరూ పెఱుఁగఁ జెప్పి నాకుఁ గడు హితం
బౌకార్యము వివరించెద, మీకున్ నాహితము గడు సమీహితము గదా. ౮

ఆ. గ్రామ్యవాదులకును గ్రాంథికవాదుల, కగ్రగణ్యు లైనయాత్మజులకు
వేఱువేఱ చక్క వివరింతు లోకసమ్మతముఋతముబుధభిమతముహితము. ౯

ఆ. వత్స రామమూర్తి వాత్సల్యమునఁ గొన్ని, పలుకు లిపుడు చెప్పవలసె నీకు
నాదుహితమితోక్తు లాదరింపఁగదన్న, యొగ్గు దొలఁగి నీకు లగ్గుగలుగు. ౧౦
ఆ గిడుగురామమూర్తి పిడుగు గ్రాంథికభాష, కంచుఁ బేసవడితి వాంధ్రజగతిఁ
బిడుగ వైన నేమి గొడుగ వైతివి గాదె, పలురకముల జగతిఁ బ్రబలునాకు. ౧౧
క. పిడుగ వయి చెఱుపఁగలవే, గొడుగ వగుచు మనుపఁగల వె కొడుకులలో నా
ఆడిపోరుపెట్టి నన్నుం, బడఁదిట్టుట నాయ మగునె పట్టీ నీకున్. ౧౨
ఆ. "తెవులు గదిరి క్రుళ్ళి చివుకులంజియ" నంచుఁ బట్టివయ్యు నన్నుఁ దిట్టినావు
తల్లి లంజ యైనఁ దా నేమి యగు నొకో, యింత యరయ వైతి వేమికుఱ్ఱ ౧౩
క. తిట్టితి వని కినియను జ, మ్మొట్టు లయిన నన్నుఁ గొలుచు శేయఃభిమత మాఁ
బట్టీ నను సేవించెదు, పట్టున నీపట్టుదలకుఁ బ్రమదముఁ గంటిన్. ౧౪
క. నీ కార్యదీక్ష నీదగు, లోకజ్ఞత నీదుసత్యలోలత నీవి
ద్యాకాంక్ష నీదుసేవయు, నాకున్ మది కెక్కె దీవనల నీకిడుదున్. ౧౫
మ. కలలో నైన భవద్విపక్షజనతా కావ్యమ్ములం దోఁచుత
ప్పులనే చూపుటయుక్ మహాసభలలోఁ బూర్వాంధ్ర మీనాఁటివా
రలకున్ రా దని చెప్పి దెప్పుటయు దుర్వారంబుగా సారె నీ
కలవా టైనది మానుకోఁగలవె వత్సా మత్సరాలాపముల్. ౧౬
క. పామరజనసౌలభ్యము, నీమనమునఁ గోరి నన్ను నిఖిలజనసుబో
ధామృతమునఁ దేల్చెదనని, యీమతముం గొంటి నీదుహృదయ మెఱుఁగుదున్.
ఆ. ఏట్సుదొరమతంబు హిత మగునే నీకు, నాదికవులమతమె యహిత మగునె
యొకటి సేయఁబోయి యొకటి సేసెదు నన్నుఁ, గోదు బాసఁ జేయకుము కుమార.
క. భల్లుకపుఁబట్టు నీకే, చెల్లున్ నా సేవ నీవు చేసినటులు ని
న్నొల్లనివారలు సేయరు, చెల్లరె యరు లైన మెచ్చఁ జెల్లదె నిన్నున్. ౧౯
సీ. ఆంధ్రభాషాదేవి నగు నాకు నద్ద మై మించుభారతము గాలించి చూచి
నన్నయ్యయాది యీనాఁటిదాఁక సమస్తకవులు వాడిన ప్రయోగము లెఱింగి
లాక్షణికులు సెప్పులక్షణంబులకు సత్కవుల పోకడకు వ్యత్యయముఁ దెలిసి
సకలభాషాతత్త్వశాస్త్రధీసంపదన్ నాపుట్టుపూర్వంపురూపు లరసి
నాదుపూర్వరూప మెఱుఁగ రా దటంచుఁ, జెప్పఁ బగఁబూనిరైన నీచేయు సేవ
నాదు మేల్గోరి కొల్చుచున్నా మటంచుఁ, జెప్పికొను నీవిపక్షులుం జేయ లేదు,
ఆ. పరమభక్తి నైనఁ బగ నైన వగ నైనఁ, బ్రీతి నైనఁ బ్రాణభీతి నైన
నాదుసేవ సేయునరుఁ బ్రోతు నీకు న, ల్లగుట నేఁ బ్రసన్న నైతిఁ దనయ. ౨౧

సీ. ప్రతివాదఖండనప్రతిభటాగ్రహబుద్ధిఁ గలఁగి పేరెలుఁగు గద్గదిక వడఁగ
గ్రామ్యంబుపైమదింగలక్రొ వారసమునాఁగనుదోయిబాష్పాంబుకణములురల
వాదసంగతపారవశ్యరసావేశ కలన మైఁ గాయంబు కంప మొంద
నతిదీర్ఘ ముగనుపన్యాస మ్మొసంగుత్ర మమ్ముచే మేనఁ జెమ్మటలు గ్రమ్మ
గ్రామ్యభాషాప్రశస్తికై కాలు ద్రవ్వి, కలితగంభీరధోరణిం గంఠ మెత్తి
ప్రతిగుతిముడీలుపడనీవుపన్యసించు, చందముఁదలంపమది నాకు జాలిపొడమ.
ఆ. చెప్పువాఁడ వీవు చేయువాఁడవు గావు, చెప్పఁ దగిన దెల్లఁ జెప్పినావు
చాలు నింక మాను చర్విత చర్వణ, మేల నీకు వాదు మేల పుత్ర. ౨౩
సీ. పూర్వసత్కవిమార్గముఁ బోవునాకూర్మి పుత్త్రులం గడుఁ దిట్టిపోసినావు
భారతాదులభాష ప్రజలు కందనిమాని ఫల మంచు సభలలోఁ బలికినావు
దేశదేశమ్ములు దిరిగి నాపదసేవ నేఁత వమ్మని చాటి చెప్పినావు
మర్మముల్ నోనాట మాటాడి నాలోని లోపపుంజము లెత్తి చూపినావు
గ్రాంధికమునొంచి గ్రామ్యమ్ముఘనతఁ బెంచి, పత్రికలలోన వ్యాసముల్ వ్రాసినా
అంబ నైనట్టి నామీఁద నక్కటకట, యింక నీకసి దీఱ లేదే తనూజ [వృ
క. నీయుక్తిప్రత్యుక్తులు, న్యాయములుగఁ దోఁచుఁ గాని నా కాదారిన్
శ్రేయము సేకూరదు పు, త్రా యింక దురాగ్రహమ్ము దగ దుడుగ వనా. ౨౪
ఆ. కట్టు లేనిపాలఁతికైవడి బాసయుం, గట్టు దప్పు నేనిఁ బుట్టు హాని
యిం తెఱింగి కాదె కృతులలోఁ గవులు నన్, నియమవతిని జేసి నిలిపినారు ౨౫
క. వ్యవహారభాషలోఁ గల, నవనవసూక్తుల గ్రహించి ననుఁ బెంచుచుఁ బ్రా
క్కవిపథమున ననుఁ గొలిచెదు, కవు లుండఁగ నెందు కింతకష్టము వత్సా. ౨౬
ఉ. పిల్లల కేమి చెప్ప నిది పెద్దల కైనను రా దటంచు న
న్నొల్లవొ బత్తిమైఁ గొలువ కుండఁగ నేను బ్రసన్న నౌదు నే
తల్లిని నన్నుఁ గొల్వఁ దగదా సుత యాంగ్లము పాటిసేయ నే
పిల్లలమీఁద నీపిడుగుప్రేటును వైవఁగ నీకుఁ బోలు నే. ౨౭
తే. గ్రాంథికాంధ్రమ్ము నేర్పెడుకాల మందె, బడులపిల్లల కేఁ గోదుబాస నైతి
గ్రామ్య మే నేర్పు నీవన్నకరణి నేను, గ్రీకొ లేటినొ యాదుఁ గాదే కుమార.
ఆ. ఆత్మసుతులప్రతిభ యాంగ్లభారతి సేవ, కప్పగించి యిట్టు లైతి నేను
గొడుకకొలుకరానికొయ్య నౌటకు హేతు, వింత యెఱుఁగ నైతి వేమి చెపుము.
ఆ. ఆంగవాణి కొల్వ నందు సహస్రాంశ, మైన నన్నుఁ గొల్తు రేని నేఁడు
నన్నయలును దిక్కనలును శ్రీనాథులు, నెంద ఱో జనింప రేఁ తనూజ ౩౦

ఆ. ప్రాఁ దెనుంగుఁగమ్మ వ్రాసి భారతభాష, నచ్చె నంచుఁ గేలి సలిపినావు
తనయ నన్ను నిట్టు లనఁగూడు నే నీకు, శాశ్వతికిని నాకుఁ జావు గలదె.3౨

క. లోకముఁ గని విశ్వత్కవి, లోకము దమకైతలందు లోకప్రతిబిం
బైకార్థసగసఫణితుల, వాకొను సూక్తులు మదీయవాసస్థలముల్. 33

సీ. పలుకుపల్కునఁ దేనె లొలుకుచక్కని తేట
కలికిమాటలసీటు చెలువుగులుక
నలవుపూఁగొలలందుఁ బొలయు తావులు వోలెఁ
దొలఁకుభావముల మైఁబులక లొలయ
మెలపు నేయవు మించి సొలవు నింపెడు వింత
మెలఁకువల్ వాడికిఁ బేరెలమి గొలుపఁ
దెలుఁగులోకమునకుఁ దళుకుటద్దం బయి
తులకించుజాతీయకలన వెలయ
నలరుకైత గలిగి యైదవ ప్రాఁబల్కుఁ, బొత్తమునకు సారభూత మైన
యాత్రయీతులితకవిత్రయీ విరచిత, భారతంబు నాకుఁ బ్రాణపదము 3౪

క. సాధన మిహపరములకును, బోధనము సమస్తధర్మపుంజములకు నా
రాధనము పరేశునకును, నాధన మగుభారతంబు నా కిరవు సుమీ 3౫

ఆ. అదియ నాదుకల్మి కాదర్శ మై యొప్పు, నాఁడు నేఁడు నెల్లనాఁడు గూడ
దానితత్త్వ మెఱుఁగలేనివానికవిత్వ, విలసనమ్ము నేలవిడుచుసాము. 3౬

ఆ. దానితెరువుఁ బట్టి తమతమనాఁటిక్రొం, దెలుఁగుఁబలుకుబడులతీరు లరసి
నాకుఁ బెంపు గూర్చినారు శ్రీనాథాది, కవివరేణ్యు లాత్మకావ్యములను.3౭

సీ. భారతాదులఁ గల్గుభాష ఛాసరుభాష యో యని తోఁపింప కుండుమార్పు
వివిధమండలవాసు లవునాంధ్రులకు భాష దురవగాహము గాక పరఁగుమార్పు
సనసపూర్వకవీంద్రసంప్రదాయమునకు నవిరుద్ధగతి నొప్పునట్టిమార్పు
దేశకాలమ్ముల తెఱఁగును బట్టి యత్యావశ్యకం బైనయంతమార్పు
లోకవిదు లైనసుకవులవాకు లందు, నేను బ్రీతి వసించి చేయించు చుందు
నలపరబ్రహ్మపరశక్తి నైన నాకుఁ, బ్రకృతిరూపిణికిని మార్పు ప్రకృతి గాదె 3౮

క. వ్యవహారసిద్ధికొఱకై, వివిధాకారముల జగతి వెలయుట నైజం
బవు నాకుఁ గాని నా దగు, ప్రవిమలరూపంబు సుకవిపలుకులఁ దోఁచున్.

క. సుకవులు నాప్రియపుత్రులు, సుకవులు కావ్యములనాదుసూక్తులు నాకుం
బ్రకృతికలితరూపమ్ములు, వికృతమ్ములు దక్కఁగలుగువివిధాకృతులున్. ౪౦

క. వికృతము లగుగ్రామ్యపదములు, లకలంకసుకావ్యముల కనర్హమ్ములు మా
మకవృద్ధి వానిచేఁ గా, నకటా యీబుద్ధి నీకు నర్హమె సత్నా. ౪౧

ఆ. పూర్వసంప్రదాయమునను గ్రామ్యము కాని, వ్యావహారికాంధ్రభాషలోన
గ్రంథరచన సేయఁగా వచ్చు ననెడుతీ, ర్మాన మేల యింతమాన మేల. ౪౨

సీ. తీర్మానములను బంధింపఁ గా వచ్చునే యతిశిరంకుశవాఙ్మహితకవులఁ
దీర్మానములచేతఁ దీరు నే మనవాఙ్నిఖిలనారస్వతనిర్ణయమ్ము
తీర్మానములు సమ్మతింపఁగాఁ జేయు నే సకలాంధ్రజనమానసముల నెల్లఁ
దీర్మానములు నిబంధించి కాచెదు నే ప్రతిపదజనపదబంధనంబు
మాటమాటకుఁ దీర్మాన మేటి కయ్య, యాంధ్రజగతిఁ దీర్మానంబు లక్కఁగల వె
కాడిక నీకోర్కి నీశిష్యకోటికతన, సాగుచుండె నీ కీర్తి జగతి నేల. ౪౩

ఆ ఎట్టులైన నాభివృద్ధికే నీ చింత, వాటుపడుచు నిన్న వాఁడ నగుట
నిన్ను మదిని మెచ్చి సన్నుతించెద జూవె, యీవివాదము పగ మిడుకఁ గుమార

ఉ నాకలకూడ నెఱుంగఁగ నవాంతమున్ వనుఁ గొల్చుచుండుటం
జేకుఱినట్టి పాండితి యశేషము వ్యర్థము గాక యుండ సు
శ్లోకపురాకవీంద్రకృతిసూక్తులఁ బట్టి సమగ్రనూతన
వ్యాకరణంబు వ్రాసి చరితార్థుఁడ వై యశ మొందవే సుతా. ౪౪

ఉ వేలకు వేలు నాదునభివృద్ధికి వెచ్చము సేయుదాతనా
జాలికి జాలి నొందు గుణశాలి మహోన్నతి నేను బొందఁగా
మేలిప్రయత్నముల్ సలుపు మేటి మదాత్మభవుండు సూర్యభూ
పాలవతంసుఁ డెప్పుడును బ్రాపయి యుండఁగ నాకు లోపమే. ౪౫

ఉ. ప్రాయము మీఱె విప్రుఁడవు గ్రామ్యపుఁబిచ్చకగొంతుగోయ వ
జ్రాయుధ మేల పూనితి వయా యిది యెప్పుడు కృష్ణమూర్తిశా
స్త్రీ యిటు సేత భారతకృతిక్రియ కెంతయు నంతరాయ మై
పోయె నెఱుంగ వో దుడుకుపోకలఁ బోవుట నీకుఁ బాడి యే. ౪౬

ఉ. తిట్టిరి నిన్ను గ్రామ్యు లని తేకువ లేక మఱింత నీవునుం
దిట్టిన వారుఁ దిట్టుదురు తిట్టులతోడన కాల మేఁగు నీ
పట్టినపట్టు సాగ నలభారత మంతయుఁ జెప్పి కీర్తి చే
పట్టుము వ్యర్థవాద మనవాదము చాల్పఱచుం గుమారకా. ౪౭

తే. బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి సరిగఁ జేయఁ, బూనినట్టి విశ్వామిత్రమౌని వోలె
భారతముమీఁద వే ఱొకభారతమును, బూనుచీ కేటికీ తేనిపోనిగొడవ. ౪౮

సీ. ఆంధ్రపత్రిక నన్నయాదిపూర్వకవీంద్ర భాషలో వ్రాయింపవచ్చునయ్య
భారతిలో "వెంకిపాట"లు ప్రకటింప వల దంచు నుడిగింపవచ్చునయ్య
చిత్రోపచిత్రాసపవిత్రభాషలగ్రామ్యపత్రికల్ మాన్పింపవచ్చునయ్య
పాపపుంజము వోలెఁ బ్రబలుచుండెడు పాడు వాఙ్మయమ్ము నణంప వచ్చునయ్య
యచ్చు చవుకయ్యె నా సేవ హెచ్చు మయ్యె. నిచ్చవచ్చిన కైతలు పెచ్చుపెరిఁగెఁ
బట్టి విపరీతకాలమ్ము వచ్చి యుండ, గ్రామ్యవిధ్వంసనము సేయఁ గలవె నీవు.

సీ. నా మేలు మదిఁ గోరి నన్నుఁ బెంచినజగత్పూజనీయుఁడు రాజరాజు లేఁడు
నాకూర్మికొడుకు శ్రీనాథు నేలినమహోదాత యావేమభూనేత లేఁడు
నాకేమిగడయు నై నను లెస్స యని మెచ్చినట్టి శ్రీకృష్ణరాయండు లేఁడు
కవుల కేమిఁగుపాడిగా నీవు లిడి నన్ను రహిఁ బెంచురఘునాథరాజు లేఁడు
ఎండ తెండలలో యాంధ్రభూమీశు లిప్పు డవనిఁ గల్గియు లేనియట్లిరి నాకు
నొక్కరో యిద్దఱో తక్క నుర్వి నాదు, గోల వినువారు లేరార కాలమహిమ.

క. నాసవతి యాంగ్లభారతి, వేసములకుఁ జిక్కి ధనము వెచ్చింతురు నా
కోసం బన మది నెంతయు, దోసము గా నెంతు రీసుతుల నే మందున్. ౫౭

సీ. మోటారుబండ్లకై మాటికిం జల్లుసొమ్మంత గా దందు నొక్కింత యైనఁ
బరదేశయాత్రకై పాఱఁబోసెడుద్రవ్య మంత గా దందుఁ గాసంత యైన
దొరలయుచ్చకపువిందులకు నై చెఱచుడబ్బంత గా దందు గోరంత యైన
నమితదుర్వ్యసనార్థమయి తొలంగెడుధనమ్మంత గా దందు నా వంత యైన
నేమి పాపమొ నాకొఱ కీయ నొల్ల, రాంధ్రరాజులయభిమాన మట్టు లున్న
దీనుతులలోన మతభేద మిట్టు లున్న, దింక నెట్లున్నదో నాయదృష్ట మకట.

సీ. కాటుకకన్నీరు గాఱ నేడ్చెడునన్ను నుపలాలనము చేసి యూఱడించెఁ
బరసేవకంటె దుంపలు దించు నడవిలో మనుట శ్రేయం బంచు మదిఁ దలంచె
బహుదరిద్రతను గీడ్పడియు నా సేవకై తనజీవితం బెల్ల ధారవోసె
సంపదంధులకు నంజనము లేమి యటంచు నాత్మానుభవము నో రారఁ జాటె
భాగవతమును బాడి నన్ బ్రోడఁ జేసె, నట్టినాకూర్మినిఱు పేదపట్టివంటి
కొడుకొకండైన నేఁడు నాకడుపునందుఁ, బొడమ నేని యు నాదుఃఖ మడఁగిపోదె.

తే. కూర్మికొడుకులు నీబోంట్లు కొంద ఱైన, జగతి నుండుట నీపాటి మిగిలి యుంటిఁ
బట్టి వజ్రాయుధంబింకఁ బాఱవైచి, భారతము వ్రాసికొమ్మిహాపరము లొదవు.

తే. వాద సభ లేల యీప్రతివాదిపక్ష, దూషణము లేల యీవట్టిదోసఁగు లేల
నీవు నేర్చినభంగి నా సేవ చేసి, నాకు సంతుష్టి ఘటియింపవే కుమార. ౫౮

తే. నాకు నుపయుక్తము లగుగ్రంథములు నిలుచు
నునపయుక్తంబు లగుకృతు లణఁగిపోవు
నెవ్వ రెటు వ్రాసికొన్న నా కేమికొఱఁత
వాఙ్మయం బెల్ల మత్స్వరూపంబ కాదె. ౫౮

తే. నాదుహితవాక్యముల మది నాదరించి, లేనిపోనివివాదముల్ మాని పూని
నాదుసేవ సేయుఁడు కార్యవాదు లగుచు, వాదశూరులు గాకుఁడు వత్సలార.

సీ. అజ్ఞానతిమిరసంహారి యానిర్బంధవిద్యావిధానంబు విస్తరిల్లు
సకలవిద్యాజ్ఞానసంపాది యగునాంధ్రసర్వకళాశాల సంఘటిల్లు
దేశసంఘాభివృద్ధిప్రదాయక మైన ప్రత్యేకరాష్ట్రంబు పరిఢవిల్లు
నౌన్నత్యకర మైనయభినవాఖిలశాస్త్ర వితతార్థపరివృత్తి యతిశయిల్లు
నాంధ్రమహియెల్ల నామయం బై వెలుంగ
నెందు నేలోపమును లేక యే పెసంగి
జగతి నాపెంపె పెంపుగా నెగడఁగలను
వలదు సుతులార యా వంత వంత మీకు. ౫౯

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు.

---

# గుణగవిజయాదిత్యునినాఁటి యద్దంకి శిలాశాసనము.

ఈశాసనము గుంటూరుమండలమున ఒంగోలుతాలూకాలోని అద్దంకి గ్రామములో నొకపొలములో నున్న రాతిమీఁదఁ జెక్కఁబడి యున్నది. ఇది బట్టరువర్తు, వేణుగోపాలసెట్టిగార్లు ప్రకటించిన నెల్లూరుమండల శాసనములలో ఒంగోలుతాలూకాలో ౩ సంఖ్యగాఁ బ్రకటింపఁబడినది. కాని వారు తీసిన శాసనప్రతిబింబము చక్కఁగా లేకపోవుటచేత మూలపాఠమును సరిగా నిర్ణయింపలేకపోయినారు. వారిచ్చిన శాసనప్రతిబింబముకూడ నస్పష్టముగా నున్నది.* వీరి కాన్పురస్థాంధ్రపరిశోధక మహామండలి పంచమవార్షికోత్సవసమయమునఁ దదధ్యక్షులగు శ్రీ॥ వెంకటలక్ష్మణరావుగారీ శాసనమునుగూర్చి కొంత ముచ్చటించిరి. వారికిని సరియైన పాఠము లభింపలేదు. స్పష్టమైనప్రతిబింబ మిప్పుడు లభించుటచే దానిని బట్టి పాఠము నిర్ణయింప వీలు కలిగినది. వెనుకనుండి ప్రతిబింబముతోడను సంపూర్ణవ్యాఖ్యానముతోడను శాసనము నీపత్రికయందే ప్రకటింపఁ దలఁచినాఁడను. ఆపని చేయుటకుఁ గొంతకాలవిలంబ మగును, గావునను, ఇదివఱలో మనకు లభించిన పద్యకవిత్వము, అనఁగా యుద్ధమల్లుని శాసనముకంటెఁ గూడ నిది ప్రాచీన మగుటచే నాంధ్రలోక మీశాసనమును జదువుటకుఁ గుతూహలపడు ననియు నిప్పుడు శాసనము మాత్రము ప్రచురించుచున్నాఁడను.

ఈశాసనము గలరాయి పగిలిపోవుటచే శాసనము పూర్వభాగము నశించినది. ఉన్నదానిలో మొదటిపంక్తిచివర రెండక్షరములును రెండవపంక్తిచివర "భూపాలకుణ్డు" అను మాటయుఁ, దరువాత నొకతరువోజపద్యమును జివర నాలుగుపంక్తులు గద్యమును గలవు. మొదటి రెండుపంక్తులుగూడఁ బద్యభాగములైనట్లును ఆపద్యమునకును రెండవపద్యమునకు నేకాన్వయమైనట్లును గనఁబడుచున్నది.

ఒకానొకరాజు తాను పట్టాభిషిక్తుఁడైన మొదటిసంవత్సరమందే పాండురంగుఁ డనునాతనిని సేనానాయకునిగా నియమించె ననియు, నాపాండురం

*ఈశాసనము చెక్కఁబడినరాయి యిపుడు చెన్నపురములోని మ్యూజియములోనికి వచ్చినదఁట.

గుణగ బోయకులము వారి పాలించుచుండిన కండ్రె వాడిసీమను జయించుట మొదలగు కొన్ని పరాక్రమకార్యములు చేసి ఆదిత్యభట్టారకునకు ధర్మపుర మను గ్రామమునఁ గొంతభూమి దానము చేసె నని యీశాసనములోని విషయము.

పాండురంగుఁడు గుణగవిజయాదిత్యుఁ డను చాళుక్యరాజు సేనానాయకుఁడుగా నున్నట్లు శాసనాంతరములవలనఁ గనుపట్టుచున్నది, కావున నీశాసనములో సూచింపఁబడిన "భూపాలకుణ్డు" గుణగవిజయాదిత్యుఁ డని యూహింపవచ్చును. ఆరాజు శా. స ౭౬౬ మొదలు ౮౧౦ వఱకు రాజ్యము చేసెను గాన నీశాసనము నాకాలమునందె పుట్టియుండవలెను. అనఁగా యుద్ధమల్లుని బెజవాడ శాసనముకంటె నీశాసనము రమారమి ౧౦౦ సంవత్సరములు ముందు దని తేలుచున్నది. ఆకాలమందుఁ గూడ నాంధ్రపద్యకవిత్వముండిన దని చెప్పుచున్నది, కావున, నీశాసనము మిక్కిలి ముఖ్యమైనది.

జయంతి రామయ్య

యథామాతృకము.

1 - - - - - - - - - - - - - - సూర
2. - - - - - - - - - - - - భూపాలకుణ్డు (॥)
3 పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు బలగవ్వఱంబొ
4. ప్ప(ం)గ(ం) బైలేచి సేనపట్టంబుగట్టిఇచ్చి ప్రభుం
5. బణ్డరంగు(ం) బణ్చి (ణ్డి?) నసమత్త (సామంత్త?) పడునతో బోయ
6 కొట్టంబుల్వన్రెణ్డు గొని వేంగినాణ్డి గొఱల్చియా
7. త్రిభువనాంకుశబ (బు?) ణనిల్పి కట్టెపుదుర్గంబుగడు
8 బయల్నేసికుణ్డు బ్బెజవాడగావిణ్చె మెచ్చి (॥)
9. పణ్డరంగుపరమమహేశ్వరుణ్డు ఆదిత్యభటరని
10 కి ఇచ్చిన భూమి ఎనుబోదివుణ్ల (ట్ల?) అడ్డుపట్టునేలధ
11. ర్మపురంబున దమ్మణ్ఛులు (।) వీనిరక్షించ్చినవారికి అస్వ
12. మేధంబున ఫలంబు అగు (॥)

## వర్తమానవర్ణక్రమానుసారము.

- - - - పర - - - - - - భూపాలకుండు॥

తరువోజ. పట్టంబుగట్టిన ప్రథమంబు నేఁడు బలగర్వ మొప్పంగఁ బైలేచి సేన
పట్టంబుగట్టించి ప్రభుపండరంగుఁ బంచినసామంత పదువతో బోయ
కొట్టముల్పండ్రెండు గొని వేఁగినాఁటి గొలచియా త్రిభువనాంకుశముస నిల్పి
కట్టెపుదుర్గంబు గడుబయులేసి కందుకూర్బెజవాడ గావించె మెచ్చి॥
పండరంగుపరమమహేశ్వరుండు
ఆదిత్యభట్టారకునకు ఇచ్చినభూమి
ఎనుబది (ఎనిమిది?) పుట్ల ఆళ్లు
పట్టు నేల। ధర్మవరంబున ధర్మువులు
వీనిరక్షించినవారికి అశ్వమేధంబు
న ఫలంబు అగు॥

---

శుభమస్తు.

# ఆంధ్రవాణీసమాశ్వాసనము.

శా. అమ్మా! నెమ్మొగ మంతయుం గములిపో న ట్లేడ్చుచున్నా వదే
మమ్మా! యాంధ్రకుమారరత్నములు నీయారాటముల్ మాన్పి బం
ధమ్ముల్ ద్రెంచి భవత్సమున్నతనికిఁ గాదా పూన్కిమైఁ బెద్దయు
త్నమ్ముల్ సేయుచునున్నవా రెఱుఁగవా తల్లీ! గిరాందేవతా! ౧

క. అడుగడుగునకుఁ బందము, పదువ్యాకృతిసూత్రములను బక్కనఁ ద్రెంపం
గడఁగినప్రజ్ఞానిధులగు, కొడుకులఁ గన్నావు నీకుఁ గొద వేమమ్మా! ౨

గీ. ప్రాఁతనగలు మూలఁ బడవైచి చక్కని, క్రొత్తనగలు దాల్చుకొని ముదంబు
దొలఁకఁ గులుకలేక తోడిఁబడి వలపోయఁ, దగునె నీకు వెఱ్ఱితల్లి! యిట్లు!

సీ. భారతం బొకయూరిపాటపై దిగఁదుడ్చి గౌతమీనదిలోనఁ గలిపివైచి
సకలశబ్దానుశాసనమూలసూత్రదు గ్రంథమండలిఁ గట్టి కాల్చివైచి
ప్రియతమ వ్యావహారికమహాశబ్దార్థ వైభవంబున వింతవన్నె వెట్టి
తలఁగొట్టుకొన్న నర్థముచిక్కు విడఁబోని భావకవిత్వసంపత్తిఁ గూర్చి

గీ. నన్నయాదులతలలను దన్నఁగలుగు,మంచికవు లిప్డు నిను సంస్కరించుచుండఁ
బెరిఁగి పెంపెక్కి యభివృద్ధిఁ బెరసిమెఱసి, త్రుళ్ళ కిళ్ళల లోలోనఁ గ్రుళ్లెదమ్మ!

శా. ఏదీ! నన్నయగాదు, తిక్కనయుఁ గా, దెఱ్ఱన్నయే గాదు ము
న్నీదారిన్ నిను స్వేచ్ఛగా నడపినారే యెన్నఁడేనిన్! భవ
త్ప్రాదుర్భావముఁ దొట్టి నేఁటిదనుకం బ్రాఁజక్కియే కాని య
య్యో! దివ్యంబగు నిట్టిత్రోవఁ బడి నీవాక్కప్డే నేఁగితే? ౭

సీ. పిచ్చలవిడి నిట్లు విహరింపఁగల్గెనే యంబరో! నీకు నన్నయ్యనాఁడు?
ఈక్రొత్తనగలు నీ వెపుడైనఁ దాల్చితే యక్కటా! నీవు తిక్కన్ననాఁడు?
ఈభావగీతంబు లెపుడేనిఁ గల్గెనే యయ్యయో! నీకు నెఱ్ఱన్ననాఁడు?
ఈయందచందంబు లెప్డే నొదవెనే యారార! నీకు సోమన్ననాఁడు?
కలిగె నేఁటికి నీపూర్వ కర్మఫలము, పండిపరిపక్వదశనొంది పరఁగఁబట్టి
హాయిగా స్వేచ్ఛగా వీని ననుభవింప, కేడ్వ దొరకొంటి విట్టు లిదేమితల్లి?

క. యతులఁట! ప్రాసములఁట! వ్యాకృతులఁట! లక్ష్యమ్ములఁట! యిసీ! యిఁక నేవో
గతులఁట! వారల కేమె, న్మతిగలదే? నిన్నుఁ గట్టి మట్టిరి జననీ! ౮

సీ. నిన్నుఁ గట్టళ్లలో నిల్పి బాధించిన నన్నయ్య చనిపోయినాఁడు గాదె
తలతిక్క నినుఁ దెయ్యితక్కలాడించిన తిక్కన్నయును గడతేఱెఁ గాదె
తనదుసర్వజ్ఞత్వమున నిన్నుఁ బొరిగొన్న సోమన్న పితృభూమిఁ జొచ్చెఁగాదె
సివమెత్తి నిను వెఱ్ఱిఁజేసి యాడించిన పోతన్న తెగటాఱిపోయెఁ గాదె
ఇడుమలన్నియు నిప్డు గట్టెక్కె నీకు, నింక నంతయు నభివృద్ధియే గదమ్మ!
యుమ్మలించెద వేల? యట్టుడికినట్లు, లుడికిపోయెద వేల? గీడ్వెడెద వేల?

శా. చాళుక్యుండు గతాయువై చనియెఁ గృష్ణక్ష్మాతలాధీశుఁడున్
వ్రాలెం గాలపుగర్భగోళమున; నిర్బంధంబు నీకూడె; నీ
వేళన్ నిన్నిఁకఁ గట్టువా రెవరు దేవి! యూఱటం జెందవే
వేళాకోళపుటూఱడింపులని భావింపంగఁబో కమ్మరో! ౯

క. నూతనవృత్తంబులు నవ, నీతంబును బోలు గ్రామ్యనిజరసవద్వా
గ్జాతంబులు నోహోనీ, కీతెఱఁగున వెలుఁగ నెచ్చె దేమే తల్లీ! ౧౦

సీ. బండిఱప్పన్నపైఁ బడి గంగి యేడ్చిన గీతంబు గాంధర్వగీతి నీకుఁ
బసవసరంగు వెంకఁడు చిన్నిపైఁ గూర్చు పదములు లలితాష్టపదులు నీకుఁ
గాఁపుకన్నె రసంబు గాఱఁ బాడినగీతి నాదెంపు వేణుగానంబు నీకు
నీడిగ యీరి పేరెలుఁగెత్తి క్రోల్చిన పాటలు మహతిపై పాటనీకు

(సంపు. ౧౪ సం. ౨ శేషము)

నడపవలసిన దేవతా స్తోత్రాదికపద్యములును గృతిపతివంశావతారపద్యములును రచియింపఁజేసి కృతిఁబొందెను. ఈనారసింహపురాణమునందలి యాశ్వాసాంత గద్యము లన్నియు నీగ్రంథము హరిభట్టుకృత మనియే నొడువుచున్నవి. ఇందలిగద్యములకును హరిభట్టారకుని యితరగ్రంథములయందలి గద్యములకును గొంచె మైనను భేదము కాన్పించుట లేదు. సంస్కృతనారసింహపురాణముఁ బూర్వభాగము చదలువాడ యెఱ్ఱన్న* మొదట నాంధ్రీకరింపఁగా, నిఖిలవిద్యాచతురాస్యుండును రాజమాన్యుఁడును, గవిరాజనుతుఁడును, ధీయుతుఁడు నగు నీతండ్రి హరిభట్టిప్పు డుత్తరభాగము నాంధ్రభాషయందు వచనకావ్యము (గద్యపద్యాత్మకమైన ప్రబంధము) గా రచించెను గావున నీ వాప్రబంధమును నాపేర నంకితముఁ గావింపవలయు నని రంగప్రధాని కోరఁగా రాఘవమనీషి యట్లుచేయుట కేమి యభ్యంతర ముండును? ఉండదు వచనకావ్య మనఁగా గద్యపద్యాత్మకమైన ప్రబంధ మనుట కాధారము హరిభట్టుకృత మగువరాహపురాణమున నీక్రిందివచనమునఁ గన్పట్టుచున్నది. “పురాతనకవీశ్వరానుసరణంబును గుకవినిరాకరణంబునుంజేసి శబ్దార్థభావరసాలంకారబంధంబుగా నొక్క ప్రబంధం బాంధ్రభాషాభవ్యం బగువచనకావ్యంబుగా రచియింపం బూనిన సమయంబున” అను నీ వచనము గలవరాహపురాణము గద్యపద్యాత్మకమే కాని కేవల వచనకావ్యము కాదు. దీనింబట్టి చూడఁగా వచనకావ్యమన్న గద్యపద్యాత్మకకావ్య మని హరిభట్టుకాలమున వ్యవహృతిలో నున్నట్లు స్పష్టమగుచున్నది. ఇందలి కవిత్వమునకును హరిభట్టుకృతము లగువరాహపురాణాదులయందలి కవిత్వమునకును సర్వజనవేద్యము లయిన పోలికలుఁ గూడఁ బెక్కులు గలవు. ఆయీ కారణములచే నీగ్రంథము నిస్సంశయముగ హరిభట్టకృతమే యని స్పష్టమగుచున్నను, గించిద్భ్రాంతిజనకము లైనకారణాభాసములచే స్థూలదృష్టికి రాఘవమనీషికృత మని భ్రాంతిపొడము నేమో యని (అనవసర మైనను) ఇంతవఱకు వ్రాయవలసివచ్చినది.

ఏతద్గ్రంథకర్త యగుహరిభట్టు యజుర్వేదివైదికబ్రాహ్మణుఁడు.

---

*ఈతఁడే కవిత్రయమునందలి యెఱ్ఱాప్రెగ్గడ యనియు శంభుదాసుని యింటిపేరు చదలువాడవా రనియు నామిత్రు లొకరు చెప్పిరి. చదలువాడ మల్లయ విరచితమగు విప్రనారాయణచరిత్ర మీవిషయమునకుఁ బ్రబలప్రమాణముగా నున్నది.

మ. అమృతప్రాయవిశేషకావ్యరచనాహంభావవాగ్రామణీ
రమణీమూర్తివి; వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతి; వే
కముఖబ్రహ్మవు; యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండ; స
ర్వమతేజుండవు రాఘవార్యహరిభట్టా! సత్కవిగ్రామణీ!

అనువరాహపురాణపద్యము పై విషయమును దెలుపుచున్నది. మఱియు నితని గ్రంథములయందలి యాశ్వాసాంతగద్యములం బట్టి యీతఁడు భారద్వాజసగోత్రుండును రాఘవమనీషిపుత్త్రుఁడును, హనుమదుపాసకుఁడును, అష్టఘంటావధానపరమేశ్వరబిరుదాంకితుఁడు నైయున్నట్లు తెలియవచ్చుచున్నది. ఆశ్వాసాంతగద్యములవలననే కాక వరాహపురాణమునందలి

గీ. అష్టఘంటావధానవిశిష్టబిరుద, నీవు రచియింపఁదలఁచిన నిరుపమార్థ
రమ్యమగు నీవరాహపురాణకావ్య, మంకితము సేయు నాపేర సంచితముగ.

అనుపద్యమును బట్టియు నీతనికీ (అష్టఘంటావధాన) బిరుద మున్నట్లు విశద మగుచున్నది. ఇది యెవ్వరిచే నీయఁబడినదో తెలియదు. ఇతఁడు తనచే రచియింపఁబడిన వరాహపురాణమున:—

సీ. వరుణదిగ్వీథి నేపురమునఁ బ్రవహించెఁ బావనసలిలసంపన్న పెన్న
దీపించె నేపురి గోపికామానసాస్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేపీటఁ బ్రహ్లాదభక్తివిశ్రాణి కోటంకనృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మహేళి వీరేశబాలేందుమౌళి
చతురచతురంగబలరత్నసౌధయాథ, సాలగోపురతోరణ సకలవర్ణ
పౌరవారాంగనాజనప్రముఖవస్తు, మేదురం బట్టికంబముమెట్టుపురము.

అని కంబముమెట్టును వర్ణించియుండుటచే నాకంబముమెట్టయే యీతని నివాసస్థల మయియుండునేమో యని తోఁచుచున్నది. మఱియు మత్స్యపురాణమునందలి:—

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేకజ
న్మారూఢాధికపుణ్యలబ్ధ హరినామాంకాప్తసత్పుత్త్రుఁడన్
శ్రీరామానుజపాదపద్మయుగళీచింతానమాయుక్తుఁడన్

అను పద్యమువలన నీకవి యాపస్తంబసూత్రుఁడును, రామమనీషికిని దిమ్మాంబకును బుత్త్రుఁడును, వైష్ణవమతాసక్తుఁడు నైనట్లు తెలియవచ్చుచున్నది. ఇతఁడు మొదట వరాహపురాణమును రచియించి కంబముమెట్టు కరణమగు

కొలిపాక యెఱ్ఱన్నకుఁ గృతియిచ్చి యట్లు నరకృతి యిచ్చుటచేఁ గలిగినదోష మును బరిహరించుకొనుతలంపుతోఁ దరువాత మత్స్యపురాణమును రచించి శ్రీరంగనాథున కర్పించినట్లు మత్స్యపురాణమునందలి యీక్రిందిపద్యమువలన నూహింపఁబడుచున్నది.

సీ. ఆయురారోగ్యనిత్యైశ్వర్యములు గల్గి విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనమునకై నరాధములసన్నుతిసేయఁ బొడమినపాపముల్ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు నిశ్చలవృత్తితో నిలుచుకొఱకు
ఘోరనమ్ములు వాసి రయమునవైకుంఠపదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకుఁ
బరమవైష్ణవజనులెల్లఁ బ్రస్తుతింప, మత్కృతంబయి హరికథామాన్యమగుచు
నుత్తమంబగు విష్ణుధర్మోత్తరంబు, రంగనాథునకర్పింతు రాణమెఱసి.

ఇంతకుమున్ను లభించిన యేతత్కవికృతము లగుమత్స్యవరాహపురాణ ములయం దీకవికాలమును నిర్ణయించుటకుఁ దగినయాధారము లేవియు లభిం చినవి కావు. కావుననే మ. రా. రా. కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవులచరిత్రమునందు "కవికాలమును నిర్ణయించుట కీపుస్తకములు రెంటిలోను నాకాధారము లేవియుఁ గానరాలేదు - - - - నిర్దుష్ట మని చెప్పఁ దగిన గ్రంథరచనను బట్టియు శైలిని బట్టియుఁ జూడఁగా నీపుస్తకములు చిరకా లముక్రిందటనే రచియింపఁబడినవైనట్టు తోఁచుచున్నది - - - అప్పకవి యీ గ్రంథములనుండి లక్ష్యములఁ జేకొనకపోవుటచేత నీకవి యాతనికిఁ దరువాత నున్నాఁడేమో యని యూహ కలుగుచున్నది కాఁబట్టి తగిన యాధారములు దొరకువఱకును మన మిప్పటి కీ కవికాలము క్రీస్తుశకము ౧౬౬౦-వ సంవత్సర ప్రాంత మని భావింతము. తెలియనివిషయముల నూహించి పెంచివ్రాయుట కంటె కవికృతగ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించి యింతటితో విరమించుట యుక్తము - - - -" అని వ్రాసియున్నారు. తరువాత మఱికొంత కాలమునకు మేమీకవిమత్స్యపురాణమును మాకవితాపత్రికయందుఁ బ్రకటిం చియుంటిమి. అప్పటికిని మాకీతనికాలనిర్ణయ మొనరించుటకు మార్గమేమియును దొరకకుండుటంజేసి యాగ్రంథపీఠికయందు "ఈతనికాల మింకను జరిత్రకారు లచే సరిగా నిర్ణయింపఁబడలేదు; కాని యపూర్వమగు గ్రంథోపక్రమమును బట్టి చూడ నీతఁడు మిక్కిలి ప్రాచీనుఁడైనట్లు తోఁచుచున్నది." అనివ్రాసి యుంటిమి. ఇప్పుడాంధ్రసాహిత్యపరిషత్తువారిచే విశేషవ్యయప్రయాసములతో సంపాదింపఁబడి ప్రచురింపఁబడిన యీనారసింహపురాణమునందుఁ గాళికుశావ

లంబనన్యాయమున నించుమించుగాఁ గవికాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు చూపట్టుచున్నవి. ఎట్లనిన:—ఏతద్గ్రంథకృతిభర్త యగు ప్రోలుగంటి రంగప్రధాని నందెల చినయోబభూపాలుని దండనాథుఁ డైనట్టు లీ గ్రంథమునఁ గృతిపతిప్రస్తావమున రాఘవమునీషిచే నీక్రిందిపద్యములయందుఁ జెప్పఁబడియున్నది.

సీ. తనమండలాగ్ర ముద్దండారిమండల భూధరంబులకు దంభోళిగాఁగఁ
దనకృపారసము బాంధవసేవకాశ్రితోద్యానసీమకు వసంతంబు గాఁగఁ
దనచక్కఁదనము కాంతామనశ్చంద్రకాంతములకుఁ జంద్రికోదయముగాఁగఁ
దననీతివర్తన ధారుణీజనచాతకంబుల కభ్రాగమంబుగాఁగఁ
వెలసె నేరాజు సముదగ్రబలసమగ్ర, కమఠకర్మఠభుజపీఠగమితధరణి
యతఁడు నందెలనరసింగయాంతరంగ, తామరసహేళి చినయోబదానశాలి.

శా. ఆరాజన్యశిఖావతంసచతురాశాంతావనీచక్రభృ
ద్ధౌరంధర్యుఁడు శత్రునిర్దళనవిద్యాశాలి లీలావతీ
మారాకారుఁడు ప్రోలుగంటి నరసామాత్యాత్మజుం డార్యర
క్షారంభుం డగు రంగమంత్రి యొకనాఁ డాత్మీయగేహంబునన్.

మఱియుఁ బ్రథమాశ్వాసము ౨౧ వ పద్యమున:—

సీ. - - - - - - - -
నందేలచినయోబనాథహృద్వీణకు రంగుమీఱినతంత్రి రంగమంత్రి.

అని యు నున్నది. ఈ నందెల చినయోబనృపాలుఁ డారవీటి బుక్కరాజు వంశములోని వాఁడైనట్లు పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయకృతిపతి వంశావతారపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. ఆరవీటి బుక్కరాజునకు బెద్దభార్య యగునబ్బలదేవియందు సింగరయ్య, రామవిభుఁడు, అహోబలుఁడు నని ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారిలోఁ బెద్దవాఁ డగుసింగరయ్యకు నరసింగరాజు, నారయ్య, తిమ్మయ్య, యని ముగ్గురుకొడుకులు. ఆ ముగ్గురలోను నరసింగరాజునకు సింగరయ్య, నారయ్య, కుమారోబళుఁడు, వరదరాజు, రఘుపతి, యనునైదుగురు కుమారులు గలిగిరి. అందు సింగరయ్యకు నరసింహరాజు, రఘుపతి, ఓబరాజు, ననిముగ్గురు కొమాళ్లు. వారిలో నరసింహరాజు కొడుకు ఆవళిచినోబళుఁడు. ఇతఁడే యీమనారసింహపురాణకృతిభర్త యగుప్రోలుగంటి రంగన్న ప్రభువు. ఈతని పినతాతలు నలుగురలో నారయ్యకుమారుఁడు నరసింగయ్య. ఈ నరసింగయ్య కొడుకు కృష్ణమరాజు. ఈతఁడే కళాపూర్ణో

దయమును గృతిపొందిన నంద్యాల కృష్ణమరాజు. కనుక నీకృష్ణమరాజునకు ఆవళి చినోబళుఁడు పెదతాతమనుమఁ డన్నమాట. మఱియు నీ నంద్యాలవంశ మున నింకొక చిన్నయహోబళుఁడును, గుమారోబళుఁడును, చిన్నయోబళుఁ డును, ఓబయ్యయు, ఓబళరాజును, పెద్ద-ఉద్దండ-కనగిరి-శబ్దపూర్వకోబళులును గనుపట్టుచున్నారు; కాని, నామసామ్యముచేతను బితృనామముం బట్టియు నా వళిచినోబళుఁడే ప్రోలుగంటి రంగన్న ప్రభు వైనట్లు నిర్ధారింపవలసి యున్నది. చూడుఁడు!

ఈ గ్రంథమునందే ప్రథమాశ్వాసాంతపద్యములయందు:—

క. హోవళిచినయోబళవసు, ధావల్లభమంత్రివర్య! ధైర్యౌదార్యా!
  ధీవిభవశోషితార్యా! పావననేత్రాబ్జయుగకృపారసధుర్యా!

అనియును దృతీయాశ్వాసాంతపద్యములయందు:—

ఉ. హోవళిచిన్నయోబళధరాధిపశేఖరసైన్యపాల! నానావిధ ....

అనియు విస్పష్టము చేయఁబడినది. ఈయావళిచినోబళుని గుఱించి పింగళి సూరనార్యుఁడు కళాపూర్ణోదయకృత్యాదియం దిట్లు వ్రాసియున్నాఁడు.

క. అనాంసింహవిభుఁ డస, మానగుణుఁడు రఘుపతికుమారుఁడు యశ
  శ్శ్రీనిధియహోబళాఖ్యధ, రానాధుఁడు సకలగుణవిరాజితుఁ డయ్యెన్.

క. ఆముప్పురిలోనగ్రజుఁ, డైమించునృసింహునకుఁ దదంగనయగుశ్రీ
  రామాంబకు నుదయించెను, హోమతి యావళిచినోబళాఖ్యుఁడు వెలయన్.

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁ డఖండచండతే
  జోవిభవంబునం; దపనసూనుఁ డనూనపితీర్తి పెంపునన్
  దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంపఁగా
  నావళిచిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే?

ఈపద్యములకును నీనారసింహపురాణములోని పైయాశ్వాసాంతపద్యములకును నామవిషయమున విసంవాదలేశ మేనియు లేకుండుటచేఁ బ్రోలుగంటి రంగప్రధానికిఁ బ్రభు వైన యావళి చినయోబభూపాలుఁ డితఁడే యని తెల్లమగుచున్నది. కళాపూర్ణోదయకృతిభర్త యగునంద్యాల కృష్ణరాజువలెనే యీ యావళిచినయోబభూపాలుఁడును ఆరవీటి బుక్కరాజున కాఱవతరము వాఁ డగుటచే మ రా. రా. కందుకూరి వీరేశలింగముపంతులుగారి లెక్కప్రకా రము క్రీ. శ. ౧౫౭౩-వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౧౫౮౧-వ సంవత్స రమువఱకు రాజ్యముచేసిన బుక్కరాజునకుఁ దరువాత వచ్చిన యుతనిసంతతి

వారు నలుగురు నొక్కొక్క రిరువదిసంవత్సరము లుండి రనుకొన్న పక్షమునఁ జినబోబన్నృపాలుఁడును గృష్ణరాజుకాలమున ననఁగా క్రీ. శ. ౧౫౬౦-వ సంవత్సరప్రాంతమున నున్నవాఁడగును. అతనిదండనాయకుఁడగు రంగప్రధానియు నతనికిఁగ్రంథమును గృతియిచ్చిన రాఘవమనీషియు నించుమించుగ నాకాలము వారే యగుదురు. ఈ రాఘవమనీషి పసివాఁడై యుండఁగా హరిభట్టీగ్రంథమును రచించి యెవ్వరికి నంకితముసేయకుండ మృతినొందినవాఁ డనుకొన్న యెడలఁ దండ్రియనంతరము రాఘవమనీషి పెరిఁగిపెద్దవాఁడై రంగప్రధానికిఁగ్రంథమును గృతియిచ్చునప్పటికి అత్యధమ మిరువది వత్సరములైనఁ బట్టును. కావున నాయిరువదివత్సరములును రాఘవమనీషికాల మనుకొనుచున్న ౧౫౬౦ లోనుండి తీసివైచినచో హరిభట్టు నిర్యాణకాలము రమారమి క్రీ. శ. ౧౫౪౦-వ సంవత్సరప్రాంతమై యుండును. ఈతఁడు కొంచె మెచ్చు తగ్గుగా నేఁబదిసంవత్సరములు జీవించియుండునని భావించినచో నీతనిజీవితకాల మించుమించుగా క్రీ. శ. ౧౪౮౦-వ సంవత్సరము మొదలు క్రీ. శ. ౧౫౪౦-వ సంవత్సరప్రాంతమువఱకు నని యేర్పడుచున్నది. ఇది యిట్లుండఁగా నీకృతిభర్తయగురంగప్రధానికి ముత్తాత యగుతిప్పన్న ప్రౌఢదేవరాయని దండాధీశ్వరుఁడైన ట్లీగ్రంథము నందలి:—

క. ఆమునిమణికులజలనిధి, సోమునికైవడిజనించె సురుచిరవిభవో
ద్దాముఁడు సమధికసమర, స్థేముఁడఁ బ్రోలుగంటి తిప్పసధాత్రిన్.

శా. ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయనృపదండాధీశసంపత్కళా
సామగ్రిన్విలసిల్లి మల్లినుమభాస్వత్కీర్తివిస్ఫూర్తి ను
ద్దామాసాధ్యమహోమహత్త్వమున సంధాయుక్తి దోశ్శక్తి వా
చామాధుర్యమునం బురావిభులతోఁ జర్చించు వర్చస్వియై.

అనుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౨౨-వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౬-వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినవాఁడు కనుక నాకాలమున నున్నప్రోలుగంటి తిప్పన్నకు మూఁడవ తరమువాఁ డగురంగన్న (తరమున కిరువది సంవత్సరముల వంతునఁ బెంచిన యెడల) క్రీ. శ. ౧౫౦౬-వ సంవత్సరప్రాంతమున నున్నవాఁ డగును. మొదటి లెక్కకు నీలెక్కకును సుమా రేఁబదిసంవత్సరములు భేద మున్నను మొత్తముమీఁదఁ బ్రోలుగంటి రంగప్రధాని క్రీ. శ. ౧౬-వ శతాబ్ద్యాది నున్నవాఁ డగును గనుక నతనికి ముందున్న హరిభట్టు ౧౫-వ శతాబ్దియం దుత్తరభాగమున

నున్నవాఁ డగుటకు సందేహముండదు. అట్లగుచో నీకవి శ్రీకృష్ణదేవరాయల రాజ్యారంభ కాలమునకు ముందే యల్లసాని పెద్దనామాత్యునికంటెఁ గొంచెము పూర్వుఁడు గానో సమకాలమువాఁడు గానో యుండి—యాధునిక కవుల కాది యందుఁ జేర్పఁబడుటకు బదులుగా—మధ్యకవుల కాదినో పూర్వకవులకుఁ గడ పటనో చేర్పఁదగినవాఁ డగును. అంతియే కాని శ్రీవీరేశలింగము పంతులు గారు వ్రాసినట్లు, అప్పకవి యీతనిగ్రంథములనుండి లక్ష్యములను జేకొనక పోయినంతమాత్రమున నీకవి యతనికిఁ దరువాతివాఁ డేమో యని యూహించుట యుక్తము గాదు అప్పకవిచే నుదాహృతములు గాని ప్రాచీనాంధ్రగ్రంథము లెన్నిలేవు? అవి యన్నియు నప్పకవికంటె నర్వాచీను లగుకవులచే రచియింపఁబడి యుండునని భావింపవచ్చునా? అంతకంటె—ఈతఁడు రచించిన గ్రంథము లన్నియుఁ బురాణాంధ్రీకరణములేయై యుండుటం బట్టియు మత్స్య పురాణమున నీతఁ డొనర్చిన యపూర్వగ్రంథోపక్రమమును బట్టియుఁ బ్రబంధ కాలమునకుఁ బూర్వుఁ డని యూహించుట యుక్తమేమో?

ప్రస్తుత మీకవికాలనిర్ణయ మింతకంటె సరిగా నొనర్చుటకుఁ దగిన ప్రబలాధారములు నాకుఁ గనుపట్టకున్నవి ఇంతకు ముం దీమాత్రమైన నాధారముఁ గానరాని యీతని జీవితకాలనిర్ణయమున కిప్పు డీయాధారమైన దొరకినందుకు సంతసింపవలసినదే. ఇప్పు డీ నేఁజూపిన నిర్ణయాంశము గూడ నెంత వఱకు సరియైనదో చరిత్రపరిశోధనములం దభినివేశముగల తద్జ్ఞులు పరిశీలింప వలసియుందురు; గావున నాభారము వారిపై వైచి యీనారసింహపురాణము నందలి కవిత్వముంగూర్చి యొకించుక వ్రాసి ముగించుచున్నాఁడను. హరిభట్టు గ్రంథము లిప్పటికి నాల్గు లభించినవి. ఇవిగాక యీతఁడింక నేవైనగ్రంథములు రచియించి యుండె నేమో తెలియదు. లభించినగ్రంథములు (1) వరాహ పురాణము, (2) మత్స్యపురాణము, (3) భాగవతషష్ఠైకాదశద్వాదశస్కంధ ములు, (4) ఈ నారసింహపురాణము. వీనిలో నీగ్రంథ మెన్నవదో సరిగా నిర్ణయింపఁ జాలము కాని మత్స్యపురాణమునందలి:—సీ.......... థనమునకై నరాధముల సన్నుతిసేయఁ బొడమినపాపముల్ చెడుటకొఱకు.......... అను దానింబట్టి, నరకృతి యీయఁబడిన వరాహపురాణము, మత్స్యపురాణము కంటె ముందు రచియింపఁబడె నేమో యని తోఁచుచున్నది. ఈ నారసింహపురా ణమునందు:—సీ. వినురాఘవమనీషి! హానుమత్కృపావరలబ్ధకవిత్వవిలాస మహిమఁ దనరి యేకాదశద్వాదశస్కంధముల్ దెలిఁగించె మీతండ్రి ధీయు

తుండు హరిభట్టు*............అని చెప్పఁబడియుండుటచే నీగ్రంథము కంటె

---

*హరిభట్టు భాగవతమున షష్ఠస్కంధముఁ గూడ నాంధ్రీకరించియున్నాఁడు. అది మా పీఠికాపురమునందలి యాంధ్రపరిశోధకమహామండలియందుండఁగా నేను జూచితిని. ఈ పద్యమున దాని ప్రసక్తి యేల చేయఁబడలేదో తెలియదు. అప్పటి కీస్కంధ మాంధ్రీకరింపఁబడి యుండకపోవునా? అట్లయిన మఱి యెప్పుడు తెలుఁగు సేయఁబడి యుండును? ఈషష్ఠస్కంధకృత్యాదిపద్యములయందుఁ గూడ నీతని కాలనిర్ణయాదుల కనుకూలించు విషయములు లభించినవి గావు. అందు:—

శా. శ్రీనీలాచలనాథు నంచితదయాసింధున్ జగన్నాయకున్
నానావైభవసన్నుతున్ మునిజనానందాలయున్ సర్వదే
వానీకా (మల?) మౌళిరత్నరుచిదివ్యాంఘ్రిద్వయీశోభితు
న్నానాస్త్రప్రభవాశ్రయున్ హరిని సంశోభింతు నెల్లప్పుడున్

మ. గురుకావ్యాదినిలింపసంఘములు వైకుంఠంబుతో సాటిగా
బురణింపం బురుషోత్తమాహ్వయమహాపుణ్యస్థలంబందు సా
గరతీరంబున నీలశైలశిఖరాగ్రంబందు వేంచేసి యు
న్నరమాకాంతుని భక్తవత్సలు జగన్నాథుం బ్రశంసించెదన్.

మ. కర (క్రమ?) మొప్పన్ ముసలాయుధుండును సుభద్రాదేవియుం బార్శ్వభా
గమునం బ్రేమ యొనర్ప రత్నమకుటగ్రైవేయహారాంగద
ప్రముఖానేకవిభూ - - - - - - డై బ్రహ్మేంద్రగౌరీశ్వరా
ద్యమరుల్ గొల్వ సుఖోపవిష్టుఁడగు నీలాద్రీశ్వరుం గొల్చెదన్.

చ. ఎడపక విష్ణునిం బొగడ నెన్నఁడు నొల్లక దుర్మదంబునం
గడుపులకై నరాధములఁ గావ్యముఖంబుల సన్నుతింపఁగా
బొడమిన పాపజాలముల బొట్టణఁగం బొలియించు ముక్తిఁ బొం
దెడుకొఱకై రచింతుఁ గృతి నీలగిరీంద్రుని కర్పితంబుగన్.

శా. ప్రస్కంధామరరాజ్యతక్షకుని భూభారాపహర్తన్ మహో
శస్కందాభినుతప్రభావుఁ గమలాసంక్రాంతరాజన్మహో
రస్కున్ విష్ణుఁ దలంచి భాగవతపౌరాణీయమైనట్టి ష
ష్ఠస్కంధంబుఁ దెనుంగుఁ జేసెదను గృష్ణప్రీతిగా వేడ్కతోన్.

క. కృతినాథుఁడు నీలాచల, పతియఁట శుకయోగి వచనభాషితమగు త
త్కృతి భాగవతం బఁట యిది, మతిఁదలఁపఁగ నింతకన్న మాన్యము గలదే.

వ. ఇవ్విధంబున సకలదేవతానాయకుండై యింద్రద్యుమ్నసరోవరతీరంబున నీలగిరినిలయుండైన జగన్నాథదేవునకు ననంతంబులైన సాష్టాంగదండప్రణామంబులు సమర్పించి తత్పాదపద్మంబులు మదీయమనఃపద్మంబునం గీలుకొల్పి తదర్పితంబుగా షష్ఠస్కంధంబు మఱి గోచరించుకొలఁదిని దెనిఁగించెద.

గీ. పరుసమునకు నినుము బంగారమును నొక్క, విధమ యైనయట్లు వీక్షసేయ
శ్వపచుఁడైన విప్రవరుఁడైన శ్రీవిష్ణు, భక్తి నొక్కసమము పరిచరింప.

ముందుగా భాగవతస్కంధము లాంధ్రీకరించినట్లు స్పష్టమగుచున్నది. వరాహపురాణమత్స్యపురాణము లంతకుఁ బూర్వమే రచింపఁబడియున్న యెడల వాని ప్రస్తావ మిం దేల చేయఁబడ లే దని యొకశంక పొడమును. పోనిండు. భాగవతస్కంధములకు ను నారసింహాపురాణమునకు ను బరమందే వరాహమత్స్యపురాణములు విరచింపఁబడిన వనుకొంద మన్నచో నా గ్రంథములు రచియించునంతకాలమువఱకు నీనారసింహపురాణము కవిచే నెవ్వరిపేర నంకితము చేయఁబడక మిగిలియుండి యిట్లేల కవిపుత్త్రునిచేఁ గృతినీయఁబడు నని సంశయింపవలసివచ్చును. ఇట్లు సంశయాస్పద మగు నేతద్గ్రంథరచనాక్రమమును గూర్చి విశేషతర్కము లొనరింపవలసిన పనిలేదు. కాని గ్రంథకర్తచే నెవ్వరికి నంకితము చేయఁబడక మిగిలియున్న దగుటచేతను, నీకవిచేతనే రచియింపఁబడిన యితరగ్రంథములయందలి కవిత్వముకంటె నిందలికవిత్వము కొంత ప్రౌఢముగాఁ గాన్పించుచుండుటచేతను నీనారసింహపురాణ మీకవిగ్రంథము లన్నిటిలోను గడపటి దని సంభావించుకొని సంశయవిచ్ఛేదకమైన సందర్భాంతరము సమకూరువఱకును సంతోషింపవచ్చును.

భారతభాగవతరామాయణాదులవలెనే యిదియును గథాసందర్భమున సంస్కృతమూలము ననుసరించి యథేష్టముగాఁ దెలుఁగుసేయఁబడినట్లు కనుపట్టుచున్నది. కాని యెంతవఱకు మూలానుగుణముగా నున్నదో చూచి వివరించుటకు నాకుఁ దగిన యనకాశము చిక్కినది కాదు. ఇందలికథ యెఱ్ఱాప్రెగ్గడ నారసింహపురాణమునందలి కథ కుత్తరభాగమని తోఁచుచున్నది.

ఈ గ్రంథమునందలి కవిత్వము నిరర్గళమైన ధారగలదై ద్రాక్షాపాకమునఁ బడి చక్కఁగా నుండును.

చ. అలఘుభుజాబలప్రథితు లాశరపుంగవు లుగ్రసాధనం
బుల నరకేసరిం బొదువఁ బూనిన యంతనె తన్నృసింహుచూ
పుల యెఱమంటలం జిమిడిపోయిరి జీర్ణములైరి జీవముల్
తొలఁగిలి తూలి రొటటిరి తొట్రిలి వ్రాలిరి కూలి రందఱున్ ప్ర॥ఆ॥ ౧౭౭.

---

క. సురవరమౌళివిరాజిత, సురుచిర రత్నప్రభాభిశోభితపాదాం
బురుహద్వయాతినిర్మల, నిరుపమగుణసన్నివేశ నీలాద్రీశా!

వ. అవధరింపుము.

అను నీపద్యగద్యములతో గ్రంథోపక్రమము సేయఁబడి:—‘ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజసారస్వత చంద్రనామాంకరాముమిద్వన్మణికుమార రాఘవఘంటావధాన హరిభట్టారకప్రణీతంబైన” ఇత్యాదిగద్యముతో షష్ఠస్కంధము పరిసమాప్తి చేయఁబడి యున్నది.

క. ఎదిరినపగ మీలోపల, ముదిరినయది లేదు లోకములు గూఁకలిడక
గదనము సేయఁగఁ దగునే, మదనజనక మదనదమన! మానుఁడు గినుకల్.
ప్ర॥ ఆ॥ ౨౦౫.

సీ. సమరాభిముఖులైన యమరవీరులగిట్టి యనిమొనఁ దుత్తుముగాఁజనలదె
దర్పితదండయాత్రాభేరిభాంకారగ ఝంకారముల మిన్ను చఱవలదె
యుత్పలదళముల యొప్పునఁ బైకొను నరిశిలీముఖముల నాఁపవలదె
తుంగమాతంగశతాంగతురంగాంగ శకలకోటులనేలఁ జమరవలదె
కలవె యొకనిఁ గొలిచి గర్వవిహీనుఁడై, యూడిగములు సేయుచున్న పతికి
ధూర్తవిజయలబ్ధకీర్తిప్రతాపంబు,లసురసుతున కిట్టు లడఁగ దగునె? ద్వి. ఆ. ౫౭
ఉ. పక్షికులేంద్రవాహనుని బల్విడిఁదోలఁగరాదొ - - - - - - ద్వి ఆ. ౬౮
శా. అన్నా! యన్నలుఁదమ్ములైనమిము మున్నాక్షేపముల్ పల్కనే
నిన్నాళ్లేలితి మూఁడులోకములు - - - - - - త్రి. ఆ. ౯౧
మ. తపముల్ సేయుచు ప్రస్విన్నక్రుస్సి విసినాంతర్వాసులై. - - - - త్రి. ఆ. ౯౫
క. గర్వించియశోవామృ, త్యుర్వీ యని దివిజబలమహోగ్రాకృతివై
గీర్వాణవిమతజలనిధి, పర్వతమైనిలువవయ్య పాకధ్వంసీ. - - - చ. ఆ. ౨౬
క. జలధిపతిబలపరాక్రమ, ములు జలలిపులుగనొనర్చి ముచ్చెరువుజలం
బులు ద్రావించిన నీయు, జ్జ్వలవిక్రమ ముగ్రతరము శత్రుధ్వంసీ! పం. ఆ. ౩౬

గ్రంథవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయముగ నీపద్యము లెత్తి చూపఁబడినవి. కాని కవిత్వమంతయు నిట్లే మృదుమధురముగనుండును.

ఈగ్రంథమునం దచటనచట సంత్యానుప్రాసాది శబ్దాలంకారములుగల పద్యము లుండుటం బట్టియుఁ గొన్నిపోలికలంబట్టియుఁ జూడ గ్రంథకర్తకు బమ్మెర పోతనామాత్యుని కవిత్వమునందు మిక్కిలి యాదరమున్నట్లు తెలియవచ్చుచుండును. ఈయాదరమే యేతత్కవిని భాగవతస్కంధములు రచింపఁ బ్రోత్సహించె నేమో?

మ. శరభేంద్రుండు మనంబులోఁదలఁచె రక్షస్సైన్యనికాభీలమున్
జిరవైరోద్ధతభాస్కరోద్భవశిరచ్ఛేదక్రియామూలమున్
బురవప్రావళిభూరిమేఘవిలయప్రోద్భూతవాతూలముఁ
వరఘంటాజనితాతిదీర్ఘనినదవ్యాలోలముఁ శూలముఁ - - - ఆ. ౧. ౧౭౭
ఉ. విక్రమసత్త్వసంయుతుఁడు వీరనృసింహుఁడు లోఁదలంచె ని
ర్వక్రపరాక్రమక్రమధురంధరసాహసికత్వవిభ్రమో

పక్రమమీనధామగృహపాలనిజధ్వజనీమహోపుర
శ్చక్రము నిర్గళజ్జ్వలనశోషితనక్రమము న్నాత్మచక్రముఙ్. - - ఆ. ౧. ౧౯౨

క. కదనంబున నాటెక్కలుం.

సీ. వలమానదహనకీలల నీను నెమ్మోము మలికితోడాపంక కలికితోడ ఆ ౧. ౯౭

సీ. హృదయంబు లక్ష్మీశపదపద్మములయంద వినుకులు హరికథల్ వినుటయంద.

క. వచ్చినచోటికిఁ గ్రమ్మఱి, వచ్చుం బూఁదోఁటసూచి వచ్చుఁ బ్రియముతో
నెచ్చెలుల నడుగునడుగుల, మచ్చమరయునొఱలుఁ దెరలుమలఁగుంగలఁగుఙ్
ఆ ౩ - ౧౧౩.

శా. అన్నా! వెన్ననినమ్మఁగా వలదు మాయానాట్యకేళీరతుం
డన్నారాయణుఁ డాదితేయులకు రంధ్రాన్వేషసంపాది యై
యిన్నీసంపద లన్నియుం గిలిబితానిచ్చు న్నిజంబీవు సం
పన్నప్రౌఢిసహించి యేమఱకుమీ ప్రత్యర్థికృత్యంబులఙ్. ఆ. ౪ - ౧౬౯.

యతిప్రాసపాదపూరణాదులకై వచ్చినడు వ్యర్థపదము లీగ్రంథమున విశేషముగాఁ గానఁబడవు. శైలి సర్వత్ర మనోజ్ఞముగా నున్నది; కాని యందందుఁ గొన్ని విరుద్ధప్రయోగములు గనుపట్టు చున్నవి.

క. ఏమియపరాధమొదవెం, దామరవిరిమనుమనందుఁ దత్కథసర్వం ఆ. ౧-౯౦.

సీ. - - - - - - - - - - - - -
మఱియు నీపౌనర్చమానుపక్రమములు, లెక్కసేయువారు లేరునిజము
ఆ. ౧ - ౨౨౪.

సీ. - - - - - - - - - - - - -
ఏ సమయము చూచినా సదాశివమిత్రగోచరగ్రంథార్థసూచనంబు
ఆ. ౨ - ౧౪.

గీ. ఆహిరణ్యకశిపు నందు నీమామిడి, క్రింది సోమరెట్లు బొందియెత్తె - -
ఆ. ౨ - ౫౯.

క. భావించి కల్పతరువుల, రావించిట్లనియె - - - - - ఆ. ౩ - ౫౫.

క. మొకమడఁచినఁగానఁగలే, కొకవస్తువు నిట్టి దనఁగ నోడిరి లోకుల్
శకలితహరిహయమణికో, రకములలోనణఁగిరనఁగ రాత్రిటివేళఙ్ ౩-౧౭౪.

చ. హరికిని నీకు నేమిపని యాయన నన్నెఱుఁగే నెఱుంగుదుఙ్
హరిని - - - - - - - - - - - ఆ. ౪. ౧౧౭

గీ. కర్మనిర్ముక్తుఁడై చెంచుగబ్బిగుబ్బ, లాని కతమునఁబాతిత్యలీనుఁడయ్యె౫.౧౭౧

దండకము. వంచనాచుంచురత్వంబున న్నీపదాంభోజముల్.

ఇట్టివి మఱియుఁ గొన్ని గలవు. ఇవి యెట్లు దొరలెనో కాని కవియజ్ఞత చేఁ బ్రయోగింపఁబడినవని చెప్పసాహసింపఁదగదు. మొత్తముమీఁదఁ గవిత్వము నిర్దుష్టమని యే చెప్పవచ్చును. మఱియు నిందు యతిప్రాసములయందు గురు లఘు రేఫభేదముపాటించినట్లు కనఁబడదు. ఇందలి పద్యగద్యములు చాలభా గము సంస్కృతపదభూయిష్ఠములై యున్నవి. కొన్నిచోట్లఁ దేటతెలుఁగుమాట లతో నలరారు వాటములగు పద్యములును గలవు. అందందు గూఢపదములకు మాఱుగఁ బర్యాయపదములు ప్రయోగింపఁబడియుండుటచేఁ బద్యపఠనోత్తర కాలార్థావబోధమున కవి యించుక ప్రతిబంధముఁ గలుగఁ జేయుచుండును. అయిన నది యొక గొప్పలోపముగాఁ బరిగణింపఁజనదు. ఈగ్రంథము పెక్కు తెఱఁగులఁ జాలఁ బ్రశస్తమైన దని యే తుదకుఁ జెప్పవలసినమాట. తినఁబోవు వారికి రుచులుసెప్ప నేల యను తలంపుతోడను, ఆయాసందర్భములయం దిం తకు మున్నుదాహృతములైన పద్యములే చాలు నను నాశయముతోడను గవితా రీతిని దెలుపుటకై మరలఁ బ్రత్యేకముగాఁ గొన్నిపద్యము లెత్తి వ్రాయలేదు. పాఠకమహాశయు లీగ్రంథమును సాంతముగఁ జదివి యిందలికవితారసము నా స్వాదించి యాంధ్రసాహిత్యపరిషత్తువారి పరిశ్రమము ఫలవంత మొనర్చుట యుభయతారకము. గ్రంథవిస్తృతి యేల?

కవితావిలాసము.
పీఠికాపురము.

ఓలేటి వేంకటరామశాస్త్రి.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

(చతుర్దశవార్షిక సభావృత్తాంతము)

ఈ 1926-వ సంవత్సరము ఫిబ్రవరి 6-7 తేదుల (శనివారము, ఆదివారము) యందు ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క చతుర్దశవార్షికసభ, కాకినాడ అన్నదానసమాజభవనములో జరగినది. ఆ సభకు సుప్రసిద్ధులగు మ.శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు అగ్రాసనాధిపత్యమును వహించిరి. ఆహ్వానసంఘమునకు దివాన్ బహదరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు అధ్యక్షులు, మ॥శ్రీ॥ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారును, మ॥శ్రీ॥ శ్రీ కాకోళపు వేంకటరావుగారు కార్యదర్శులు.

సభ్యులు

మ-రా-రా-శ్రీ, వేమూరి రామకృష్ణారావుగారు, ఎం, ఏ. ప్రిన్సిపాల్, పిఠాపురము రాజాగారి కళాశాల, కాకినాడ.

" గోడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ. పిఠాపురము రాజాగారి కాలేజి, కాకినాడ.

" ఆదిపూఁడి సోమనాథరావుగారు, చెన్నపురము.

" గూడూరి రామచంద్రరావుగారు, ఎం. ఏ. గుడివాడ.

" చిట్టావఝ్ఝల వరదరాజులుగారు, బి.ఏ., బి ఎల్. సబుజడ్జి, కాకినాడ.

" త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు, సిద్ధాంతము, గంజాము జిల్లా.

" మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, బి. ఏ. ఛత్రపురము.

" మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.

" కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ. "

" కేతవరపు వేంకటశాస్త్రిగారు, విశాఖపట్టణము.

" గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు, బి. ఏ. ఎలమంచిలి.

" అయ్యంకి వేంకటరమణయ్యగారు, బెజవాడ.

" జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ. బి.ఎల్. ముక్తేశ్వరము.

" చర్ల నారాయణశాస్త్రిగారు, కాకరపఱ్ఱు.

మ--రా-రా-శ్రీ, పెనుమత్స సత్యనారాయణరాజుగారు, తణుకు.
,, తాడూరి లక్ష్మీనరసింహారావుగారు. రాజమహేంద్రవరము.
,, బోడపాటి సత్యనారాయణగారు, ,,
,, అళక్కి వేంకటరామయ్యగారు, పెద్దాపురము.
,, కేశవరపు కామరాజుగారు, బి ఏ. ,,
,, సెలపాక సూర్యప్రకాశరావుగారు, ,,
,, దేవులపల్లి నరసింహశాస్త్రిగారు, మండపేట.
,, పారుపూఁడి చలమయ్యశాస్త్రిగారు, మాగాము.
,, అనంతపంతుల రామలింగస్వామిగారు, చామర్లకోట.
,, నడకుదుటి వీరరాజుగారు, పిఠాపురము.
,, వంకాయలపాటి బంగారురాజుగారు, ,,
,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, ,,
,, పి. రంగబ్రహ్మారావు నాయఁడుగారు, ,,
,, శ్రీరావు వేంకరావుగారు, ,,
,, కొత్త వేంకటరాజుగారు, ,,
,, దేవులపల్లి వేంకటరామయ్యగారు, బి.ఏ. ,,
,, నండూరి రంగాచారిగారు, ఎం. ఏ. ,,
,, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, ,,
,, పొక్కులూరి లక్ష్మీనారాయణగారు, అన్నవరము.
,, చెలికాని సూర్యరావుగారు, చిత్రాడ.
,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.
,, చిలకూరి నారాయణరావుగారు, ఎం. ఏ. ,,
,, రా. సా. గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు బి. ఏ. పర్లాకిమిడి.
,, మంత్రిప్రెగడ నరసింహారావుగారు, కాకినాడ.
,, దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు, బి. ఏ. కాకినాడ.
,, చేవలి రామసోమయాజులుగారు, బి.ఏ., బి.ఎల్. ,,
,, దర్భా వెంకయ్యగారు, బి. ఏ. ,,
,, దర్భా వేంకటశివరామరాసుగారు, బి.ఏ., బి.ఎల్. ,,
,, ఎల్లాజోస్యుల కామేశ్వరరావుగారు, బి. ఏ. ,,

మ-రా-రాశ్రీ, వాజపేయయాజుల భావనారాయణగారు, బి.ఏ., బి.ఎల్. కాకినాడ.

,, లక్కరాజు సుబ్బారావుగారు, బి ఏ., బి ఎల్. కాకినాడ.

,, దివాన్‌బహద్దరు. దురిసేటి శేషగిరిరావుపంతులుగారు బి ఏ., బి. ఎల్. కాకినాడ.

,, గోగులపాటి వీరేశలింగముపంతులుగారు, బి. ఏ. కాకినాడ.

,, కంభముపాటి సోమనాథరావుగారు, ,,

,, ఉప్పులూరి సీతారామయ్యగారు, బి ఏ., బి ఎల్. కాకినాడ.

,, రావుబహద్దరు పైడా వెంకటచలపతిగారు, ,,

,, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, ,,

,, మోచెర్ల హనుమంతరావుగారు, ,,

,, వేటూరి కృష్ణబ్రహ్మముగారు, బి. ఏ. ,,

,, కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం.ఏ., బి.ఎల్. ,,

మఱియు ననేకు లుద్యోగులు, వర్తకులు, న్యాయవాదులు సభనలంకరించిరి.

సభకు రాఁజాలమైతిమని పలువురు మహాశయులు వ్రాసిన తంత్రీవార్తలు జాబులుఁ జదువఁబడినవి.

మొదటినాఁడు, కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు సరస్వతీప్రార్థనము గావించినపిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షులు స్వాగతోపన్యాసముం జదివిరి. అగ్రాసనాధిపతిగారు తమగంభీరోపన్యాసముం గావించిరి. కేతవరపు వేంకటశాస్త్రిగారు గ్రంథవిమర్శనపద్ధతిం గూర్చి వ్యాసముం జదివిరి, విజయనగరమునుండి వచ్చిన కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారు భాషావిషయక మగునొకవ్యాసముం జదివిరి. కడపనుండి జనమంచి శేషాద్రిశర్మగారు పంపిన భాషాసేవ తత్ఫలము అనువ్యాసము చదివింపఁబడినది.

రెండవనాఁ డుదయముమొదలు మధ్యాహ్నము మూఁడుగంటలవఱకు కార్యనిర్వాహకసభ జరగినది. పిమ్మట త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు మాతృభాషాసందేశమను పద్యములం జదివి సభ్యుల నానందపఱిచిరి. ఆంధ్రభాషోత్పత్తి దానిపురాతనత్వమును గూర్చి కేశవరపు కామరాజుగారుదాహరణపూర్వకముగా నుపన్యసించిరి. తాడూరిలక్ష్మీనరసింహారావుగారి తిక్కసోమయాజి యుద్యోగపర్వముం గూర్చినవ్యాసము, వారు సభకు వచ్చి

నను అనారోగ్యముగానుండుటచే వేఱొకరిచేఁ జదివించిరి. శతావధాని ఓలేటి వేంకటరామశాస్త్రిగారు పంపిన "యాంధ్రవాణీసమాశ్వాసనము" అను పద్యములు చదివింపఁబడినవి. సోమంచి సూర్యనారాయణశర్మగారు "పెద్దనార్యుని కవిత్వములోని మెఱుగులు" అనువ్యాసముం జదివిరి. బ్ర. శ్రీ. మల్లాది రామకృష్ణశాస్త్రిచయనులుగారి మహాభారతకథాతత్త్వనిర్ణయ మనువ్యాసము గొంత భాగముచదివింపఁబడినది. పిమ్మట తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు కొన్ని యీశ్వరాంకితములు భాషావిషయములు నగుపద్యములం జదివిరి. అనంతరము సభాధ్యక్షులు రెండుదినములచర్యపైఁ గొంతయభిప్రాయముం దెలిపి యుపసంహారోపన్యాసముచే సభాసదుల నానందపరవశులం జేసిరి. రాఁబోవు సభ హైదరాబాదున కాహ్వానము చేయవలసిన దనియుఁ దాము రాఁజాలక పోయితి మనియు హైదరాబాదునుండి మ.శ్రీ.తణికెళ్ల వీరభద్రుఁడుగారు తమ పేర వ్రాసినయుత్తరమును మ.శ్రీ.రా పానుగంటిలక్ష్మీనరసింహారావుపంతులుగారు చదివిరి. కాని పరిషత్కార్యస్థానమును గాకినాడకు మార్చుట మొదలగుకొన్ని మార్పులు గలుగుచున్నందున రాఁబోవుసభయుఁ గాకినాడలోనే జరపి చక్కనియేర్పాటులు చేసికొన్న పిమ్మట హైదరాబాదువారి యాహ్వానము సంగీకరింపవచ్చునని కార్యనిర్వాహకులకుఁ దోఁచినందున రాఁబోవుసభయుఁ గాకినాడలోనే జరపుటకు నిశ్చయింపఁబడినది.

సభలోని తీర్మానములు నుపన్యాసాదులును బరిషత్పత్రికలోఁ బ్రకటింపబడును.

---

# మహాభారతకథాతత్త్వనిర్ణయము.

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః ॥

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక రుధిరోద్గారిసం॥రము ఆశ్వయుజపుష్యమాసములసంచికలో మహాభారతచరిత్ర మనునొకవ్యాసము ప్రచురింపఁబడినది. దానిం జదివితిని. ఆవ్యాసము వ్రాసినవారు మహాభారతమును సమగ్రముగాఁ జదివి విషయపరిశోధనము చేసినందు కెంతయు సంతసించుచున్నవాఁడను వారి విమర్శనశక్తియు ఆశ్చర్యకరము. శ్రీమదప్పయదీక్షితులును శ్రీమధ్వాచార్యులును మహాభారతతాత్పర్యనిర్ణయము చేసిరి కాని వారు శివవిష్ణుపారమ్యప్రతిపాదనమాత్రముతో విరమించిరి. ఈవిమర్శకులు పురాతనాధునాతనపండితాభిప్రాయములకు విరుద్ధముగా పాండవులు దుష్టులనియు వ్యాసుఁడు మోసగాఁడనియు శ్రీకృష్ణుఁ డంతకంటె మోసగాఁ డనియు దుర్యోధనాదులు సధర్ములనియు కుంతీద్రౌపదీసత్యవతుల చరితము దూషిత మనియు నింక నేమేమో వ్రాసిరి. వీరివ్యాసము సత్యాసత్యముల గమనించుటకై నేనును మహాభారతము పరిశీలించితిని. వీరివ్యాసము చాలభాగము సత్యదూర మనినానమ్మకము. ఈసంగతి నించుక విమర్శించి వ్రాసెదను. నిష్పక్షపాతచిత్తులు స్థాలీపులాకన్యాయముచే నిజము గ్రహింతురుగాత.

విమర్శనీయాంశములు.

1. మహాభారతరచనాకాల మెద్ది?
2. మహాభారతము కవిత్రయకృతమా? వ్యాసమాత్రకృతమా?
3. సత్యవతీకుంతీద్రౌపదులు పతివ్రతలుగాఁ బరిగణింపఁదగినవారా? కారా?
4. పరస్పరవిరుద్ధముగాఁ గాన్పించు కర్ణోత్పత్తికథకు సమన్వయ మెట్లు?
5. శ్రీకృష్ణుఁడు పూతనాదిరాక్షసులను సంహరించెననుకథ కల్పనాకథయేనా? లేక దానియందు నిజము కలదా?
6. భీముని దుర్యోధనాదులు గంగలోఁద్రోయఁగా నాతఁడు సర్పరాజగువానుకిచేత నమృతరసపానము చేయింపఁబడెనా? లేక నాగులనుపేరుగల యొకజాతి మనుష్యులచేతనే రక్షింపఁబడెనా?
7. అరణ్యపర్వమున రావణుని రాముఁడును కుంభకర్ణుని లక్ష్మణుఁడును వధించినట్లు వర్ణింపబడినది. దీనికి సమన్వయ మెట్లు?

ఇవిగాక యీవిమర్శకులు గనఁబఱిచిన ప్రశ్నలు 15.

1. దుర్యోధనాదులకు పాండవులపైఁ గోపము కలుగుటకుఁ బ్రథమ కారణ మెద్ది?
2. పాండవులజన్మవృత్తాంతము నాఁటివారి కిష్ట మైనస్థితిలోనిదేనా?
3 పాండవపక్షముగాఁ బనిచేయు భీష్మద్రోణకృపాదులకు దుర్యోధనునిపైఁ గ్రోధకారణము పాండవులనాతఁడు విరోధించుటచేత నేనా?
4. భీష్మాదులు కేవల మర్థసంబంధముచేతనే దుర్యోధనుని కూడికము చేయునంతటిస్వార్థపరులా?
5. కేవలము నర్థముచేతనే యూడిగముల కొప్పంబడినవా రైనచో ధర్మరా జింద్రప్రస్థపురమున రాజ్యముచేసిన 23 సం॥ములలో వా రేల ధర్మజుకడ నుండలేదు? దుర్యోధనుఁ డిచ్చినంత వేతనము ధర్మరా జీయలేఁడా?
6. యుద్ధకాలమునందు భీష్మద్రోణకృపశల్యులప్రవర్తనము యుక్తముగా నున్నదా?
7. అభిమన్యువధ కాక సౌప్తికవధ విడిచి మహాయుద్ధమునందు దుర్యోధనుఁ డన్యాయముగా నెందఱఁ జంపించెను? దుర్యోధనుఁ డే యన్యాయములఁ జేసెను?
8. భీష్మభగదత్త భూరిశ్రవశ్శ్రుతాయు సైంధవద్రోణ దుశ్శాసన దుర్యోధన కర్ణులవధలలోఁ బాండవులప్రవర్తన మెట్టిది? వీరులకు యుక్తముగు రీతిఁ బ్రవర్తించిరా?
9. ఘటోత్కచవధకు కృష్ణుఁ డిష్టపడుట యుక్తమా?
10. శ్రీకృష్ణునితనయులుగాని సాత్యకితప్ప యాతనిసంబంధులుగాని పాండవులకుఁ దోడు రాకుండుటకుఁ గారణమేమి?
11. ధర్మజదుర్యోధనులకు సమానజ్ఞాతులును బాహ్లీకదేశమును స్వతంత్రముగా నేలుచుండినవారలు నగు బాహ్లీకసోమదత్తభూరిశ్రవస్సులు ధర్మజునిపక్షమునకు రాకపోవుటకుఁ గారణ మేమి?
12. ధర్మజునిపినతల్లికుమారు లగువిందానువిందులు కౌరవపక్షముగా నేల వచ్చిరి? ప్రకృతివిరుద్ధముగా జన్మించినవారలలో నెందఱు దుర్యోధనుపక్షమున యుక్తముగాఁ బోరాడిరి? ఎందఱయుక్తముగాఁ బోరాడిరి? అట్టివారు యుక్తముగా నెందఱు పాండవులపక్షమునఁ బోరాడిరి?
13. కుంతీగాంధారులప్రవర్తన మెట్టిది? ద్రౌపదీప్రవర్తన మెట్టిది?

14. ధృతరాష్ట్రుఁడు తనకుమారుల కపార్థములు కలుగుదుర్యోధన దుశ్శాసన దుర్ధర్షణ దుర్ముఖ దుర్మద వికటానన బహ్వాశి కుండాశ్యాది నామముల నుంచియుండునా?

15. యుద్ధానంతరమున దుర్యోధనసంబంధులను పాండవు లెట్లుచూచిరి?

వీనినిర్ణయమువలన పాండవధార్తరాష్ట్రశ్రీకృష్ణాదులసాధుత్వములు నిర్ణయింపఁబడును.

దీనికంతటికిఁ బ్రప్రథమమున నీవ్యాసము వ్రాసినవారలు కూడ మహాభారత మని వ్యవహరింపఁబడిన యష్టాదశపర్వపరిమితగ్రంథము ప్రమాణ మని యంగీకరింపక తీరదు. అటు లంగీకరింపనియెడల కుంతీద్రౌపదులచారిత్రము మంచిది కా దనియు వ్యాసుఁడు మొదలగువారలు మోసగాండ్రనియు వారు నిరూపించుట సంభవింపదు. ఆశ్రమవాసాదిపర్వములలోని గాథలను వారు కూడ నుదహరించి యున్నారు. మహాభారతమును సమగ్రముగాఁ బ్రమాణ మని మన ముభయుల మంగీకరింపవలసివచ్చినపుడు కొన్నిప్రక్షిప్తము లని వారనుట యుక్తముకాదు. వారు ద్రౌపదీవస్త్రాపహరణాదిగాథలు ప్రక్షిప్తము లనినయెడల దుర్యోధనోరుభంగసమయపుష్పవృష్ట్యాదికము బలరామకృతదుర్యోధనాభినందనాదికము చెప్పెడిగాథలు ప్రక్షిప్తము లని మే మేల యనఁగూడదు? కనుక ఆవాదము యుక్తముకాదు. భారతచరిత్రము నిర్ణయింపఁదలఁచినవారందఱును సమగ్ర మగుమహాభారతము ప్రమాణ మని యంగీకరింపక తీరదు.

## 1. భారతరచనాకాలము.

క్రీస్తుపుట్టుటకుఁ బూర్వము 1485-వ సం॥ ప్రాంతమున భారతయుద్ధము జరిగె నని వీరితలంపు. మే మది యంగీకరింపఁజాలము. శ్రీకృష్ణుఁ డేదినమున భూలోకమునుండి వైకుంఠమునకు వెడలెనో ఆదినమే కలియుగారంభ మని శ్రీభాగవతము ఏకాదశస్కంధమునఁగలదు. భారతయుద్ధానంతర మిరువదియాఱు సం॥లకు శ్రీకృష్ణనిర్యాణము జరిగినట్టు భారతము ఆశ్రమవాసపర్వమున వర్ణింపఁబడినది. ధృతరాష్ట్రాదులకు భారతయుద్ధమృతవీరులను వ్యాసమహర్షి తపఃప్రభావముచేఁ జూపింపఁగా మాతండ్రియగుపరీక్షిన్నరేంద్రుని జూపింపు మని జనమేజయుఁడు వైశంపాయనుని వేఁడెను. అపుడు వైశంపాయనప్రార్థనచే వ్యాసమహర్షి జనమేజయునకు పరీక్షిన్నరేంద్రాదులఁ జూపించినట్లు ఆశ్రమవాసపర్వమునందుఁ జెప్పఁబడియున్నది. ఆశ్రమవాసపర్వ॥ అధ్యా 35.

శ్లో॥ మమాపి వరదో వ్యాసో దర్శయే త్పితరం యది। తద్రూపవేషవయసం శ్రద్దధ్యాం సర్వమేవ తే॥ ప్రియంమే స్యాత్కృతార్థశ్చ స్యామహంకృతనిశ్చయః। ప్రసాదాదృషిముఖ్యస్య మమ కామస్సమృద్ధ్యతామ్॥ సౌతిరువాచ॥ ఇత్యుక్తవచనే

తస్మిన్నృపే వ్యాసః ప్రతాపవాన్। ప్రసాదమకరోద్ధీమా నానయచ్చ పరీక్షితమ్॥ తత్ర స్తద్రూపవయస మాగతం నృపతిం దివః। శ్రీమంతం పితరం రాజా దదర్శ జనమేజయః॥ వ్యాసమహర్షి మృతులగు మహాసంగ్రామనాయకులఁ జూపించిన యెడల వ్యాసమహర్షి భారతమృతవీరులను జూపించినమాట సత్యమే కాని వైశంపాయనునితో జనమేజయుఁ డనియెను. అప్పుడు వ్యాసమహర్షి ప్రసన్నుఁడై జనమేజయునకు పరీక్షిన్నరేంద్రాదులఁ గనఁబఱిచెనని దీనియర్థము. శ్రీకృష్ణనిర్యాణమే కలియుగారంభము. శ్లో॥ యదా ముకుందో భగవా నిమాం మహీం జహౌ స్వతన్వా శ్రవణీయసత్కథః, తదాహరేవాప్రతిబుద్ధచేతసా మభద్రహేతుః కలిరన్వవర్తత॥ మహానుభావుఁ డగు శ్రీకృష్ణుఁడు భూలోకము నెప్పుడు వదలెనో అప్పుడే కలియుగము ప్రవేశించిన దని చెప్పెడి యీభాగవతశ్లోక మిందుకుఁ బ్రమాణము. కలియుగారంభము పంచసహస్రాధిక మని జ్యోతిషికసంప్రతిపన్నము. కాలనిర్ణయమునకు జ్యోతిశ్శాస్త్రమే ప్రబలప్రమాణము. కలియుగారంభానంతరము సుమారు నూఱుసంవత్సరముల ప్రాంతమున వ్యాసమహర్షి మహాభారతమును రచియించియుండును. ధృతరాష్ట్రాదులకు జనకుఁ డగు వ్యాసమహర్షి జనమేజయుని నాఁటికిఁ గలఁడా యని శంకింప నవసరముండదు. శ్లో॥ అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః। కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః॥ అనుపురాణవచనప్రకారము, వ్యాసమహర్షి చిరంజీవి గనుక నాఁటికే గాక నేఁటికిఁ గూడఁ గలఁడు. శ్రీశంకరులకును విద్యారణ్యులకును దిక్కనసోమయాజులకుఁ గూడఁ గాశిలో దర్శనమిచ్చిన ట్లాఖ్యాయికలు కలవు. వానిని నిష్కారణముగ నప్రమాణము లనుటకు వలనుపడదు. యోగశాస్త్రమునఁ జిరజీవన సాధనము లగుయోగములు కలవు. మహాయోగియగు వ్యాసమహర్షికిఁ జిరజీవన మాశ్చర్యకరము కాదు. ఇతిహాసపురాణప్రవక్తలు తమచరితమును భవిష్యచ్చరితమును గూడఁ బ్రథమపురుషప్రయోగములతోడను భూతకాలికక్రియలతోడను వ్రాయుట సంప్రదాయసిద్ధము. శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్। నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్॥ అని వాల్మీకి మహర్షియే తనవృత్తాంతమును ప్రథమపురుషప్రయోగముతోఁ జెప్పెను. భవిష్యద్రామకథను భూతకాలికక్రియలతోఁ జెప్పెను. ఈసంగతి జగద్విదితము. ఈ శ్లోకము ప్రక్షిప్త మనఁజెల్లదు. ఇది గాయత్రీప్రథమాక్షరఘటిత మనియుఁ జతుర్వింశతిసహస్రగ్రంథాంతర్గత మనియు సకలవిద్వజ్జనసంప్రతిపన్నము. కించిదూనపంచసహస్రవర్షపరిమితకాలమున మహాభారతము రచింపఁబడినట్టు శ్లో॥ తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిమ్। అబ్రవీ ద్భారతం లోకే మానుషే౽స్మి న్మహానృషిః॥ ఇత్యాదిశ్లోకములవలన స్పష్ట మగుచున్నది. సప్త

ర్షిసంకేతములలోని పశ్చిమనక్షత్రములు రెండును అశ్విన్యాదినక్షత్రములకు సదా నొక్కొకశతవత్సరము లుండు నని యు ఆనక్షత్రములు మఖానక్షత్రగతములై యుండఁగా పరీక్షిత్పరిపాలనము జరిగె ననియు శ్రీభాగవతమునను విష్ణుపురాణమునను జెప్పఁబడినది. దానినిబట్టి చూచినను భారతరచనాకాలము కించిదూనపంచసహస్రసంవత్సరప్రాంతమై యుండును. క్రీస్తునకుఁ బూర్వము పదునాలుగుశతాబ్దముల ప్రాంతమున భారతయుద్ధము జరిగె ననువాదము ప్రపంచము పుట్టి నాలుగువేలసంవత్సరములకు మించలే దనెడి క్రైస్తవులసిద్ధాంతము వంటిది. దానిని మనము విశ్వసించుటకు వలనుపడదు.

2. భారతము వ్యాసవైశంపాయనసూతకృత మని వీరివాదము.
దానిని మే మంగీకరింపఁజాలము.

మహాభారతము ఆఖ్యాయికారహితము 24000 ఇరువదినాలుగువేలు. ఆఖ్యాయికాసహితమై మనుష్యలోకవ్యాప్త మగుమహాభారతము లక్షపరిమితము జయము, భారతము, మహాభారతము అనునవి పర్యాయపదములు. జనమేజయునకు వైశంపాయనునకుఁ జెప్పినట్టును సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పినట్టును వ్యాసమహర్షియే స్వరచితగ్రంథమునఁ జెప్పియున్నాఁడు. మహాభారతము ఆదిపర్వము మొదలు స్వర్గారోహణపర్వమువఱకును శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్। దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥ అను శ్లోకము ప్రతిపర్వాదియందును ఘటితమై యున్నది, గాన గ్రంథమంతయు జయసంజ్ఞ మనుట యుక్తము పర్వాంతమునందు "శ్రీమన్మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం" అని యుండుటం బట్టి శతసహస్రపరిమితగ్రంథము వ్యాసమహర్షిప్రణీత మని నమ్మఁదగియున్నది. ఆదిపర్వ॥ అధ్యా. ౧. శ్లో॥ చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితామ్। ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః। షష్టిం శతసహస్రాణి చకారాన్యాం ససంహితామ్। త్రింశచ్ఛతసహస్రంచ దేవలోకే ప్రతిష్ఠితమ్। పిత్ర్యేపంచదశప్రోక్తం గంధర్వేషు చతుర్దశ। ఏకం శతసహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితమ్॥ ఉపాఖ్యానములను విడిచినయెడల భారత మిరువదినాలుగువేలగ్రంథ మనియు నిదిగాక యుపాఖ్యానసహిత మఱువదిలక్షలగ్రంథమును వ్యాసమహర్షియే రచియించె ననియు నందు ముప్పదిలక్షలు దేవలోకములోఁ బ్రచారమం దున్నదనియుఁ బితృలోకమందుఁ బదియేనులక్షలును గంధర్వలోకమందుఁ బదునాలుగులక్షలును మనుష్యలోకమున నొకలక్షగ్రంథమును ప్రచారములో నున్నదని వీనియర్థము. దీనినిబట్టి చూడఁగా బ్రకృతమందుఁ గనఁబడుచున్న అష్టాదశపర్వపరిమితమగుమహాభారతము వ్యాసకృత మనియే స్పష్ట

మగుచున్నది. ఆదిపర్వ॥ అధ్యా. ౧. శ్లో॥ విస్తీర్యైతన్మహాజ్ఞాన మృషిస్సంక్షిప్య చాబ్రవీత్ । ఇష్టంహి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్ ॥ సంక్షేపముగాఁ జెప్పిన చతుర్వింశతిసహస్రగ్రంథమును విస్తృతమగులక్షగ్రంథమును గూడ వ్యాసమహర్షియే చెప్పె నని దీనియర్థము దీనినిబట్టి కొంతగ్రంథమును సూత వైశంపాయనాదికృతమనుట యుక్తముకాదు. శ్లో॥ మన్వాది భారతం కేచి దాస్తీకాది తథాపరే । తథోపరిచరా దన్యే విప్రా స్సమ్యగధీయతే ॥ భారతమును మన్వాదిగాఁ గొందఱును, ఆస్తీకచరితము మొదలుగఁ గొందఱును, ఉపరిచరవసుచరిత్రము మొదలు కొందఱును అధ్యయనము తమతమశక్త్యనుసారము చేయుదురని యర్థముకాని యీభారతము లన్నియు భిన్నకర్తృకము లని యర్థముకాదు. ముద్రణయంత్రములు లేనికాలమున లేఖకులు కొందఱు కొన్నియుపాఖ్యానముల వదలి శక్తికొలఁది వ్రాసికొనియుందురు శ్రద్ధాళువులు యథామాతృకముగా వ్రాసికొనియుందురు. అంతమాత్రముచేఁ బ్రాహ్మణులు లేక ప్రాచీనులు తాము కొన్నికథలను భారతములోఁ జూర్చి రని వ్రాయుట యన్యాయము అసత్యభీతి యిప్పటివారికంటెఁ బ్రాచీనుల కధిక మనుటకు శంకించువారుండరు.

3. కుంతీద్రౌపదీసత్యవతులవిషయము.

వసుదేవునితండ్రి యగుశూరునకు పృథ యనుకన్య గలదు. ఆకన్యను తండ్రి తనమేనత్తకుమారుఁడును సంతానరహితుఁడు నగు కుంతిభోజున కాయన యడుగఁగాఁ బుత్రికగా నిచ్చెను. ఆమె బాల్యయౌవనసంధిని, తమయింట సంవత్సరము నివసించిన దుర్వాసునకు మనఃప్రీతికరముగా సేవచేసెను. ఆ మహర్షి యామెసేవకు సంతోషించి నీవు చేసినసేవకు నేను సంతోషించితిని మనుష్యులకు దుర్లభము లగువరముల నడుగు మిచ్చెద ననియెను. అంతట కుంతి, అరణ్యపర్వ॥ అధ్యా॥ 304. శ్లో॥ కృతాని మమ సర్వాణి యస్యా మే వేదవిత్తమ । త్వం ప్రసన్నః పితా చైవ కృతం విప్రవరైర్మమ ॥ వేదవిదుఁడ వగునీవును మాతండ్రియు నేను దమకుఁ జేసినసేవకు సంతోషించితిరి. నా కిదియే చాలును. నాకువరములతోఁ బని లేదనియెను. అప్పుడు దుర్వాసుఁడు శ్లో॥ యది నేచ్ఛసి మత్తస్త్వం వరం భద్రే శుచిస్మితే । ఇమం మంత్రం గృహాణ త్వమాహ్వానాయ దివౌకసామ్ । యం యం దేవం త్వమేతేన మంత్రేణావాహయిష్యసి । తేన తేన వశే భద్రే స్థాతవ్యం తే భవిష్యతి ॥ అకామో వా సకామో వా ససమేష్యతి తేవశమ్ । విబుధో మంత్రసంశాన్తో భవే ద్భృత్య ఇవాత్మనః ॥ నీకు వరమవసరము లేనియెడల నేను మంత్రము నిచ్చెద గ్రహింపుము. ఆమంత్రముతో నేదేవుని బిలిచినను ఆయన నీకు భృత్యునివలె వశుఁ డగు నని పలికెను.

శ్లో॥ నళశాక ద్వితీయం సా ప్రత్యాఖ్యాతు మనిందితా । తంవై ద్విజాతిప్రవరం తదా శాపభయా న్నృప ॥ శపించు ననుభయయముచే నీమంత్రముతో నాకుఁ బనిలే దని కుంతి యన లేక పోయెను. అపు డాయన మంత్రము నుపదేశించెను. అనంతరము బాల్యచాపలముచే నామె సూర్యుని బిలువఁగా సూర్యుఁడు మా నవరూపముతో సాక్షాత్కరించెను. సూర్యుఁడు కుంతిని నాతోఁ గలియు మని కోరఁగా నేను గన్యను బితృపరతంత్రురాలను, మంత్రపరీక్షార్థము నిన్నుఁ బిలి చితిని, నాయపరాధము క్షమించి వెళ్లుమని వేఁడెను. అంతట నాసూర్యుఁడు నీకుఁగన్యాత్వభంగము లేనట్లు వరమొసంగెద. నీ వంగీకరింపవేని నిన్నును నీ కుపదేశ మొసంగిన గురువును శపించెద ననియెను. అప్పు డామె భయపడి యియ్యకొనెను. కర్ణుఁడు జన్మించెను. కన్యాత్వభంగము లేకుండునట్టు సూర్యుఁడు వరమొసంగెను. ఆదిపర్వ॥ అధ్యా ౧౧౧. శ్లో॥ తత్రవీర స్సమభవ త్సర్వశస్త్ర భృతాంవరః । ఆముక్తకవచశ్శ్రీమా న్దేవగర్భశ్రియాన్వితః ॥ ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పునస్స పరమద్యుతిః । దత్వాచ తపతాం శ్రేష్ఠో దివమాచక్రమే తతః॥ ఈశ్లోకములలో సహజకవచకుండలములు గలకర్ణుఁడు కలిగె ననియు కుంతికిఁ గన్యాత్వవర మీయఁబడె ననియుఁ జెప్పఁబడినది. తత్కాలమున సద్యోగర్భ మునఁ గలిగె ననుపద మీశ్లోకములలో లేదు. కాని స్థూలదృష్టితోఁ జూచిన యెడల నటులే తోఁచును. ఏనను, అరణ్యపర్వ॥ శ్లో॥ ధారయామాన సుశ్రోణీ నచైనాం బుబుధేజనః ॥ తతః కాలేనసాకన్యా సుషువే వరవర్ణినీ ॥ ఇత్యాది స్ఫుట వచనములం బట్టి దశమమాసముననే కర్ణుం గనియె నని నిర్ణయింపవలసి యున్నది. ఇట్టిపరస్పరవిరోధములు ప్రమాణ మగుగ్రంథమునఁ గనిపించి నప్పుడు నిస్సందిగ్ధవచనముచే సందిగ్ధవచనమును నిర్ణయించుట మీమాంసా శాస్త్రసిద్ధము. దేవతాప్రసాదమున కన్యాత్వము నందిన కుంతి స్వయంవరమున పాండురాజును వరించెను. పాండుమహారాజు కొంతకాలమునకు మృగశాప ముచే స్త్రీసంగవిముఖుఁ డాయెను. అప్పుడు పాండురాజు విరక్తుఁడై నేను సన్న్యసించెదను. మీరు హస్తినపురమునకు వెళ్లుఁ డని కుంతీమాద్రులతో ననియెను. అప్పు డాపతివ్రతామతల్లికలు నీవు వానప్రస్థుఁడవై యుండుము. మేము కామసుఖముల నొల్లము. నీ సేవఁ జేయుచుందుము. అట్లు నీ వంగీకరింప వేని మే మిరువుర మిప్పుడే ప్రాణత్యాగము చేసెద మని చెప్పిరి. ఆదిపర్వ॥ అధ్యా. ౧౨౯. శ్లో॥ ప్రణిధా యేంద్రియగ్రామం భర్తృలోకపరాయణే । త్యక్త్వా కామసుఖేహ్యావాం తప్స్యావో విపులంతపః ॥ యదిచావాం మహాప్రాజ్ఞ త్యక్ష్య సిత్వం విశాంపతే । అద్యైవావాం ప్రహాస్యావో జీవితం నాత్రసంశయః ॥ ఈ శ్లోకము లీయర్థమును జెప్పును. కామసుఖముల విడనాడి భర్తతోఁ గూడ నరణ్య

వానప్రస్థులకోర్చిన కుంతీమాద్రులు రాజ్యసుఖము వదలి భర్తతో నరణ్యవాసమున కేగినసీతాదేవికంటెఁ దక్కువపతివ్రతలనుట భావ్యము కాదు. అనంతరము పాండురాజు తనకు మృగశాపమువలన సంతానజననార్హత లేనందున, ఓకుంతీ! నీవు నాయాజ్ఞచేఁ బ్రాహ్మణునివలన సంతానముఁ గనుమని యాజ్ఞయిచ్చెను. ఆదిపర్వ॥ అధ్యా ౧౨౦. శ్లో॥ తథా త్వమపి కల్యాణి బ్రాహ్మణా త్తపసాధికాత్ । మన్నియోగా ద్యతశ్రీవ్ర మపత్యోత్పాదనం ప్రతి ॥ అనుశ్లోక మీయర్థమును జెప్పెను. అపుడు కుంతి శ్లో॥ న మా మర్హసి ధర్మజ్ఞ వక్తు మేవం కథంచన । ధర్మపత్నీ మభిరతాం త్వయి రాజీవలోచనే॥ సర్వధర్మముల గుఱుతెఱింగిన నీవు నీయం దనురక్తిగల ధర్మపత్నిని గూర్చి యిట్టికార్యము విధించుట యుక్తము కా దని యామె నిషేధించెను. అపుడు శ్లో॥ భర్తా భార్యాం రాజపుత్రి ధర్మ్యం వాఽధర్మ్యమేవ వా। యద్బ్రూయా త్తత్తథా కార్య మితి వేదవిదో విదుః॥ విశేషతః పుత్రగృద్ధీ హీనః ప్రజననా దహం । యథాహ మనవద్యాంగి పుత్రదర్శనలాలసః । తథా రక్తాంగుళియుతః పద్మపత్రనిభ శ్శుభే । ప్రసాదార్థం మయా తేయం శిరస్యభ్యుద్య తోంజలిః ॥ మన్నియోగా త్సుకేశాంతే ద్విజాతే స్తపసాధికాత్ । పుత్రా న్గుణసమాయుక్తా నుత్పాదయితు మర్హసి ॥ భర్త భార్యను గూర్చి ధర్మ్యమైనను అధర్మ్యమైనను ఎట్టికార్యమును విధించినను ఆకార్యమును భార్య చేసితీరవలెను. ఇది వేదవిహితము. నేను సంతానార్థిని. శాపగ్రస్తుఁడను. నిన్ను నమస్కారపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను. నానియోగమున బ్రాహ్మణుని వలన నీవు గుణాధికు లగుపుత్రులఁ గనుము. అని పాండురాజు వేఁడెను. ఇట్టి యవశ్యకర్తవ్య మగుభర్త్రాజ్ఞ నుల్లంఘింప లేకపోయెను.

అపుడు తనకు దుర్వాసునివలన లభించిన మంత్రములసంగతిని జెప్పి నే నేదేవత నాహ్వానము చేయవలెనో నీవే చెప్పు మని భర్త నడిగెను. అపుడు శ్లో॥ అద్యైవత్వం వరారోహే ప్రయతస్వ యథావిధి । ధర్మ మావాహయ శుభే సహి లోకేషు పుణ్యభాక్ ॥ యమధర్మరాజును సంతానార్థ మాహ్వానము చేయుము. అతఁడు పుణ్యాధికుఁ డని చెప్పెను. అపుడు యమానుగ్రహము వలన ధర్మరాజు జన్మించెను. భీమార్జునుల జన్మమును గూర్చి యు నిటులే భర్త్రభ్యనుజ్ఞ గలదు గ్రంథవిస్తరభీతిచే వదలితిని. పాండవజన్మకాలమునఁ బుష్పవర్షణ దేవదుందుభినిర్ఘోషాద్యద్భుతములు జరిగెను. ఈవిధమున బాల్యమున సూర్యునిగూడఁ గామింపక శాపభీతిచే సూర్యునితోఁ గలసినను వరముచేఁ గన్యాత్వము సంపాదించి పాండురాజును బెండ్లియాడి యాయనశాపవశమున విరక్తుఁడైనప్పుడు తాను సకలభోగములం దృజించి యనుల్లంఘనీయ మగు భర్త్రాజ్ఞవలన కౌరవవంశము నుద్ధరించిన కుంతీదేవిని అమెరికా మొదలగు దేశ

ములలోని స్వచ్ఛందచారిణులతోఁ బోల్చి తూలనాడుట కలికాలవిలాసము. ఆదిపర్వ॥ అధ్యా. ౧౨౩. శ్లో॥ సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతమ్। జాతమాత్రే సుతే తస్మి న్వాగువా చాశరీరిణీ। ఏషధర్మభృతాం శ్రేష్ఠో భవిష్యతి నరోత్తమః। యుధిష్ఠిర ఇతి ఖ్యాతః పాండోః ప్రథమజ స్సుతః॥ భవితా ప్రథితో రాజా త్రిషులోకేషు విశ్రుతః॥ ధర్మజుని జన్మకాలమున నశరీరవాణి ఈకుమారుఁడు ధార్మికశ్రేష్ఠుఁడును లోకత్రయవిఖ్యాతుఁడు నగునని పలికెను. భీముఁడు సర్వలోకములందు బలాధికుఁ డగు నని పలికెను. అర్జునుని జన్మకాలమున నశరీరవాణి యీతఁడు మహాపరాక్రమశాలి యై లోకోత్తరము లగు కార్యములఁ జేయు నని పలికెను. దేవదుందుభినిర్ఘోషములు పుష్పవృష్టి మొదలగునద్భుతములు జరిగెను నకులసహదేవుల జన్మకాలమున వీర లశ్వినీదేవతలతో సము లగుదు రని యశరీరవాణి పలికెను ఆదిపర్వ॥ అధ్యా. ౧౧౫. శ్లో॥ యస్మిన్నహని దుర్యోధన స్తదా। తస్మిన్నేవ మహాబాహు ర్జజ్ఞే భీమోపి వీర్యవాన్। సజాతమాత్ర ఏవాథ ధృతరాష్ట్రసుతో నృప। రాసభారావసదృశం రరావచ ననాదచ। తం ఖరాః ప్రత్యభాషంత గృధ్రగోమాయువాయసాః। వాతాశ్చ ప్రవవు శ్చాపి దిగ్దాహశ్చాభవ త్తదా॥ దుర్యోధనుఁడు పుట్టుటతోడనే గర్దభమువలె నఱచెను. దానికి గర్దభములు, కాకులు, నక్కలు గృధ్రములుఁ గూడఁ బ్రతిధ్వని చేసిన వాయెను. అప్పుడు ధృతరాష్ట్రుఁడు భీతుఁడై బ్రాహ్మణుల నడుగఁగా శ్లో॥ వ్యక్తం కులాంతకరణో భవితైష సుతస్తవ॥ నీకుమారుఁడు కులాంతకరుఁ డగు నని చెప్పిరి. అప్పు డీకుమారుని బరిత్యజింపుమని భీష్మాదులు చెప్పినను బుత్రప్రేమచే ధృతరాష్ట్రుఁడు పరిత్యజింపకపోయెను. అని వర్ణింపఁబడినది. దీనినిబట్టి పాండవులు ధార్మికు లనియు దుర్యోధనుఁడు దుష్టుఁడనియు వ్యక్త మగుచున్నది. ధర్మజభీమార్జునజన్మానంతరము మాద్రి సంతానార్థినియై కుంతితోఁ జెప్పి తనకు సంతానలాభము కలుగఁ జేయుమని పాండురాజును వేఁడెను. అపుడు పాండురాజాజ్ఞాప్రకారము కుంతి మాద్రికి మంత్రముల నుపదేశించెను. అశ్వినీదేవతలప్రసాదమున మాద్రికి నకులసహదేవులు జన్మించిరి. ఆదిపర్వ॥ అధ్యా. ౧౨౪. శ్లో॥ యది త్వపత్యసంతానం కుంతిరాజసుతా మయి। కుర్యా దనుగ్రహో మేస్యా త్తవచాపి హితం భవేత్। సంరంభో హి సపత్నిత్వాత్ వక్తుం కుంతిసుతాం ప్రతి। యది తు త్వం ప్రసన్నో మే స్వయమేనాం ప్రచోదయ॥ పాండుః॥ సా త్వం మాద్రీం ప్లవేనేవ తారయైనా మనిందితే। అపత్య సంవిభాగేన పరాం కీర్తి మవాప్నుహి॥ ఈశ్లోకము లీయర్థమును జెప్పును. పాండురాజు దేవతాప్రసాదమున సంతానము గనినకుంతిని "అనిందితే" యేదోషములు లేనిదానా? యని సంబోధించెను. ఇప్పటి నవనాగరక

పండితు లాసాధ్విని నిందితురా లని దూఱుచుండుట యాశ్చర్యకరము. సవతి తన్ను దూషించు నని యామె కిద్దఱ నంటఁగట్టిన దని వీరు వ్రాసినది సరికాదు. తాను ముప్వురను గామపరతంత్రతచేఁ గట్టికొన లేదు. మాద్రికిద్దఱను దనంతట తా నంటఁగట్ట లేదు. ఈ రెండును భర్త్రాజ్ఞాప్రకారము జరిగినవి. భర్త్రాజ్ఞాప్రకారము జరిగిన యెట్టి కార్యమును బతివ్రతలకు దోషావహము కానేరదు. మన్త్రాహూతుఁడై సూర్యుఁడు మానవరూపముతో వచ్చుట యద్భుతము. సహజకవచకుండలుఁ డగుశిశువు కలుగుటయు నద్భుతము. ఇది యసత్యము, కర్ణుఁడు కుంతికి వ్యభిచారదోషముచేఁ గలిగెను. కవచకుండలములు సహజములు కావు. అని యంటిమేని కవచకుండలముల నింద్రుఁడు ఛేదించి యిమ్మని కోరుటయు నసత్య మనవలసివచ్చును. అది యసత్య మగునెడల ఇంద్రుఁడు ఏకవీరఘాతిని యగుశక్తి నిచ్చినకథ యసత్య మనవలసివచ్చును. అదియసత్య మగునెడల ఘటోత్కచవధ యసత్య మనవలసివచ్చును. ఇటు లన్యోన్యసంబంధము గల భారతకథ లన్నియు నించుమించుగా నసత్యము లనవలసివచ్చును గనుక దేవతా మహిమల నంగీకరింపనివారలు భారతము కేవలకల్పనాకథ యని వదలుటయే మంచిపని, లేదా జన్మాంతరభాగ్యమున ఆస్తిక్యము కలిగి యున్న యెడల యథా వచనము వారివారిమహిమలను బవిత్రతను నంగీకరించుట యుక్తము. ఉభయ భ్రంశము మంచిపని కాదు.

మాద్రీవివాహకథ ఆదిపర్వ॥ ౧౧౩. అధ్యా. ఇట్లు వర్ణింపఁబడినది. భీష్మాచార్యుఁడు కుంతీవివాహానంతరము పాండుమహారాజునకు రెండవవివాహము కూడఁ జేయఁదలఁచి “నీచెల్లెలిని పాండురాజున కీయవలయును, మీకును మాకునుసంబంధము యుక్తరూపమున నుండు” నని శల్యు నడిగెను. అప్పుడు శల్యుఁడు వరునివలన ధనము గ్రహించి కన్యనిచ్చుట మాకులాచారము. ఆయాచారము మంచి దైనను చెడు దైనను నేనతిక్రమింపఁజాల నని బదులుచెప్పెను. అపుడు భీష్ముఁడు శ్లో॥ విదితేయం చ తే శల్య మర్యాదా సాధుసత్తమ। ఇత్యుక్త్వా స మహాతేజా శ్శాతకుంభం కృతాకృతమ్। రత్నానిచ విచిత్రాణి శల్యాయా దాత్సహస్రశః। తత్ప్రగృహ్యధనం సర్వం శల్య స్సంప్రీతమానసః। దదౌ తాం సమలంకృత్య స్వసారం కౌరవర్ష భే॥ సాధుసత్తముఁడ వగుశల్యుఁడా మీకులమర్యాద నాకుఁ దెలియుననిపలికి మహాధనమును విచిత్రములగురత్నముల నిచ్చెను. అపుడు శల్యుఁడు సంప్రీతుఁడై యలంకృతురాలగు మాద్రిని భీష్మునకు స్వాధీనము చేసెను. అని వర్ణింపఁబడినది. భీష్మునకు భయపడి కులహీనుఁ డగుపాండురాజునకుఁ జెల్లెలి నిచ్చె నని చెప్పునెడల కన్యాశుల్కస్వీకారము మాకులాచార మని చెప్పి ధనము స్వీకరించి కన్యనిచ్చుట యెటులు ఘటించును? శూరాగ్రేసరుఁ

డును సత్కులీనుఁడు నగుశల్యుఁడు పాండురాజు కులహీనుఁడు గనుక నేను గన్య నీయనని చెప్పి యుద్ధము చేసియుండును. అటులు చేయక సంప్రీతమానసుఁడై కన్య నిచ్చె నని చెప్పఁబడి నందున వీరికల్పనలు కుకల్పన లనుటకు సంశయ ముండదు.

ద్రౌపదీవృత్తాంతము—ద్రుపదుఁడు ద్రోణశిష్యుఁ డగు నర్జునునిచేఁ బరాభూతుఁడై అర్జునున కీయఁదగిన సకలసద్గుణవతి యగుకన్యయు ద్రోణుని సంహరింపఁదగిన కుమారుఁడును గలుగవలె నని యొకయాగము చేసెను. హోమకుండమునుండి ద్రౌపదీదృష్టద్యుమ్ను లావిర్భవించిరి. ఇట్టివీరు గూఢోత్పన్ను లైన యెడల నాకాలపు కులీనులు వీరి నాక్షేపించియుందురు. అట్టియాక్షేపణము లేగ్రంథమునను లేవు. వీరు పవిత్రులనియే వర్ణింపఁబడినది. మత్స్యయంత్రభేదనముచే ద్రౌపదిని గెలిచి యామెను దోడ్కొని తమనివాసస్థానమునకు వచ్చి తల్లీ భిక్ష తెచ్చితి మని పాండవులు చెప్పిరి. అపు డాకుంతి మీరందఱు భిక్షను సమముగా భుజింపుఁ డని ప్రత్యుత్తర మిచ్చెను. అనంతరము కుంతి ద్రౌపదిని చూచి అయ్యయో! ఒక్కస్త్రీని పలువురు సమముగా ననుభవించుట యెట్లు? నావాక్య మసత్య మగునే యని శంకించెను. నే నెన్నఁడు ననృతము పలికి యుండలేదు. దైవసంకల్ప మటులే యుండియుండు నని యుఁ బలికెను. అనంతరము ద్రుపదమహారాజు ధర్మజునితో నీవు ద్రౌపదిని వివాహ మాడుము. లేదా మీయయిదుగురిలో నెవ్వరో యొకరు వివాహ మాడుఁ డని పలికెను. అపుడు ధర్మజుఁడు శ్లో॥ సర్వేషాం మహిషీ రాజన్ ద్రౌపదీ నో భవిష్యతి । ఏవం ప్రవ్యాహృతం పూర్వం మమమాత్రా విశాంపతే । ఏషన స్సమయో రాజన్ రత్నస్య సహభోజనమ్। నచతం హాతు మిచ్ఛామస్సమయం నృపసత్తమ । సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీ నో భవిష్యతి । ఆనుపూర్వేణ సర్వేషాం గృహ్ణాతు జ్వలనే కరాన్ ॥ ద్రౌపది మాకందఱకు భార్య యగును. మాతల్లి సమముగా భుజింపుఁ డని యాజ్ఞ నొసంగెను. నీపుత్రిక రత్నభూత యైనది. రత్నమును సమముగా భుజించుట మాయొడంబడిక, గాన, మే మందఱము ద్రౌపదిని వివాహమాడెద మని ప్రత్యుత్తర మిచ్చెను. అపుడు ద్రుపదుఁడు శ్లో॥ ఏకస్య బహ్వ్యోవిహితా మహిష్యః కురునందన। నైకస్యా బహవః పుంస శ్శ్రూయంతే పతయఃక్వచిత్ । లోకవేదవిరుద్ధం త్వం నాధర్మంధర్మవిచ్ఛుచిః । కర్తుమర్హసి కౌంతేయ కస్మాత్తే బుద్ధిరీదృశీ ॥ ఒకపురుషునకు బహుభార్య లుండుట కలదు. ఒకస్త్రీ కనేకులు భర్త లగుట గానము. లోకవేదవిరుద్ధ మగునిట్టియధర్మకార్యమును నీవేల పూనితివి. అని ద్రుపదుఁడు ధర్మజునితో ననియెను. అపుడు ధర్మరాజు శ్లో॥ సూక్ష్మో ధర్మో మహారాజ నాస్యవిద్మో వయంగతిమ్ । పూర్వేషా

మానుపూర్వేణ యాతం వర్త్మానుయామహే ॥ నమేవాగనృతం ప్రాహ నాధర్మే ధీయతే మనః । ఏవంచైవ వదత్యంబా మమచైత న్మనోగతమ్ । ఏషధర్మోధ్రు వోరాజన్ చరైన మవిచారయన్ । మాచ శంకా తత్ర తేస్యాత్ కథంచి దపిపార్థివ ॥ ధర్మము సూక్ష్మమైనది. దానిరహస్యము మనము కనుఁగొనఁ జాలము. పూర్వికులు పోయినమార్గమున మనము పోయెదము. నావాక్కు అనృతము నెప్పుడును బలికియుండలేదు. అధర్మమందు నామనస్సు ప్రవే శింపదు. మాతల్లియు నిటులే యాజ్ఞ యిచ్చెను. ఇదియే ధర్మమని ధర్మజుఁడు పలికెను. ఇక్కడ "పూర్వేషా మానుపూర్వేణ యాతం వర్త్మానుయామహే" అనుటవలన టిబేటుదేశమందు ఒక్కతె ననేకులు వివాహమాడుట యాచా రము కలదనియు నాదేశమందు పెరిఁగినధర్మజునకు అది యలవాటుపడెననియు వ్రాయుట సాహసము. మాత్రాజ్ఞాపరిపాలనము చేయుటయే పూర్వా చార మని ధర్మజు తాత్పర్యము. దానినే "ఏవంచైవ వదత్యంబా" యని వివరిం చెను. పూర్వ మిట్టియాచార మెప్పుడు లేదనుటకు శ్లో॥ శ్రూయతేహి పురా ణేపి జటిలానామ గౌతమీ । ఋషీనధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వర । తథైవ మునిజా వార్క్షీ తపోభిర్భావితాత్మనః । సంగతాభూ ద్దశభ్రాతౄ నేకనామ్నః ప్రచేతసః । అని గౌతమియొక్కయు వార్క్షీయొక్కయు బహుపురుషవివాహ మును బూర్వాచారమునుగా ధర్మజుఁడు నిరూపించెను. సర్వజనసాధారణ మగు నాచారమును మాని క్వాచిత్కమగుపూర్వులయాచారమునే యేల గ్రహింప వలె నని శంక కలుగఁగా శ్లో॥ గురోర్హి వచనం ప్రాహు ర్ధర్మ్యం ధర్మజ్ఞసత్తమ । గురూణాంచైవ సర్వేషాం మాతా పరమకో గురుః । సాచాప్యుక్తవతీ వాచం భైక్షవ ద్భుజ్యతా మితి ।తస్మా దేత దహం మన్యే పరం ధర్మం ద్విజోత్తమ॥ గురు వచనపరిపాలనము ధర్మము. గురువులలో నెల్లఁదల్లి పరమగురువు. ఆయమ మమ్ము ను సమముగా భుజింపుఁ డని యాజ్ఞ యొసంగినది. కనుక నిదిధర్మమని ధర్మజుఁడు నుడివెను. అప్పుడు వ్యాసమహర్షి ద్రౌపదీపూర్వజన్మవృత్తాంతము పంచేంద్రో పాఖ్యానము మొదలగు గాథలఁ జెప్పి ద్రౌపదిని పంచపాండవులు వివాహ మాడునట్లు చేసెను. ఇట్లు శాస్త్రచర్చాపూర్వకముగా జరిగిన ద్రౌపదీవివాహ ము అధర్మ మెట్లగును? ద్రౌపది వివాహమాడిన పతుల విడనాడి మనసులో నైనఁ బరపురుషుని ప్రేమించినయెడల నసాధ్వి యగును గాని అటుగాక వివాహ మాడినపతులతో మెలంగి వారికి మహావిపత్తులు సంభవించినసమయమున వారిని విడనాడక అరణ్యాజ్ఞాతవాసములతో నానావిధశ్రమలం బొందిన పతి వ్రతాశిరోమణిని స్వైరిణులతోఁ బోల్చి దూషించుట పాపకార్యము. ఒకపురు షుఁడు పలుపురుభార్యల వివాహమాడి వారితో సుఖముగా వర్తించినను స్వైర

చారి యెటులు కాఁడో అట్లే గుర్వాజ్ఞాప్రకారము పలువురుభర్తల వివాహమాడి వారితో మెలంగిన ద్రౌపది వ్యభిచారిణి కానేరదు. టిబేటుదేశమందుఁగూడ ఏకకాలమున నొక్కతె పలువురుభర్తల వివాహమాడుట మేము వినియుండ లేదు. ద్రౌపది పాండవులఁ బ్రోత్సాహపఱచుటకు, శ్లో. యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ। పితా మే యోత్స్యతే వృద్ధ స్సహపుత్త్రై ర్మహారథైః। పంచచైవ మహావీరాః పుత్త్రా మే మధుసూదన। అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ ॥ భీమార్జునులు సంధిని గోరి యుద్ధము చేయక పోయినను మాతండ్రియు, నాకుమారులును, అభిమన్యుఁడును నాకొఱకు యుద్ధము చేయుదురు. అని పలికెను. ఇంతమాత్రమున భర్తల నిరాకరించె నని తలఁపఁగూడదు. తన్నరణ్యమునకుఁ దోడ్కొనిపోవుటకై సీత, శ్లో. కింత్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః। రామజామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్ ॥ పురుషవిగ్రహము ధరించిన స్త్రీకి మాతండ్రి నన్నిచ్చి పెండ్లి చేసె నని పలికెను. అంతమాత్రముచే సీత భర్తను దూషించె ననఁజెల్లదు కదా? అట్లే ద్రౌపదీవాక్యములు ప్రోత్సాహకములుగాని దూషణములు కావు (2) ద్రౌపదీవస్త్రాపహరణకథ యసత్యమని వీరు సాహసముతో వ్రాసిరి. ఏల యసత్యము కావలెను? దుర్యోధనుని యందు దౌష్ట్యము లేకనా? కృష్ణునియందు బహువస్త్రప్రదానమహిమ లేకనా? దుర్యోధనోరుభంగానంతరము భీముఁడు, శ్లో. రజస్వలాం ద్రౌపదీ మానయ న్యేయేచా ప్యకుర్వంత సద స్యవస్త్రాం। తాన్ పశ్యధ్వం పాండవై ర్ధార్తరాష్ట్రాన్ రణేహతాం స్తపసా యాజ్ఞసేన్యాః ॥ అని శల్యపర్వమునఁ గూడ ద్రౌపదీవస్త్రాపహరణమును కౌరవులు చేసినట్లు వర్ణింపఁ బడినది. గ్రంథాంతరమునఁ గేశగ్రహణమాత్రమే వర్ణింపఁబడిన దంటిరేని "నహి క్వచి దశ్రవణ మన్యత్ర శ్రుతం వారయతి" అను న్యాయప్రకారమున ఒకచో జెప్పఁబడకపోయినంతమాత్రమున మఱియొకచోఁ జెప్పఁబడినవృత్తాంత మసత్యమ నఁజెల్లదు. శ్రీకృష్ణమహిమలందవిశ్వాసమున్న యెడలవిశ్వరూపసందర్శనదుర్వా సస్తృప్తి సైంధవవధసమయసూర్యమండలపిధానాదు లన్నియు నసత్యము లేయన నగును, గనుక, భారత మంతయు నసత్య మనవలసివచ్చును. దుర్యోధనసంబంధి వృత్తాంతము సత్యము శ్రీకృష్ణద్రౌపద్యాదివృత్తాంత మసత్యమనుటకుఁ దగినంత హేతువుకనిపింపదు. అపుడు "మూలచ్ఛేదీతవపాండిత్యప్రకర్షః" అనినట్లుండును. అగ్నికుండమునుండి స్త్రీపురుషు లుద్భవించుటయు నద్భుతము. హోమకుం డమునుండి యజ్ఞపురుషుఁడు పాయసముం దెచ్చి యిచ్చుటయు నద్భుతము. ఆకథను నమ్మనియెడల రామాయణ మసత్యము. ఈకథను నమ్మనియెడల భారత మసత్యము. లోకోత్తరు లగుమహనీయులచరిత్రమును అస్మదాదుల

వృత్తాంతములతోఁ బోల్చి విమర్శించుట యుక్తము కాదు. సకలపాపనివర్తకురాలగు గంగచే వరింపఁబడిన శంతనుఁడు వరించిన సత్యవతిచారిత్రమును పవిత్రమనుటకు సంశయింపఁ బనిలేదు. ఇటులు సత్యవతీకుంతీద్రౌపదులు మహాపతివ్రత లని ఖ్యాతిఁజెంది యుండఁగా వారిని దూషించుట యుక్తము కాదు. (3) పాండవద్రౌపద్యాదులు ప్రకృతివిరుద్ధజన్మము కలవారలు, దుర్యోధనుఁడట్టి వాఁడు కాఁడు, గనుక, దుర్యోధనాదులపై వ్యాసమహర్షికి ద్వేషము కల దని వ్రాయుటయు నసంగతము. అంగుష్ఠపరిమితము లగుమాంసఖండముల ఘృతకుంభములలో నుంచుటయు జలసేకముచేత నామాంసఖండములు మానుషశిశువులుగాఁ బరిణమించుటయుఁ బ్రకృతివిరుద్ధము, గనుక, దుర్యోధనాదులును బ్రకృతివిరుద్ధజన్మము కలవారలే. ధృతరాష్ట్రపాండురాజు లిరువురును దసనంతానమైనవుడు పాండవులపై ననురాగము ధార్తరాష్ట్రులపై ననాదరము కలుగుటకు వారిసదసత్ప్రవర్తనము లే హేతువులు కాని యితరకారణములు సంభవింపవు.

(4) కర్ణోత్పత్తి ఆదిపర్వమున సంక్షిప్తముగా వర్ణింపఁబడినది. అరణ్యపర్వమున విస్తీర్ణముగా వర్ణింపఁబడెను. ఆదిపర్వమున సద్యోగర్భజనితుఁ డని చెప్పఁబడలేదు. సహజకవచకుండలుఁ డగుకర్ణుఁడు దశమమాసముననే కలిగె ననియారణ్యపర్వమును బట్టి నిర్ణయింపవచ్చును.

(5) శ్లో. బాలగ్రహాస్తత్ర విచిన్వతీ శిశూ న్యదృచ్ఛయా నందగృహేఽసదంతకమ్। బాలంప్రతిచ్ఛన్ననిజోరుతేజసం దదర్శతంచాగ్నిమివాహితాంభసి॥ అని శ్రీభాగవతమునఁ జెప్పఁబడియున్నందున పూతనాదులు బాలగ్రహములనుట సత్యము. నారాయణుఁడు కృష్ణుఁడై యవతరింపఁగా కంసపక్షపాతు లగుపూతనాదులు మాయారూపములనుధరించి శ్రీకృష్ణుని వధించుటకు వచ్చుటయు సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణుఁ డానంగతి గుఱుతెఱింగి వారినే వధించుటయు వర్ణింపఁబడినది. లోకసామాన్యముగా మనయందఱవలె బాలగ్రహబాధలు కృష్ణునకుఁ దొలఁగిన వని చెప్పుటయే గ్రంథకర్త్రభిప్రాయ మైనయెడల నింత వర్ణింపఁ బనిలేదు. బాలగ్రహబాధలు తొలఁగక యెవ్వఁడును జీవింపఁడు. పూతనాదులపుడే శ్రీకృష్ణునిచే సంహరింపఁబడినయెడల నిపుడు పూతనాదిగ్రహశాంతికైచేయు ఫలీకరణాదిహోమము లనవసరము లనుశంకయు నసంగతము. నారాయణుఁడు వరాహనృసింహావతారములతో హిరణ్యాక్షహిరణ్యకశిపుల సంహరించినను వారు రావణకుంభకర్ణులై జన్మించి లోకుల బాధింపలేదా? రామావతారమున వారిని సంహరించినను శిశుపాలదంతవక్త్రులై బాధింపలేదా. అటులే శ్రీకృష్ణనిహతులైనను రూపాంతరములచేఁ బూతనాదులు బాలగ్రహములై బాధింపవచ్చును. తచ్ఛాంతికై హోమములు చెప్పఁబడినవి. ఇంతమాత్రముచేఁ బరమేశ్వరమహిమలను గల్పనాకథ లనుట నాస్తికవాద మగును.

(6) భీముఁడు దుర్యోధనుచే విషపానము చేయింపఁబడి నీటిలోఁ ద్రోయఁబడెను. అపుడు నాగకుమారు లాయనను గఱచిరి. స్థావర మగువిషము సర్ప విషముచే శమ మొందెను. అతఁడు సర్పముల బాధింపఁగా నాసర్పములు వాసుకికడ కేగి చెప్పఁగా నాయన వచ్చి భీముని గౌరవించి యష్టకలశపరిమిత రసపానము చేయించెను. దానం జేసి భీముఁడు నాగాయుతబలుఁ డాయె నని వర్ణింపఁబడినది. భీముఁడు వాసుకికి దౌహిత్ర దౌహిత్రు డనియు వర్ణింపఁబడినది. శ్లో. తత స్సమేత్య బహుభి స్తదా నాగై ర్మహావిషైః। అదశ్యత భృశం భీమో మహాదంష్ట్రై ర్విషోల్బణైః॥ గొప్పవిషము గలిగినట్టియు గొప్పకోఱలు గలిగినట్టియు నాగకుమారులచే భీముఁడు దష్టుఁడాయె నని చెప్పఁబడినది. నాగు లను నొకజాతి మనుష్యులు భీముని రక్షించిరి, సర్పములు రక్షింపలే దని వీరు వ్రాసిరి. అది సరికాదు. నాగు లనుమనుష్యులకు విష ముండుటయు వారు నీటిలోనే నివసించుటయు నితరులను గఱచుటయుఁ బెద్దకోఱలు గలవారలై యుండుటయు నసంభవము. భీముఁడు వాసుకికి దౌహిత్రదౌహిత్రుఁ డైనను గావచ్చును. అర్జునునకు ఉలూపితో వివాహము జరిగినట్లు కుంతిభోజునితండ్రికిని నాగకన్యావివాహము జరిగియుండును. నాగకన్యలు కామరూపిణులై మనుష్యుల వివాహమాడుట పూర్వయుగములలోఁ గలదు. ఇట్టికథల నిష్టము వచ్చినట్లు తాఱుమాఱు చేయుట కేవలాసంగతము.

(7) అరణ్యపర్వమున మార్కండేయమహర్షి ధర్మజునకు శ్రీరామచరితమును వర్ణించెను. రావణుని శ్రీరామచంద్రుఁడును గుంభకర్ణుని లక్ష్మణుఁడును వధించినట్లు కలదు. ఈకథ వాల్మీకిరామాయణవిరుద్ధము. అయినను మార్కండేయుఁడు సప్తకల్పజీవి యని ప్రసిద్ధి కలదు. ఒకకల్పములోని రామచరితము నాయన చెప్పియుండును. మఱియొకకల్పములోని రామచరితమును వాల్మీకి మహర్షి వర్ణించియుండును. దశావతారము లనేకపర్యాయములు వచ్చెననియు అయ్యవి కొన్నియర్ధసమములు కొన్నిపాదసమములు కొన్నిపూర్ణసమములనియు యోగవాసిష్ఠనిర్వాణప్రకరణమున భుశుండోపాఖ్యానమున వర్ణింపఁబడినది, గనుక, విరోధ మేమియును లేదు. వాల్మీకిరామాయణము మార్కండేయులకుఁగాని వ్యాసులకుఁగాని తెలియ దనుట యుక్తము గాదు.

ఇఁక విమర్శకులు గనఁబఱిచిన ప్రశ్నలలోఁ బ్రథమ ప్రశ్నము చేసిన వారలు భీమునిదౌష్ట్యమే దుర్యోధనవిరోధమునకుఁ బ్రథమకారణ మని తలంచిరి. అది సరికాదు. లోకమున బలాధికుఁడును విద్యాధికుఁడును స్వభావముచే నితరుల సరకుగొనక స్వతంత్రుఁడై యుండును. దానిం జూచి యసమానపరు లోర్వఁజాల కుందురు. ఇది లోకవిదితము. దుర్యోధనుఁడు పరశ్రేయస్సహనము లేని

వాడు,గనుక,విద్యాధికుఁడగు ధర్మజుని బలాధికుఁడగు భీముని నిరోధించి రాజ్యము చేయఁదలఁచి యుండెను. ఈసంగతి ధీరోద్ధతుఁడగు భీమునకుఁ దెలిసియుండును. బాలక్రీడయందు బాల్యముచే ధార్తరాష్ట్రులకుఁ దనబలాధిక్యమును గనఁబఱిచి యుండును. ఇట్టిభీమునితో స్నేహము చేయుట మాని విషము పెట్టించి నిదురించి నపుడు నీటిలోఁ ద్రోయుటకు దుర్యోధనుని దౌష్ట్యమే హేతువు. ఆదిపర్వః। అధ్యా. ౧౨౮-వ శ్లో॥ ఏవం సధార్తరాష్ట్రాంశ్చ స్పర్థమానో వృకోదరః। అప్రియే తిష్ఠదత్యంతం బాల్యా న్న ద్రోహచేతసా॥ ఈవిధమున వృకోదరుఁడు బాల్యముచే దుర్యోధనాదుల కప్రియ మాచరించెను గాని ద్రోహబుద్ధిచేతఁ గాదు. అని భారతమునఁ గలదు. ద్రోహబుద్ధిచేతనే యహిత మాచరించె నని వీరు వ్రాయుట యసంగతము. ఆయధ్యాయముననే శ్లో. తస్య ధర్మా దపేతస్య పాపాని పరిపశ్యతః। మోహా దైశ్వర్యలోభాచ్చ పాపా మతి రజాయత। అయం బలవతాం శ్రేష్ఠః కుంతీపుత్రో వృకోదరః। మధ్యమః పాండుపుత్రాణాం నికృత్యా స న్నిహన్యతాం। ప్రాణవా న్విక్రమీ చైవ శౌర్యేణ మహతాన్వితః। స్పర్థతే చాపి సహితా నస్మానేకో వృకోదరః। తంతు సుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిపామహే। అథ తస్మా దవరజం శ్రేష్ఠం చాపి యుధిష్ఠిరమ్। ప్రసహ్య బంధనే బద్ధ్వా ప్రశాసిష్యే వసుంధరామ్॥ ధర్మవిముఖుఁడును పాపబుద్ధియు నగుదుర్యోధనుఁడు రాజ్యలోభమున భీముని గంగలో బడఁద్రోయవలె ననియు ధర్మజాదుల బంధించి రాజ్యము చేయవలయు ననియు సంకల్పించెను. అని వీని యర్థము. దుర్యోధనుఁడు సధర్ముఁ డైనయెడలఁ దమకు ద్రోహ మాచరించు భీమునిపై ద్వేషించినను శాంతస్వభావులును నిరపకారులు నగుధర్మజాదుల బంధింపవలె నని యేల సంకల్పింపవలెను. ద్రుపదుఁ డర్జునునిచే నవమానింపఁబడినను అర్జునునితో సంబంధము చేసి మైత్రిని సంపాదించుకొనలేదా? కాన సుయోధనుని యసహనమే పాండవులపై ద్వేషమునకుఁ బ్రథమ కారణము. భీము దౌష్ట్యము కాదు. దుర్యోధనుఁడు కర్ణాదులను వలె భీముని గౌరవించినయెడల భీముఁడు తనప్రాణములనైన వారి కిచ్చెడివాఁడు. ఏకచక్రపురమున బ్రాహ్మణపుత్రరక్షణమునకై బకుని వధింపలేదా? పూర్వోత్తరగ్రంథముల విమర్శించినయెడలదుర్యోధనాసహనమే వైరమునకుఁబ్రథమకారణమని తేలును.

ద్వితీయప్రశ్నము చేసినవారలు పాండవోత్పత్తిచరితము హాస్తినపురవాసులకుఁ దెలియదు గనుకనే వీరు పాండుసుతు లగుదురో కారో యని కొందఱు సంశయించి రని వ్రాసిరి. అది సరికాదు.

పాండురాజు మృతుఁ డైనపుడు శతశృంగగిరినివాసు లగుతాపసులు పాండవులను కుంతిని మాద్రీపాండురాజులశరీరములను అనఁగా శల్యములను దీసి

కొని హాస్తినపురమునకు వచ్చిద్వారపాలునితో రాజునకు వర్తమానము పంపిరి. అపుడు హాస్తినపురవాసు లందఱును ధృతరాష్ట్రభీష్మవిదురాదులును సత్యవత్యాదిరాజమాతలును నగరివెలుపలికి వచ్చి యొకస్థలమున సభగాఁ గూర్చుండిరి. అపు డామహర్షులకు భీష్ముఁడు పూజ గావించెను. సభ నిశ్శబ్దముగా నుండఁగా వారిలో నొకమహర్షి తమవారియనుమతి గొని "పాండుమహారాజు బ్రహ్మచర్యవ్రత మవలంబించి శతశృంగపర్వతమునకు వచ్చెను. దేవతారహస్యమువలనఁ గుంతియందు యమధర్మరాజు వలన ధర్మజుఁడును వాయుదేవునివలన భీముఁడును మహేంద్రునివలన నర్జునుఁడును అశ్వినీదేవతలవలన మాద్రియందు నకులసహదేవులును గలిగిరి. ధర్మనిత్యుఁ డగుపాండురాజువలన రాజవంశ ముద్ధరింపఁబడినది. పాండురాజు పదియేడుదినములక్రిందఁ బరలోకగతుఁ డాయెను. మాద్రి పాండురాజుతో సహగమనము చేసెను. కుంతిని పాండవులను పాండుమాద్రుల శరీరములను మీ కప్పగించుచున్నాము. ఉత్తరతంత్రమును మీరు నడుపుకొనవలసిన" దని చెప్పెను. అప్పు డామహర్షు లంతర్ధాన మందిరి. అపుడు ధృతరాష్ట్రుఁడు విదురునితో పాండుమహారాజునకు సకలప్రేతకృత్యములను యథావిధిగా జరిపించు మనియు కుంతిని అంతఃపురములోఁ జేర్చి యాదరింపవలసిన దనియు పాండుమహారాజునకు దేవతుల్యు లగు నైదుగురు కుమారులు కలరు, ఆయన విషయమై మనము చింతింపఁ బనిలేదనియు సెలవిచ్చెను. ఈకథ ఆదిపర్వము ౧౨౬ అధ్యాయమునఁ గలదు. ఈవిధముగా మహర్షులుచెప్పినపుడు వీరు పాండుసుతులు కా రని గాని వీరు గూఢోత్పన్నులు గనుక కులీనులు గా రని కాని యెవ్వరును ఆక్షేపించి యుండలేదు. అర్ధరాజ్యము నపహరించెద రనుభీతితో ధృతరాష్ట్రుఁడైన నిట్టిదోషముల నారోపింప వలసియుండెను. ఆయనయు నాక్షేపింపలేదు. ఇట్లు పాండవోత్పత్తి సర్వజనసంప్రతిపన్నమై యుండఁగా ఆకాలము వారికి వారియుత్పత్తి శిష్టసమ్మతము కా దని వ్రాయుట కేవల మసంగతము. వీరు పాండుమహారాజు కుమారు లగుదురా కారా? యని కొందఱజ్ఞులు సంశయించిన సంశయించి యుందురు. సీతాపాతివ్రత్యమునకు రజకుఁడు సంశయింపలేదా? కనుక నది యకించిత్కరము. ఈసంగతి తెలుపుట కాయధ్యాయము నిచట పొందుపఱుచుచున్నాను. ఆదిపర్వ। అధ్యాయము ౧౨౭ శ్లో॥ పాండోరుపరమం దృష్ట్వా దేవకల్పా మహర్షయః। తతో మన్త్రవిద స్సర్వే మంత్రయాంచక్రిరే మిథః॥ తాపసా ఊచుః॥ అస్మిన్ స్థానే తపస్తప్త్వా తాపసాన్ శరణం గతః। సజాతమాత్రా న్పుత్రాంశ్చ దారాంశ్చ భవతామిహ। ప్రదా యోపనిధిం రాజా పాండు స్స్వర్గమితో గతః। తస్యేమా నాత్మజా న్దేహం భార్యాం చ సుమహాత్మనః। స్వరాష్ట్రం గృహ్యగచ్ఛామో ధర్మ ఏష హి న స్స్మృతః॥ వైశంపా

యన ఉవాచ॥ తేపరస్పరమామన్త్ర్య దేవకల్పా మహర్షయః । పాండోః పుత్రా
న్పురస్కృత్య నగరం గజసాహ్వయమ్ । ఉదారమనస స్సిద్ధా గమనే చక్రిరే
మతిం । భీష్మాయ పాండవా న్దాతుం ధృతరాష్ట్రాయ చైవహి । తస్మిన్నేవ క్షణే
సర్వే తానాదాయ ప్రతస్థిరే । పాండో ర్దారాంశ్చ పుత్రాంశ్చ శరీరే తేచ తా
పసాః । సుఖినీ సాపురాభూత్వా సతతం పుత్రవత్సలా । ప్రపన్నా దీర్ఘ మధ్వా
నం సంక్షిప్తం తదమన్యత । సాత్వదీర్ఘేణ కాలేన సంపన్నా కురుజాంగలమ్ । వర్ధ
మానపురద్వార మాససాద యశస్వినీ । ద్వారిణం తాపసా ఊచూ రాజానం
చ ప్రకాశయ । తేతు గత్వా క్షణేనైవ సభాయాం వినివేదితాః । తం చారణ
సహస్రాణాం మునీనా మాగమంతదా । దృష్ట్వా నాగపురే నౄణాం విస్మయ
స్సముపద్యత । ముహూర్తోదిత ఆదిత్యే సర్వే బాలపురస్సరాః । సదారా స్తాపసా
న్ద్రష్టుం నిర్యయుః పురవాసినః । స్త్రీసంఘాః క్షత్రసంఘాశ్చ యానసంఘసమాస్థి
తాః । బ్రాహ్మణై స్సహ నిర్జగ్ము ర్బ్రాహ్మణానాం చ యోషితః । తథా విట్శూ
ద్రసంఘానాం మహాన్వ్యతికరో భవత్ । నకశ్చి దకరో దీర్ష్యా మభవ న్ధర్మబుద్ధ
యః । తథా భీష్మ శ్శాంతనవ స్సోమదత్తో థ బాహ్లికః । ప్రజ్ఞాచక్షు శ్చ రాజ
ర్షిః క్షత్తాచ విదుర స్స్వయమ్ । సాచ సత్యవతీ దేవి కౌసల్యాచ యశస్వినీ ।
రాజదారైః పరివృతా గాన్ధారీ చాపి నిర్యయౌ ॥ ధృతరాష్ట్రస్య దాయాదా
దుర్యోధనపురోగమాః । భూషితా భూషణై శ్చిత్రై శ్శతసంఖ్యా వినిర్యయుః ।
తాన్మహర్షిగణా న్దృష్ట్వా శిరోభిరభివాద్యచ । ఉపోపవివిశు స్సర్వే కౌరవ్యా స్స
పురోహితాః । తథైవ శిరసా భూమా వభివాద్య ప్రణమ్యచ । ఉపోపవివిశు
స్సర్వే పౌరజానపదా అపి । తమకూజ మభిజ్ఞాయ జనౌఘం సర్వశస్తదా । పూ
జయిత్వా యథాన్యాయ్యం పాద్యేనార్ఘ్యేణచ ప్రభో । భీష్మో రాజ్యం చ రాష్ట్రంచ
మహర్షిభ్యో న్యవేదయత్ । తేషామథోవృద్ధతమః ప్రత్యుత్థాయ జటాజినీ । ఋ
షీణాం మతమాజ్ఞాయ మహర్షి రిదమబ్రవీత్ । యః స కౌరవదాయాద పాండు
ర్నామ నరాధిపః । కామభోగా న్పరిత్యజ్య శతశృంగ మితో గతః । బ్రహ్మచర్య
వ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా । సాక్షాద్ధర్మా దయంపుత్రః తత్రజాతో యు
ధిష్ఠిరః । తథైనం బలినాం శ్రేష్ఠం తస్యరాజ్ఞో మహాత్మనః । మాతరిశ్వా దదా
పుత్రం భీమం నామ మహాబలమ్ । పురుహూతాదయం జజ్ఞే కుంత్యామేవ ధనం
జయః । యస్య కీర్తి ర్మహేష్వాసా న్సర్వా నభిభవిష్యతి । యౌతు మాద్రీ మహే
ష్వాసౌ వసూత పురుషోత్తమౌ । అశ్విభ్యాం పురుషవ్యాఘ్రా విమౌ తా వపి
పశ్యత । చరతా ధర్మనిత్యేన వనవాసం యశస్వినా । నష్టః పైతామహో
వంశః పాండునా పునరుద్ధృతః । పుత్రాణాం జన్మబుద్ధించ వైదికాధ్యయనా
నిచ । పశ్యంత స్సతతం పాండోః పరాంప్రీతి మవాప్స్యథ । వర్తమానస్స

తాం నృత్తే పుత్రలాభ మవాప్యచ । పితృలోకం గతః పాండు రితస్సప్త దశేహని । తం చితాగత మాజ్ఞాయ వైశ్వానరముఖే హుతమ్ । ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వాజీవిత మాత్మనః । సా గతా సహ తేనైవ పతిలోక మనువ్రతా । తస్యా స్తస్యచయత్కార్యం క్రియతాం తదనంతరమ్ । ఇమే తయోశ్శరీరేద్వే పుత్రా శ్చేమే తయోర్వరాః । క్రియాభి రనుగృహ్యంతాం సహ మాత్రా పరంతపాః । ప్రేతకార్యే నివృత్తేతు పితృమేధం మహాయశాః । లభతాం సర్వధర్మజ్ఞః పాండుః కురుకులోద్వహః॥ వైశంపాయనఉవాచ॥ ఏవముక్త్వా కురూ న్సర్వా న్కురూణా మేవ పశ్యతామ్ । క్షణే నాన్తర్హితా స్సర్వే తాపసా గుహ్యకై స్సహ । గంధర్వనగరాకారం తత్రైవాన్తర్హితం పునః । ఋషిసిద్ధగణా న్దృష్ట్వా విస్మయం తే పరం యయుః। ధృతరాష్ట్రఉవాచ॥ పాండో ర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ । రాజవ ద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషతః । పశూ న్వాసాంసి రత్నాని ధనాని వివిధానిచ। పాండోః ప్రయచ్ఛ మాద్ర్యాశ్చ యేభ్యో యావచ్చ వాంఛితమ్ । యథాకుంతీచ సత్కారం కుర్యా న్మాద్ర్యా స్తథాకురు । యథా నవాయు ర్నాదిత్యః పశ్యేతాం తాంసుసంవృతామ్ । నశోచ్యః పాండురనఘః ప్రశస్య స్సనరాధిపః । యస్యపంచసుతా వీరా యాతా స్సురసుతోపమాః ॥ ఇత్యాది ॥

౮-వ ప్రశ్న చేసిన వారలు భీష్మద్రోణాదులు గూఢోత్పన్నులు గనుక తమవలె గూఢోత్పన్ను లగుపాండవులను ప్రేమించిరి. కులీను లగుదుర్యోధనాదులపై ద్వేషించిరి-అని తలంచిరి. అది సరి కాదు.

ఆదిపర్వ॥ అధ్యా ౧౬౦. శ్లో॥ ధృతరాష్ట్రః స్వచక్షుష్ట్వా ద్రాజ్యం నప్రత్యపద్యత । పారశవత్వాద్విదురో రాజాపాండు ర్బభూవహ ॥ ధృతరాష్ట్రుఁడంధుఁడైనందున రాజ్యాభిషిక్తుఁడు కాలేదు. విదురుఁడు శూద్రయోనిజుఁడైనందున రాజ్యాభిషిక్తుఁడు కాలేదు. ఏదోషములు లేనిపాండుమహారాజు పట్టాభిషిక్తుఁడాయె నని చెప్పఁబడి యున్నందున పాండుమహారాజే రాజ్యాభిషిక్తుఁడాయెను. ఆయన విరక్తుఁడై వనవాసముచేసి నప్పుడు అగతికముగా ధృతరాష్ట్రుఁడే రాజ్యతంత్రమును జూచుచుండెను. పాండురాజసుతులు రాజ్యార్హులై ధార్మికు లని ఖ్యాతిగాంచి యుండఁగా వారిపై ద్వేషించుటయే గాక విషప్రదానజలపాతనలాక్షాగృహదాహకపటద్యూతాదిమూలముగా బాధించుచు నెందఱు చెప్పినను వినకుండుటం జేసి భీష్మద్రోణాదు లననేల ధృతరాష్ట్రగాంధారులకుఁ గూడ దుర్యోధనునిపై ద్వేషము గలిగినది. భవితవ్యతవలనను పుత్రప్రేమాధిక్యతవలనను ధృతరాష్ట్రుఁడాతనిపక్షము నదలలేకపోయెను. ఆదిపర్వ॥ అధ్యాయ ౨౦౪. శ్లో॥ యథైవ పాండో స్తేవీరాః కుంతీపుత్రా మహారథాః । తథైవ ధర్మత

స్సర్వే మమపుత్రా నసంశయః। యత్రైవ మమపుత్రాణా మిదం రాజ్యం విధీయతే। తత్రైవ పాండుపుత్రాణా మిదంరాజ్యం నసంశయః॥ పార్థులు పాండురాజునకుఁ గుమారులైనట్లు నాకును ధర్మముచేఁ గుమారులు, నాకుమారులకీరాజ్యమందుఁ గలస్వత్వము పాండవులకును గలదు, సంశయము లేదని ధృతరాష్ట్రుఁడు విదురునితోఁ జెప్పెను. పాండవులయందు క్షేత్రజత్వప్రయుక్త న్యూనతయే యున్నయెడల ధృతరాష్ట్రుఁడు ఔరసులు గనుక నాకుమారులే రాజ్యార్హులు క్షేత్రజులు కాన పార్థులు రాజ్యార్హులు కా రని చెప్పియుండును, గనుక సర్వవిధముల రాజ్యార్హు లగుపాండవులపై ద్వేషించుటయే భీష్మాదులకు దుర్యోధనాదులపై ద్వేషమునకు హేతువు. ఉద్యోగపర్వ॥ అధ్యా ౧౦౩ శ్లో॥ సత్వం పాప మతిం క్రూరం పాపచిత్త మచేతసమ్। అనుశాధి దురాత్మానం స్వయం దుర్యోధనంనృప॥ పాపబుద్ధికలిగి వివేకరహితుఁ డగుదుర్యోధనుఁడు నాకు వశుఁడు కాఁడు నీవే శిక్షింపు మని శ్రీకృష్ణునితో ధృతరాష్ట్రుఁ డనియెను. ఈ విధముగా ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుఁ డధార్మికుఁడు పాపాత్ముఁ డని యంగీకరించెను. ఉద్యోగపర్వ॥ అధ్యా ౧౨౮. శ్లో॥ గాంధారీ॥ నిగృహ్యానుహృదాం మన్యుం శాధి రాజ్యం యథోచితమ్। స్వమంశం పాండుపుత్రేభ్యః ప్రదాయ భరతర్షభ॥ పాండవులభాగమును పాండవుల కిచ్చి స్నేహితులకుఁ గోపమురాకుండ వర్తించి రాజ్యము పాలింపుము. అని గాంధారి దుర్యోధనునితోఁ జెప్పెను. ఈవిధముగా దుర్యోధనుఁ డర్ధరాజ్యమును పాండవుల కీయకుండుట యధర్మమని గాంధారియు నంగీకరించినది. శ్లో॥ యచ్చత్వం మన్యసే మూఢ భీష్మద్రోణకృపాదయః। యోత్స్యంతే సర్వశక్త్యేతి నైతద ద్యోపపద్యతే। సమంహి రాజ్యం ప్రీతిశ్చ స్థానంహి విదితాత్మనామ్। పాండవే ష్వథయుష్మాసు ధర్మ స్త్వభ్యధిక స్తతః॥ భీష్మద్రోణకృపాదులు నాపక్షమున సర్వశక్తులతో యుద్ధము చేయుదురని తలంచెదవేమో అట్లుతలంపకుము వారలకు మీరుభయులు సములు పాండవపక్షమందు ధర్మమధిక మని చెప్పెను.

శ్లో॥ త్వం హ్యే వాత్ర భృశం గర్హ్యో ధృరాష్ట్ర సుతప్రియః। జానన్హి పాపతా మస్య తత్ప్రజ్ఞామనువర్తసే॥ అని దుర్యోధనుఁడు పాపాత్ముఁడు అతని మాటవినవల దని గాన్ధారి భర్తతోఁ జెప్పెను. ఇటులు భీష్మద్రోణాదులు పాండవులఁ బ్రేమించుటకు వారిధార్మికత్వమే హేతు వని దుర్యోధనుని తలిదండ్రులు గూడ నంగీకరించినప్పుడు కారణాన్తరము నన్వేషించుట యనుచితము.

4. 5. ప్రశ్నలకుత్తరము:—దుర్యోధనుఁడు రాజనీతికుశలుఁడు. ఈసంగతిని శ్లో॥ సఖీనివ ప్రీతియుజో౽నుజీవిన స్సమానమానా సుహృదశ్చ బంధుభిః। ససన్తతం దర్శయతే గతస్మయః కృతాధిపత్యా మివసాధుబంధుతామ్॥ దుర్యోధ

నుఁడు భృత్యుల స్నేహితులతో సమముగను స్నేహితులను బంధువులతో సమముగను బంధువులను ప్రభువులను గాను గౌరవించె నని భారవి వర్ణించియున్నాఁడు. సుయోధనుఁడు పాండవభీతుఁ డగుటంజేసి భీష్మద్రోణాదులఁ దమయొద్దనేయుండున ట్లాదరించి నిలుపుకొనెను. పాండవులు మహాబలు లగుటంజేసి యు భీష్మద్రోణాదులఁ దమయొద్దకు రప్పించుకొనినయెడల మిత్రభేదము కలుగు ననియు నుపేక్షించిరి. ద్యూతానంతరము పాండవులు రాజ్యభ్రష్టులైనందున నట్టియవకాశమే ఘటింపలేదు. ఇంతకాలము దుర్యోధనునిచేఁ బోషింపఁబడి యుద్ధకాలమున దుర్యోధనుని విడనాడుట న్యాయముకా దని యెంచి భీష్మద్రోణాదు లాతనిపక్షముననే యుండిరి. నీపక్షము న్యాయ్యము కాదు, నీకు జయము కలుగ దని పలుమారు దుర్యోధనునితో వ్యక్తముగాఁ బలికిరి. శ్లో॥ అర్థస్య పురుషోదాసో దాస స్త్వర్థో నకస్యచిత్ । ఇతి సత్యం మహారాజ బద్ధోస్మ్యర్థేన కౌరవైః॥ అర్థమునకు పురుషుఁడు దాసుఁడు. అర్థమెవ్వనికిని దాసుఁడుకాదు. ఇది నిజము. కౌరవులచేత నేనర్థమూలమునఁ గట్టువడితి నని భీష్ముఁడును ద్రోణుఁడును ధర్మజునితో ననిరి. ఇది మే మర్థపరతంత్రుల మని చెప్పుటకాదు. ఇప్పుడు దుర్యోధనపక్షము వదలినయెడల మాకుఁ గృతఘ్నతాదోషము ఘటించును. మే మాపక్షముననే పోరాడెదము. మామనఃపూర్వకముగా ధార్మికుఁడ వగునీకు క్షేమచింతనము చేయుదు మని చెప్పిరి, గాన భీష్మద్రోణాదులు స్వార్థపరులును గారు. ధర్మజుఁడు లుబ్ధుఁడును గాఁడు.

6-వ ప్రశ్నకుత్తరము:—భీష్మద్రోణు లజేయులు, తా ముండినపక్ష మధర్మ మని వారికిఁ దెలియును. ధర్మమేజయ మందవలె నని వారి సిద్ధాంతము. తాము హతులు కానిది ధర్మజునకు జయము రాదు గనుక తమమరణోపాయములను తామే చెప్పిరి. కర్ణుఁడు ధర్మజపక్షమునఁ జేరినయెడల దుర్యోధనుఁడు యుద్ధోత్సాహవిముఖుఁ డగును. దానంజేసి లోకమునకు క్షేమము కలుగు నని భీష్ముఁడు కర్ణుని పాండవపక్షమునఁ జేరు మని చెప్పెను కాని దుర్యోధనునిపై ద్రోహబుద్ధిచేఁ గాదు; గనుకనే భీష్మపర్వ॥ అధ్యా. ౧౨౪. శ్లో॥ సంగచ్ఛ్వైతై ర్మహాబాహో మమచే దిచ్ఛసిప్రియమ్ । మయాభవతు నిర్వృత్తం వైర మాదిత్యనందన । పృథివ్యాం సర్వరాజానో భవం త్వద్యనిరామయాః॥ నీవు నాకుఁ బ్రియము చేయ నిచ్ఛయించితివేని పాండవులలోఁ జేరుము. వైరము నాతో సమాప్తమగుఁగాక. పృథివిలోన రాజులందఱు నిరుపద్రవు లగుదురుగాక. అని పలికెను. నీసహాయమున దుర్యోధనుఁడు పాండవులతో విరోధించుచున్నాఁడు. నీవు పాండవులలోఁ జేరినయెడల సంధి కిచ్ఛయించును. అప్పుడు యుద్ధము నిలిచిపోవును. రాజుల కందఱకు క్షేమము కలుగును. అని చెప్పెను. కాని పాండవులలోఁ

జేరి దుర్యోధనున కపకారము చేయు మని కృతఘ్నతను బోధించియుండ లేదు. భీష్మద్రోణులు ధర్మజపక్షపాతు లని దుర్యోధనునకు దృఢముగాఁ దెలియును. ఇటులు తెలిసియు వీరి నెందుకు వదలలేదు? దుష్టుఁడగు దుర్యోధనుఁడు వీరి వలన పాండవపక్షమున కేమాత్రము నష్టము కలిగినను దానికే సంతసించెద నని తలఁచెను. అటులే జరిగెను. కర్ణశల్యులు కుంతీధర్మజులకుఁ దామిచ్చిన వర ప్రకారము వర్తించిరి, గనుక, వారి ప్రవర్తనములలో లోప మేమియును లేదు.

7-వ ప్రశ్న కుత్తరము:—భీమునకు విషము పెట్టించినట్టియు లాక్షా గృహదహనోద్యోగము చేసినట్టియు దుర్యోధనుఁడు తనకు సాధ్యమైనయెడల నెందఱినైన నన్యాయముగాఁ జంపించువాఁడే. సౌప్తికవధానంతరము అశ్వత్థామ ధృష్టద్యుమ్నాదుల నిద్రాసమయమున వధించితి నని చెప్పినపుడు ఇట్టి యుకార్యము నేలచేసితి వనుటకు మాఱుగా శ్లో॥ నమే కరో న్మే గాంగేయః నకర్ణో నచ తే పితా। యత్త్వయా కృపభోజాభ్యాం సహితే నాద్య మే కృతమ్॥ భీష్మద్రోణకర్ణులెవరును నీవు చేసినంత ఘనకార్యము చేయలే దని శ్లాఘించెను, గనుక సాధ్యముగాక యూరకుండెను. అందఱి నన్యాయముగాఁ జంపుట యందు దుర్యోధనునకు సందేహము లేదు.

(8) ప్రశ్న కుత్తరము:—దుర్యోధనదుశ్శాసనవధలు ప్రతిజ్ఞానుసారము జరిగినవి. భీష్మద్రోణాదు లజేయులు గనుక వారియాజ్ఞాప్రకారమే వారిని జయించిరి. మఱికొందఱిను జయించుటలోఁ గొన్నియక్రమము లున్నను అక్రమస్థుల నక్రమముగా వధించిరిగాన నదియు దోషము కాదు. శ్లో॥ ధర్మవ్యుచ్ఛిత్తి మిచ్ఛన్తో యేఽధర్మస్య ప్రవర్తకాః। హన్తవ్యా స్తే దురాత్మానో దేవైర్దైత్యా ఇవోల్బణాః। ఏకం హత్వా యదికులే శిష్టానాం స్యాదనామయమ్। కులం హత్వా ధరాష్ట్రేచ నతద్వృత్తోపఘాతకమ్। యోహి పాపసమారంభః కార్యే తద్భావభావితః। కుర్వన్నపి తథైవ స్యాత్ కృత్వాచ నిరపత్రపః। తస్మిం స్తత్కిల్బిషం సర్వం సమాప్త మితి నిశ్చితమ్। త్వంతు శుక్లాభిజాతీయః పరదోషేణ కారతః। అనిచ్ఛమానః కర్మేదం కృత్వాచ పరితప్యసే। అశ్వమేధో మహాయజ్ఞః ప్రాయశ్చిత్త ముదాహృతమ్॥ అని శాంతిపర్వమునఁ జెప్పఁబడినరీతిని అధార్మికు లగు కౌరవులను అధర్మముగా వధించినను దోష ముండదు. దేవతలు అధార్మికు లగు రాక్షసుల నటులే వధించిరి. పరదోషమువలన అనిచ్ఛతో యుద్ధమందు ప్రవర్తించి యుద్ధానంతరము పశ్చాత్తప్తుఁడై అశ్వమేధాదిప్రాయశ్చిత్తములు చేసికొనిన ధర్మజుఁడు శుద్ధుఁడనుటకు సంశయింపఁ బనిలేదు. దుర్యోధనోరుభంగ కాలమున దుర్యోధనుఁడు అన్యాయముచే భీష్మద్రోణకర్ణభూరిశ్రవ ప్రభృతుల సంహరింపఁజేసితి వని శ్రీకృష్ణుని నిందించెను. దానికి శ్రీకృష్ణభగవానులు నీవు

జ్ఞాతుల కర్ధరాజ్యమీయక అన్యాయద్యూతముచే బరాజితులం జేసితివి మహా రాజపుత్రియు వీరపత్నియు నగు ద్రౌపదిని కేశవస్త్రాకర్షణముఁ జేయించితివి. విష ప్రదానలాక్షాగృహదాహకూటయుద్ధాభిమన్యువధాదికముఁ జేయించితివి. ఇట్టి నీదోషముచేతనే భీష్మద్రోణాదులు నిహతులైరి. మేముచేసినయకార్యము లన్ని యు నీదౌర్జన్యమువలననే జరుపఁబడినవి. అధార్మికుల నధర్మముచే వధించినను దోషము;లేదు. బృహస్పతి నీతిశాస్త్రము శుక్రనీతియు నీ మర్మమును జెప్పెడిని; నీకాశాస్త్రములు తెలియవు నీవువృద్ధుల సేవింపలేదు. నీవుచేసిన దుష్కర్మ ములఫలము నీ వనుభవించుచున్నావు. అని సమాధానము చెప్పెను. ఆశ్లోక ముల నుదహరించుచున్నాను. శల్యపర్వ॥ అధ్యాయ ౬౧ వాసుదేవ ఉవాచ। శ్లో॥ త్వైన దుష్కృతైర్వీరా భీష్మద్రోణౌ నిపాతితౌ। కర్ణశ్చ నిహత స్సంఖ్యే త్వచ్ఛీలానువర్తకః। యాచ్యమానో మయామూఢ పిత్ర్యమంశం నదిత్ససి। పాం డవేభ్య స్స్వరాజ్యంచ లోభా చ్ఛకునినిశ్చయాత్। విషంతే భీమసేనాయ దత్తం సర్వేచ పాండవాః। ప్రదీపితా జతుగృహే మాత్రాసహా సుదుర్మతే। సభా యాం యాజ్ఞసేనీచ క్లిష్టాద్యూతే రజస్వలా। తదైవ తావద్దుష్టాత్మ న్వధ్య స్త్వం నిరపత్రపః। అనక్షజ్ఞంచ ధర్మజ్ఞం సౌబలే నాక్షవేదినా। నికృత్యా యత్పరా జైషీ స్తస్మా దసి హతో రణే॥ అభిమన్యుశ్చ యద్బాల ఏకోబహుభి రాహవే। త్వద్దోషై ర్నిహతః పాప తస్మాదసి హతో రణే॥ యా న్యకార్యాణి చాస్మాకం కృతానీతి ప్రభాషసే। వైగుణ్యేన తవాత్యర్థం సర్వంహి తదనుష్ఠితమ్। బృహ స్పతే రుశనసో నోపదేశ శ్శ్రుతస్త్వయా। వృద్ధా నోపాసితా శ్చైవ హితం వాక్యం న తేశ్రుతమ్। లోభే నాతిబలేన త్వం తృష్ణయాచ వశీకృతః। కృతవా నసి కార్యాణి విపాక స్తేషు భుజ్యతామ్॥ ఈశ్లోకము లీయర్థము చెప్పును. అటుపైన దుర్యోధనుఁడు నేనధ్యయనము చేసితిని, యథావిధి దానముల నాచ రించితిని, సాగరాంతభూమిని పాలించితిని, శత్రువుల నవమానించితిని, క్షత్రియుల కిష్ట మగుయుద్ధమందుఁ బ్రాణత్యాగము చేయుచుంటిని, దేవార్హములును మను ష్యులకలభములుగానివియు భోగముల ననుభవించితిని, స్నేహితులతోడను దమ్ము లతోడను స్వర్గమున కేగుచున్నవాఁడను. నాకంటె నదృష్టశాలి యెవఁడు? మీరు విహతసంకల్పులై దుఃఖించుచు జీవింపుఁ డని పలికెను. దుర్యోధన॥ శ్లో॥ అధీతం విధివద్దత్తం భూః ప్రశాస్తా ససాగరా। మూర్ధ్ని స్థిత మమిత్రాణాం కోనుస్వంతతరో మయా॥ యదిష్టం క్షత్రబంధూనాం స్వధర్మ మనుతిష్ఠతామ్। తదిదం నిధనం ప్రాప్తం కోను స్వంతతరో మయా॥ దేవార్హా మానుషాభోగాః ప్రాప్తా అసులభా నృపైః। ఐశ్వర్యం చోత్తమం ప్రాప్తం కోనుస్వంతతరో మయా॥ ససుహృ త్సానుజశ్చాహం స్వర్గంగంతా య మచ్యుత। యూయం విహతసం

కల్పా శ్శోచంతో వర్తయిష్యథ॥ అను శ్లోకము లీయర్థమును జెప్పెను. ఈదుర్యోధనవాక్యావసానమందుఁ బుష్పవృష్టియు దేవదుందుభినిర్ఘోషము అప్సరోనర్తనము మొదలగు నద్భుతములు జరిగియుండెను. దుర్యోధనుఁడు శత్రువులఁ బరాభవించి యఖండభూమండలము పాలించెను. అధ్యయనము చేసెను. మహాదానములం జేసెను యుద్ధమునందు సపరివారుఁడై మృతుఁ డగుచున్నాఁడు. ధర్మజాదులు బంధువియోగముచే దుఃఖితులై జీవించెదరు ఇది యంతయు సత్యమని మన మీదేవతానుమోదనమువలన గ్రహింపనగును, గాని, దుర్యోధనుఁడు పాండవులకు భాగమీయకుండుట ధర్మ మనియు ద్రౌపదీ కేశవస్త్రాకర్షణాదికము ధర్మమనియుఁ గాదు. ఒకప్పుడు పాండవులు భీష్మ ద్రోణాదుల నక్రమముగా సంహరించిరి యని యభిప్రాయము కావచ్చును. దానికి శ్రీకృష్ణభగవానులు ధర్మయుద్ధముచే భీష్మాదుల జయించుట యెవ్వరికిని సాధ్యము కాదు అధర్మపక్షావలంబు లగుభీష్మాదుల మాయాయోగముచేత నేను సంహరింపఁ జేసితిని. ఇటులు చేసితిమే యని మీరు చింతింపవలదు. బలాధికులును అధార్మికులునగు శత్రువుల మాయోపాయమున వధింపవచ్చును రాక్షసులను వధించునప్పుడు దేవత లీమార్గము నవలంబించిరి. పూర్వులప్రకారము మనము వర్తించుచున్నాము. అని పాండవుల కాజ్ఞ యిచ్చెను. శ్లో॥ నచవో హృదికర్తవ్యం యదయం ఘాతితో రిపుః। మిధ్యావధ్యా స్తథోపాయైః బహవశ్శత్రవో ధికాః। పూర్వై రనుగతో మార్గో దేవై రసురఘాతిభిః। సద్భి శ్చానుగతః పంథాస్స సర్వై రనుగమ్యతే॥ అనుశ్లోకము లీయర్థమును జెప్పుచున్నవి. దుర్యోధనుఁడు రావణాదులవలె సకలజనాపకారి కాఁడు. తాను శత్రువులుఁగా భావించిన పాండవుల కెంతటి యధర్మములనైనఁ జేయుటకు జంకకుండెను. బలరాముఁడు పౌరాణికుఁ డగుసూతుఁడు తాను వచ్చినపుడు లేవలేదను నెపమున ఆయనను వధించెను. బ్రహ్మహత్యాదోషనిరహరణార్థము బ్రాహ్మణులు విధింపఁగాఁ బ్రాయశ్చిత్తముకొఱకుఁ దీర్థాటనము చేసెను. శ్రుతిస్మృతినిషిద్ధ మగుసురాపానము చేయువాఁడు బలాధిక్యమువలన భగవదవతారముగా లెక్కింపఁబడినను ఆయవతారమందు జ్ఞానశక్తిప్రకాశము తరుగు, గనుక, తనశిష్యుఁ డగుదుర్యోధనుని పరాభవమున కంగీకరింపక కుపితుఁడై యూరుభంగమున కాక్షేపించెను. ఆయనను శాంతిపొందించుటకు శ్రీకృష్ణుఁడు నాలుగుహేతువులఁ గనఁబఱిచెను. నీవు ధర్మవత్సలుఁడవు. ధర్మనిరతు లగుపాండవులపైఁ గోపింపకుము. కలియుగము రాఁబోవుచున్నది. కనుక గదాయుద్ధధర్మము తొలఁగినందుల కాక్షేపింపకుము. భీముఁడు స్వప్రతిజ్ఞాపరిపాలనము చేసెను. కోపింపకుము, మైత్రేయుశాపానుసారమూరుభంగము జరిగెను గనుక కోపింపకుము. అని చెప్పెను. కలియుగము

రాఁబోవుచున్నది. అన్నయ్యా! ఇంకేటిధర్మ మనిచెప్పుట ఛందోనురోధాభిప్రాయము. ప్రతిజ్ఞాపాలనమే ప్రబలహేతువు; అట్లుచేయనియెడల అసత్యము వాటిల్లును. ఇట్లు పాండవులు ధార్మికులు దుర్యోధనాదు లధార్మికు లని భారతము వలన స్పష్ట మగుచుండఁగాఁ దద్విరుద్ధముగా నభిప్రాయము వ్రాయుట యుక్తము కాదు.

(9) ప్రశ్న కుత్తరము:—ఇంద్రునిచే నీయఁబడిన ఏకవీరఘాతిని యగు శక్తి ఘటోత్కచునియం దుపయోగింపఁబడుటచే భక్తుఁ డగునర్జునుఁడు కర్ణనిహతుఁడు కాఁ డని శ్రీకృష్ణుఁడు సంతోషించెను. ఇదిగాక ద్రోణపర్వ॥ అధ్యాయము ౧౮౩. శ్లో॥ ఏషహి బ్రాహ్మణద్వేషీ యజ్ఞద్వేషీచ రాక్షసః। యజ్ఞహంతాచ పాపాత్మా త స్మాదేవం నిపాతితః। వ్యంసితా చాప్యుపాయేన శక్రదత్తా మయానఘ। యేహి ధర్మస్యలోప్తారో వధ్యాస్తే మమపాండవ। ధర్మసంస్థాపనార్థాయ ప్రతిజ్ఞైషా మయాకృతా॥ బ్రాహ్మణులను యజ్ఞములను ద్వేషించునట్టి యజ్ఞనాశకుఁ డగుఘటోత్కచుఁడు నాకువధ్యుఁడు, ధర్మలోపకు లందఱు నాకు వధ్యులని ధర్మసంస్థాపకుఁ డగుశ్రీకృష్ణుఁ డాజ్ఞ యొసంగెను. శ్లో॥ మయా వనిహతః పూర్వ మేషయుష్మత్ప్రియేప్సయా॥ మీకు లాభముచేయఁగోరి ఘటోత్కచు నింతవఱకు వధింపకయుంటి నని కూడఁ జెప్పెను. దుష్టనిగ్రహశిష్టపరిపాలనముకొఱ కవతరించిన శ్రీకృష్ణపరమాత్ముఁ డిటులు పలుకుట లోఁగాని చేయుటలోఁగాని వింత యేమియు లేదు. ఘటోత్కచుఁడుండిన యెడలఁ దనమేనల్లునికుమారునకు రాజ్యము రాదని ఘటోత్కచవధకు శ్రీకృష్ణుఁడు సంతసించె ననుకల్పన హాస్యాస్పదము. ఘటోత్కచుఁడు రాక్షసుఁడు. అతనికి మానవరాజ్యార్హతాశంక యే కలుగనేరదు.

(10) ప్రశ్న కుత్తరము:—శ్రీకృష్ణుని యుద్ధసాహాయ్యము కోరఁదలఁచి దుర్యోధనుఁడును అర్జునుఁడును ఏకకాలముననే ద్వారకకు వెళ్లిరి. శ్రీకృష్ణుఁడు నిదురించియున్నసమయమున దుర్యోధనుఁడు ప్రథమమందు వచ్చి శిరస్థానమునఁ గూర్చుండెను. అర్జునుఁడు తరువాత వచ్చి పాదస్థానమునఁ గూర్చుండెను. శ్రీకృష్ణుఁడు ప్రప్రథమమున నర్జునుని జూచెను. అనంతరము దుర్యోధనుని జూచెను. అపుడు దుర్యోధనుఁడు నేను బ్రథమమందు వచ్చితిని నాపక్షము రమ్మని యడుగఁగా అర్జునుని మొదటఁ జూచితిని ఆయనకుఁ గూడ సహాయము చేయవలసియున్నది. మీయుభయులలో నర్జునుఁడు చిన్నవాఁడు, గనుక, ఆయన మొదట నేర్చుకొనవలయును. అర్బుదసంఖ్యాక మగునారాయణగోపాలసైన్య మొకవైపు, నిరాయుధుఁడ నగు నేనొకవైపు. ఏర్చుకొనవలసిన దని యానతీయఁగా నిరాయుధుఁడగు శ్రీకృష్ణుని నర్జునుఁ డేర్చుకొనెను. అర్బుదసంఖ్యాకు

లగు నారాయణగోపాలురను దుర్యోధనుఁడు స్వీకరించెను. కృతవర్మను గోరఁగా నాతఁ డక్షౌహిణీసైన్యము నిచ్చెను. బలదేవుని దుర్యోధనుఁడు కోరఁగా నేను భయపక్షములకు సహాయము చేయ నని చెప్పెను. తక్కిన వారిని, ఉభయులును గోరలేదు. వా రెవరిపక్షమునను రాలేదు. అంతియె కాని పాండవుల యయోగ్యతవలనఁ గాని శ్రీకృష్ణునుపలుకుబడి లేనందునఁ గాని వారు పాండవపక్షమున రాలే దని కల్పించుట యసంగతము. ఉద్యోగపర్వము ఆఱవయధ్యాయమున నీకథ వర్ణింపఁబడినది.

(11) ప్రశ్న కుత్తరము:— బాహ్లీకసోమదత్తాదులను ధర్మజపక్షము చేరకుండునట్లు రాజనీతికుశలుఁ డగుదుర్యోధనుఁడు చేసెను. ఇదిగాక పాండవులు బలవంతులు గనుక వారికి దుర్యోధనునంతయూడిగములఁ జేసి యుండరు. శల్యసత్కారమే యిందుకు నిదర్శనము. రాజసూయయాగమునకు లోఁగడ పాండవులలో నొక్కొక్కరే దిగ్విజయము చేసిరి, గాన వీరిపౌరుషమం దసూయయు నుండియుండవచ్చును. ప్రకృతివిరుద్ధజన్మమే హేతు వైనయెడల ధృతరాష్ట్రుఁడు నియోగమునవలనఁ గలిగినవాఁడే గనుక ఆయన నాశ్రయించి యుండరు. ఇదిగాక పూర్వకాలమున దేవకీస్వయంవరమందు సాత్యకితండ్రి యగుశిని, సకలరాజులను జయించి దేవకీదేవిని వసుదేవునికొఱకుఁ దెచ్చెను. అప్పుడు భూరిశ్రవస్సుతండ్రి యగుసోమదత్తుఁడు ఓర్వలేక శినితో యుద్ధముచేసి పరాజితుఁడై కేశాకర్షణపూర్వకముగాఁ బాదాహతుఁ డాయెను. అనంతరము సోమదత్తుఁడు మహాదేవు నారాధించి శినియొక్కకుమారుని బాదాహతుని జేయఁదగిన కుమారుని దయచేయు మని వేఁడెను. మహాదేవుఁ డట్టివరము నిచ్చెను. నాఁటనుండియు శినిసుతుఁ డగుసాత్యకియందు భూరిశ్రవస్సోమదత్తబాహ్లీకులకు ద్వేషము కలదు అర్జునశిష్యుఁ డగుసాత్యకి పాండవపక్షమున నియతముగా వచ్చును గనుక, అతనితోఁ బగసాధించుటకై బాహ్లీకసోమదత్తభూరిశ్రవస్సులు దుర్యోధనపక్షమున నిలిచిరి. ఈకథ ద్రోణపర్వ॥ ౧౪౪ అధ్యాయమున వర్ణింపఁబడినది. నిజము తెలియుటకుఁ గొన్ని శ్లోకముల వ్రాసెదను. శ్లో॥ తాం దృష్ట్వా దేవకీం శౌరే రథస్థాం పురుషర్షభ । నామృష్యత మహాతేజా స్సోమదత్త శ్శినే ర్నృప । తయో ర్యుద్ధ మభూ ద్రాజ న్దినార్థం చిత్ర మద్భుతమ్ । బాహుయుద్ధంసుబలినోః ప్రసక్తం పురుషర్షభ । శినినా సోమదత్తస్తు ప్రసహ్య భువి పాతితః । అసిముద్యమ్య కేశేషు ప్రసహ్యాచ పదాహతః । మధ్యే రాజసహస్రాణాం ప్రేక్షకాణాం సమంతతః । కృపయాచ పునస్తేన సజీవేతి విసర్జితః ॥ తదవస్థః కృతస్తేన సోమదత్తో ధమారిష । ప్రసాదయ న్మహాదేవ మమర్షవశ మాస్థితః ॥ తస్య తుష్టో మహాదేవో వరదానాం మహాప్రభుః । వరేణచ్ఛందయామాస సతు వవ్రే

వరంనృపః। పుత్రమిచ్ఛామి భగవ న్యోహీహాన్యా చ్ఛిసేన్సుతమ్। మధ్యేరా జనహస్రాణాం పదాహాన్యాచ్ఛ సంయుగే॥ తస్య తద్వచనం శ్రుత్వా సోమ దత్తస్య పార్థివ! ఏవ మస్త్వితి తత్రోక్త్వా సదే వోన్తరధీయత ॥ ఇత్యాది. విందాను విందులు శిశుపాలాదులవలె శ్రీకృష్ణవిరోధులు. శ్రీకృష్ణునియందలి ద్వేషమున కౌరవపక్షమున నుండిరి, గాన, నిది పాండవాగౌరవమునకుఁ గారణము గాదు.

(12) ప్రశ్న కుత్తరము:—కారణాన్తరప్రయుక్త ద్వేషము గల అలంబుసనా గకుమారభూరిశ్రవఃప్రభృతులుగాక మిగిలినవా రందఱును దాక్షిణ్యమునకు దుర్యోధనపక్షమున నుండినను ధర్మజునకు విజయము కోరియే పోరాడిరి. ప్రకృ తివిరుద్ధజన్మము గలవార లను ననాదరము గాని పక్షపాతము గాని వారి కున్నట్టు తోఁపదు. భీష్మద్రోణాదులను మహానుభావులనుగా నంగీకరించిరేగాని వారియు త్పత్తిని గాని వారిచరితమును గాని యాక్షేపించువారు నేఁటివఱకుఁ గనిపింప లేదు. అధర్మపక్షమందు మనఃపూర్వకముగా యుద్ధము చేయుటకంటె ధర్మపక్ష మునకు మనఃపూర్వక సహాయము చేసి పోషకులకుఁ బ్రాణముల నప్పగించు టయే యుక్త మని వారితలంపు. అది ధర్మవిరుద్ధము కాదు. వీరు వా రననేల. గాన్ధారీధృతరాష్ట్రులే ధర్మమే జయించు నని యాశీర్వదించిరి.

(13) ప్రశ్న కుత్తరము:—కుంతీద్రౌపదీసత్యవతులవిషయ మిదివఱకు వ్రాసితిని. గాన్ధారీపాతివ్రత్యవిషయమై యెవ్వరికిని సంశయము లేదు.

(14) ప్రశ్న కుత్తరము:—ధృతరాష్ట్రునికుమారులనామములలోఁ జాల భాగము రమణీయము లగునవియే కలవు; యుయుత్సు, జలసంధి, సమ, వింద, అనువింద, దుర్ధర్ష, సుబాహు, దుష్ప్రధర్షణ, కర్ణ, వివింశతి, శల, సత్వ, సులోచన, చిత్ర, ఉపచిత్ర, చిత్రాక్ష, చారుచిత్ర, శరాసన, దుర్విగాహ, వివిత్సు, ఊర్ణ నాభ, సునాభ, నంద, ఉపనందక, చిత్రబాణ, చిత్రవర్మ, సువర్మ, దుర్విమో చన, అయోబాహు, మహాబాహు, చిత్రాంగ, చిత్రకుండల, భీమవేగ, భీమ బల, బలవర్ధన, ఉగ్రాయుధ, సుషేణ, భీమకర్మ, చిత్రాయుధ, నిషంగి, పాశి, బృం దారక, దృఢవర్మ, దృఢక్షత్ర, సోమకీర్తి, దృఢసంధ, జరాసంధ, సత్యసంధ, సదస్సు వాక్, ఉగ్రశ్రవ, ఉగ్రసేన, దుష్పరాజయ, అపరాజిత, విశాలాక్ష, దృఢహస్త, సుహస్త, సువర్చస్సు, ఆదిత్యకేతు, నాగదత్త, అగ్రయాయి, కవచి,ఉగ్ర, భీమరథ, వీరబాహు, అలోలుప, అభయ, అనాధృష్య, ప్రమథ, ప్రమాథి, దీర్ఘబా హు, మహాబాహు, వ్యూఢోరస్సు, కనకధ్వజ, విరజస్సు ఈనామములన్నియు క్షత్రవీరులకు వాడుకలో నున్నవియే. దుర్యోధన దుశ్శాసన శబ్దములు దురా ధర్షత్వమును సూచించును గనుక నయ్యవి నింద్యములు కావు. బహ్వాశి, దుష్క ర్ణాది శబ్దములు కొన్ని శ్రవణకటువులుగా నుండినను బూర్వికులకు నామములందు

పట్టుదల లేకపోవుటచేతను వికృతనామములచేతనైన జీవించియుండిన చాలు
నను నమ్మకముతోడను, అట్టినామముల నుంచి యుందురు. శునశ్శేఫ, అష్టావ
క్రాదిఋషినామములను దీర్ఘరోమ హ్రస్వరోమాది రాజనామములను గని యు
న్నవారలము. వక్రనాసరాక్షసాదిరాజమంత్రినామములను ముద్రారాక్షసాది
నాటకములలోఁ గనియున్నవారలము. ఇపుడును మనదేశములందు పిచ్చయ్య,
పెంటయ్య, పుల్లయ్య, పాపయ్య, పాుళక్కి మొదలగునామముల నుంచుటయు
వా రొకప్పుడు విఖ్యాతులై యుండుటయుఁ జూచుచున్నాము. ఇదిగాక సుజాతు
లగుకౌరవులయందు వ్యాసమహర్షికిఁ గలద్వేషమే వికృతనామకల్పనకు హేతు
వైనయెడల ధార్తరాష్ట్రులలోఁ గొందఱియందు ద్వేషము కొందఱియం దనురా
గము కల దనియు ద్వేషము కలవారికి దుర్నామముల నుంచి రనియు అనురా
గము కలవారికి మంచినామముల నుంచి రనియుఁ గల్పింపవలసివచ్చును. ధార్త
రాష్ట్రులలో మంచినామములు కలవా రందఱు పాండవులం బోలి ప్రకృతివిరుద్ధ
జన్మము కలవార లనిచెప్పినయెడల, కుంతితో సమముగా గాన్ధారికిఁ గూడవ్యభి
చారము కల్పించినవా రగుదురు, గనుక, ఇట్టికుకల్పనలు నిర్మూలములు.

(15) ప్రశ్న కుత్తరము:—యుద్ధానంతరము ధర్మజుఁడు ధృతరాష్ట్రగాంధా
రులకు శ్రద్ధాభక్తులతో నుపచారము చేయుచుండెడివాఁడు, భీముఁడు దక్కమిగి
లినవా రందఱు నటులే యుపచారము చేయుచుండెడివారలు. భీముఁడు మా
త్రము ధీరోద్ధతుఁడు; ధార్తరాష్ట్రులవలన నానాశ్రమల నధికముగా నందెను, గాన,
వారియం దాదరము లేకుండెను. శ్లో॥ పాండవా స్సర్వకార్యాణి సంపృచ్ఛంతి
స్మ తంనృపమ్ । చక్రు స్తేనాభ్యనుజ్ఞా తావర్షాణి దశపంచచ । సదాహిగత్వా
తేవీరాః పర్యుపాసన్త తం నృపమ్ । పాదాభివందనం కృత్వా ధర్మరాజమతేస్థి
తాః॥ పాండవులు యుద్ధానన్తరము ధృతరాష్ట్రుఁడు తపస్సుకై వనమునకేగు
వఱకుఁ బదియునైదుసంవత్సరములును బ్రతిదినము ధృతరాష్ట్రునకు సకలకార్య
ములను విన్నవించి పాదాభివన్దనము చేసి ధర్మరాజాభిప్రాయప్రకారము ధృత
రాష్ట్రానుమతిచేఁ బరిపాలనము చేయుచుండెడివారలు. శ్లో॥ నతాం ప్రీతిం పరా
మాప పుత్రేభ్య స్సకురూద్వహః । యాం ప్రీతిం పాణ్డుపుత్రేభ్య స్సదావాప
తదానృపః॥ పాణ్డవులవలన ధృతరాష్ట్రుఁడు పొందినసౌఖ్యమును దుర్యోధనాదు
లవలనఁ గూడఁబొందలేదని వర్ణింపఁబడియె. ఇట్టివిషయములలో పాండవులు యు
ద్ధానంతరము దుర్యోధనపక్షమువారి నాదరింప లేదనుట యసంగతము. తమకప
కారము చేసినగాన్ధారీధృతరాష్ట్రులనే గౌరవించినపు డితరులసంగతి చెప్పనవసర
ముండదు. ధర్మజుఁడు భీముఁ డంగీకరింపకపోయినను దుర్యోధనాదిసద్గతి కల్పన
మునకై ద్రవ్య మిచ్చెను. దాని నర్జునాదు లనుమోదించిరి. మహాప్రస్థానపర్వ॥

అధ్యా ౧. శ్లో॥ తతో యుయుత్సు మామన్త్ర్య ప్రవ్రజ న్దర్శకామ్యయా। రాజ్యం పరిదదౌ సర్వం వైశ్యాపుత్రే యుధిష్ఠిరః॥ ధర్మజుఁడు వానప్రస్థమవలంబింపఁ దలఁచి వైశ్యాపుత్రుఁడును క్షేమ్మాశ్రయించినట్టియు ధార్తరాష్ట్రుఁడు నగు యుయుత్సునకు సర్వరాజ్య మిచ్చె నని చెప్పఁబడినది శ్లో॥ అభిషిచ్య స్వరాజ్యేచ రాజానం చ పరీక్షితమ్॥ పరీక్షిత్తునకు తనరాజ్యమందు పట్టాభిషేకము చేసె నని చెప్పుటవలన పరీక్షిత్తునకు చక్రవర్తిత్వము నిచ్చి యుయుత్సునకు సర్వరాజ్యమునందు మన్త్రిత్వము నిచ్చెనని గ్రహింపవలసియున్నది. "అథవా పరివిభజ్య దదౌ" అనిసర్వరాజ్యమును విభజించి కొంత పరీక్షిత్తునకును గొంత యుయుత్సునకు నిచ్చెనని యర్థము చెప్పవచ్చును. కృపాచార్యులను రాజగురువునుగా గౌరవించెను. శ్లో॥ కృపమభ్యర్చ్య చ గురు మథపౌరై రుపస్కృతమ్। శిష్యం పరీక్షితం తస్మై దదౌ భరతసత్తమ॥ అనుశ్లోకి మీయర్థమును జెప్పును. పాండవులు గాన్ధారీధృతరాష్ట్రుల నెటులుగౌరవించిరి యనుసంగతి ఆశ్రమవాసపర్వప్రథమాధ్యాయమున వర్ణింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే నాశ్లోకముల వదలితి. దిఙ్మాత్రము గనఁబఱచితిని. ధర్మజుఁడు రహస్య మగుకర్ణోత్పత్తిని కుంతి యుద్ధమునకుఁ బూర్వము తనకుఁ జెప్పనందుకు శపించెనుగాని యామెచరిత్రము ప్రశస్తము కాదని శపింపలేదు. ఈకథ శాన్తిపర్వమునఁ గలదు కుంతిని పాండవులాదరింపకపోవుటచేత నామె వనవాసమున కేగిన దని వీరు వ్రాసినవ్రాత యసత్యము. ఆశ్రమవాసపర్వ॥ అధ్యా. ౧౭ కుంతీ॥ శ్లో॥ నాహం మాత్మఫలార్థం వై వాసుదేవ మచూచుదమ్। విదులాయాః ప్రలాపైస్తైః పాలనార్థంచ తత్కృతమ్। నాహం రాజ్యఫలం పుత్రాః కామయే పుత్రనిర్జితమ్। పతిలోకానహం పుణ్యాన్కామయే తపసావిభో। శ్వశ్రూశ్వశురయోః కృత్వా శుశ్రూషాం వనవాసినోః। తపసా శోషయిష్యామి యుధిష్ఠిర కళేబరమ్। నివర్తస్వ కురుశ్రేష్ఠ భీమసేనాదిభి స్సహ॥ నేను నాలాభముకొఱకు నిమ్మును యుద్ధముకొఱకుఁ బ్రోత్సహింపలేదు. పుత్రులకు నీతి చెప్పుట తల్లులకు విధి గనుక నటులు చేసితిని. పుత్రనిర్జితసంపత్తితో నా కవసరము లేదు. నేను పతిలోకమును బొందెద. ధృతరాష్ట్రగాంధారులకు శుశ్రూష చేయుచు వనమున నివసించి తపస్సుచే దేహత్యాగమును జేయుదు నని తన్నువిడఁజాల నని ప్రార్థించిన ధర్మజుతో కుంతి చెప్పెను, గనుక, పాండవు లెవ్వరి కన్యాయ మాచరించి యుండలేదు. ధృతరాష్ట్రపక్షము వారి కెవ్వరికిని యనాదరణము చేయలేదు. మొండిచేయి చూపి రని యుపహసించుట వివేకులు చేయఁదగినపని గాఁ గనిపింపదు.

వ్యాసమహర్షిచరిత్రము

వ్యాసమహర్షి ఉపరిచరవసుమహారాజపుత్రిక యగుసత్యవతియందు పరాశరమహర్షివలన నవతరించెను. ఉపరిచరవసుమహారాజు స్ఖలితమగు తనవీర్యము

నొకడేగచేఁ దనపత్నియొద్దకుఁ బంపఁగా మార్గమధ్యమున యమునకు సమీపముగా నాకాశమధ్యమున మఱియొక డేగతో నాడేగకు యుద్ధము సంభవించినందున పర్ణపుటమునుండి వీర్యము స్ఖలితమై యమునానదిలోఁ బడెను. దాని నొక చేప మ్రింగెను. ఆచేపగర్భమున సత్యవతి కలిగెను. ఆమె బోయలకుఁ బ్రభువగు దాశరాజునకు దొరికినందున ఆయన యామెను పుత్రికగాఁ బెంచెను. కాన సత్యవతి ఉపరిచరవసుమహారాజపుత్రికయే గాని దాశరాజునకు ఔరసపుత్రిక కాదు ఈకథ ఆదిపర్వము ౬౩-వ అధ్యాయమునఁ బ్రసిద్ధము.

బ్రహ్మతేజోనిధి యగుపరాశరమహర్షివలనఁ ద్రిలోకసుందరియును రాజపుత్రియు నగుసత్యవతియం దవతరించిన వ్యాసమహర్షి దివ్యసుందరవిగ్రహుఁ డనుటకు సంశయము లేదు వ్యాసమహర్షిని దనతల్లి యగుసత్యవతి విచిత్రవీర్యునిక్షేత్రములందు నియోగవిధిచే సంతానము గని కౌరవవంశము నుద్ధరింపు మని వేఁడెను. అపుడు వ్యాసమహర్షి ఆరాజపత్నులిద్దఱు నొకసంవత్సరము నేను జెప్పిన వ్రతము యథాశాస్త్ర మాచరించిన యెడల ననంతరము కోరినసంతానము నిచ్చెదను. వ్రతనియమముగల నాతో వ్రతహీన యగుస్త్రీ కలియుటకు వలనుపడ దని చెప్పెను. అపుడు సత్యవతి సంవత్సరవిలంబము జరిగిన యెడల రాష్ట్ర మరాజక మగుచు నశించును అవిలంబముగనే భారతవంశము నుద్ధరింపు మని వేఁడెను. అపుడు వ్యాసమహర్షి యిపుడే సంతానము కావలసిన యెడల నేను వికృతరూపముతోడను వికృతగంధముతోడను వికృతవేషముతోడను వచ్చెదను. నావికృతవేషాదుల సహించి నాతోఁగూడినయెడల వారలకు సత్సంతానము కలుగును. ఇది వారికి వ్రత మని యుపదేశించెను. ఆరాజభార్యలలో నొకర్తు ఆయాకారవేషముల సహింపలేక కనులుమూసికొనినందున గ్రుడ్డివాఁడు కలిగెను. మఱియొకర్తు వెలవెలపోయినందున పాండువర్ణుఁ డగు పాండురాజు కలిగెను. మాతృదోషమువలన వారి కిట్టిలోపములు కలిగిన వని భారతమందుఁ జెప్పఁబడి యుండఁగా, పితృదోషమువలన నిట్టిలోపములు కలిగిన వని యసత్యపువ్యాసముల వ్రాయుట లోకవంచన మగును. నిజము తెలియుట కాశ్లోకములు కొన్నిటి నుదాహరించుచున్నాను. ఆదిపర్వ॥ అధ్యా ౧౦౫॥ వ్యాస ఉవాచ ॥ శ్లో॥ తస్మా దహం త్వన్నియోగా ద్ధర్మముద్దిశ్య కారణమ్ । ఈప్సితం తే కరిష్యామి దృష్టం హ్యేత త్సనాతనమ్ । భ్రాతుః పుత్రాన్ప్రదాస్యామి మిత్రావరుణయో స్సమాన్ । వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్ట మిహ యన్మయా । సంవత్సరం యథాన్యాయం తతశ్శుద్ధే భవిష్యతః । నహి మామవ్రతోపేతా ఉపేయాత్కాచిదంగనా ॥ సత్యవత్యువాచ ॥ సద్యో యథా ప్రపద్యేత దేవీ గర్భం తథాకురు । అరాజకేషు రాష్ట్రేషు ప్రజాఽనాథా వినశ్యతి । నశ్యం

తిచ క్రియాస్సర్వా నాస్తిసృష్టి ర్న దేవతా ॥ వ్యాసఉవాచ ॥ యదిపుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః । విరూపతాం మే సహేతాం తయో రేతత్పరం వ్రతమ్ । యదిమే సహతే గంధం రూపం వేషం తథావపుః । అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్ ॥ ఇత్యాది ॥ అనంతరము ఒకభార్య నిమీలితనేత్రయై కలిసికొనినందున వ్యాసమహర్షి "కింతు మాతు స్సవై గుణ్యా దంధ ఏవ భవిష్యతి" అని చెప్పెను. రెండవభార్య వెలవెలపోయి కలిసికొనినందున శ్లో॥ వ్యాస స్సత్యవతీపుత్ర ఇదం వచన మబ్రవీత్ । యస్మా త్పాండుత్వ మాపన్నా విరూపం ప్రేక్ష్య మామిహ । తస్మాదేష సుతస్తేవై పాండురేవ భవిష్యతి ॥ రెండవకుమారుఁడు పాండువర్ణుఁ డగునని చెప్పెను. కనుక ధృతరాష్ట్రపాండురాజుల దేహవైగుణ్యములకు మాతృదోషములు కారణములు గాని వ్యాసమహర్షి వైగుణ్యము హేతువు కాదు. వ్యాసమహర్షి రూపము శ్రీరామునిరూపమువలె నీలమేఘశ్యామల మని యువిద్యుత్సదృశ జటాభార మండిత మనియు వర్ణింపఁబడినది. పద్యము ॥ ప్రాంశుపయోద నీల తనుభాసితునుజ్జ్వలదండధారుఁబింగాంశుసటాచ్ఛటాభరణునాగమపుంజపదార్థతత్త్వవిన్ స్సంశయకారుఁగృష్ణమృగచర్మకృతాంబరకృత్యుభ్రాంతి। వంశవివర్ధనుం ద్రిదశవంద్యితు సాత్యవతేయుఁ గొల్చెదన్ ॥ అని పోతరాజమహాకవి వర్ణించి యున్నాఁడు. వ్యాసమహర్షి పరాశరుని వలన సత్యవతియం దవతరించినందున నిషాదవ్యాసుఁ డని నిందించుట యన్యాయము. శ్రీరాముఁడు క్షత్రియుఁ డని బ్రాహ్మణులు పూజింపకుందురా? మత్స్యకూర్మవరాహాద్యవతారములు తిర్యగ్జంతువు లనవచ్చునా? సామాన్యశాస్త్రములందు భగవదవతారములకు సంకోచము చెప్పక తీరదు. శ్లో॥ తతస్స ప్తదశే జాత స్సత్యవత్యాం పరాశరాత్ । చక్రే వేదతరోశ్శాఖాః పుంసో దృష్ట్వాల్పమేధసః ॥ సత్యవతియందు పరాశరునివలనఁ గలిగి వేదవిభాగముచేసినవ్యాసమహర్షి శ్రీమహావిష్ణుని యవతారములలో రామకృష్ణాద్యవతారములతో సమముగాఁ బదియేడవయవతార మని శ్రీభాగవతమున వర్ణింపఁబడినది. ఇదిగాక పరాశరమహర్షి లోకాతీతమహిమ కలవాఁడు. సంతానార్థము క్షత్రియకన్యను బరిగ్రహించినను దనకుమారునకు బ్రాహ్మణత్వ మిచ్చుటకును సత్యవతికిఁ గన్యాత్వము నిచ్చుటకును సమర్థుఁడు. మహర్షులు తపఃప్రభావముచే సృష్టికి పునస్సృష్టి చేయఁదగిన శక్తి కలవార లనుటకు విశ్వామిత్రాది చరితములే సాక్షి. వెనుకటియుగములందు క్షత్రియస్త్రీలయందు బ్రాహ్మణులవలనఁ గలిగినవారలు బీజప్రాధాన్యముచే బ్రాహ్మణులై యుండుటకు పరశురామాదులు సాక్షులు. శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ। వ్యాసం శుకం గౌడపదం మహాన్తంగోవిందయోగీన్ద్ర మథా

స్వశిష్యం శ్రీశంకరాచార్యం॥ అని నానాదేశస్థు లగుబ్రాహ్మణులు గురుకోటిలోఁ బరాశరసుతుఁ డగువ్యాసమహర్షిని పఠించుచున్నారు. శ్లో॥ కృష్ణద్వైపాయనం సాక్షా ద్విద్ధి నారాయణం పరమ్। కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్॥ అనుపురాణవచనము మహాభారతకర్త యగుకృష్ణద్వైపాయనుఁడు నారాయణావతార మని చెప్పుచున్నది. శ్రీభాగవతప్రథమస్కంధము. అధ్యాయము ౪ శ్లో॥ ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే। జాతః పరాశరాద్యోగీ వాసవ్యాం కలయా హరేః॥ చాతుర్హోత్రం కర్మశుద్ధం ప్రజానాం వీక్ష్య వైదికమ్। వ్యదధా ద్యజ్ఞసంతత్యై వేద మేకం చతుర్విధమ్॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాశ్చత్వార ఉద్ధృతాః। ఇతిహాసః పురాణంచ పంచమో వేద ఉచ్యతే॥ తత్రర్గ్వేదధరః పైలః సామగో జైమినిః కవిః। వైశంపాయన ఏవైకో నిష్ణాతో యజుషాం గణే॥ అథర్వాంగిరసామాసీ త్సుమంతుర్దారుణో మునిః॥ ఈవచనములయందు సత్యవతీపరాశరులపుత్త్రుఁ డగువ్యాసమహర్షియే వేదవిభాగకర్త యనియు పైలవైశంపాయనజైమినిసుమంతులు, ఆయన శిష్యు లనియు వర్ణింపఁబడినది, కల్పాంతరములందును వ్యాసులు కలరు. ఈద్వాపరమున వేదవిభాగము చేసినది ఈవ్యాసులనుటయే నిశ్చయము. బ్రహ్మసూత్రరచయితయు నీమహర్షియే. నిజ మిటు లుండఁగా వేదవిభాగకర్త యగువ్యాసమహర్షికాఁ డనుట యవిచారమూలము. వ్యాసమహర్షి కామపీడితుఁడై విచిత్రవీర్యపత్నులఁ గలియలేదు. మాత్రాజ్ఞానుసారమున నష్టవంశోద్ధరణార్థము నియోగవిధిచే సంతానము కలుగఁజేసెను. "కృతేతు మానవా ధర్మాః" అను పరాశరస్మృతివచనప్రకారము నియోగవిధి కృతయుగము నాఁటినుండియుఁ గలదు. కనుకనే మనుస్మృతియందు వర్ణింపఁబడెను. మధ్యకాలమున ధర్మశాస్త్రములలోనికి దశవిధసంతానముల నెక్కించి రని తూలనాడుట ధర్మవిరుద్ధము. శ్రీభాగవతప్రథమస్కంధమున శ్లో॥ భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రకాశితః॥ అని భారతము సకలవేదార్థప్రకాశక మని చెప్పఁబడియున్నది. భారతము పురుషార్థచతుష్టయప్రతిపాదకము. కేవలము భగవన్మహిమవర్ణనప్రధానము కాదు. కనుక అట్టిస్వతంత్రగ్రంథమును రచియింపకపోయితిని, ఆవిధముగాఁ గూడ లోకోపకారము చేసిన బాగుగనుండు నని యామహర్షి చింతించెఁ గాని భారత మసచ్చరిత్రము, అట్టిదాని రచించితి నని చింతింపలేదు. భారతము విస్తృతగ్రంథ మగుటచే నిత్యపారాయణము చేయుసంప్రదాయము లేకపోయినను నియమముగాఁ గథాశ్రవణము చేయుటయు ప్రతిపర్వము సమారాధనాదికము చేయుటయు సకలశిష్టజనసంప్రతిపన్నము. వ్యాసమహర్షి చింతించిన సంగతి భాగవతప్రథమస్కంధపంచమాధ్యాయమున స్పష్ట మగును.

శ్లో॥ జిజ్ఞాసితం సుసంపన్న మపి తే మహదద్భుతమ్ । కృతవా న్భారతం యస్త్వం సర్వార్థపరిబృంహితమ్ । జిజ్ఞాసితమధీతం చ బ్రహ్మయత్తత్సనాతనమ్ । తథాపి శోచస్యాత్మాన మకృతార్థ ఇవప్రభో ॥ ఎకలపురుషార్థప్రద మగుచు నాశ్చర్యకర మగుభారతము రచియించితివి. వేదాధ్యయనము చేసితివి. బ్రహ్మమీమాంసా శాస్త్రము రచించితివి. అయినను ఖేదముగలవానివలెఁ గనఁబడుచున్నావు. ఇందుకుఁ గారణ మేమి యని నారదమహర్షి వ్యాసమహర్షిని బ్రశ్న చేసెను. అందుకు వ్యాసమహర్షి తనయసంతోష హేతువు తనకుఁ దెలియ దని చెప్పఁగా నారదమహర్షి శ్లో॥ భవతా నుదితప్రాయం యశోభగవతోఽమలమ్ । యేనైవాసౌ నతుష్యేత్తు మన్యే తద్దర్శనంఖిలమ్ । యథా ధర్మాదయశ్చార్థాః ముని వర్యానువర్ణితాః । నతథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః ॥ భారతమందు ధర్మార్థకామములు నిరూపింపఁ బడినంత భగవన్మహిమ నిరూపింపఁబడలేదు. ఏగ్రంథము చేభగవంతుఁడు సంతోషింపఁడో ఆగ్రంథము వ్యర్థము. నీవు భగవద్భక్తినిరూపక మగుగ్రంథమును రచింపు మని చెప్పెను. ఇదియు భారతము పవిత్రగ్రంథము కా దనుటకుఁ జెప్పఁబడియుండ లేదు. భారతప్రాశస్త్యము నారద మహర్షియే యంగీకరించి యుండెను. "నహీ నిందా నిందితుంప్రవృత్తా అపితుస్తవ్యం స్తోతుం" అను మీమాంసాన్యాయప్రకారంము ప్రస్తుతము శ్లాఘింపఁబడు భాగవతము, ఉత్తమ మని చెప్పుటకై భారతరచనానంతరము, అసంతోషము వర్ణింపఁబడినదిగాని భారత మప్రశస్త మగుట చేఁ గాదు. భారతములోని భగవద్గీతలకును మోక్షధర్మములకును మించినతత్త్వశాస్త్ర మెందును లేదు ఈసంగతి పండితులకుఁ దెలియనిది కాదు. పరీక్షిన్న రేంద్రుని యుత్పత్తి చెప్పఁదలఁచి సౌప్తికవధకథ నుపక్రమించినంతమాత్రమున సౌప్తికవధానంతరమే వ్యాసకృతభారత మనుట యసంగతము. హరివంశమున కృష్ణకథ సమగ్రముగా వర్ణింపఁబడినందున భాగవతము పురాణమే కా దనుట యుక్తమా? ఇతిహాసపురాణములందు ప్రసక్తానుప్రసక్తిచేఁ గొన్నిటిస్వీకరించుట యునితరపురాణగాథలఁగొన్నిటి నదలుట యుఁ బురాణావలోకనము చేయువారలకుఁదెలియని యంశము కాదు. భారతమును గల్పవృక్షమునుగా నిరూపించిన ఆదిపర్వప్రథమాధ్యాయగతశ్లోకముల లో శ్లో॥ సంగ్రహాధ్యాయబీజోవై పౌలోమాస్తీక మూలవాన్ । సంభవస్కంధ విస్తారి స్సభారణ్యవిటంకవాన్ । అరణీపర్వరూపాఢ్యో విరాటోద్యోగసారవాన్ । భీష్మపర్వమహాశాఖో ద్రోణపర్వపలాశవాన్ । కర్ణపర్వసితైః పుష్పైశ్శల్యపర్వసుగంధిభిః । స్త్రీపర్వైషీకవిశ్రాను శ్శాంతిపర్వమహాఫలః । అశ్వమేధామృతరస స్త్వాశ్రమస్థానసంశ్రయః । మౌసలశ్రుతిసంక్షేప శిష్టద్విజనిషేవితః । సర్వేషాం కవిముఖ్యానా ముపజీవ్యో భవిష్యతి ॥ అని భారతము స్వర్గారోహణపర్వాంత మని చెప్పఁబడియుండఁగా ధర్మజుఁ డశ్వమేధమునే చేయలేదనియు వ్యాస మహర్షి యార్త్విజ్యమునే చేయలేదనియుఁ జెప్పసాహసించుట విచిత్రముగా

నున్నది. ధర్మజుఁ డశ్వమేధము చేయలేదని చెప్పెడి శ్రుతి కనంబడునంతవఱకు ధర్మజుఁ డశ్వమేధమాచరించె నని చెప్పెడి భారతస్మృతివచన మప్రమాణము కానేరదు. "విరోధే త్వనపేక్షం స్యా దసతి హ్యనుమానం" అను మీమాంసాన్యాయము శ్రుతిస్మృతులకు పరస్పరవిరోధము కలిగినప్పుడు స్మృతికంటె శ్రుతియే ప్రమాణమనియు శ్రుత్యంతరవిరోధము లేనియెడల స్మృతి ప్రమాణ మనియుఁ జెప్పుచున్నది. వ్యాసమహర్షి రాజసూయాధ్వరమున బ్రహ్మత్వము చేసినట్లు సభాపర్వము ౩౩ అధ్యాయమున శ్లో॥ స్వయం బ్రహ్మత్వ మకరో త్తస్య సత్యవతీసుతః। ధనంజయానామృషభ స్సుసామా సామగో ఽభవత్। యాజ్ఞవల్క్యో బభూవాథ బ్రహ్మిష్ఠో ఽధ్వర్యుసత్తమః। పైలో హోతా వసోః పుత్రో ధౌమ్యేన సహితో ఽభవత్॥ వ్యాసమహర్షి బ్రహ్మత్వము చేసెను. యాజ్ఞవల్క్యుఁ డాధ్వర్యము చేసెను. సుసాముఁ డౌద్గాత్రమును పైలధౌమ్యులు హౌత్రము చేసిరని చెప్పఁబడెను. సకలలోకమహనీయులు సన్నిహితులగు రాజసూయమహాక్రతువునందు బ్రహ్మత్వ మాచరించిన వ్యాసమహర్షి శిష్టసమ్మతుఁడు కాఁడని వ్రాయుట హాస్యాస్పదము. ఋత్విక్కులలో బ్రహ్మయే సర్వాధికుఁ డని శ్రౌతిసంప్రతిపన్నము. అశ్వమేధప॥ అధ్యా ౭౨ వ్యాసఉవాచ. శ్లో॥ అహం పైలోఽథ కౌంతేయ యాజ్ఞవల్క్య స్తథైవచ। విధానం యదృధాకాలం తత్కర్తారో నసంశయః॥ అని రాజసూయయాగఋత్విక్కులే అశ్వమేధమున కార్త్విజ్యము చేసినట్లు వర్ణింపఁబడినది. "కృష్ణద్వైపాయనాదయో యే ఋషయః" అని ఋషితర్పణమున ప్రథమోత్కీర్తితుఁడగు వ్యాసమహర్షిని నిషాదవ్యాసుఁడని దూషించుట కడుశోచనీయము. "అపాంతరతమా నామ వేదాచార్యః పురాణర్షిః విష్ణునియోగా త్కలిద్వాపరయోః సంధౌ కృష్ణద్వైపాయన స్సంబభూవ" అని యాదికారికాధికరణమున శ్రీశంకరభగవత్పాదాచార్యులు కలిద్వాపరసంధిని అవతరించిన కృష్ణద్వైపాయనుఁడు వేదాచార్యుఁ డని చెప్పియున్నారు. ఇట్టిప్రమాణములకు విరుద్ధముగా వ్రాసిన పీఠివ్రాఁత సరియగునది కాదు. శ్రీకృష్ణుఁడు మృతులగు పుత్రులను దేవకీవసుదేవులకును తనగురువునకును గనఁబఱిచెను. అటులే వ్యాసమహర్షి భారతయుద్ధమృతవీరులను ధృతరాష్ట్రాదులకుఁ గనఁబఱిచెను. యుద్ధమృతులభార్యలకు భర్తృసాలోక్య మిచ్చెను. ఇట్టివిచిత్రకథను భరణము లీయవలసి వచ్చునని ధర్మజునకు మేలుచేయఁ దలఁచి ఇందఱిస్త్రీలను మాయోపాయముచేఁ జంపె నని వ్రాయుట పాపకార్యము. వ్యాసమహర్షిని గాంధారీధృతరాష్ట్రాదులు తమతమసంబంధులగుమృతవీరులఁ జూపింపు మని ప్రార్థించిరి. తపఃప్రభావమున లోకాన్తరముల సృజించుటకుఁ గూడ సమర్థుఁడగు వ్యాసమహర్షి దుఃఖితులగు ధృతరాష్ట్రాదులకు రాత్రియందు భాగీరథిలో యుద్ధమృతులఁ జూపించెను. వారందఱుఁ దెల్లవాఱునవఱకు తమ బంధువులతోఁ గలసిమెలసి సంభాషించి వారినాలింగనము చేసికొని వారితో

వెళ్లివచ్చెద ననని చెప్పి మరల భాగీరథిలో మునింగి తమతమలోకములకుఁ బో యిరి. ధృతరాష్ట్రునకు దివ్యచక్షుస్సు నీయఁగా నాయన గూడ నీయద్భుతములం జూచెను. అప్పుడు పతిలోకము కావలసినస్త్రీలు భాగీరథిలో నవగాహనము చేయుఁడు భర్తృసాలోక్యము వచ్చును. అని వ్యాసమహర్షి యాజ్ఞనొసంగెను. అపుడు వారివాక్యములందు శ్రద్ధగల పతివ్రతలు ధృతరాష్ట్రుని యనుజ్ఞ గైకొని గంగాప్రవేశము చేసి దివ్యమాల్యాంబరధారిణులై పతిసాలోక్యమును బొందిరి. అని యాశ్రమవాసపర్వమున వర్ణింపఁబడినది. ఈవిధానము ధర్మజునకు భరణము దప్పించుటకు రచించిన సినీమావిధాన మైనయెడల వారు పరస్పరము మాట లాడుకొనుటయుఁ దమబంధువులయొద్దికి వచ్చి వారి నాలింగనము చేసికొను టయు మొదలగు నద్భుతము లెట్లు ఘటించును? ఆశ్రమవాసపర్వము అధ్యా యము 33 శ్లో॥ పరస్పరం సమాగమ్య యోధానాం భరతర్షభ। సమాగతా స్తాః పితృభిః భ్రాతృభిః పతిభిస్సుతైః। ముదం పరమికాం ప్రాప్య నార్యో దుఃఖమథాత్యజన్। ఏకాంరాత్రిం విహృత్యైవ తేవీరా స్తాశ్చ యోషితః। ఆమ న్త్ర్యాన్యోన్య మాశ్లిష్య తతో జగ్ము ర్యథాగతమ్॥ ఇత్యాది శ్లోకము లీయ ర్థమును జెప్పును. ఆసమయమున అమ్మలారా, అక్కలారా, మీరు మోసపో కుఁడు మీకు ధర్మజుఁడు భరణము లీయవలసివచ్చు ననివ్యాసుఁడు ధర్మజునియం దలి ప్రేమచే మిమ్ము మోసము చేయుచున్నాఁడు. బ్రతికియుండి బలుసాకైన నేఱు కొని తినవచ్చును లేదా వ్యాసుని తల్లి యిద్దఱిని కట్టుకొనలేదా? కుంతి నలు గురితో వ్యభిచరింపలేదా? ద్రౌపది యైదుగురిని వివాహ మాడలేదా? కలియు గమున నింకెందఱో యువతారంపురుషులు వితంతువివాహములఁ జేయింపనున్నా రు మీరును పునర్వివాహములఁ జేసికొనుఁడు ధర్మజుఁడు భరణమీయకపోయి నను సరే స్వైరిణులై కామసుఖ మనుభవింపుఁడు. అని హితము బోధించెడి యీశాస్త్రులుగారివంటి యాప్తుఁ డొక్కఁడేని ఘటింపనందున నింతటియకార్య ము జరిగియుండె నని గ్రహింపవలెఁ గాఁబోలు. తుదకు ధృతరాష్ట్రుఁడైనను అమ్మలారా బ్రతికియైన యుండుఁ డని కోడండ్రను ప్రేమింపకపోయెను గంగా ప్రవేశము కంటు అనియాజ్ఞ యొసంగెను. యుద్ధానంతరము పదునైదుసంవత్సర ములు భరణమిచ్చిన ధర్మజుఁ డింకఁగొంతకాల మీయలేఁడా? సరి సరి ఇట్టి కల్పనలు ప్రాజ్ఞులకు లజ్జావహములు. ఆయన వీరనుకొనినటులు మోసమే చేసిన యెడల ఈనిజము గ్రహించిన దయాళువులు మహర్షులలో నొక్కరైన నుండరా! వారు నిజము తెలిపియుండరా? ఏ పురాణమందుఁ గాని ఏశాస్త్రమందుఁ గాని వ్యాసమహర్షి పవిత్రతావిషయమై సంశయించువాక్యములు గనిపింపవు. పౌరా ణికులందఱు నేఁటివఱకు శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్। పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥ అని వ్యాసమహర్షి యకల్మషుఁ డనియుఁ దపోనిధి యనియు నంగీకరించుచున్నారు. వీ రనుకొనిన ప్రకారము

చూచినను పాండవధార్తరాష్ట్రులు తనసంతతిలోనివారు, ధార్తరాష్ట్రులును ప్రకృతి విరుద్ధజన్మము కలవారలే. ఈసంగతి యిదివఱకు నిరూపించియున్నాను. ఇటు లుండఁగా ధర్మజునికి ఇట్టియుపకారము చేయఁదలంపనేల? ప్రకృతివిరుద్ధ జన్మము కలవారు గాని ప్రకృతివిరుద్ధజాతుల కుపకరింప రని నియమ మంగీకరించు నెడల నిమ్నజాత్యుద్ధరణమునకుఁ బాలుపడెడి నవనాగరకబ్రాహ్మణులు నిమ్న జాతిసాజాత్యము కలవార లనియనుట భావ్యమా? అటులనుట యుక్తము కాదు. లోకోపకారార్థము సకలసనాతనధర్మప్రతిపాదక మై వేదతుల్య మని శ్లాఘింపఁ బడు మహాభారతనిబంధనము రచించిన కృపానిధి యగువ్యాసమహర్షిని అనాథ స్త్రీసహస్రముల నన్యాయముగా వధించె నని దూఱుట యెంత యుచితమో పాఠకులే గ్రహింతురుగాత! విశ్వరూపప్రదర్శనము చేసినశ్రీకృష్ణుని దుర్యోధనుఁ డైంద్రజాలికుఁ డనెను. మృతవీరులఁ గనఁబఱచినవ్యాసమహర్షిని సినీమాప్రదర్శ కుఁ డని యీశాస్త్రులుగా రనిరి. లోకోత్తరుల చరితమును సామాన్యబుద్ధితో విమ ర్శించినయెడల ఫలమిట్టిదే కలుగును. శ్లో॥ శంబూక స్సికతిలభూతలానుకర్షీ సంవింతే చిర మురసా పదానిగచ్ఛన్ । ద్విత్రాణి క్షుభితమహార్ణవ స్తిమింద్రః కూలే ద్వేచరతిమృషేతి లోకవార్తామ్ ॥ గవ్వపురుగు ప్రతిదినము రెండుమూఁ డడుగులు నడచును. తనశక్తినిబట్టి తిమింగిలము సముద్రమునఁ బ్రతిదినము ననేకయోజనములు తిరుగు ననుకథను మృష యని యెంచును. అనునభియుక్తోక్తి యిందుకుదాహరణముగా నున్నది. గురుదేవతాభక్తివిరహిత మగునిక్కాలమున గురుదేవతాభక్తిప్రోత్సాహమునకు బదులుగా గురుదేవతాభక్తి వినాశకము లగు నిట్టి విమర్శనములు బయలువెడలుట కలికాలవిలాసము. శ్లో॥ యుధిష్ఠిరో ధర్మ మయో మహాద్రుమః। ధర్మోభివర్ధతి యుధిష్ఠిరకీర్తనేన పాపం। ప్రణశ్యతి వృకోదర కీర్తనేన । శత్రు ర్వినశ్యతి ధనంజయకీర్తనేన। మాద్రీసుతౌ కథయతాం నభవంతి రోగాః ॥ అనుపురాణోక్తిప్రకారము కీర్తనమాత్రమున సకలశుభంబుల నొసఁ గూర్పఁదగిన పాండవులను లోకాచార్యుఁ డగువ్యాసమహర్షిని స్వేచ్ఛానుసా రము దూలనాడిన యీశాస్త్రులుగారి యపచారముల క్షమించి వీరి కాయు రారోగ్యైశ్వర్యముల నిచ్చుటకును, ఇఁక నిట్టివిమర్శనముల వ్రాయకుండ వీరి యంతరాత్మను బురికొల్పుటకును సర్వశక్తులు గలయీశ్వరుని ప్రార్థించుచున్నా ను. వీరు వ్రాసినప్రతివిషయమునకును సమాధానము వ్రాయుట యనవసర మని దిఙ్మాత్రము గనఁబఱచితిని. ప్రాజ్ఞులు స్థాలీపులాకన్యాయముచే నిజము గ్రహింతురుగాత.

మల్లాది రామకృష్ణశాస్త్రి చయనులు.

ఆంధ్రసాహిత్యపరిషచ్చతుర్దశవార్షికసభ.

# అధ్యక్షునియుపన్యాసము.

---

ఆర్యులారా!

సాహిత్యపరిషచ్చతుర్దశవార్షికసభ కధ్యక్షునిగా నన్నుకొని నన్ను గౌరవించినందుల కీసభాసన్నాహకులకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడ నై వందనము లర్పించుచున్నాఁడను. నాయెన్నిక తలఁచుకొన్నపుడు నామేనమామ కీర్తిశేషు లయినపురాణపండ మల్లయ్యశాస్త్రిగారి చమత్కారవచన మొకటి నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆయన చిరకాలముక్రిందటఁ గొందఱు విద్యార్థులకు మహాభారతకథ సంగ్రహముగాఁ జెప్పుచు సందర్భవశమున, మహాబలపరాక్రమసంపన్నుఁడగుపాండురా జుండఁగా జాత్యంధుఁడగుధృతరాష్ట్రునకుఁ బ్రాజ్ఞులైన భీష్మాదులు రాజ్యాభిషేక మేల చేయవలసివచ్చె ననుప్రశ్న కుత్తరము చెప్పుచుండఁగా సహజమధురవాఙ్నైపుణితో ‘గృహమందున్నవారిలో నప్రయోజకునకు నింటిపెత్తన మప్పగించినపక్షమున నాశ్రితులు, బంధువులు, సేవకులు వానియెడ నత్యధికభక్తిశ్రద్ధలు గలిగి మెలఁగుచుందురు. అది కారణముగా బుద్ధిమంతు లగువిదురభీష్ములు పుట్టుగ్రుడ్డిని భూభారవహనమందు నియోగించిరి” అని చెప్పిరి. ఆమాటలయందలి యాథార్థ్యము నా కిప్పుడు తెలిసినది.

ఏలయన:—సంస్కృతాంధ్రసాహిత్యచక్రవర్తులు, నుభయభాషాకవితాప్రవీణులు, నిరంతరవాఙ్మయసేవాపరాయణులు, చిరకాలపరిశ్రమలబ్ధప్రతిష్ఠులు, నగుమహనీయు లాంధ్రదేశమున నెందఱో యుండఁగా బాహ్యాంతరచతురింద్రియదరిద్రుం డైననావంటి కించిజ్జ్ఞుని నిట్టిమహాసారస్వతసభ కధ్యక్షునిగాఁ జేయుటచేత నే సుఁడీ! అందుచేత నంధునిచే నడపింపఁబడు నట్టివారియవస్థ యెట్లుండునో మీ రెఱుంగనివిషయము కాదు; అయినను నాయెన్నికవలన మీరు రెండునీతులు నేర్చుకొనవచ్చును. కార్యదక్షులు నతిప్రవీణులు నగుమీ సహాయమువలన నే నీసభ జయాస్పదముగా నిర్వహింపఁ గలుగుదునేని, ఈలోకమున నెంతపనికిమాలినవాఁ డైనను గొంతపని చేయఁగలఁ డని మీరు గ్రహింపవచ్చును. నాసహజదౌర్బల్యముచేత నే నీభారమును నిర్వహింపలేక పోవుదునేని, ఇఁకమీఁద నిట్టికొఱమాలిన వాని నెన్నఁడు సభాధ్యక్షునిగ నెన్నుకొనఁగూడ దనుమంచిపాఠ మైన మీరు నేర్చుకొనవచ్చును.

కాకినాడ; కాకినాడపట్టణము—నన్నయభట్టారకుకాలమునుండియు మృదుమధురకవితారసములతోఁ గలసియుండిన గోదావరీనిర్మలజలములయొక్క

పాలుజలచేఁ బవిత్రమైన ప్రదేశ మగుటచేఁ గాబోలు! నిచ్చటఁ గూడ నాంధ్రవాఙ్మయము వికాస మొందినది. నిజముగా సుమనోమనోభిరంజన మహాప్రబంధరత్నమీకాకినాడఖనియం దుద్భవించినదే! ప్రాచీనకవిపండితసాంప్రదాయముల ననుసరించి యనర్గళధారగా నాంధ్రకవిత్వముం జెప్పఁగలిగిన శ్రీఓగిరాల జగన్నాథకవి యిచ్చటనుండియే తన కావ్యగీతములను గానముచేసెను శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తొలుదొల్తఁ దమయాంధ్రకవిజీవితామృతమును నిచ్చటనుండియే యాంధ్రలోకమునకు గుచిచూపి యాంధ్రుల నపారసంతోషమునఁ దేల్చిరి. ఇచ్చోట నుండియే పై యిరువురుమహనీయులు శుద్ధాంధ్రనిఘంటువుం బ్రకటించి యాంధ్రులకు మహోపకారం బొనర్చిరి. ఇచ్చోటనుండియే శ్రీపోలవరపు సంస్థానప్రభువులును, నాంధ్రపురాణభాషావిశారదులును నగు శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు బహద్దరువారు సరస్వతీమాసపత్రికం బ్రకటించి యందు నమూల్యము లగుసింహాసనద్వాత్రింశిక శోపాఖ్యానము, శుకసప్తతి, కువలయాశ్వచరిత్రము, హారవిలాసము, కాకుత్స్థవిజయము మొదలగు ప్రబంధరాజములను, రసవంతము లగు ప్రాచీనరూపకములను నాఖ్యాయికలను, మఱియితరగ్రంథములను బ్రచురించి, చిరకాలమాంధ్రసారస్వతసేవాపరాయణులై కీర్తిగాంచిరి. నేఁటికాలమునను చింతామణిశ్రీవరవిక్రయప్రముఖ నవనవరూపకము లిచ్చటనుండియే వెలువడిబహుజనాదరంబును బడయుచున్నవి. ఇచ్చటనుండియే విమర్శన కుశలు రగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి కలమునుండి బహుసంశయవిచ్ఛేదకములై వాఙ్మయోపకారకము లగుబహువిమర్శనలు వెడలుచున్నవి. ఇంకను నిచ్చట పిఠాపురపు మహారాజావారి కళాశాలలో నాంధ్రసంస్కృతాధ్యాపకులుగా నున్న అత్తిలి సూర్యనారాయణగారు శృంగారకవి సర్వారాయుఁడుగారు కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు మున్నగువారు నవీనభావములు గలవ్యాసములను, గ్రంథములను రచియించి సారస్వతపోషణమును చేయుచున్నారు. ఇంక ననేకయువకు లిప్పుడిప్పుడు బయలుదేఱి వాఙ్మయసేవకై దీక్షవహించుచున్నారు. అందుచేత నీకాకినాడపట్టణము వాఙ్మయవిషయమునఁ బ్రసిద్ధిగాంచిన దనుట నిర్వివాదాంశము. అదియును గాక సాహిత్యపరిషత్సభ యిచ్చోటికి వచ్చుట కిదే మొదటిసారి కాదు. మున్నొకసారి యానందసంవత్సర చైత్రమాసమున (అనఁగా 1914-వ సం॥ ఏప్రియల్) నప్పుడే క్రొత్తగా నియమింపఁబడిన పురపాలకసంఘకార్యస్థానమునందు మ॥రా॥రా॥శ్రీ దివాన్ బహద్దూర్ శ్రీకిళాంబి రామానుజాచార్యులు యమ్. ఏ. యల్. యల్. బి. గారి యాధిపత్యమున సమావేశ మయ్యెను. నాఁటికి నేఁడు మనము మరల నిచ్చట సమావేశమైనందుకు మిగుల సంతసించు

చున్నాఁడను. వితరణఖను లగుమహారాజుల నిరంతరపోషణమున శోషణము లేక యాంధ్రసాహిత్యపరిషత్క-న్యక పదునాలుగేండ్లప్రాయము గలదియై ముగ్ధ భావమును విడచి ప్రౌఢభావమును దాల్చి యాంధ్రమహాజనుల కన్నులచంద మామ యై, యుత్తరోత్తరవిశిష్టచరిత్ర యై, దినదినప్రవర్ధమాన యై, తేజరిల్లుట మనభాగ్యము.

మరణములు:—తెలుఁగులోజరగిన కడపటిసమావేశము తరువాత నీదేశ మందలి విద్వత్ప్రపంచములోఁ గొన్ని తీరనిలోపములు గలిగినవి. అందు భారత ఖండమున కంతటికి సంబంధించినదియు నొకభారతఖండమునకే యననేల? గీర్వాణసారస్వతప్రపంచమున కెల్ల సంబంధించినదియు, నతిదుఃఖకర మైనదియు నగు డాక్టరు రామకృష్ణగోపాల్ భండార్కరుగారి మరణము ఈమహనీయుఁడు నేఁటి కాలమున భరతఖండమునం గల సంస్కృతవిద్వాంసులలో నగ్రగణ్యుఁడని చెప్పవచ్చును. విమర్శనకౌశలమునం దద్వితీయుఁడు, తననాటిలేనిసాహిత్యము నకు, విమర్శనప్రవీణతకు స్వదేశీయులచేతనే గాక గీర్వాణసారస్వతకోవిదు లగు పశ్చిమఖండవాసులచేత సహితము ననేకవిధములఁ బ్రస్తుతిఁ బడసెను. ఈయన యెనుబదియెనిమిది సంవత్సరములు జీవించెను. ప్రాజ్ఞత వచ్చినది మొదలుకొని కాలమం దొక్కనిమిష మైనను వ్యర్థముచేయక ప్రాచీనచరిత్రల పరిశోధనల యందును, సంస్కృతసారస్వతమునందలి రహస్యముల నెల్లరకు వెల్లడిచేయుట యందును జీవితమెల్లఁ గడపి లోకమునకు మహోపకారముఁ జేసి గొప్పపద వుల నధిష్ఠించి యశోలతల నానాదిశల వ్యాపింపఁజేసి యశశ్శరీరమును విడిచి పరమపదము నొందెను. ఈమహనీయుని మరణమువలన దేశమునకుఁ దీరని వెలితి సంభవించెను.

రెండవది నామేనమామయు, మీకుఁ జిరపరిచితుఁడును, నుభయభాషా సాహితీధురీణుండును, శ్రీపిఠాపురమహారాజాస్థానవిద్వాంసుఁడును, నాంధ్ర బ్రహ్మసూత్రభాష్యకర్తయు, నాంధ్రశుక్రనీతిసారప్రణేతియు, నుపనిషత్కథార చయితయు, భద్రాపరిణయ, ప్రభావతీప్రద్యుమ్న వ్యాఖ్యాతయు, నగు బ్రహ్మ శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి మరణము. ఈయనమరణముచేత నాంధ్ర దేశమునకు గొప్పకొఱఁత వాటిల్లె ననుట యతిశయోక్తి కాదు. ఈయనతో నొక్కసారి సంభాషించినవా రాయనవాఙ్మైపుణ్యము నొక్కసారి విన్నవారు నాయన నెన్నఁడు మఱవఁజాలరు. ఈయన డెబ్బదిమూఁడుసంవత్సరములు జీవించి సంతానముచేతను, గ్రంథసంతానముచేతను ధన్యుఁడై క్రోధనసంవ త్సరాశ్వయుజశుద్ధైకాదశీ సోమవారమునాఁడు మధ్యాహ్నమున (1925-వ సం॥ సెప్టంబరు 28-వ తేదీ పగలు రెండుగంటలకు) దేహము విడిచి వేదాంత

శాస్త్ర మధ్యయనముచేసిన బ్రహ్మవేత్తలకుఁ బ్రాపణీయము లయిన యుత్తమ గతుల నొందెను.

అంజలి:—ఈసమయమున నామన స్సాంధ్రభాషయొక్క యు నాంధ్ర సారస్వతముయొక్క యుఁ బూర్వపు టౌన్నత్యమునుఁ దలంచికొని గర్వింపఁ గుతూహలపడుచున్నది. ఆయావేశమును నేను నివారింపఁ జాలకున్నాఁడను, గావున, నాంధ్రభాషా సేవకుల కపేక్షణీయ మైనయామహానందము ననుభవించుటకు నాకొక్కనిమిషము సెలవిండు.

ఏదేశము శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామమధ్యస్థలం బని ప్రాచీనులచేత వర్ణింపఁబడినదో, యేదేశము, గౌతమీ, కృష్ణవేణీ, పినాకినీ, తుంగభద్రా ప్రముఖనదీనదంబు లొసఁగెడు జీవనంబులచేతఁ బావనంబై, సారవంతమై, రత్నగర్భమై, రాజిల్లెనో, యెయ్యది యనేకపుణ్యక్షేత్రములతోఁడను, ననేకాగ్రహారములతోఁడను, బౌద్ధవిహారస్తూపములతోఁడను, జైనవిగ్రహములతోఁడను, నిండి విదేశీయులైన బాటసారులకు సహితము పూర్వకాలమున నచ్చెరువు గొల్పెనో యెయ్యది సూర్యచంద్రవంశీయులయుఁ, బూర్వపశ్చిమ చాళుక్యులయు, పల్లవరాష్ట్రకూటులయు, కర్ణాటకాకతీయులయు, రెడ్డికమ్మ, వెలమనృపాలురయుఁ బరిపాలనంబునకు లోనై వారల విజయలక్ష్మీతాండవనంబులకు రంగస్థలంబై, చరిత్రనిర్మాతలప్రయత్నములకు సాధనసామగ్రి సమకూర్చుచున్నదో, యెయ్యది త్రిలింగ మని యు, నాంధ్రదేశ మనియు, వేఁగీవిషయ మనియుఁ దెలుఁగునాఁ డనియుఁ, బలుపేరులు గలిగి వేదములకాలమునుండియు, నేఁటివఱకు నెడతెగనిప్రఖ్యాతివహించుచున్నదో, యెద్దానిఁబరిపాలించిన యాంధ్రవంశమహీవల్లభులు గంగానదీపరిసరంబులవఱకుఁ దమజయపతాకములఁ బ్రసరింపఁజేసి మగధరాజ్యమునుఁ జిరకాలము పాలించి చారిత్రకపురుషులైరో యెయ్యది నాకును, మీకును, జన్మభూమియై మిక్కిలి ప్రియమై "జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ" యనులోకోక్తి యందలి యర్థము సత్య మని చాటుచున్నదో యట్టియాంధ్రదేశమునకు నమస్కారము.

ఏభాషామతల్లి కన్నడరాజ్యరమారమణుఁడైన కృష్ణదేవరాయలచేత "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనుబిరుదము వడసెనో, యేభాషాశిరోమణి యాంధ్రనిఘంటునిర్మాతయైన బ్రౌనుదొరచేత ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు (Etalian of the East) అను సార్థకాభిధానము వహించెనో, యెయ్యది రెండు కోట్లు నిరువదిలక్షలమహాజనులజిహ్వాగ్రములయందు నెలకొనియుండి వారి పరస్పరాభిప్రాయప్రకటనలకు, నిత్యవ్యవహారములకు మూలాధారమై యున్నదో, యెద్దానిసాయమున, మనభౌతికశరీరములకుఁ గారణమైన, మాతృదేవతను,

మునుముందు, వచ్చియుగాని యవ్యక్తమధురవచనములతో 'నమ్మా' యనిపిలు చుటకును సృష్టికర్త యైనపరమేశ్వరుని 'జేజే' యని కొలుచుటకును, నలుగుచు న్నొంటిమో, యెద్దాని నాధారముచేసికొని, యాంధ్రకవితాసరస్వతి మహీమండ లమున నవతరించి యాంధ్రమహాజనులకు సకలధర్మోపదేశంబులఁ జేసి వారి కైహికాముష్మికసుఖంబుల నొనగూర్చుచున్నదో, యేభాష సంస్కృతమునందలి యక్షరముల నన్నింటినిఁ గలిగి యుచ్చారణసౌష్ఠవమునకుఁ బేరుపడి, యుత్కళ, వంగ, మహారాష్ట్ర, గూర్జర, ద్రవిడ, కర్ణాటాది, దేశభాషలకన్న మిన్నయై, యల రారుచున్నదో, యట్టి తెలుఁగు బాసకు నంజలి ఘటియించెద. గోదావరీజలముల వలె విమలరసములు గలిగి, యానదీగర్భమువలె మిక్కిలి గంభీరమై, యా వాహినీప్రవాహమువలె యనర్గళధారాశోభితమై, యాయేటితరగలవలె నున్నత భావాభిశోభితమై, ద్రాక్షాగుచ్ఛములవలె మధురమై, పంచమవేదమై, లక్షణ గ్రంథమై, ధర్మశాస్త్రమై, యితిహాసమై, పురాణమై, నీతిసాగరమై, కథాకల్లో లినియై, విలసిల్లుభారతము నాంధ్రీకరింపఁ దొడంగి రమారమి మూఁడుపర్వ ములు రచించిన, శబ్దశాసనుని, వేదవేదాంగపారీణుని, సకలపురాణవేత్తను, రాజరాజకులబ్రాహ్మణుని, నన్నపార్యుని నొక్కసారి స్మరింపనిండు!

ఏవిద్వత్కవిసార్వభౌముఁడు, స్థిరము లైన యక్షరపుష్పములతో నవ చంపకోత్పలమాలికలఁ గూర్చి కవితాశారద నర్చించి నవరసభరితము లైన, కావ్యకుంభములతో నామహాదేవి కనేకసహస్రఘటాభిషేకములఁ జేసి దేశా రిష్టముల దవ్వుగఁ దోలి, లోకోపకారపరాయణుఁడై, మనుమసిద్ధి నృపాలరా జ్యధురంధరుఁడై, కవిబ్రహ్మయై, యుభయకవిమిత్రుఁడై యాంధ్రలోకమున శాశ్వతకీర్తిసౌధమును నిర్మించుకొని, మహాభారతమున నన్నయార్యుఁడు తెలిఁ గింపఁగా మిగిలిన పదునేనుపర్వములు నఖండపాండిత్యంబు మెఱయ నాంధ్రీక రించిన మహామహుని సోమయాజిని దలంచుకొననిండు!

నాటి మేటికవు లెల్లఁ దమకవితాకన్యకలను మహారాజుల కర్పించి వా రిచే ననేకపారితోషికముల, నగ్రహారముల, నందలముల, ఛత్రచామరముల, బిరుదులఁ, బడసి సౌఖ్యంబు లవ్వారిగాఁ బొందుచుండఁ, గడుపుకక్కుఱితికై కవితాపుత్రిక నొరుల కమ్ముకొనక పేదతనమునే వరించి కష్టముల నెల్ల నతిశాం తముతో ననుభవించి దరిద్రుఁ డయ్యు నీశ్వరానుగ్రహభాగ్యవంతుఁడై హాలి కుఁడై ద్వాదశస్కంధసమేతభాగవతకావ్య మనురసవంత మైనపండ్రెండుకను పుల చెఱుకుగడను, దేవసారస్వతభూమినుండి తెచ్చి యాంధ్రభూమండలమున నాటి ప్రోదిచేసి, నేఁటివఱకు రసశూన్యంబుఁ గాకుండ నిలిపి యాంధ్రుల హృదయములు భక్తిరసప్రపూరితము లగునట్లు, పరవశమునొందునట్లు మహా

నంద సముద్రమున నోలలాడునట్లు, మేనులు పులకరించునట్లు చేసిన పరమ భాగవతోత్తముని సహజపాండిత్యవైభవుని, పుట్టుకవిరాజును పోతరాజు నొక్కసారి ధ్యానించి యాతనిభాగవతమునకు నమస్కరింపనిండు!

వేమభూపాలు నాస్థానకవీంద్రుఁడై, హరివంశ నరసింహపురాణములు రచియించి యాంధ్రవాఙ్మయశారదకు నవీనాభరణంబులు గల్పించి యరణ్యపర్వశేషము పూరించి లోకఖ్యాతిఁగాంచి మూర్తిత్రయమునందుఁ బరమేశ్వరుఁడట్లు కవిత్రయమునందుఁ బ్రబంధపరమేశ్వరుండై శంభుదాసబిరుదాంకితుండై వెలసిన యెఱ్ఱాప్రెగ్గడప్రభావ మించుకఁ గొనియాడనిండు!

సంస్కృతవాఙ్మయముపైనందు ముఖ్యముగా శ్రీహర్షమంజులనైషధముపై దండువెడలి యందున్న సువర్ణములను, గల్పనారత్నములను, నమూల్యపదార్థములను, యథేచ్ఛముగాఁ జూఱగొని తనయాంధ్రసారస్వతమున, సంస్థాపించిన ధీరాగ్రేసరుని దక్షిణాధీశునిముత్యాలచవికలో దీనారటంకాలయభిషేకమును బొందినకవితాసామ్రాజ్యపట్టాభిషిక్తుని, బహుఖండకావ్యప్రణేతను, సీసపద్యచక్రవర్తిని, గీతపాదుపాను, శ్రీనాథమహాకవి నొక్కసారి కైవారము సేయనిండు!

ఉత్తుంగగోత్రమునందు జన్మించి మహాసత్త్వసంపన్నములై, కవితాదానధారాశోభితములై, మహారాజపూజితములై, భద్రజాతిలక్షణలక్షితములై, యాంధ్రవాఙ్మయప్రపంచము గూలిపోకుండఁ దమమనీషాబలంబున మోయుచు కృష్ణదేవరాయల సభాలంకారములై, యమితకీర్తిని గాంచిన యష్టదిగ్గజముల నభినందింపనిండు!

ఇటీవల "చేమకూర పాకమునఁ బడిన" దనులోకోక్తినిఁ బడసి తంజాపురీవల్లభుఁ డగునచ్యుతేంద్రరఘునాథరాయనియాశ్రితుఁడై నవరసంబులు చిప్పిలు విజయవిలాసమును రచించిన చేమకూర వేంకటకవిని, ఉత్తరరామాయణమును సోమయాజి రచించియుండఁగా వెండియు నాగ్రంథమునే రచించియు రసపుష్టి గావించిన కంకంటి పాపరాజప్రధానుని, మఱియు, సనాతనాధునాతన కవిశిఖామణులను, గీర్తించి, వారి తాళపత్రగ్రంథములఁ జెదపురుగులపాలు గాకుండఁ, బరశురామప్రీతిఁగాకుండఁ జోరులయధీనములై నశింపకుండఁ గాపాడిన భాషాభిమానులను, వినుతింపనిండు!

ఆంధ్రభాషకు సరియైనవ్యాకరణము లేనికాలమున బహులక్షణగ్రంథములఁ బరిశోధించి సంస్కృతసిద్ధాంతకౌముది ననుసరించి తెలుఁగున బాలవ్యాకరణ మనుపేర వ్యాకృతిరచించి, తననీతిచంద్రికలచేత బాలకులమనంబున నెలకొని యుండునజ్ఞానాంధకారమును బాదవ్వులకుఁ దోలుచున్న చిన్నయసూరి చందమ.ని మఱిఁ దలంపనిండు!

పిమ్మట రాజమహేంద్రనగరమున జన్మించి చిన్ననాఁటనుండియు సారస్వత సేవాతత్పరుఁడై, శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధకావ్యాదుల బహునియమ ములతో నిర్మించి పదపడి యాంగ్లేయసారస్వతమునఁ గలవింతల నాంధ్రులకు రుచి చూపఁ దలఁచి క్రొత్తపుంతలఁ ద్రొక్కి, నవలలు, నాటకములు, ప్రహసన ములు, ప్రకృతిశాస్త్రములు, చిత్రకథలు, జీవచరిత్రలు, కవిచరిత్రలు, కమనీ యోపన్యాసములు, విపులముగ వ్రాసి, హూణసంస్కృతభాషలనుండి యనేక గ్రంథముల నాంధ్రీకరించి భాషాయోషామణికిఁ గ్రొత్తనగలు గూర్చి శతా ధికగ్రంథకర్త యై యీయుగము, వీరేశలింగయుగ మనుపేరువడునట్లు భాషా సేవఁ జేసి, తనతరువాతివారి కనేకులకు మార్గదర్శియై, విశేషించి. సంఘసం స్కర్త యై బహుసాంఘికయుద్ధములలో విజయుఁడై, వీరుఁడై, స్త్రీపునఃపరిణ యస్థాపనాచార్యుఁడై, బ్రహ్మమతావలంబకుఁడై, యేడుసంవత్సరముల క్రిందట బ్రహ్మైక్యమునుఁ బొందిన మద్గురుని శ్రీకందుకూరి వీరేశలింగకవిని వినుతింప నిందు!

పూర్వకాలమున సంస్కృతకవిత్వమే యెల్లచోటులనుండ జనుల నజ్ఞాన మనుబురదనుండి యుద్ధరింపఁ దలంచి దేశికవిత్వము నెలకొల్పిన సత్యాశ్రయ మహీపాలుని, నన్నయభట్టారకుని, సమస్తవిధముల నాదరించి, పురికొల్పి, మహా భారతము నాంధ్రభాషకు మార్పించిన, చళుక్యవంశభూషణుని పండితారామ వసంతుని, రాజరాజనరేంద్రుని, తిక్కనసోమయాజిని 'మామా' యని వరుస వావులతోఁ బిలిచి యాతనిచే నుత్తరరామాయణకావ్యకన్యకనుఁ బరిగ్రహించి యాంధ్రభాషాపోషకుఁడైన మనుమసిద్ధినృపాలుని, హుళిక్కిభాస్కర, మారన ప్రముఖమహాకవులకాశ్రయుఁడై సంస్కృతంబున విద్యానాథునిచేఁ బ్రతాప రుద్రీయ మనునలంకారశాస్త్రమునుఁ గృతిపొందిన ప్రతాపరుద్రదేవుని నుగ్గ డింపఁ దగదా?

తరువాతఁ, దాను కన్నడరాయఁ డయ్యు నాంధ్రభాషాయోషయొక్క మృదుమధురవాక్ఫణితికి నలరి వలచి యామెను దనవశముచేసికొని, యాముక్త మాల్యదామహాకావ్యమును రచించి, కవిజనరత్నహారమున నమూల్యమణియై, పండితపారిజాతమై, కవిజనకల్పమై, శ్రితజనచింతామణియై, యష్టదిగ్గజము లను పేర మహాకవుల నెనమండ్రఁ దనయాస్థానమునఁ బోషించి, సాహితీసమరాం గణసార్వభౌముఁడై, ధర్మప్రతిష్ఠాపనార్థమై, కలమును ఖడ్గమును సమానముగ వినియోగించి, తనకొలువుకూటము సాహిత్యరత్నాకరముగాఁ, దనముఖము కువలయానందముగాఁ, దనవాగ్విశేషములు రత్నావళిగాఁ, దనపరిపాలనము ప్రబోధచంద్రోదయముగాఁ, దనకావ్యము సరస్వతీకంఠాభరణముగా దాని

యందలిరసము నరులఁ బరవశులుగాఁ జేయు కాదంబరిగాఁ, దనరాజ్యము కావ్యాదర్శముగాఁ, దనజీవితము కావ్యప్రకాశికగా, నిరంతరవిద్వజ్జనగోష్ఠి చిత్రమీమాంసగాఁ, దనసరసవచోరచనలు కర్ణపర్వములుగా, నవీనకాలపు వాఁడయ్యు, విక్రమార్కుఁడై, హర్షవర్ధనుఁడై, రాజరాజై, ప్రతాపరుద్రుఁడై, విలసిల్లిన శ్రీకృష్ణదేవరాయచక్రవర్తినిఁ, బొగడి, నామనంబానందాబ్ధి నోలాడనిండు!

అనంతరము, సంగీతసాహిత్యకళాశాలల నెలకొల్పి, విరివిగా విద్యాదానముఁ జేయుచు, ననేకవిద్వజ్జనుల కాశ్రయులై, యాంధ్రదేశకృతజ్ఞతకుఁ బాత్రులైన, రాచ, కమ్మ, వెలమ, రెడ్డి, కులములం జనియించిన యుదారస్వభావుల, నుత్తమచరిత్రుల, భాషా సేవకులఁ బ్రస్తుతించి పిదపనొకముఖ్యవిషయమునుఁ గూర్చి ప్రశంసించెద.

ఆంధ్రభాషాప్రాధాన్యత—:స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో, రసప్రలుబ్ధధియః, లోకే, బహుమన్యంతే, వైకృతకావ్యాని చాన్య దపహాయ" అని యాంధ్రశబ్దచింతామణియందుఁ జెప్పఁబడియున్నది. అనఁగా స్వదేశవేషభాషలయం దభిమానము గలిగి రసగ్రహణపరాయణు లగుసజ్జనులు అన్యభాషాకావ్యములను విడిచి వైకృతకావ్యములను, (అనఁగా మాతృభాషయందు రచియింపఁబడిన కావ్యములను) ఆదరింతు రని దాని తాత్పర్యము. కాఁబట్టి దేశాభిమానము గలప్రతివ్యక్తియుఁ దనదేశభాషయందు నిర్మింపఁబడిన కావ్యముల నాదరించుచు, గ్రంథకర్తలం బ్రోత్సహించుచు, యాభాషాద్వారమున జ్ఞానవ్యాప్తిఁ జేయుటకుఁ బ్రయత్నించుచుండవలెను. ఏలయన మాతృభాషయే సర్వార్థసాధకంబు. జనసామాన్యమునకు మన మేవిషయము నేర్పఁదలఁచినను, నేవార్తఁ దెలుపఁ దలఁచినను, నేధర్మము నుపదేశింపఁ దలఁచినను, దేశభాషయే దాని కుత్తమసాధనము. మనదేశమున దేశభాష కాక మఱి రెండుముఖ్యభాషలు కలవు. అందు మొదటిది సంస్కృతభాష, ఈభాష ప్రస్తుతము వ్యవహారమునందు లేదు, కాని కొందఱు పండితులు మాతృభాషవలెనే, దానిఁ గూడ వశపఱుచుకొని, దానిలోఁగూడ ననర్గళముగ సంభాషింపఁ గలరు. గీర్వాణభాషాసాహిత్యముఁ గలవారు దానిని మాటలాడఁగలవారు దేశములో మిక్కిలి తక్కువగా నున్నారు. అది మనయాంధ్రదేశమునఁ గాని భరతఖండమందలి మఱి యేయితరభాగమందుఁగాని యెన్నఁటికిని వ్యావహారికభాష కానేరదు. కాని మనమతమునకు మూలాధారములైన చతుర్వేదములు, షడంగములు, వానివ్యాఖ్యానములు, అష్టాదశపురాణములు, బోధాయనాదిసూత్రములు, మనుపరాశరాదిస్మృతులు, నుత్తమరాజర్షిచరిత్రములైన భారత, రామాయణాదులు, సంస్కృతభాషలోనే యున్నవి. ఇవిగాక విజ్ఞానప్రదములై, సర్వరసభూయిష్ఠ

ములై, సంతోషదాయకములై, వెలయు, కావ్యనాటకాలంకారాదులుఁ దర్కవ్యాకరణాదిశాస్త్రములుఁ గూడ దానిలోనే యున్నవి. కొన్ని యాంధ్రీకరింపఁబడినను, దానియందలి జ్ఞానసర్వస్వము మనభాషలోనికి రాలేదు. ఆవిషయమై మనవారు కృషిచేయవలయును గాని సంస్కృతభాషను వ్యావహారికభాషగాఁ జేయుట దుస్తరము. రెండవది యింగ్లీషు (English) భాషపాఠశాలలలోని విద్యార్థులు, విద్యాభ్యాసము ముగించి యుద్యోగములు చేయుచున్నవారు, దానినుపయోగింపఁగలరు. అట్టివారు నూటికిఁ బదిమందియైన నుండరు. కాఁబట్టి నూటికిఁ దొంబదిమంది తెలుఁగుభాషయందే యుత్తరప్రత్యుత్తరములు జరుపుకొనుచు, సాభిప్రాయప్రకటనలఁ జేసికొనుచున్నారు. కావున జనసామాన్యమునకు రాజకీయవిషయములు గాని సాంఘికవిషయములుఁ గాని, భాషాసారస్వతవిషయములుఁ గాని, మనము వాగ్రూపకమునఁ గాని, పత్రికారూపకమునఁ గాని, గ్రంథరూపమునఁ గాని, వెల్లడింపఁ దలఁచినపుడు, పదుగురలోఁ దొమ్మండుగురకుఁ దెలిసినభాషలోఁ బ్రచురింపవలయును గాని, పదిమందిలో నొక్కనికే తెలిసినభాషలోఁ బ్రచురించుట యవివేక మగునుగదా! అదియునుఁగాక, యెట్టికఠినవిషయమైనను, స్వభాషతో నేర్పినపుడు, విద్యార్థియొక్క మనస్సునకు సులభముగా నెక్కునుగాని వైదేశికభాషలో నేర్పినపు డంతసులభముగాఁ దెలియదు. అపుడువిద్యాభ్యాసకుఁడు పరభాష నర్థముచేసికొనుటకు, నేర్పఁబడువిషయము నర్థము చేసికొనుటకుఁ గూడమిక్కిలి శ్రమపడవలయును. విషయము, దేశభాషతో బోధించినపుడు విషయ మొక్కటియే, గ్రహించుటకు విద్యార్థి బుద్ధి నుపయోగింప వలయు నే కాని, భాషాక్లిష్టతకై కష్టపడ నక్కఱ లేదు. కావున మాతృభాషయందు జ్ఞానవ్యాప్తిఁ జేయుట, మిక్కిలి సులభము. ఐనను, మన దేశమున నట్టు జరుగుట లేదు! కారణ మందఱకుఁ దెలిసిన దే! మన ప్రభుత్వము విదేశప్రభుత్వము! రాజభాష విదేశభాష! నాగరకత విదేశనాగరకత! గ్రంథములు విదేశగ్రంథములు! పద్ధతులు పరదేశ పద్ధతులు! సాంప్రదాయములు వైదేశికసాంప్రదాయములు! అందుచేత విద్యావ్యాప్తి జరుగవలసినంత వేగముగా జరుగుటలేదు. ఇట్లుంటకు ముఖ్యకారణము మాతృభాషలో విద్యాబోధ జరుగకపోవుటయే.

సశేషము.

---

మన్నారుదాస నీమనను నేఁ గంటి, విన్నఁదనం బింక విడువుము నీవు
కలికిపై వలచిన కారణం బేమి, తెలిపెద విను తేటతెల్లమిగాను
ద్వాపరయుగమున వచ్చిచంద్రుండు, గోపాలుచెంతకుఁ గుతుకంబు మీఱ
రవిశశినేత్ర శ్రీరమణీకళత్ర, వివరింతు వినుము నావిన్నపం బొకటి
తరణికుమారియై తగు కళిందజను, బరిణయం బైన యప్పుగిదిని నాదు
చిన్నికొమార్తను చేకొనిరెండు, కన్నులు సరిగాను కనుఁగొనవయ్య
అన విని గోపాలుఁ డాచంద్రుఁజూచి, నెనరున నిట్లనె నీదుచెల్లెలిని
వేడుకతో మేము పెండ్లాడ మేన, గోడలయ్యెను నీదుకూఁతురు మాకుఁ
గలియుగంబున యశోగరిమచే ధరణిఁ, బొలుపొంద రఘునాథభూనాథమణికి
విజయరాఘవుఁడన విఖ్యాతిగాంచి, ప్రజలెల్లఁగొనియాడఁ బ్రభవింతునపుడు
తనరెడు దక్షిణద్వారకాస్థలిని, జనియింపుదువు రాజచంద్రుండ వనఁగ
నపుడు నీకన్నియ నమరఁ బెండ్లాడి, యపరిమితశ్రీల నలరింతు ననియెఁ
గావున విజయరాఘవ వత్స నీవె, భావింపగాను గోపాలదేవుఁడవు
చంద్రుండె యారాజచంద్రుండుగాన, సాంద్రమోదమున నాజననాథసుతను
అతివలమేల్బంతి యనఁదగుకాంతి, మతిఁ బెండ్లి సేసెద మనుజేంద్ర నీకు
సరగున నారాజచంద్రునకేము, నిరుపమంబుగఁ దెల్పి నీగుణావళులు
తనయపెండ్లికి ముహూర్తమునిశ్చయించి, మనసు రంజిలని దెమరలివచ్చెదము.

వా. అని పలికి యయ్యాచార్యవర్యుండు విజయరాఘవమహీకాంతుని యంతరంగంబునకు సంతసం బొనరించి బంగారు టనముల రంగారు వింతవగపనుల దంతపుపల్లకి యెక్కి చెంతలను శ్రీవైష్ణవశ్రేణులుగొలువ నగ్గలం బగు హెగ్గాళెలు దిగ్గగనంబులు నిండ మెండుగా మ్రోయ సువర్ణదండరంజితంబు లగు వింజామరంబులు వీవ నిస్తంద్రచంద్రమండలరాజమానంబు లగువాజపేయచ్ఛత్ర శతంబులు వరుసగా నిరుగడల ధరింప సురభిఘృతధారాపూరితంబులైన దీపికానికరంబులు పరిచారకప్రకరంబులు కరంబులం బూని క్రందుకొని సందడిగ నడవ మాపాలవెలయు గోపాలుం డీమహామహుండే యని యాబాలగోపాలంబును నందంద వందనంబులుసేయ నానందింపుచు సకలవైభవసాంద్రుం డగు రాజచంద్రునిహజారంబునకు వచ్చునవసరంబున రాజచంద్రుండు నెదురుకొనవచ్చెనఁట యెటువలెను.

సారంగ రాగము-అటతాళము.

రాజాధిరాజులు రమణతోఁ గొల్వంగ, రాజచంద్రుఁడు వచ్చె రాజసంబునను ॥

వా. ఈరీతి నెదురుకొన్న యారాజచంద్రుండు హృష్టాంతరంగుండై సాష్టాంగ
దండప్రణామంబు గావించి యర్ఘ్యపాద్యాదుల బహూకరించి యంతఃపు
రంబుఁ బ్రవేశింపఁ జేయించె నట యెటువలెను - - - - - -
వా. తదనంతరంబు ముదం బంకురింపఁ జెలువుమీఱఁ గులకాంతలుఁ దాను
బహువిధోపచారంబు లాచరించి కాంతిమతిచేత మ్రొక్కించిన నక్కన్యా
రత్నంబునుం జూచి యాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులు చదివెడి పద్యము.

క. విజయమునఁ గరుణచేతను, విజయుని రాఘవునిఁ బోలు వీరవరు నీ
రజముఖి వివాహమయ్యెడు, సుజనులు గొనియాడునట్టి శుభములు గలుగన్
వా. అని దీవించిన యాదేవతావైభవుం డగునాచార్యవర్యునిజూచి రాజచం
ద్రుం డేమనుచున్నాఁడు.

రాజచంద్రుఁడు చదివేపద్యము.

క. దేవర యిటు విజయించిన, భావం బిది యేమొ తెలియఁ బలుకఁగవలయున్
సేవకుఁడఁ గాన నిప్పుడె, కావించెదఁ గోరినట్టి కార్యము లెల్లన్.
వా. అనిపలికిన రాజచంద్రునితో నాచార్యు లేమనుచున్నారు.

ద - శంకరాభరణము-ఆదితాళము.

వినుము రాజచంద్ర మావిజయరాఘవుండు నీ, తనయను బెండ్లాడఁ దలఁ
చినాఁ డిపుడు ‖ ౧ ‖

ఈపెండ్లి చేకూర్ప నేము వచ్చితిమి, రేపు ముహూర్తమ్ము నీపుత్త్రినిమ్ము ‖ ౨ ‖
వా. అని పలికి యామన్నారుదాసుగుణము లే మని వర్ణింపుచున్నారు.

ఆచార్యులు చదివే ద్విపద. [డు

వినురాజ యతఁడు మాప్రియశిష్యుఁ డగుచుఁ, దనరును మన్నారుదాసాహ్వయుం
చిన చెవ్వయాహ్వయక్షితిగోప్తనప్త, ఘనుఁ డచ్యుతక్షమాకాంతు పౌత్త్రుండు
రఘునాథమేదినీరమణపుత్త్రుండు, మఘవసమానుండు మహితవైభవుఁడు
సాహితీభోజుండు సంగీతవేది, బాహువిక్రమశాలి భానురశైలి
చాతుర్యధుర్యుండు సర్వార్థదర్శి, జాతివార్తలమేటి సద్గుణపేటి
స్వపరజనత్రాత సంపద్విధాత, విపులకీర్తివిహారి విమతవిదారి
తనరుషోడశమహాదానదీక్షితుఁడు, అనిశంబు లక్షవిప్రాన్నప్రదాత
మనసిజాకారుండు మానధనుండు, వినయాన్వితుఁడు కవిజనపోషకుండు
నీతికి మనురాజు నేర్పరి మిగుల, దాతలరాయుండు దాక్షిణ్యశాలి
మాటలమంచి ధర్మప్రవర్తకుఁడు, నాటకపరితోషి నతజనపోషి
ఆజానుబాహుండు నచలధైర్యుండు, రాజరాజనిభుండు రాజప్రభుండు

చూడఁ గల్గినవాఁడు చుట్టాలసురభి, యాడితప్పనివాఁడు నాశ్రితావనుఁడు
రసికుండు నెఱజాణ ప్రాబంధికుండు, నొసపరియుత్సాహి యుచితజ్ఞుఁ డరయ
రామాయణాదిపురాణపారీణుఁ, డామోదసంధాయి యఖిలాతిశాయి
శ్రీరాజగోపాలసేవాపరుండు, వీరాధివీరుండు విజయరాఘవుఁడు
అతని గుణంబుల నభినుతింపఁగను, జతురాస్యునకు నైన శక్యమే జగతి
అటువంటి మేటి నీయల్లుఁ డైనపుడె, యిటువంటి భాగ్యంబు నెవరికిఁగలదు.
వా. అని మఱియు నే మనుచున్నారు.

ద - మధ్యమావతి - జంపెతాళము.

ఈపూర్వవృత్తాంత మీవు దెలియుదువె, యోపార్థివచంద్ర యుచిత మీతలంపు ॥ ౧ ॥

కులమును శీలంబు గుణము రూపముఁ జూడ, కళావతిసుతునకు నీ కన్నియ కమరు ॥ ౨ ॥

ఏమాన తిచ్చినది యితవుగా మదినెంచి, ప్రేమ నీకూఁతురికిఁ బెండ్లొనగూర్పు ॥ ౩ ॥

వా. అనిన విని రాజచంద్రుఁ డే మనుచున్నాఁడు.

దరువు - ఘంటారవము - ఆదితాళము.

పదివేలసతులతోఁ బరఁగినవాని, హృదయము నాతనయపైని నన యంగాఁ జేర్చునా.

ముఖారిరాగము - అటతాళము.

ఎలమి సవతులలోన నీచిన్నపడుచు, చెలువునిమనసురా సేవచేయనేర్చునా.

కేదారరాగము - అటతాళము.

కలనైనమీమాట కాదన వశమె, తెలుపందగినవిధము తెలిపితిఁగాని.
వా. అనిన విని శ్రీనివాసతాతయాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులు చదివే పద్యము.

సీ. విజయరాఘవమహీవిభునిగుణంబులు వినుతింప నలవియే విభువతంస
కామినులెందఱు గలిగిన నందఱి సమముగా నేలెడు స్వామి యతఁడు
పసిబిడ్డ యైనను భావంబు రంజిల్ల దిద్దుకోనేర్చిన ధీరుఁ డతఁడు
చనవిచ్చి నడపెనా శాశ్వతంబుగ నిల్పు నితరరాజులసాటి యెంచనేల
ప్రేమతోడుత నేఁబూని పెండ్లిసేయు, సవతులందఱు నీపుత్రిసాటి యెవ్వ
రింక నాలోచనలు మాని యిపుడుసుతను, విజయరాఘవునకునిమ్ము వేడ్క మీఱ.
వా. అనిన విని రమణీయగుణసాంద్రుం డగురాజచంద్రుం డాచార్యవర్యునితో
నే మనుచున్నాఁడు.

రాజచంద్రుండు చదివేద్విపద.

ఔనయ్య మీరిటు లానతీయంగ, నే నుత్తరం బీయ నెంతటివాఁడ
స్వామివారు తనకు సకలభాగ్యములు, వేమాఱు చేకూర్చు వేల్పవుఁగాన
నాముద్దుపట్టిని నరవతు లెంచఁ, బ్రేమ మన్నరుదాసవిభునకు నిత్తుఁ
బొంతనంబులు చూచి పుత్రికామణికిఁ, గాంతిమతికిని లగ్నము నిశ్చయించి
పెరిమమీఱఁగ మీరె పెండ్లిపెద్దలయి,యిరవొందఁ బెండ్లి సేయింపఁగావలయు

వా. అని పల్కిన రాజచంద్రునితో నాచార్యశిఖామణి యేమనుచున్నాఁడు.

ఆచార్యులు చదివే పద్యము.

గీ. మన్ననారు రథోత్సవమహిమ జేసె, వేడ్కఁగావించి యెంతయు విభవమలర
వినుము నిశ్చయతాంబూల మొనరఁజేయ, నీదునగరికి వత్తుము నిక్కముగను.

వా. అని యానతిచ్చిన యాచార్యచంద్రునకు రాజచంద్రుం డమూల్యంబు లగు
కనకాంబరమాల్యంబులు ననర్ఘ్యంబులగు మణిభూషణంబులు సారఘన
సారతాంబూలంబులు సమర్పించినఁ గైకొని యమ్మహామహుండు నిండువే
డుకతోడ సుముఖుండై సముఖంబునకు మరలి వచ్చి వన్నె మీఱ మన్నారు
దాసునితో నేమనుచున్నారు.

కేదారగౌళ - ఆదితాళము - ద.

ఫలియించె నీకోర్కి చెలువమన్ననికృప। నెలమిపురోహితుల నిటకు రప్పింపు.

వా. అనిన విని మనుజేశ్వరుండు శ్రీరాజగోపాలరథోత్సవంబు శేఖరించి యనంత
రంబు హితులైనపురోహితులరప్పింప నచ్చటికి వారువచ్చిరఁట యెటువలెను.

ద - రేవగుప్తి - ఆదితాళము.

పట్టుకుళ్లాయలుపెట్టి పంచాంగములు చేతఁ। బట్టి పురోహితులు వచ్చిరా వేళ.

వా. ఇవ్విధంబున వచ్చిన పురోహితులం జూచి యాచార్య లేమనుచున్నారు.

ఆచార్యులమాట—రారయాపురోహితులార! మీరు యీనగిరికి నూరుతరాల
నుంచి తగులైనవారుగనుక ముహూర్తం గలవారు, అటుగనుక కనకాంబర
ముస్నుముడుంగరాలతోట్టుకూడా నగరిముత్తైదువులచేత పండు పసపు బం
గారు టెంకాయలు పూలు వక్కలాకులు మొదలైనశోభనద్రవ్యాలు బట్టిం
చుకొని మేళతాళాలతో గూడా ఆరాజచంద్ర మహారాజుగారినగరికి పోయి
వధూవరుల పేరింట సంతోషముగా పొంతనంబులు జూచి దేవుచంద్రతారా
బలాలు గలిగిన శుభదినంబు గనక రాత్రి యిరవై అయిదవఘడియను సింహ
లగ్నమందు వివాహముహూర్త మని తెలియంబలికి నిశ్చయతాంబూలం

వా. అనిన విని పురోహితులు కల్యాణఘటనప్రవీణులై సకలశోభనవైభవ ప్రచారంబు లాచరించి మగుడి వచ్చి యాచార్యపట్టభద్రునితో విన్నవింప నాచార్యు లేమని యానతిచ్చేరు.

ఆచార్యులమాట.—రారయా పురోహితులార మీరాక శుభాకరం బయ్యెగనక సంతోషమాయెను. ముందర నాంద్యాహ్వానాది శుభాచారంబు లాచరింపరయా.

వా. అనిన విని హితులైన పురోహితులు ధీచాతుర్యంబు మెఱయ నాచార్యానుమతులై డెందంబున నానందంబు గందళింప నాందీదేవతాహ్వానంబు గావించి హృద్యతరవాద్యఘోషంబులు మేదురంబుగా నామేదినీవిభుని సాదరంబుగా వాటంబైన పెండ్లిపీఁటయందుంచి ఫలతాంబూలంబుల వడిగ నొడినింప నత్తఱి ముత్తైదువలు వచ్చిరఁట యెటువలెను.

ద. అచ్యుత విజయరాఘవాధిపు పెండ్లికి, ముచ్చటలాడుచు ముత్తైదువలువచ్చిరి.

వా. ఈసరణి వచ్చినసువాసినులు సేసలు వెట్టికొట్నంబులు వెట్టిరఁట యెటువలెను.

ద. సువ్వి మన్నారుదాస సువ్వి రమ్యహర్మ్యవాస, సువ్వి రుచిరముఖవిలాస సువ్వి సువ్వి
సువ్వి చోళభూమిపాల సువ్వి సుజనవినుతశీల, సువ్వి యువతిపాంచాల సువ్వి సువ్వి
సువ్వి మన్మథాకార సువ్వి సుకవిమందార, సువ్వి సార సుగుణహార సువ్వి సువ్వి.

వా. అంతట నంతఃపురకాంతలు మెచ్చుగా నచ్యుతవిజయరాఘవధరాపురందరునకు రంగుమీఱ మంగళస్నానంబు సేయింప నామహామహుండు వివాహసమయ సముచిత శృంగారంబు నుప్పొంగుచుఁ బూనెనఁట యెటువలెను.

కవివచనము ద్విపద.

మన్నారుదాసుండు మగువ లందిచ్చు, సన్నజాజి విరుల సరములు చుట్టి
సరులైన రతనాల జంటచే మెఱయు, బురుసారుమాల్గట్టి పొంకంబు మీఱ
నొప్పైన సిగమీఁద హొయలు గన్పట్ట, గొప్పముత్తియములకుచ్చు గీలించె
మంజాడులను మించు మగఱాలచేత, రంజిల్లునట్టి తురాయి ధరించెఁ
జెలువైన చెక్కుల జిగి దులకింపఁ, బొలుపొంద ముత్యాలముఱువులు పూనె
నతులితలీలఁ గట్టాణిముత్తెములు, జతలు గూర్చిన పెద్దచౌకట్లు పెట్టి
గరిమఁ గెంపులదామకంబులకంట, సరములు గళమున సవరించె వేడ్క
బునసాహిజారుపైఁ బొలుచుముత్యాల, నెఱజంట యఱచట్ట నీటుగాఁ దొడిగి
తులకించు నీరాజి దుప్పటి గట్టి, వలనొప్పు వజ్రాలవంకియుఁ దాల్చెఁ
గరమొప్పు నక్షత్రకంఠమాలికయు, సరిలేని జాతిపచ్చల చిల్కతాళి
మెఱుఁగైన కెంపుల మేల్పతకములు, నొఱపైన వజ్రాల యుత్తరిగెలును

బంచరత్నమ్ముల బాహుపురులును, మించు మానికముల మెఱయు తాయెతులు
తావుల పచ్చలఁ దగు కడియములు, జీవరత్నంబుల చేసరంబులును [ములు
వెలయు వజ్రాల హంవీరతాయితులు, పోలుపొందఁ జూఱు కెంపులయుంగర
నెలకొను బిరుదు పెండెము మొదల్గాఁగఁ, గలుగు సొమ్ములు మేనఁ గైసేసెనపుడు.

వా. ఇవ్విధంబున సింగారించుక దేశికాగ్రణి యాశీర్వదించి యొసంగు బాసి
కంబు వాసిగా ధరించి దిగంతరనిరంతరిత భేరీమృదంగపటహ పణవముర వఝ
ర్ఝాహుడుక్కాదివాద్యవిశేష ఘోషంబులు పుండరీకభవాండ భాండం
బులునిండ నిశ్శ్రేణికాశ్రేణికల దేదీప్యమానంబు లగు దీపికావితానంబులును
సాంద్రతరజ్యోతు లగు చంద్రజ్యోతులు బాణవిద్యలు రాణింప నొప్పుగల
పూలచప్పరంబు క్రింద విజయరాఘవపట్టభద్రుండు భద్రగజంబు నెక్కి
వచ్చె నఁట యెటువలెను

ముఖారిరాగము - ఆదితాళము - దరువు.

గజరాజంబు నెక్కి ఘనవైభవంబు మీఱ, విజయరాఘవేంద్రుండు వీథిలో వచ్చె.

వా. ఈరీతి ధారుణీపరిణి యూరేఁగి వచ్చు సమయంబున రాజద్గుణసాంద్రుం
డగు రాజచంద్రుండు తనయనుంగు తనయ యైన కాంతిమతికిఁ బెండ్లికూఁ
తురు సింగారంబు చేయించెనఁట యెటువలెను.

మంజరి. అంగనలా వేళ నలకాంతిమతికి, మంగళస్నానంబు మనుతఁ జేయించి
ఉవిదకుఁ బావట హాయలుగాఁ దీర్చి, కోమలికిని బెండ్లికొప్పమరించి
బంగారుపూవుల పావడమీఁద, రమణికిఁ గనకాంబరంబుఁ గట్టించి
రామకు ముత్యాల ఆవికయుఁ దొడిగి, కాంత నెన్నుదుటిపైఁ గస్తూరి దిద్ది
కలకంఠికన్నులఁ గాటుక దీర్చి, పొలఁతిచెక్కున దృష్టిబొట్టును బెట్టి
జవ్వని వీనుల జవ్వాదియుంచి, కొమ్మ నెమ్మేనఁ గుంకుమగంద మలఁది
సారిది పాపటబొట్టు సూర్యచంద్రులును, మురువులు బవిరెలు ముత్యాలకుచ్చు
కొప్పుబిళ్ల తురాయి గొప్ప ముక్కెఱయుఁ, బంజాలకమ్మలు బన్నసరాలు
కంటసరుల్ ముద్దుకంటె తాళియును, నొఱపైన కుతికంటు నుత్తరిగెలును
దండలు తాయితల్ తళుకు గాజులును, చేకట్లు కడియముల్ చేసరంబులును
పంచరత్నంబుల బటువుంగరములు, గంటలమొలనూలు గాళసరములు
మురువైన యొడ్డాణమును సందియలును, నాదిగాఁ గల్గిన యాభరణములు
కాంతిమతికిని శృంగారించిరపుడు.

వా. ఈలాగున వాలుఁగంటికి లోలవిలోచనలు కైసేసి కళ్యాణ మేదురం [బైన
కళ్యాణవేదికకుఁ దోడి తెచ్చిరఁట యెటువలెను.

క. చెంతఁ గాంతలు గొల్వ సిగ్గు దుళుకింపఁగాఁ, గాంతిమతి వచ్చెఁ గల్యాణవేదికకు

వా. అత్తఱి నత్యాదరంబున ముత్యాలసేసలు చల్లుచు భాసురగుణసాంద్రుండగు రాజచంద్రుండు విజయరాఘవమహీంద్రు నెదురుకొనెనఁట యెటువలెను.

ద. ఎదురుసేసలు చల్లుచు నెలమి విజయరాఘవుని
ముదమునఁ దోడితెచ్చి ముదితతోఁగూడ
సదయుఁడై యలరాజచంద్ర భూపాలుండు
ఉదిరి పెండ్లిపీఁటపై నుంచె వేడుకను.

వా. ఈవిధంబున నావధూవరుల భద్రప్రదం బగుకాంచనభద్రపీఠంబున నుంచినయనంతరంబ హితమతులైన పురోహితులు వివాహసంకల్పంబు నడపించిరఁట యెటువలెను.

సంకల్పము. శుభే శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానే వ్యవహారే చాంద్రమానే శుభకృన్నామ సంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ చైత్రమాసే శుక్లపక్షే అద్యపంచమ్యాం శుభతిథౌ గురువాసర యుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ యుక్తాయాం అస్యాం శ్రీరఘునాథభూపాల కుమారస్య అచ్యుత విజయ రాఘవ భూపాలస్య ఉద్వాహాఖ్యం కర్మకరిష్యమాణ తదాదౌ వృథ్వర్థం శుధ్యర్థమభ్యుదయార్థంచ మహాజనైస్సహ పుణ్యాహవాచనం కరిష్యే.
తదేవలగ్నం సుదినంతదేవ తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి.
సుముహూర్తోస్త్విత్యనుగృహ్ణాంతు సుముహూర్తమస్తు సుప్రతిష్ఠితమస్తు.

వా. అని యీవిధాన దేవతాహ్వాన నాంద్యగ్నిముఖ స్నాతకవ్రత పునఃపుణ్యాహవాచన అంకురార్పణ కన్యావరణ మంగళాష్టక నవవస్త్రధారణ మంగసూత్రధారణ వివాహ ప్రధానహోమాది శుభకర్మంబు లాచరింపఁ జేయించుసమయంబునఁ బురోహితుల కొకరికొకరికి సంవాదంబు నడచెనఁట యెటువలెను.

పురోహితుల మాటలు.

కొండుభట్లమాట—అవునోయి యల్లుసోమయాదులు నూరుతరాలనుంచి యీయింటికి తగులైన పురోహితుండ నే నుండంగా నీవెవ్వండి కొడకవు నా స్వాతంత్ర్యం కొంగుముడిరూక తీసుకపొయ్యేటట్లుగా. ౧

యల్లుసోమయాదులమాట—యేమోయి కొండుభట్లు మాతాతకు చవ్వప్ప నాయునివారు పాంకెన సంభావన కట్టడ చేశివుండంగా నీవెవ్వండవు అపహరించుకపొయ్యేటట్లుగా మాయన్న కొడకవా. ౨

వో భళభట్లమాట — అవురా నరసంభట్టిగా నగరింటి సహస్రనామపూజకు సువర్ణపుష్పాలు గలవే అవల్లా అపహరించి బదులుగా మొలాముచేసిన పూలు తెచ్చి వేస్తివే యిది నగరివారు వింటే అట్లాగే శేయించరా యిది యెంత లేదని కనిపించుకాకవుంటే నీవాడనా మరి. ౩

నరసంభట్లమాట—వోరి వో భళభట్టిగా నగరింటి దానధర్మాలల్లా తవాప్యర్థం మమాప్యర్థం అంచున్ను యిరుజీవి యెరుంగకుండా అంతా అంటించుకొని కాదనిపించుక పోయినవార్ని వినవా వెనకటికి, నీవైనా బుద్ధికలిగి వుండరా. ౪

మధ్యస్థం మరొక పురోహితుని మాట—వోయి వుండరోయి యిష్టబడి అష్టబడి యిటువంటిమాటలు నగరబడెనాయనా అందరికి బహుశ్రేయస్సు వచ్చీనే। నగర వచ్చిన ఆదాయమల్లా సరిగా పంచుక తీసుకుందామోయి మనలో మనమేనా కొట్లాట। యింతట చాలించరోయి ౫.

వా.ఆసమయంబున ముత్తైదువలు జాత్యనుగుణముగా మాట లాడిరంట యెటువలెను.

రంగావొఝల తిమ్మక్కమాట—యేమో ప్రోలుభట్ల యల్లమ్మ నగరింటి పెండ్లి నాడయినా వొకవక్కబ్రద్ద వేసుకొని నమలరా దమవో ౧.

యల్లమ్మమాట—అవునషే రంగావొఝలతిమ్మక్క, నాకు వక్కబ్రద్దా వొకటి కొదవా చాలుచాలు నిన్నమావారు సుక్కరారం సంతలో పిండికూరకంచున్ను గానుగబిండి దెచ్చిరి పెండ్లిపందిట్లో నోరు మెదలించవలెనంచున్ను యింత దెచ్చుక తించునా నింతే ౨.

తిమ్మక్కమాట—ఔ పొరుగింటి తిమ్మావధానిపెండ్లాం పీరమ్మ పాటలు బాడుచున్నది. అంటుకొని నీవున్ను పాడ్రాదమవో ౩.

యల్లమ్మమాట—యిదేందో నీవు నాగవసానివై పెద్దతనం చేసుక వుండేదాన వున్ను కడమవారు పాటలు బాడే వారున్నా ౪.

తిమ్మక్కమాట—వోశమ్మా మాయింటి ఆయన యెందుకో యెవపో యేవేళా రమ్మంచున్నారు. నాకు పాటలు బాడేటందుకున్ను ప్రొద్దు వున్న దషే, మావుట్నింటిలో వుండేప్పుడు కొండవీటి సర్వముచేత పదినుడుగులు నేర్చుకొంటి పాడుదునో అంటే శిగ్గవుచున్నది, యిక్కడంతా మొగవారే వున్నారు. నీవు ధవళమెత్తు నేనుంగూడా పాడేగాని ౫.

వా.అనిన విని ధవళంబు పాడిరంట యెటువలెను.

ధవళం—జయజయ తంజవురవాసా, జయజయ మంజుళహాస
జయజయ మదనవిలాస, జయజయ మన్నారుదాస ॥ ౧ ।
జయజయ సుజనవిధేయ, జయజయ సమరగాంగేయ

జయజయ గానరాధేయ, జయజయ దక్షిణరాయ ॥ ౨ ॥
జయజయ రఘునాథనందన, జయజయ విక్రమభార్గవ
జయజయ విజయవైభవ, జయజయ విజయరాఘవ ॥ 3 ॥

వా. తదనంతరంబ శోభనంబులు పాడిరంట యెటువలెను.

శోభనము—చోళాధినాథునకు శుభకీర్తి సనాథునకు
బాలార్క తేజునకు భామామనోజునకు ॥ ౧ ॥
కనకాచలధీరునకు కవిజనమందారునకు
మనసిజవిలాసునకు సన్నారదాసునకు ॥ ౨ ॥
భుజవిక్రమసాంద్రునకు భోగదేవేంద్రునకు
విజయబలోపేంద్రునకు విజయరాఘవేంద్రునకు ॥ 3 ॥

వా. ఇవ్విధంబున నవ్విభూవరునకు గురుగౌరవంబు మెఱయ కులగురుండును, వాచాలకులైన యాచార్యపురుషులును బ్రాహ్మైశ్వర్యులైన యాప్తజనులును దంత్రవిధాననిపుణులైన మంత్రిప్రవీణులును బూర్వసంబంధులైన సర్వబంధువులును ననన్యసామాన్యులైన సన్నెరాజన్యులును అసమానశూరులైన హాసమువారును నత్యామోదంబున ముత్యాలసేసలిడ నద్వంద్వులైన విద్వజ్జనులును, చాతురి మీఱ హేతువాదంబులు సేయ నవనీయకవనధురులైన కవివర్యులు హృద్యాన్యపద్యశరగద్యపద్యంబులు ప్రసంగింప గాయకనగాయనీజనులు వీనులవిందుగా గానంపుసోన గురియింప నటచేటవిటసార్ద విదూషకవందిమాగధ వైతాళికబృందంబు లంబంబుగా నభినందింప రంగారు సంగీతమేళంబు సేయ దుందుభిధ్వనులచేఁ బ్రతిధ్వనులు మెఱయ సువాసినీజను లాశీర్వదించి యభిరతిచేత నారతు లిచ్చుసమయంబున హితులైన పురోహితులు వివాహశేషహోమంబులు శేఖరించువేళఁ గులక్రమాగత శుభాచారానుకూలంబుగా బాలునకు లీలఁగా బాలలు జోలలు పాడిరంట యెటువలెను.

జోజోజో రాజగోపాల, జోజోజో జితశిశుపాల, జోజోజో గురుశిశుపాల జోజోజో ....మాపాల ॥ ౧ ॥

జోజోజో బాణాసురారి, జోజోజో చాణూరవైరి, జోజోజో వేణుగానానుకారి, జోజోజో శోణపద్మావిహారి ॥ ౨ ॥

జోజోజో గోపికాజార, జోజోజో నవనీతచోర, జోజోజో జగదాధార, జోజోజో నందకుమార ॥ 3 ॥

జోజోజో రమణీయశీల, జోజోజో సత్యభామావిలోల, జోజోజో యమునపవులీల, జోజోజో యదువంశబాల ॥ ౪ ॥

జోజోజో మహితానుభావ, జోజోజో యతులప్రభావ, జోజోజో సత్త్వ
గుణస్వభావ, జోజోజో మన్నారుదేవ ॥ ౨౩ ॥

వా. తదనంతరంబ మునం బంకురింప నామదనమోహనాకారుండగు మన్నారు దాసధీరుండు, ఆనగర దొరలతో విందారగింప గారవంబున నారాజచంద్ర మహేంద్రుండు చోళభూతలనేత యైనజామాతకుఁ దనయనుంగుఁగూఁతునకు నిస్తులవస్తువాహనాభరణంబు లరణంబుగా నిచ్చెనంట యెటువలెను.

కవివచనము.

సీ. రాజచంద్రవిభుండు రతనాలకడియముల్ కడునించు ముత్తేల కంటసరులు
ఘనమైనచౌకట్లు కంఠమాలికయును వెలయెచ్చు నుంగుకు కెంపుంతురాయి
పలకవజ్రంబులు బాగైనపదకంబు చెలువైన పచ్చలచిలుకతాళి
పగడంపు పిడివంకి బలవైరిగర్వము న్నోవ గిల్టినయట్టి పెద్దకత్తి
ప్రబలు నైరావతము మించు భద్రకరులు, నఖిలలక్షణయుతజవనాశ్వములును
హేమగిరి నైనఁ దృణముగా నిచ్చునట్టి, యల్లునకునిచ్చె నప్పుడు హర్షమునను.

సీ. వెలలేని తొడవులు వింతలౌ కోకలు అపికలు పానపు ఉంగుమీఁటులు
రతనాలమంచముల్ రాణించు పక్కుపులు చెలువైన యొరగులు తలగడలును
బాగుమీఱినయట్టి బంగారుబొమ్మలు పంచవన్నెచిలుకపంజరములు
కస్తూరిపిణె ల గందంపుమ్రాఁకులు జవ్వాజిపిల్లులు జాలివీఁటఁ
జెలుల దాదుల మఱియుదాసీజనంబుఁ, బరఁగఁగా నిచ్చెఁ దనముద్దుపట్టికపుడు
ఘనతచేఁ బదిలక్షలగ్రామములును, బసపునకు.... నెంతయుఁ బ్రాభవమున.

వా. ఆరీతి నారాజచంద్రక్షితిపతి ప్రతిలేని శతక్రతు శ్రీనివాసతాతయాచార్యులవారి నపారధనంబుల బహూకరించి భావంబు చెలంగ విద్వత్సంభావనలు సేయుసమయంబున నగ్రసంభావనకు విద్వాంసులకుఁ బరస్పర సంవాదంబు నడచెనంట యెటువలెను.

మల్లుభట్లమాట–యేమిరా కృష్ణంభట్టిగ, అగ్రస్థానానికి నే యోగ్యుండనై వుండంగా నాముందర యెట్లావలె గూర్చుండువురా వజ్రశుంఠవు. ౧

కృష్ణంభట్లమాట–అదేమిరా మల్లుభట్టిగ కామదేవుండు వచ్చినప్పుడు "సంఖ్యే సంఖ్యే శంఖభంగప్రసంగః" అనిపించి సంకులు పెంకులు జేశినవాండను నేనుండంగా నీకు అగ్రసంభావన వలదా మరి. ౨

పల్లకిచెరి యల్లంభట్లమాట–అదేమిరా తిప్పాభట్టిగా మరస్తివా నేరెళ్లయల్లావధానిని వర్ణక్రమములో తప్పుబట్టి ప్రాతిశాఖ్యలక్షణం తప్పెనని చెంప గొట్టితిమే। అటువంటి యోగ్యుండు నీదృష్టికి చాలకపోయెనా। యిదిగోరా

అగ్రసంభావనకు పాత్రము । యిదిగో ముడివేస్తిరా యెవండైనా యెత్తు
మను చూతాముగాని. 3

తిప్పాభట్లమాట — వారి పల్లకిచెంత యెల్లంభట్లు పెదనాయనవారి సముఖాన
మీమాంసయందు ప్రసంగం వచ్చినప్పుడు ఆయనకొక్క సిద్ధాంతకు పూర్వపక్ష
సిద్ధాంతాలు యేమిలేక పోతివే ప్రసంగము ధ్యాస్యం కుంటుపడినపుడు
యీనాడు రెండు బోయినా యిప్పుడేవారయు శబ్దతర్క మీమాంసలయందు
ప్రసంగం చేయుదామురా నీగుట్టు బయలు చేసేను. ౪

వా. అని సంవాదము చేయుచు విద్వత్కవిరాజులకుఁ జోకట్లు సరిపెట్టుచుఁ గుంచె
తాళాంజలు సవిణుసులహారులు మొదలైన బహుమానములు చేసి యథో
చితంబుగఁ బ్రధానమంత్రిదళకర్తల ననువర్తించి యుపంహారంబు లొసంగి
పట్టి కేమని బుద్ధులు దెల్పుచున్నాఁడు.

రాజచంద్రుఁడు చదివే పద్యాలు.

క. అక్కల దగ్గఱ రమ్మని, యక్కునఁ జేర్చుకొని చాల వాత్సల్యము మదిలో
నెక్కొనఁగ శిరము మూర్కొని, చక్కని తనపట్టిఁ జూచి జనకుం డనియెన్.

సీ. ప్రేమతో నినుఁ బిల్చి ప్రియుఁ డొసంగక నీవె వివరించి మున్నుగా వేఁడకమ్మ
బహుమానముగఁ బిల్చి పతి నీకొసంగినఁ గొంచె మంచును నీవె కొసరకమ్మ
నెనరుతో రమణుండు నినుఁ బిల్వఁ బంపిన నేయెడలను జాగు సేయకమ్మ
ప్రాణవల్లభుఁడు ని న్నావింపకయ యున్న బలిమిదగ్గఱఁ బోయి నిలువకుమ్మ
భర్తలాలించె నని హెచ్చి పలుకకమ్మ, మగనిమాటలకును మాఱుమలయకమ్మ
ప్రాణనాయకు మతమె చేపట్టనమ్మ, విభుఁడు దైవంబటంచు భావింపనమ్మ.

వా. అని యీవిధాన బోధించి ధన్యతరమైన కన్యకామణి నాచార్యశిఖామణి
చే నొప్పగించెనఁట యెటువలెను.

ద. బిలాహరి. ఆచార్య నిను నమ్మి యాత్మజ నిచ్చితి,
నీచిన్నపడుచు గోల యేమియుఁ దెలియదు ॥ ౧ ॥
వేమాఱునీతోడ విన్నవించెదనయ్య,
ప్రేమతో నేలుమని ప్రియతనయునికిఁ దెలుపు ॥ ౨ ॥
ఏవుమీఱంగ నవతు లిందఱిలోన,
నాపట్టిఁ జేపట్టి నడవు మనవయ్య ॥ 3 ॥
బహుతపంబులు సేసి భామనుగంటిని,
మహిమతో నేలు మని మన్నారుదాసునకుఁ దెల్పు ॥ ౪ ॥

వా. ఆతీరున నాతంజావురాధినాథునిచేఁ దనకూఁతురి నప్పగించె నఁట యెటు
వలెను.

ముఖారిరాగము – ఆది – దరువు.

విజయరాఘవేంద్రా నావిన్నపమువినవయ్య, ప్రజలెంచనే జేయుభాగ్యంబుకతన॥
అల్లుండనైతి నీవందఱుఁ గొనియాడ, నెల్లరాజులలోన నే ధన్యుండనైతి ॥ ౨ ॥
మసుతనేనాఁకినమందెమేలమునఁ, గమలాక్షి చెల్లుబడిగా నుండునెపుడు ॥ ౩ ॥
నేర్పునేరములెల్లనీవెసైరింపుచు, నోర్పుతో నేలుకోవోయయ్య మాసుతను ॥ ౪ ॥

వా. అని తేజంబు మీఱ రాజచంద్రమహారాజు హెచ్చుగా నచ్చుగతవిజయరాఘవసార్వభౌముని నుచితంబుగా నుపచరించి యూవధూవరుల భావంబు రంజిల్ల రక్తాబ్జనాయికా రాజగోపాలకుల సేవింపఁజేయించి తంజాపురప్రవేశంబు చేయింప నాకాంతిమతీవిజయరాఘవేంద్రులు జోడుగూడి నటించిరఁట యెటువలెను.

కళ్యాణి–ఆది – ద.

కాంతిమతినిం జోడుగూడి ఘనుండు విజయరాఘవుండు, సంతసంబున నటియించె సభవారుపొగడ.

వా. తదనంతరంబ ముదం బంకురింప నెంతేయు సంతసంబునఁ గాంతిమతి తన చాతుర్యంబు పొదలఁ బదకేళిక వినుపించెనఁట యెటువలెను.

ఘంటారవము – విజయభూషణము.

వలపునిలుపలేరా చెలుఖమన్నారుదాసధీర, అలరువిల్తునిబారి సైరింప॥౧॥పల్లవి.
ఏలుకోరా మ్రొక్కేరా, చాలదయదానరా, సామి విజయరాఘవ ॥ ౨ ॥
దక్కితి నిపుడు నీకుఁ దమి దాఁపనేలరా, పుక్కిటి విడెమిచ్చి బుజ్జగింపుచు నన్ను, అక్కునఁ గదియించి యాదరింపుచుఁ బ్రేమఁ। జక్కని మన్నరుదాస ........నీవేళ ॥ ౩ ॥ ఏలుకోరా.

కవివచనము.

సీ. భాసిల్లు రాజగోపాలవిలాసంబునందు సువర్ణసింహాసనమున
నాకాంతిమతి మొదలైన ప్రియాంగనల్ గోరి యిర్వంకలఁ గొలువుసేయఁ
బొలుపొందఁ గొలువుండి పుత్రులు పౌత్రులు తామరతంపరై దండఁదనర
నలశ్రీనివాసతాతాచార్యవర్యుండు సరసప్రసంగముల్ సారె సేయ
సకలతారావృతుం డైనచంద్రుఁ డనఁగ, విశదనిజకీర్తిచంద్రికల్ దిశలవెలయ
విజయరాఘవమేదినీవిభువరుండు, చెలఁగుచున్నాఁడు శోభనశ్రీలు వెలయ.

భరతవాక్యము.

అని యివ్విధంబున రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమానసారసారస్వతధురీణయు విచిత్రతరపత్త్రికాశతలిఖితవాచికార్థావగాహనప్రవీణయుఁ దత్ప్రతిపత్త్రికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు శృంగారరసతరంగితపద

కవిశ్రేష్ఠసుహనీయమతిస్ఫూర్తియు, నతులితాష్టభాషాకవితాసర్వంకష మనీషా విశేషశారదయును రాజనీతివిద్యావిశారదయును విజయరాఘవమహీపాల విరచిత కనకాభిషేకయు విద్వత్కవిజనస్తవనీయవివేకయు మన్నారుదాసవిలాసోషా పరిణయముహాప్రబంధనిబంధనకృతలక్షణయు, మహనీయరామాయణభాగవత భారతకథాసంగ్రహణవిచక్షణయు, పసపులేటి వేంకటాద్రిబహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును రంగద్గుణకదంబయు నగురంగాజమ్మ రచియించిన మన్నారుదాసవిలాసంబను మహానాటకరాజంబునకుఁ గథానాయకుండును, దన ప్రాణనాయకుండు నైన యచ్యుతవిజయరాఘవనాయకు హేమాబ్జనాయికారాజగోపాల! - - - - సమృద్ధియు నైశ్వర్యాభివృద్ధియు సర్వశాత్రవనివృత్తియు సకలసామ్రాజ్యప్రాప్తియుఁ గలుగ లాలించిపాలింపు.

సంపూర్ణము.

---

# భాషాప్రశంస.

—∞∞—

చ. పరమకృపానిధే పుడమిపై జనియించినభాషసంఘమం
దరుదుగఁ బ్రేమనుంచి పరమాదరణంబును జేయుచుండు మీ
మొగుగుణగానముం జలుపుచుంటిమి వేగ మీ యాంధ్రసాహితీ
పరిషదనూనసంపదను బాలన చేయుమి లోకరక్షకా.

సీ. ఆంధ్రభాషాభిజ్ఞులైయున్న నేగాని యాంధ్రదేశం బైక్యమందదింకఁ
బూర్వప్రబంధసంపూర్ణవేత్తలు లేనియాంధ్రదేశం బైక్యమంద దింక
మాతృభాషాభిమానరక్షణలేక యాంధ్రదేశం బైక్యమంద దింక
సంఘమైత్రికిఁ దగుసంస్కృతి లేకున్న నాంధ్రదేశం బైక్యమంద దింక
నాంధ్రవాగ్ధాటి పెంపొందనతులగతుల, దేశమునకెల్ల సానుభూతియు నొసంగి
గద్యపద్యాత్మకాది సద్గ్రంథములను, బోధచేయుఁడి బుధులార పొందుగూర్చి.

సీ. ప్రతిమానవుండును సతతంబుఁ దనమతభాషాసదాచారపోషణమును
జేయుచుండుటె ధర్మసేవనం బిందుచే సంఘంబు గాంచును సత్ప్రసిద్ధి
చిన్ననాఁటనునుండి చిత్తంబునందున భాషాభిమానసద్భావ మలర
మతకులాచారాభిమాన మెప్పుడువృద్ధి నొందురీతిని విద్య నొసఁగుచోడఁ
గలుపవలయును గురువులు కరుణగాంచి, బాలురకు దేశభక్తిప్రబలునట్టు
లన్యభాషామతంబుల నంటవలవ, దాత్మగౌరవసత్కీర్తి వాసిగలుగు.

సీ. బాల్యంబు మొదలిడి బాలు రింగ్లీషున నుత్తరంబుల వ్రాయుచుండి రిపుడు
మాతృభాషలలోన మాటాడలే రెంత వాగ్మిత్వమును బొందువారలైన
మాతృభాషాభ్యాసమాన్యతయే చెడె గురుకులవాసంబు గూలిపోయె
నన్యభాషాసమాక్రాంతచిత్తంబున దేశీయభావంబు నాశమొందె
నిట్టు లేరాజ్యమునఁగాన మెంచిచూడ, వారిభాషామతంబుల వారు విడక
యన్యులకుబోధచేయుదు రాత్మమతము, నందుఁ దము దేశవృద్ధిని జెందఁగోరి

సీ. మనదేశమందున ఘనులయ్యుఁ దమభాష నభ్యసింపక యుండి యన్యభాష
నాలకింపంగోరి యతిసుందరంబైన యాంధ్రభాషను దూలనాడుచుండ
ధిక్కారబుద్ధియు ధీపథంబునఁ బుట్టు నన్యభాషాసమాక్రాంతివలన
మనపురాణంబుల మనశాస్త్రముల నెల్ల మనచరిత్రల సొంపు గనుటకింక

నాంధ్రభాషానుభవభాగ్యమందుకొనిన, సాధ్యమై యుండు జనులకు సంఘమందు
భ్రాతృభావంబు మైత్రియుఁ బ్రబలుచుండుఁ, గోర్కెలెల్లను జేకూరుఁ గొదవ లేక

సీ. మనపూర్వులెంతటి మానవంతులో మనపూర్వు లెంతటి మహాపుణ్యజనులో
మనఋషు లెంతటి మాహాత్మ్యవంతులో భవ్యభూపతులు నేపాటివారో
నిండఁ దెల్వియుఁ గల్గు పండితు లెందఱో వీరనాకం బేగు శూరు లెవరో

- - - - - - - - - - - - - - -

బూసదర్థముగనుటకు బాసదెలియ, వలయు నాంధ్రుల కిప్పుడు విలసనముల
చిత్రచారిత్రబోధన చేయవలయు, నట్లుగాకున్న మన దేశ హానిగలుగు.

సీ. అన్యభాషఁ జదువ నారంభమే మనసంఘంబు చెడుటకు సాధనంబు [బు
మనమాంధ్రులము మనమాతృదేశము నాదియాంధ్రభాష యొకటె మాకాశ్రయం
వినసొంపు మీఱఁగ విన్యాసశోభితం బై యొప్పుచుండు నీయాంధ్రభాష
దాని వృద్ధిని గోరి తత్పరుండై యున్న శ్రీకృష్ణదేవరాణ్ణృపతితిలకుఁ [నిలిచె
డాంధ్రుఁడై యుండి జనుల కానందమొసఁగి, యాంధ్రసామ్రాజ్యవీరమందమర
నాంధ్రజనరక్షణోద్రేక మతిశయిల్లె, శౌర్యగాంభీర్యధృతులకుఁ జాలియుండె

సీ ఆరాజవర్యుని యాస్థానపీఠిక నెందఱో పండితు లెలమినిల్చి
శస్త్రశాస్త్రకలితసాధునాశ్రయము కల్పనాకలితసత్కావ్యములను
జక్కఁగా సమకూర్చి చాతుర్యమును జూపి బహుమానములనంది మహితులైరి
నాఁటనుండియె యాంధ్రంబు విపులమై శ్లాఘ్యతఁగనె బహుసరసగతిని
బహుదినంబుల కంతటఁ బొడఁజూపె, భవ్యతను గాంచె యావనీభాషమహిని
దానిచే నాంధ్రమున వెలదాఁటిపోయె, నంతలో హూణశకమునఁ గాంతి వెలసె

సీ హూణభాషకుఁ జాలహొయలు గల్గిన యాంధ్రభాషకు సాంకర్యపదవి పట్టె
నాంధ్రవిద్వాంసులు నైక్యంబుగని ప్రతివర్షంబునందున వరుసగాను
దేశమందాంధ్రసందేశంబులను బంపి రుచిగల్గుపద్ధతి రూఢిపఱచి
సాంఘికసభలను సమకూర్చి శ్రద్ధతోఁ దెనుఁగుభాషకుఁ జాలఁ దేటదెచ్చి
పద్యరచనలఁ జేయుచుఁ బ్రౌఢిమెఱయ, భాషణంబుల సలిపి వాక్పటిమతోడ
వెల్లడించుచున్నారు తల్లిభాష, వృద్ధినొందించు సంఘసమృద్ధికొఱకు.

సీ. నవరసాలంకారనవనాదములకెల్లఁ బాత్రంబు మనయాంధ్రభాష మహిని
త్యాగరాయల గేయరాగరంజితకృతి పాత్రంబు మనయాంధ్రభాష మహిని
సరసగాంధారాదిస్వరశోభ కెల్లను బాత్రంబు మనయాంధ్రభాష మహిని
దంత్రీస్వనారూఢతానగతులకును బాత్రంబు మనయాంధ్రభాష మహిని

ఇట్టియాంధ్రావనీకాంతకీసుఁడెవ్వఁడో, ఆంధ్రభాషనుగన్నయార్యుఁడెవ్వఁడో
అనఘుఁ డప్పయదీక్షితుఁ డన్నరీతి, భాగ్యవంతుఁడు నధికతాపసి యతండు.

సీ. తెలుఁగుభాషకుఁ జాలఁ దేటు దెత్తునటంచుఁ గ్రొత్తకవిత సమకూర్పరాదు
పూర్వప్రబంధసద్బోధన సలుపక పిట్టకథల నందుఁ బెట్టరాదు
గ్రాంథికభాషను గాపాడకే బుధుల్ గ్రామ్యంబు రక్షింపఁ గడఁగరాదు
సంగీతసాహితీఛందోవిశేషమహా శాస్త్రంబులను వెదచల్లరాదు
విబుధజనులార విద్యావివేకులార, మహితసుగుణాళివిభ్రాజమానవిభుల
విమలసత్కీర్తికలితాంధ్రపీకులార, క్షీణమౌనాంధ్రభాషఁ బోషింపవలయు.

పారుపూఁడి చలమయ్యశాస్త్రి.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు.

—— :o: ——

# TELUGU ACADEMY.

## శ్రీ రక్తాక్షినామ సంవత్సరకార్య నివేదనము.

(1924-25)

గత సంవత్సరమున, పదుమూఁడవ పరిషద్వార్షికసభ కృష్ణామండలములోని తణుకుపురమున జరిగినది. సాధారణముగా సమావేశము రెండేసి దినములే జరుగుచుండెనుగాని బెజవాడలో మూఁడునాళ్లును, తణుకులో నైదునాళ్లును జరిగినది. అన్ని దినములు సభ జరిగినను నియమితకాలములో జరుగక సభాకాలము రెండు మూఁడుసారులు మాఱుటచేత ముఖ్యులుకొందఱురాలేదు.

### సభ్యులు మొదలగువారు.

ఈ యాంధ్రసాహిత్య పరిషత్తును ఆ 1911 సంవత్సరములో శ్రీ పిఠాపురము మహారాజావారును కీ॥ శే॥ శ్రీవేంకటగిరి మహారాజావారును స్థాపించిరి. వీరిరువురును ప్రతిష్ఠాపకులు. శ్రీబొబ్బిలి మహారాజావారును శ్రీ తుని రాణీగారును, శ్రీ ఉయ్యూరి జమీందారుగారును, పిమ్మట నుద్ధారకులుగా నిలిచిరి. శ్రీ వేంకటగిరి, శ్రీభద్రాచలము, శ్రీ నడిమితిరువూరు, శ్రీముక్త్యాల, శ్రీ మునగాల సంస్థానాధీశ్వరులును రావుబహద్దరు పైండా వేంకటచలపతిగారును, గౌరవనేయ శ్రీ పానగల్లురాజాగారును, పోషకులు.

యావజ్జీవసభ్యులు 26 గురు.

సాధారణసభ్యులు. 203 క్రొత్తవారు 16 గురు మొత్తము 219గురు.

గౌరవార్థసభ్యులు 36 గురు.

కార్యనిర్వాహకసభాసభ్యులు- 45 గురు.

కార్యనిర్వాహక సభాధ్యక్షు లొక్కరు.

కార్యదర్శి యొక్కరు.

రక్తాక్షి సం॥ను పరిషద్గౌరవాధ్యక్షులొక్కరు.

గౌరవసేయ, న్యాయమూర్తి వేపా రామేశము పంతులుగారును, దివాన్ బహద్దరు శ్రీమాన్ ధర్మవరము శేషాచార్యులుగారును కోశాధ్యక్షులు.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ఈ సంవత్సరములో పరిషత్పత్రిక రెండునెలల కొకసారి ప్రకటింపఁబడినది. హరిభట్టారకకృత నారసింహపురాణము పత్రికలోఁ బ్రకటింపఁబడినది. తంజావూరు సంస్థానములో రంగాజమ్మయను నామెరచియించిన మన్నారుదాస విలాసనాటకము (యక్షగానము) ప్రకటింపఁబడుచున్నది. ఇదితక్కిన యక్షగానములవంటిదిగాక రంగాజమ్మపాండిత్య మింతదనేకవిధముల వెల్లడిచేయుచున్నది. జ్యోతిష్కులు తెలిసికొనవలసిన విషయములు, నాచనసోమనాథ నన్నిచోడులకావ్యవిశేషములు, నన్నిచోడునికాల నిర్ణయముదెలుపు ప్రశస్త వ్యాసము నీ సంవత్సర సంపుటము నలంకరించుచున్నవి. పరిషత్పత్రిక చందాదారులు 248. ఈపత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల పేరులును దత్కర్తల పేళ్లును 3 వ యనుబంధమునఁ జూడవచ్చును.

పరిషత్పుస్తక భాండాగారము.

తాళపత్రగ్రంథములు క్రొత్తవి యేవియుసంపాదింపఁబడలేదు. సంవత్సరాంతమున 4441 పుస్తకములు మాత్రమున్నవి. ముద్రితపుస్తకములు 1231. ఇందుఁగొనినవి 5, వెల యీయకుండవచ్చినవి 32. వీనిలో బ॥ శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిచ్చిన యాంధ్రవ్యాఖ్యానాదికముతోఁ గూడిన వాత్స్యాయన కామసూత్రములును, నీలమత పురాణమును (కాశ్మీరదేశ చరిత్రము) చెన్నపురి దొరతనమువారు ప్రచురించిన శాసనముల గ్రంథము (South Indian Inscriptions Vol IV) సర్వవిధముల నుత్తమమైనవి. దండికృతావంతిసుందరీకథాసార మపూర్వమైనది. మైసూరు దొరతనమువారు ప్రకటించిన చంద్రకవికృత కృష్ణభూపాలీయమనుపద్యాంధ్ర వ్యాకరణము మనదేశమునకుఁగ్రొత్తది. శ్రీరాజామంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరుగారి నవనిబంధనము, శ్రీశివశంకరశాస్త్రిగారి హృదయేశ్వరియు, నాంధ్రభాషలోఁ గ్రొత్త పద్యకావ్యములు. కాగితములపైఁ బ్రతులు వ్రాయించినవి గతసంవత్సరమున

36, క్రొత్తగా వ్రాయించినవి 3. మొత్తము 39. పరిషత్పుస్తక భాండాగారమున కుంజెన్నపురి దొరతనమువారును మైసూరు దొరతనమువారునుదమతమ ప్రచురణముల నుచితముగఁ బంపుచున్నారు. ఈసంవత్సరమున తిరువానూ్కరు దొరతనమువారును బంపుటకు త్తరువు చేసినారు.

పరిషత్పత్రికనుండి పునర్ముద్రితములైన గ్రంథములును విడిగాఁ బ్రకటించినవియు నీ నివేదిక కడపటి ముఖపత్రమునఁ గనఁబఱుపఁబడినవి. సముఖము వేంకట కృష్ణప్పనాయక ప్రణీతమగు జైమినిభారతము (వచనము) పునర్ముద్రణము చేయవలసియున్నది. ప్రథమముద్రణ ప్రతులన్నియు వ్యయమైనవి. ప్రథమముద్రణమునకయిన ధనమంతయు వేంకటకృష్ణప్పనాయఁకుని బంధుకుటుంబములోనివారును దొడ్డప్పనాయక్కనూరు జమీందారుగారులునైన దివాన్ బహదర్ వి. రామభద్రనాయఁడుగారొసంగిరి.

శ్రీసూర్య రాయాంధ్రనిఘంటువునుగూర్చిన విషయము 1 వ యనుబంధమునఁజూడఁదగును.

పరిషత్పత్రికకు వినిమయముగా వచ్చువృత్తాంత పత్రికల పేరులు రెండవయనుబంధమునఁ జూడనగును.

పరిషత్తుయొక్క ఆదాయవ్యయములను గురించిన పట్టిక లీక్రిందఁ గనఁబఱుపఁబడినవి.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీరక్తాక్షినామ సం॥(ది 24 మార్చి 1925)

### అప్పు

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఫండు.— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 86,527 | 0 | 11 | | | |
| ఈసంవత్సరమున హెచ్చు వ్యయము | 274 | 11 | 6 | 86,252 | 5 | 5 |
| తంజావూరు లైబ్రరీచందా | | | | 33 | 0 | 0 |
| చేబదుళ్లు | | | | 1200 | 0 | 0 |
| నింటుఫండు.— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | | | | 15,000 | 0 | 0 |
| | | | | 102,485 | 5 | 5 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువ లెక్కలను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి రక్తాక్షినామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెలుపుచున్నాను.

నెం. 20, తంబుచెట్టివీథి, మదరాసు. 27-6-25 } గుళ్లపల్లి నరసింహాము, ఆడిటరు.

న జమాఖర్చు నిలువ లెక్క.

ఆస్తి.

| | | | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఫండు.— | | | | | | | | | |
| మదరాసు ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ యిండియా వారి జాగ్రత్తలోనుంచబడినవి.— | | | | | | | | | |
| 3½ o/o 1900-01 గవర్నమెంటుపత్రము | | | | 10 000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలాతరుగు | | | | 4,450 | 0 | 0 | 5,550 | 0 | 0 |
| 5 o/o 1927-47 గవర్నమెంటుపత్రము | | | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలాతరుగు | | | | 2 000 | 0 | 0 | 8,000 | 0 | 0 |
| నగదువగైరా నిలువ:— | | | | | | | | | |
| మేనేజరువశమున నిలువ | | | | 40 | 8 | 0 | | | |
| ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియాలో కరెంటు అకౌంటులో | | | | 43 | 10 | 3 | | | |
| డిటో ఫిక్స్డ్ డిపాజిట్టులో | | | | 1,000 | 0 | 0 | 1,084 | 2 | 3 |
| సభ్యులవలన రావలసిన చందాలు | | | | 15,526 | 11 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలా రానిబాకీలు | | | | 1,226 | 0 | 0 | 14,300 | 11 | 0 |
| కుర్చీలు మొదలగు సామానులు (అసలు) | | | | 525 | 8 | 0 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 230 | 6 | 0 | | | | | | |
| ఈసంవత్సరాంతమున మినహా | 24 | 4 | 0 | 254 | 10 | 0 | 270 | 14 | 0 |
| ప్రచురింపఁబడిన పుస్తకములనిలువ.— | | | | 2936 | 10 | 0 | | | |
| పత్రికలనిలువ | | | | 2843 | 0 | 0 | | | |
| కాగితముల నిలువ | | | | 39 | 8 | 0 | 5,819 | 2 | 0 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు.— | | | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | | | | 1856 | 15 | 0 | | | |
| ఈసంవత్సరమున ఉచితముగా వచ్చినవి | | | | 64 | 11 | 0 | | | |
| ఈసంవత్సరమున కొనినవి | | | | 11 | 8 | 0 | | | |
| ప్రతులువ్రాయించుటకు | | | | 19 | 0 | 0 | | | |
| | | | | 1952 | 2 | 0 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 711 | 15 | 0 | | | | | | |
| ఈసంవత్సరాంతమున మినహా | 56 | 15 | 0 | 768 | 14 | 0 | 1,183 | 4 | 0 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు | | | | | | | 51,427 | 8 | 6 |
| నిఘంటువ్యయము:— | | | | | | | | | |
| గతసంవత్సరాంతమునకు | | | | 14,847 | 12 | 2 | | | |
| ఈసంవత్సరమునకు | | | | 1 | 15 | 6 | | | |
| | | | | | | | 14,849 | 11 | 8 |
| | | | | | | | 102,485 | 5 | 5 |

గుమ్మిడూరి వేంకటరంగరావు,

కార్యదర్శి.

## ఆంధ్రసాహిత్య పరిషత్తు—చెన్నపురి. రక్తాక్షినామ సం॥ (ది 5 ఏప్రిల్ 1924

### ఆయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని కార్యస్థానమున నిలువ | | | | 49 | 2 | 0 |
| బ్యాంకినుండి వచ్చిన వడ్డి | | | | 769 | 13 | 8 |
| బ్యాంకినుండి తెచ్చినది | | | | 1488 | 8 | 4 |
| చందాలు:— | | | | | | |
| సాధారణసభ్యుల చందాలు | 232 | 0 | 0 | | | |
| పత్రికచందాదారుల చందాలు | 194 | 0 | 0 | 426 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము | | | | 71 | 9 | 0 |
| పుస్తకముల విక్రయము.— | | | | | | |
| విప్రనారాయణ చరిత్రము | 6 | 15 | 0 | | | |
| జైమినిభారతము | 70 | 5 | 0 | | | |
| కవిజనాశ్రయము | 16 | 4 | 0 | | | |
| జ్యోతిః శాస్త్రసారము | 1 | 15 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము | 2 | 15 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | 1 | 10 | 0 | | | |
| చంపూరామాయణము | 13 | 5 | 6 | | | |
| జ్ఞానప్రసూనాంబికా శతకము | 1 | 0 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | 1 | 7 | 6 | | | |
| కావ్యాలంకారచూడామణి | 8 | 15 | 0 | | | |
| అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0 | 8 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | 4 | 6 | 0 | | | |
| Defence of Literary Telugu | 1 | 0 | 0 | | | |
| చంద్రభాను చరిత్రము | 8 | 13 | 6 | | | |
| శివతత్త్వసారము | 9 | 9 | 6 | | | |
| శివరాత్రిమాహాత్మ్యము | 14 | 0 | 0 | | | |
| ఆర్యభాషావిభాగము | 0 | 15 | 6 | 164 | 0 | 6 |
| వి. పి. పోస్టేజి | | | | 14 | 9 | 0 |
| బైండింగు జమ | | | | 1 | 0 | 0 |
| రిజిస్టరు పోస్టేజి | | | | 0 | 9 | 0 |
| | | | | 2984 | 14 | 6 |

నెం. 20, తంబుచెట్టివీథి, మదరాసు
27-6-25

గుళ్లపల్లి నరసింహము
ఆడిటరు.

సం॥ మొదలు ది 24 మార్చి 1925 సం॥వఱకు) ఆయవ్యయముల లెక్క-

వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకికిఁ బంపినవి | | | | 837 | 3 | 4 |
| వి. పి. పోస్టేజి | | | | 17 | 2 | 6 |
| బ్యాంకిచిల్లరవ్యయము | | | | 3 | 8 | 4 |
| ఉద్యోగుల ప్రయాణవ్యయము | | | | 37 | 6 | 0 |
| పత్రికావిషయము.— | | | | | | |
| ప్లాకులుచేయించుటకు | 2 | 8 | 0 | | | |
| కాగితములు | 180 | 0 | 0 | | | |
| ముద్రణము బైండింగు | 345 | 0 | 0 | | | |
| పోస్టేజి | 61 | 8 | 6 | | | |
| చిల్లరవ్యయము | 2 | 8 | 6 | 591 | 9 | 0 |
| ఇతరముద్రణము బైండింగు | | | | 27 | 14 | 6 |
| పుస్తకభాండాగారవిషయము.— | | | | | | |
| కొనిన పుస్తకములు | 11 | 8 | 0 | | | |
| ప్రతులు వ్రాయించుటకు | 19 | 0 | 0 | | | |
| చిల్లరవ్యయము | 16 | 14 | 0 | 47 | 6 | 0 |
| ఉద్యోగుల జీతము | | | | 783 | 9 | 4 |
| ఇంటియాదె | | | | 440 | 0 | 0 |
| చిల్లర పోస్టేజీ | | | | 17 | 4 | 6 |
| రిజిస్టరుపోస్టేజీ | | | | 6 | 1 | 6 |
| కార్యస్థానము చిల్లరవ్యయము | | | | 60 | 8 | 0 |
| కలములు కాగితములు మొ॥ | | | | 2 | 11 | 0 |
| ఆడిటు ఫీజు | | | | 50 | 0 | 0 |
| పత్రికలలో ప్రకటన | | | | 12 | 0 | 0 |
| పుస్తకప్రకటనముద్రణాదికము | | | | 8 | 8 | 0 |
| నిఘంటుచిల్లరవ్యయము | | | | 1 | 15 | 6 |
| కార్యస్థానమున సంవత్సరాంతమున నిలువ | | | | 40 | 8 | 0 |
| | | | | 2984 | 14 | 6 |

గుమ్ముడూరి వేంకటరంగరావు,

కార్యదర్శి.

## ఆంధ్రసాహిత్య పరిషత్తు—చెన్నపురి. శ్రీ రక్తాక్షి నామ సం॥

### వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్యోగులజీతములు | 783 | 9 | 4 | | | |
| ప్రయాణవ్యయములు | 37 | 6 | 0 | | | |
| ఆడిటరుఫీజు | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానము— ద్దె | 440 | 0 | 0 | | | |
| చిల్లరపోస్టేజీ | 17 | 4 | 6 | | | |
| రిజస్టరుపోస్టేజీ | 6 | 1 | 6 | | | |
| పత్రికలలో ప్ర టనము | 12 | 0 | 0 | | | |
| చిల్లరవ్యయములు | 66 | 6 | 4 | | | |
| వి. పి. పోస్టేజీ | 17 | 2 | 6 | | | |
| ఇతరముద్రణము — బైండింగు | 27 | 14 | 6 | | | |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయము | 16 | 14 | 0 | 1474 | 10 | 8 |
| పుస్త॰ ప్రకటనము — ముద్రణాదికము | | | | 8 | 8 | 0 |
| పత్రికా విషయము:— | | | | | | |
| గత సంవత్సరప్రతులు | 2327 | 8 | 0 | | | |
| కాగితములు ముద్రణము మొదలైనవి | 591 | 9 | 0 | | | |
| కాగితములు నిలువ | 136 | 4 | 0 | 3055 | 5 | 0 |
| మనహాయింపులు:— | | | | | | |
| కుర్చీలు సామానులు | 24 | 4 | 0 | | | |
| పుస్తకభాండాగారము | 56 | 15 | 0 | 81 | 3 | 0 |
| గతసంవత్సరము ప్రచురింపఁబడిన పుస్తకములు నిలువ | | | | 3117 | 7 | 0 |
| మొత్తము. | | | | 7737 | 1 | 8 |

నెం. 20, తంబుచెట్టివీథి, మదరాసు.
27-6-1925

గుళ్ళపల్లి నరసింహాము,
ఆడిటరు.

ఆయవ్యయముల లెక్క— ఆయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| చందాలు:— | | | | | | |
| సాధారణసభ్యులు | 360 | 0 | 0 | | | |
| పత్రికచందాలు | 197 | 0 | 0 | | | |
| | | | | 557 | 0 | 0 |
| విడి సంచికల విక్రయము | 71 | 9 | 0 | | | |
| పుస్తకముల విక్రయము | 164 | 0 | 6 | | | |
| | | | | 235 | 9 | 6 |
| పత్రికలనిలువ | 2843 | 0 | 0 | | | |
| కాగితముల నిలువ | 39 | 8 | 0 | | | |
| | | | | 2882 | 8 | 0 |
| పుస్తకములనిలువ:— | | | | | | |
| బైండుది | 1667 | 14 | 0 | | | |
| బైండుకానివి | 1268 | 12 | 0 | | | |
| | | | | 2936 | 10 | 0 |
| బ్యాంకివడ్డీ | 769 | 13 | 8 | | | |
| వి. పి. పోస్టేజీ | 14 | 9 | 0 | | | |
| చిల్లరజమ | 0 | 9 | 0 | | | |
| ఇతరముద్రణము – బైండింగు | 1 | 0 | 0 | | | |
| ఉచితముగా వచ్చినపుస్తకములు | 64 | 11 | 0 | | | |
| | | | | 850 | 10 | 8 |
| హెచ్చువ్యయము | | | | 274 | 11 | 6 |
| మొత్తము. | | | | 7737 | 1 | 8 |

గుమ్ముడూరు వేంకటరంగరావు,

కార్యదర్శి.

పరిషదభివృద్ధికొఱకుఁ జేయుచున్న పనులన్నియు నుందఫలము లగుచున్నవి. ఈయవలసినచందాలు, సాధారణసభ్యులు పత్రికాపాఠకులు మొదలగువారు ప్రార్థనములపైఁ ప్రార్థనములుగావించినను దూష్ణీంభావమును వహించుచున్నారు. సభ్యులవిషయ మిట్లున్నది గదా, వేఱుమార్గమేదయినఁ గలదా యను యోజనతోఁగడచిన మార్చినెలలో, చెన్నపురమున, కాస్మాపాలిటను క్లబ్బులో నొక యసాధారణ సమావేశము గావింపఁబడినది. అందు రావలసిన సొమ్మురాఁబట్టవలయుననిరి. వెనుకటి తీర్మానముల ప్రకారము మీరీయవలసిన చందాల నీయకున్న మీ పేరులు సభ్యులపట్టికలోనుండి తొలఁగించివేయఁబడునని వ్రాయుటయైనది. ఇద్దఱు ముగ్గురు తప్పశత సంఖ్యాకులు ధనముపంపనే లేదు. దొరతనమువారు కొన్నివిద్యాసంస్థలకు ధనసహాయము చేయుచున్నారు. కావుననే తద్విషయమై యొక ప్రార్థనాపత్రము ప్రభుత్వము (విద్యాశాఖ) వారికి వ్రాసిపంపుటకు నిశ్చయించిరి. ఆప్రకారము వ్రాసిపంపి యున్నాము. పర్యవసాన మింకను దెలియరాలేదు.

డిసెంబరు నెలలోఁ జెన్నపురమున జరిగిన All India Oriental Conference సందర్భములోఁ బెక్కుదేశముల నుండివచ్చిన సభ్యులకొక్కనాఁడ ల్పాహారపు విందు పరిషత్పక్షమున గావింపఁబడినది. దీనికైన వ్యయములోఁ బరిషత్కార్యదర్శియగు రాయ్‌సాహెబు గుమ్మిడూరి వేంకట రంగారావు గారు కొంతయు నుకార్యనిర్వాహకసభాధ్యక్షులు జయంతి రామయ్యపంతులు గారుకొంతయునుభరించిరి. కొంతపరిషద్ద్రవ్యములోనుండియీఁబడినది. పై మహాసభలో పరిషత్పుస్తకభాండాగారములోనున్న కొన్నితాళపత్రగ్రంథములు ప్రదర్శింపఁబడినవి. వానిలోని పురాతనలిపికిని, సూక్ష్మతరమై పుణికిని చిత్రలేఖనచాతుర్యమునకు, ననేకులుశ్లాఘించియుండిరి.

# 1-అనుబంధము.

## శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

### రక్తాక్షిసంవత్సర (1924_25) కార్యనివేదిక

రక్తాక్షి సంవత్సరమున మొదటి యైదుమాసములు యథాపూర్వము గాఁ దత్సమపదముల విమర్శనము జరిగినది. "అ" మొదలు "పరుఁడు" అనుపదమువఱకుఁ గల తత్సమపదములన్నియు విమర్శించి యచ్చునకు సిద్ధము చేయుట యైనది. ఆతత్సమపదముల మొత్తము 28595. పవర్గమువఱకుఁగల తత్సమేతరపదములుకూడ విమర్శించి నిఘంటుసంకలనము గావింపఁదలచి భాద్రపదమాసము మొదలు తత్సమేతరపదవిన్యాసము జరుపఁబడుచున్నది. క్రోధనసంవత్సరాదికి "అన" అనుపదమువఱకుఁ గల తత్సమేతరపదములుకూడ విమర్శించి వెనుకసిద్ధము చేసియుంచిన తత్సమపదములతో గలిపి యచ్చునకుసిద్ధము చేయుటయైనది. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుస్వరూపమును బండితులకును, భాషాభిమానులకును జూపి వారి సవిమర్శనాభిప్రాయముల గయికొనఁదలఁచి కొన్ని పదములను మచ్చునకుఁ బ్రకటింప నిర్ణయింపఁబడినది. పండితాభిప్రాయములు కనుఁగొని యావశ్యకమని తోఁచిన మార్పులు చేసి తదనుసారముగా సాధ్యమగునంత శీఘ్రకాలములో ప్రథమ సంపుటముఁ బ్రకటింపవలయునని యుత్సహించుచున్నాము. ప్రకృతము దాని కావశ్యకమగు తత్సమేతరపద విమర్శనము జరుగుచున్నది.

ఈ సంవత్సరమున నిఘంటువిషయమైన వ్యయము.

| | |
|---|---|
| జీతములు | 2696_11_4 |
| చిల్లరవ్యయము | 78_6_9 |
| ఇంటిఅద్దె | 180_0_0 |
| | 2955_2_1 |

# 2—అనుబంధము

వినిమయముగా వచ్చుచున్న పత్రికలు.

1. అభినవసరస్వతి—జానపాడు—గుంటూరుజిల్లా, మాసపత్రిక.
2. ఆంధ్రపత్రిక—చెన్నపురము—వారపత్రిక.
3. ఆంధ్రప్రకాశిక—చెన్నపురము—వారపత్రిక.
4. భారతి—చెన్నపురము—మాసపత్రిక.
5. రవి—వారపత్రిక—కాకినాడ.
6. కృష్ణాపత్రిక—వారపత్రిక—బందరు.
7. సుదర్శని—పక్షపత్రిక—నరసాపురము. కృష్ణాజిల్లా.
8. వైఖానసపత్రిక—మాసపత్రిక—ఈగావారిపాలెము, చెంగల్పట్టుజిల్లా
9. పంచానన—పక్షపత్రిక—సోంపేట, గంజాము.
10. ఆయుర్వేదసమ్మేళనపత్రిక—మాసపత్రిక, ఏలూరు.
11. త్రిలింగ—వారపత్రిక—చెన్నపురము
12. ఆంధ్రభాషావిలాసిని (మాస) చిత్రాడ, పిఠాపురం, గోదావరి.
13. నవ్వులతోట—బందరు. (వార)
14. శ్రీవైష్ణవపత్రిక (మాస) మెంటపాడు, కృష్ణాజిల్లా.
15. పినాకిని—అనంతపురము (వార)
16. హిందూయువతి—వార—చెన్నపురము.
17. నీలగిరి- (వార) నల్లగొండ- నైజాము.
18. కళ-మాసపత్రిక, చెన్నపురము.
19. స్వరాజ్యపత్రిక, బెజవాడ.
20. సారస్వతసర్వస్వము. తణుకు (మాస)
21. సరస్వతి - ముక్త్యాల- (మాస)
22. రెడ్డిరాణి-(మాస) వెదురుపాక రాయవరము, గోదావరి.
23. కర్ణాటసాహిత్యపరిషత్పత్రిక- బెంగుళూరు (త్రైమాసిక)
24. ప్రబుద్ధాంధ్ర - మాస - రాజమహేంద్రవరము.
25. సాహితి - బెజవాడ [మాస]
26. కర్ణాటగ్రంథమాల - మైసూరు.
27. మాతృసేవ - [వార] నంద్యాల.
28 బ్రాహ్మణపత్రిక - (మాస) మాంబళము, సైదాపేట.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

| | | |
|---|---|---|
| సంపుటము ౧౫. | క్షయనామసంవత్సరము.<br>జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨. |

## కార్యదర్శివిజ్ఞప్తి.

ఈసంచిక జ్యేష్ఠ శు ౧ నాఁటికే వెలువడి యుండవలసినది. కొన్ని కారణములచేత సకాలమునఁ బ్రచురింపఁ బడనందుకుఁ బాఠకులు క్షమింప వేఁడెదను. గతవార్షికసభయందుఁ బరిషత్కార్యస్థానమును జెన్నపట్టనమునుండి కాకినాడకు మార్చుటకుఁ దీర్మానింపఁబడినది. ఈసంవత్సరము మెయినెల ది 1-వ తేదినాఁటికి సంపూర్ణముగఁ గార్యస్థానము కాకినాడలోఁ బెట్టఁబడినది. పట్టనమునుండి 6000 గ్రంథములును యావత్సామగ్రియుఁ గాకినాడకుఁ జేరునప్పటికి సుమారు 700 రూపాయలు వ్యయమైనది. ఈ మార్పునకు యావజ్జీవాధ్యక్షులగు శ్రీపిఠాపురముమహారాజావారిసహాయము లేకుండినచో సాగియే యుండకపోయెడిది. ఆధనమంతయు శ్రీవారొక్కరే సమకూర్చిరి.

కార్యస్థానమునకు శ్రీ పిఠాపురముమహారాజావారు తమకాకినా[illegible]ణాకు సంబంధించిన విశాలమైన యింటిని బ్రస్తుతము దయచేసినారు. ఇట్టివిశాలస్థల మిచ్చినందుకు శ్రీవారియెడలఁ గృతజ్ఞులము. వారియుదారత యెంతయుఁ గొనియాడఁ దగినది.

పరిషత్పత్రిక యింతవఱకుఁ జెన్నపురిలో నచ్చు పడుచుండెడిది. కార్యస్థానము కాకినాడకు మాఱినపిదప నచ్చు కాకినాడలోనె వేయించుట యగత్యమైనందున ముద్రాపకులను మార్చి కాకినాడలో నొకరిని వెదకుకొనవలసివచ్చినది. జిల్లాకలెక్టరుగారియొద్ద డిక్లరేషను మొదలైనవి ముద్రాయంత్రముల చట్టముప్రకారము చేయవలసివచ్చుటచేత నీసారి పత్రిక కొం మాలస్య మగుటకు మఱియొకకారణము కలిగినది.

# ఆంధ్ర సాహిత్యపరిషత్తు.

(1911 సం॥ స్థాపింపఁబడినది)

### ప్రతిష్ఠాపకులు.

౧. శ్రీపిఠాపురము రాజావారగు శ్రీమహారాజా శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు సి. బి. ఇ, గారు.

౨. కీ. శే. శ్రీ వేంకటగిరిరాజావారగు శ్రీ మహారాజా సర్ వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్రబహద్దరు జి. సి., ఐ. ఇ. పంచహజారి మన్సబ్దారువారు.

### యావజ్జీవాధ్యక్షులు.

శ్రీపిఠాపురము రాజావారగు శ్రీమహారాజా శ్రీరావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరు సి. బి. ఇ, గారు.

### కార్యనిర్వాహకసభాధ్యక్షుఁడు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శి.

౧. దర్భా వేంకటశివరామరాసుగారు. బి.ఏ., బి.ఎల్., వకీలు.

### కోశాధ్యక్షులు.

౧. న్యాయమూర్తులగు ది. ఆనరబుల్ వేపా రామేశము పంతులుగారు.

౨. దివాన్‌బహద్దరు క్రొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు.

పరిషదుద్దేశములు.—తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధిపొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈ పనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీ క్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి:—

i తెలుఁగుభాషలోనిపదములకు వ్యుత్పత్తియొసఁగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటువొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకును జాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకు నైపారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములయినవానిలో మిక్కిలివిశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశము యొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయుఁ

v సర్వవిషయములనుగురించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసఁగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెనుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించినవిషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించినవిషయములను గురించిచర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁగావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట;

x ఒకపుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుఁగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికినుపకరించునన్ని కార్యములను జేయుట;

విశేషము.—ద్రవ్యసంపత్తిని స్థితిగతులననుసరించి పైఁజెప్పినమార్గములను గాలక్రమమున నవలంబించి కొనసాగింపవచ్చును.

## చందాలవివరము.

(1) రు 5,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు ఉద్ధారకులు.

(2) రు 1,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు పోషకులు.

(3) రు 100 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు యావజ్జీవసభ్యులు.

(4) రు 6 లకుఁ దక్కువకాని సంవత్సరపుఁజందా నిచ్చువారు సాధారణసభ్యులు.

కాంక్షతో 'దధ' ప్రాసములాకృత్యమునందు 'వే'యఁగా నెంచియత్నించి విడిచినావు
'నెపము' 'నెవము'లనేయనే నిజమటంచుఁ దర్కమును జేసి దాని విడచినావు
'సన్నిధము సర'మనుచోట నన్నయేమి, గతియను చుదిద్ది 'పరవ' నియతుఁ దలఁచి
యేటికీ బాధయంచును నెంచినావు, క్షత్రమాంధాతృపదముల మైత్రి యెట్లు
ప్రాసము 'యమ'ముఁ గలదని గాసిపడితొ, 'యేని' 'నేని'కిఁ గల భేద మెఱిఁగికొనఁగ
విసిగి వేసారి కడకిట్లు సవిరి జేసితొ.

ద్వి. అల 'జిఘత్సా'పేక్ష నచతలమందుఁ, బునరుక్తిదోషంబు పొడముటకేమి
హేతువైయుండునో యెఱుఁగంగరాదు, అంచును యోజించి యాశ్చర్యపడితొ
'నీతదర్థము' గాఁగ నెంజలి పడెసి, చెలికాండ్రఁ గాంచును శిరము పైకెత్తి
చూడకుంటివయేని చూచువారెల్ల, 'దుర్ణయుఁ' డవనినిన్ దూఱెదర్ చుమ్ము
అన్నిష్టసఖ 'యీ'ఁదియనుచోటఁ బదము, విడఁదీసి చెప్పుమంచుఁ బృచ్ఛ చేసెదవొ
'యొందేని' నుండి నీఁకెయ్యని 'యొక్కఁ', డరుదెంచి చెప్పఁగా నడరంగరాదొ
యేలయీ పిచ్చి నీకిఁక బూనుమయ్య, కావ్యమును లిఖింపఁగా వేగనిపుడ
యయ్యయో యిదియేమి కొయ్యపడితివి.

గీ. అనుచునోసూరి యాకవి యండ కేఁగి, 'నడునడనడంక' గారణమడుగఁ దలఁచి
యతని హస్తానఁగల పొత్తమట్టె విప్పి, 'వెలువెలను బాఱి' యేమేమొ తలఁచి తలఁచి
బాలకవిచంద్రుని విచార భావమెఱఁగి, 'యెన్నఁడున్నేని' యెఱుఁగని యిట్టి వింత
కిదియె కారణ మంచును జదివె నిట్లు.

ఉ. నన్నయభట్టుగారు యజనమ్మొనరించినచోట జమ్మిచె
ట్టున్నది తణ్కు తూర్పున నహో యిదియా కవిశేఖరానిమున్
ఖన్నమనస్కుఁ జేసినది ఖేద మదేటికి లెమ్ము లెమ్మిఁకన్
నిన్నునుఁబోలువాఁ డిల మనీషి యొకండు కలండె ధన్యుఁడా
క్రన్నఁ గావ్యరాజమును గల్పన చేయుము మేలుగా సుఖం
బున్నది నన్నపార్య నెవసుంచియ మ్రొక్కి కవీంద్రచంద్రమా
యున్నది శ్రోత్రమార్గమునయందుఁ బడ న్నదమంది లేచియా
క్రొన్నన లెత్తి జొంపమగు కోమలమా నొకజమ్మిఁ గాంచి లో
నెన్నుచు నన్నపార్యువల నేత్తెఱఁ దిర్గుచు నేటికోళ్లల
న్మన్నన తోషఁ జేసి యతిమాత్రపుభక్తిఁ బ్రబంధరాజమున్

సన్నియం కుంకితం బిడి యనంతరమందుచు దమ్ముతూగ్ప్రవం
మన్న కుటీరరాజమున నుత్సుకుఁడై యతఁడుండు నేఁటికిన్.

క. .............
స్థలమాహాత్మ్య మదెంతటిదో, తెలుపఁగలదో వేపికేలు పృథ్విస్థలిలోన్.

---

## సెలవు.

(కొత్తపల్లి సూర్యరావు)

శా. తల్లీ! చెన్నపురమ్మ! నన్నునువు వాత్సల్యంబునన్ హాయిగాఁ
జెల్లె న్నీయొడిలోఁ బ్రమోదభాసమల్ చేకూరి నీమేళ్ళ ను
ద్యల్లేఖం దలఁ పేమియో తెలియ నత్యాదృక్తటస్థత్వమే
వల్లెం బ్రోయుము నీమబిడ్డఁ డను సుప్రఖ్యాతి వర్తించెడన్.

మ. నను రప్పించితి కృష్ణభూపుసభనుండం దెచ్చి శ్రీరామర
క్షను స్థాపించితి వుత్తరోత్తరసుభిక్షంబొంద నీయింతలో
నను నే మెచ్చి యథాప్రకారగతికి న్మన్నించితో చెప్ప త
ప్పనె యే నీశ్లెట నెన్నినాళ్లఋణమో పోయంచు నూహించెదన్.

గీ. ఏగడియ కేమివచ్చునో యెఱుఁగరాదు, రమ్మనినవచ్చితిని మఱిపొమ్మనంగఁ
బోవుచుంటిని సర్వంబు దైవవశము, మనుజుఁడేమెఱుఁగు మదరమునికి మూనికి.

గీ. అంధ్ర మాంధ్రమటంచుఁ బోరాడువారి
యాలిపులకునులిక్కితివె గాక యుక్తియుక్త
ముగను చేసితో యాంధ్రంపుముచ్చటలను
దలఁగఁ ద్రోసితి వీఁకనీకుఁ దమిళపేచ్చు.

గీ. నిన్నుఁ బరిమత్తునంటినే నిన్నినాళ్ళు, లుండఁగాఁ బూలతో నారకొదవీనట్టు
లలరు వాసన వెడమె నాకదియె చాలు, నిలువఁబెట్టుఁడు మీరలీయిలను దాని.
ఎఱుఁగుఁ బ్రజయెల్లనను గ్రొత్తయింత లేదు, పోయివచ్చెద సెలవిమ్ము పురమతల్లి
చెప్పవలెనా కిఁక నావతో నొప్పగించి, నోరు మంచిదయినఁగా దెయ్యూహమంచి.

ము వెంబడి సహాయము లొసరించి పత్రికలోఁ బ్రచురపఱుపవలయునని కుతూహలము గలదు.

అక్టోబరు నెలలో వచ్చునవరాత్రములపండుగదినములలోఁ బ్రోధన సంవత్సరవార్షికసభ కాకినాడలో జరుపవలయు నని యున్నది. అప్పటికి సభ్యులసంఖ్య వృద్ధిగా నుండఁగల దనియు సభ్యు లెల్లరును సమావేశ మగుట కవకాశ ముండుననియు వార్షికసభ జయప్రదముగ జరుపఁబడుననియు నమ్ముచున్నారము. ఈసంవత్సరము జరుపఁబడు వార్షికసభవలనఁ బరిషత్తునకు సరియైన యౌన్నత్యము తమవలనఁ గలుగఁగల దని నమ్ముచున్నారము. వార్షికసభలో వ్యాసములను జదువఁ దలఁచినవారు వ్యాసవిషయమును సెప్టెంబరు 15 తేదీలోపున మాకుఁ దెలియఁజేయఁ గోరుచున్నారము. వ్యాసములు ముప్పదినిముసములకాలములోఁ జదివి ముగింపఁదగినవిగ సంక్షేపముగా నుండవలయును.

ద. వేం. శివరామదాసు



# ఆక్రోశము.

—• పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు •—

చ. కలమును గాగితంబుఁ గొని కావ్యము వ్రాయఁగ నున్నమాస్తు తే
కులపతి నన్నపార్య యని గ్రుడ్డుకుఁ గుంచెఁడు నీళ్ళు గార్చి చా
కలమును జాఱవైచి యల కాగితము న్నలివెట్టి చించి హా
విలవిల యేల బేల విలపించెద విట్లు దురంతచింతలన్.

క. హరిహరి యేమీ పాపము, వరకావ్యారంభమూని ప్రతిభాశక్తిం
బురిటిఁట సంధిమాడ్కిని, గలమును గాగితము నవలగా వైచితయో.

సీ. కూలంకషామలగోస్తనీజలసంగతాయాతవాతపోతములువీవ
సహకారపల్లవజాలఖాదనకషాయితకంఠకలకంఠపతములొలయ
మందారమకరందమాధుర్యరసపాన మత్తబంభరగాన మొత్తుచుండ
ఘనవారనిష్యందవనకణకందళితలతాంతవాసన లలముకొనఁగ
గనులఁ బైకెత్తి కనుఁగొని కయిత చెప్ప, కాకసంబునవైపున కట్టుసాఁచి
పృథుచరిత్రముపత్రములిప్పివిప్పి, యేలవిభ్రాంతిఁ జెందెదో బాలసుకవి.

గీతమాలిక.

శబ్దశాసనుకావ్యంపు శయ్యరాదు, అంచుఁదలఁచి కావ్యారంభమాఁగినావొ
యంతమాత్రానవ్యవసాయమాఁగనగునె, యాఁగితివిపోయి యేటికీనడలుచుంటి
మాటలాడవెయిది యేమిమాయయయ్య, తొలుతశ్లోకంబువ్రాయఁగాఁదలఁ
(చినావొ
హరిహరహిరణ్యగర్భులననెడిచోట, వ్యస్తమా లేకనుసమస్తమాయనుచెదఁ
దోఁపఁబ్రకృతమునుమఱచితూలినావు, హరిహరాజసమాసంబుతిరిగివ్రాసి
యేల క్రమభంగమొదవించెబాలునన్ను? కట్టయేమిదియంచునుగుట్టుచెడితొ
నూటయొనుబదియా లేకనూఱునెనుబదియయటంచులో నెఱుఁగఁగాదినిరినావొ
పదిదినములైదుప్రొద్దులుఁబడపడియును, పద్యమునర్థముతెలిసికొభ్రాంతిపడితొ
'కొండుక'కుఁ 'గొండిక'కుఁగలరెండుతెఱఁగు, లైనరూపంబులెఱుఁగఁగాఁ
(బూనినావొ
తెలివిశనివులరూపములైలిసికొఁగఁ, దలఁగుతోపాటుభ్రమచెందితలఁగినావొ
తెలుఁగునసమాస్తపునశాస్త్రములకు నేమి, కారణమ్మంచుఁ దలపోయఁగడఁగి
(నావొ

# అఱవమునందలి ఱ అను వింతయక్కరము తెలుఁగునఁ గలదా?

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

ఈవింతయక్కరము ప్రాచీనకాలమున నాంధ్రమునఁగూడ నుండెడి దని నూతనముగఁ గనిపెట్టితి మని కీ. శే. కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులవా రొకవ్యాసమును వ్రాసి పరిషత్పత్రికలోఁ బ్రచురించిరి. వారి వాదము సరియైనదిగా నాకుఁ గాన్పింపకుండుటచే వారి యూహల విమర్శించుచు నొకవ్యాసమును వ్రాసి నేనును బరిషత్పత్రికలోనే దానిని బ్రచురించితిని. ఆవ్యాస మఱవమునందలి వింతయక్కరము తెలుఁగున నెన్నఁడును లేదని తెలుపునదిగా నున్నది. నావ్యాసముం గని మ. రా. రా. కానూరి వీరభద్రేశ్వరరావుపంతులవా రొకప్రతివిమర్శనము దానిపై వ్రాసి మరలఁ బరిషత్పత్రికయందే ప్రచురించిరి. వీరియెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నై యుండవలసి యున్నది. ఏమన నావిమర్శనముం గని లక్ష్మణరావుగారు ప్రతివిమర్శనయోగ్యము కా దని త్రోసివేసి రనియు నైనను దాము ప్రతివిమర్శన నొనరించుచుంటి మనియు వీరు వ్రాసియున్నారు. అంతియే కాక తమ ప్రతివిమర్శనము పదునాఱుపుటలు కలదియే యైయుండినను బదునెనిమిదిపుటల నావ్యాసమును వీరు పెద్దచేసి దీర్ఘవ్యాస మని వర్ణించిరి. అపూర్వప్రేమ యున్నచో సామాన్యవిషయములే పెద్దవి యగును గాఁబోలు! నావ్యాసమును బెద్దచేసి వర్ణించుటలో వీరెంత నైపుణ్యమును జూపినను దత్ఖండన మొనర్చుటలో బేలుతనమునే చూపిరి. మఱియును యుద్ధమల్లశాసనప్రశంసను దమచమత్కృతిచే మల్లయుద్ధశాసనవిమర్శగా మార్చి యాక్షేపపట్లులో నేనే చిత్ ఐనట్లు వ్రాసిరి. ఇంకను యుద్ధమల్లశాసనముం గూర్చిన మల్లయుద్ధము పూర్తికాలేదు. లక్ష్మణరావుగారు వింతయక్కరముంగూర్చి నాతోఁ బట్టుపట్టుట మానుకొనినను శాసనముం గూర్చిన మల్లయుద్ధము విడువక యాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలోను [illegible]పన్యాసమునను నాపైకి డీకొనిరి. నేను వారిధాటిని బ్రతిఘటించితిని. ఇంతలో వారు స్వర్గస్థులైరి. కాని వారిపక్షమున మఱికొందఱు నన్నెదుర్కొనుచున్నారు. వారికి నేను బదు లిడుచున్నాను. ఇట్లుండ

ఈవిద్యావిషయకవాగ్యుద్ధములో నేను చిత్తైనట్లు రావుగారు వ్రాయుట వింత ! ఇంతమాత్రముచేఁ బ్రతివాదు లప్పుడే యచిత్తైనట్లు నే నెన్నుకొనను. మూలవ్యాసమును వ్రాసిన లక్ష్మణరావుగారు స్వర్గస్థులైరి గదా యిఁక నీవిషయమై వ్రాయుట యెందు కని కొందఱకు సంశయము పుట్టవచ్చును. అట్టిసంశయముతోఁ బనిలేదు. వారిమూలవ్యాసమును నావిమర్శనమును లోకము నిమిత్తమై వ్రాయఁబడినవి గాని పరస్పరవైరము ప్రధానముగాఁ జేసికొని యొకరి కొఱ కొకరు వ్రాసికొనినవి కావు. "మరణాంతాని వైరాణి" అనున్యాయముచే వైరము లొక్కరు గతించిన నాఁగిపోఁదగినవి. విద్యావాదము లట్టివి గావు. ఇవి ధర్మనిర్ణయమున కగునవి కావునను వైరజనితములు కావు కాఁబట్టియును నెప్పుడును సరసమార్గము తప్పకుండ సాఁగఁదగినవే. అదిగాక నాయూహలపై విమర్శనము వ్రాసిన శ్రీవీరభద్రేశ్వరరావుగారు నావ్యాసమును మరల విమర్శింప నవకాశ ముండిన విమర్శింపనేవచ్చును. సత్యనిర్ధారణార్థమై నే నీవిమర్శన మిప్పుడు వ్రాయుట యనుచితము కాదు.

రావుగారివ్యాసము సత్యేతరోక్తులతోడను ననుచితవాక్యములతోడను నిండి నిస్సారమై యుండుటచే వారివాగ్ధాటికి సమాధాన మీయ నవసరము లేదని మొదట నెంచి వదలివేసితిని. ఇంతలో నీనడుమ విద్వద్వరు లగు మాధ్వశ్రీ చిలుకూరి నారాయణరావుపంతులవారు మరల నీవిలక్షణాక్షర ప్రశంస గావించుటచే లోకమున కీవిషయమై మఱియొక పరి తెలుపుట యవసర మని యెంచి యీవ్యాసమును వ్రాయుచున్నాను. సత్యరతులు గుణాగుణగ్రహణ మొనరింతురుగాక !

శ్రీరావుగారు ద్రావిడవిలక్షణాక్షరము మనభాషయం దున్నదా, లేదా యను విద్యావిషయమును బ్రధానముగాఁ జేసికొని తమవాదము సాగించుట లే దనియు నేను నావ్యాసమున ననేకము మోసపువ్రాఁతల వ్రాసియుంటి ననియు వానిని లోకమునకుఁ జూపుటకై తా మీప్రసక్తివిమర్శనమును వ్రాయుట తటస్థించిన దనియుఁ బ్రప్రథమమున లిఖించిరి. నా వ్రాసినదంతయు మోసపువ్రాఁత యని తేల్చుటయే వీరిప్రధానపాండిత్యమై యున్నది. ప్రధానవిషయవిమర్శన మంతగా లేదు. ఎత్తిపొడుపులు, నిందలు, పరిహాసములు హెచ్చుగాఁ గలవు. వారిదూషణపాండిత్యమును వారికే విడిచిపెట్టి

పూర్వ మాంధ్రాక్షరసమామ్నాయమున నఱపమునందలి యింతయక్కర ముండెడివా లేదా యనునంశమును బ్రధానముగాఁ జేసికొని యీవ్యాసము వ్రాయుచు మొసపువ్రాఁతల వ్రాసినవా రెవరో దానిని గూడఁ జూపుచుందును. విద్వద్వరు లగుచదువరులు న న్నందుకు మన్నింపవలెను. ఈవాదము మనవాఙ్మయమునకు మూల మగు నక్షరసమామ్నాయవిశేషముంగూర్చి ముచ్చటించునది కాన సరసముగ జరిగిన నీయది వాఙ్మయమున కెంతయో యుపయోగకరమైనది యగును. కాని శ్రీరావుగారు విషయమును విడిచి పెడత్రోవలఁ బట్టుచు వచ్చుటచే ననవసరచర్చలు గూడఁ జేయవలసి వచ్చినందుకు విచారముగా నున్నది. నేను లక్ష్మణరావుగారి వ్యాసముపై దుర్వృత్తిమూలముగ విమర్శనము వ్రాసినట్లు రావుగారు తేల్చిరి. అది ఘోరాసత్యము లక్ష్మణరావుగా రెట్టిభాషాభిమానముతోఁ దమవ్యాసమును లిఖించిరో యట్టిభాషాభిమానముతోడనే నేనును నావిమర్శనము వ్రాసినాను. నాకేవిధమగు దుర్వృత్తియును లేదు. నామొదటి వ్యాసములోఁ బ్రతివిషయమును విపులముగాఁ జర్చించియే యున్నాను. ఐనను దానిని సరిగా గ్రహించుకొనక శ్రీరావుగా 'రదరగొండము' చేసిరి. కావున మొదట నేను వ్రాసినదానిని బాగుగా బలపఱుచునూతనాంశములఁ బ్రకటించుచు రావుగారివాదవైరస్య మిందుఁ జూపుచున్నాను.

—• మన ప్రాచీనలక్షణలక్ష్యగ్రంథము లేమిచెప్పుచున్నవి? •—

ఒకధ్వని యొకభాషలో నుండెడివా లేదా యని విచారము వచ్చినపుడు దానిని దేల్చుటకుఁ బ్రాచీనవిరచిత లక్షణగ్రంథములును లక్ష్యగ్రంథములును మూలాధారములై యుండును. కాన నారెండుమార్గములఁ బరిశీలించి చూచుకొందము. ప్రతివాదు లీయక్షరము ప్రాచీనకాలమున నాంధ్రమున నుండెడి దని వ్రాసిరి. ఆకాలమున నియ్యది నిజముగ మన తెలుంగున నుండియున్నయెడల మనప్రాచీనాంధ్రలక్షణకారులు దీనింగూర్చి ముచ్చటించి యుండవలెను గదా ! వా రెవరను నట్లుచేయలేదు. ఎవరును నీయక్కరముంగూర్చి ప్రశంసింపలేదు. సత్యముగఁ బూర్వము మనభాషలో నీయక్కరముండియుండినచో వా రేల దీనిని విడుతురు? వారు భాషావ్యుత్పత్తిజ్ఞానశూన్యులు గారు. శబ్దశాస్త్రమం దపార మగు ప్రజ్ఞకలవారు. మనభాషలలో నున్నయక్షరముల స్థానాభ్యంతరాదులఁ జక్కగ నిశ్చయించి వర్ణముల నేర్పా

టుచేసి సరియగు వరుసను దెల్పియున్నారు. సంస్కృతాక్షరము లెవ్వియో యాంధ్రాక్షరము లెవ్వియో వివరించియున్నారు. ఆంధ్రమున లేని సంస్కృతాక్షరము లేవియో సంస్కృతమున లేని యాంధ్రాక్షరము లేవియో విభజించి చూపియున్నారు. ఇంతశబ్దశాస్త్రపరిజ్ఞానము గలమనపూర్వలాక్షణికులు మనభాషయందు ఱ అను వింతయక్కరము కలదని చెప్పియుండలేదు నిజముగా నావింతయక్కరము మనభాషయందప్పు డుండినచో వారేల చెప్పక విడతురు? వారు చూపిన ప్రత్యేకాంధ్రాక్షరముల తోడిపాటుగ దీనినిగూడ వారుగ్గడించియే యుందురు గదా! అట్లు వారు తెల్పియుండలేదు గావునఁ బ్రాచీనకాలమునందును నీవింతయక్కరము మనబాసలో లే దనుకొనుట యుచిత మని నే నిదివఱకు వ్రాసియుంటిని. నావాదము నంతను ఖండింపఁ గంకణముకట్టుకొనిన వీరభద్రేశ్వరరావుగా రీవిషయమున మాత్రము నావాదము నొకింత బాగుగఁ గాన్పించుచున్నదని యంగీకరించుచు మరల నిట్లధిక్షేపించిరి. "నాల్గవది మొదట హేతువుగఁ గాన్పించును గాని కొంచెము విచారించినయెడల నది హేత్వాభాస మని తెలియఁగలదు. లక్షణవేత్తలు దీనిఁ జెప్పనలేదఁట. ఏలక్షణవేత్తలు? 13 వ శతాబ్దమునకుఁ బూర్వపువారా? తరువాతివారా? తరువాత నీయక్షరమే భాషనుండి లోపించినపుడు తరువాతిలాక్షణికులు చెప్పకపోవుట సహజము కదా?"

పూర్వలాక్షణికు లెవ్వరో నేఁ జెప్పనప్పుడుగదా పంతులవారు పైప్రశ్నముల వేయవలసి యుండును? ఆపూర్వలాక్షణికు లెవ్వరో నేనే నావ్యాసమున విస్పష్టముగ 24 వ పుటయం దిట్లు పేర్కొనియున్నాను. "అట్లే తెలుంగునందును నుండినఁ బూర్వలాక్షణికులు నన్నపాథర్వణాదులు దానిం గూర్చి ముచ్చటించి దానిని భద్రము చేయువిధుల నేర్పాటు చేసియే యుందురు." ఇట్లు నేను నన్నపాథర్వణులఁ బేర్కొని యుండఁగా వారెవ రని శంకించుట యనుచితము నసంబద్ధమునై యున్నది. నేను జెప్పినవారిలో మొదటివాఁ డగునన్నపార్యుని 'ఆంధ్రశబ్దచింతామణి' మాటను గూడ మఱియొకవిషయముఁ దెల్పుసందర్భములో వీరెత్తుకొని యయ్యది నన్నపవిరచితముకాదని వీరేశలింగముపంతులవారు వ్రాసిరనియు దాని నెవ్వరు నేఁటివఱకు ఖండించి యుండలే దనియుఁ బ్రతివాదు లొప్పని గ్రంథముఁ బ్రమాణముగా నిచ్చుట ధర్మము గాదనియు నేమేమో వ్రాసిరి. వీరేశలిం

గముపంతులవారు నన్నయభట్టారకుఁడు వ్యాకరణము విరచింపలేదనియు భారతవిరచనము చేతనే యాతనికి శబ్దశాసనబిరుదము వచ్చినదనియు వ్రాసినమాట నిజము. ఆప్రవాహములోనే కొంతకాలమువఱకు నన్నపాదులమును బడినారము. కాని యిటీవల నయ్యది పూర్తిగ ఖండించివేయఁబడినది. దాని నెవరును సప్రమాణముగ ఖండించియుండలేదని వీరభద్రేశ్వరరావుగారువ్రాసినది పెద్దకల్ల. వీరేశలింగముగారు వ్రాసినదానినిబూర్తిగ ఖండించుచు "నన్నయభట్టీయము, బాలసరస్వతీయభాష్యము" అనుశీర్షికతో నొకవ్యాసమును పండితవరులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారును, శ్రీమాన్ రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారును వ్రాసి నళసంవత్సర శ్రావణమాసపుపరిషత్పత్రికలోఁ బ్రచురించియుండిరి. ఇట్టి విపులమైన ఖండన ముండినను గూడ వీరేశలింగముగారు వ్రాసిన దాని నెవ్వరును ఖండింపలేదని శాస్త్రి సం॥రములో వీరభద్రేశ్వరరావుగారు వ్రాయుట పెద్దమృష గాదంటునా? మఱియును వీరేశలింగముగారి వాదమునే యందఱును శిరసావహించుచున్నారని వీరభద్రేశ్వరరావుగారు వ్రాసిరి. ఇదియును బొంకే. వీరేశలింగముగారివ్రాతను శిరసావహించువారు లేకపోలేరు గాని బహు పండితు లావాదము నంగీకరించుట లేదు. వారివాదమును స్వబంధువులును పండితవరులు నగు మ. రా. రా. వెన్నేటి రామచంద్రరావుపంతులవారే యంగీకరింపక 'చింతామణి' నన్నయవిరచితమే యని తాము విరచించిన మనువసుచరిత్రరచనావిమర్శన మనుగ్రంథమున లిఖించిరి. ఆంధ్రవాఙ్మయచరిత్రాదులును నన్నయభట్టీయము నన్నయభట్టు వ్రాసినదే యని నుడువుచున్నవి. బహువిమర్శకు లట్లేవ్రాసిరి, యింకను వ్రాయుచున్నారు. అది యటు లుండనిండు. ఆంధ్రశబ్దచింతామణి నన్నపార్యుఁడు వ్రాయలేదని వీరేశలింగముగారు గదా వ్రాసిరి. ఈవిషయమున నాప్రతివాదులట్లువ్రాయలేదే? ఇందు నాప్రతివాదులు కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు కాని వీరేశలింగముగారు కారు. "ప్రతివాదు లొప్పని దానిని నీవెట్లు ప్రమాణముగాఁ దీసికొందువని రావుగారు నన్నడుగుట యనుచితము. లక్ష్మణరావుగారు వీరేశలింగముగారితో బహువిషయములలో నేకీభవించువారే యైనను నన్నయభట్టు వ్యాకరణము వ్రాయలేదనియు భారతరచనముచేతనే యాతనికి శబ్దశాసనబిరుదము వచ్చినదనియుఁ దలంచుటలో వీరే

శలింగముగారితోఁ గలియలేదు. ఆవాదమును తమ హిందూదేశకథాసంగ్రహములో నిట్లు ఖండించివేసిరి. "ఈనన్నయభట్టు ఆంధ్రభారతములోని మొదటి రెండుపర్వములు పూర్తిగను మూఁడవపర్వము కొంతవఱకును రచించెను. ఇదియుఁగాక ఆంధ్రవ్యాకరణ మొకటి రచించి శబ్దశాసనుఁ డన్న బిరుదు వహించెను. నన్నయభట్టు వ్యాకరణము రచింపలే దనియు భారతము రచించినందున నాతనికి ఈపేరు వచ్చె ననియు రావుబహాదరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి యభిప్రాయ మై యున్నది. కాని తెలుఁగు బాసలోని మొదటి సీసపద్య మనఁదగు భారతములోని ప్రథమ సీసపద్యములోనే నన్నయభట్టు తనకు శబ్దశాసనుఁ డన్నబిరు దున్నటులు వ్రాసికొనుటచే నాతనికి శబ్దశాసనుఁ డనుబిరుదు భారతరచనమువల్ల వచ్చె నని చెప్పుట పొసఁగదు. అతఁడు భారతరచనకుఁ బూర్వమే వ్యాకరణము రచించె నని స్పష్టపడుచున్నది. సంస్కృతములో శబ్దశాసన మనఁగా వ్యాకరణ మని యర్థము. వ్యాకరణమహాభాష్యము 'అథశబ్దానుశాసనమ్' అను సూత్రములోఁ బ్రారంభ మగుచున్నది." నన్నయభట్టారకుని గూర్చి తాము వ్రాసిన పుస్తకమునఁగూడ వీరిట్లే లిఖించిరి.

ఇట్లు నాప్రతిపక్షు లగులక్ష్మణరావుగారే వీరేశలింగముగారి వ్రాఁతను ఖండించివేసియుండఁగా నట్టి ఖండితవాదము నాధారముగాఁ జేసికొని వీరభద్రేశ్వరరావుగారు 'చింతామణి' నధిక్షేపింపఁబోవుట వింతను బుట్టించుచున్నది. వీరేశలింగముపంతులువారిటీవలఁ దమ నూత్నసంపుటములోఁ దమప్రాఁతవాదమును నిలుపుకొనఁ గొంత ప్రయత్నించిరి గాని యది యంత సహేతుకముగ లేదని పలువుర తాత్పర్యము. బహుపండితు లిప్పటికిని నన్నయభట్టీయము నన్నయభట్టవిరచితమే యని యంగీకరించుచున్నారు. పత్రికలలో నిప్పటివ్రాఁతలఁ జూచువారల కిది విశదమే. ఈనన్నయభట్టీయ మఱవము నందలి వింతయక్కరముఁగూర్చి యేమియును ముచ్చటించుట లేదు. నన్నయభట్టారకుని నాఁటి కాయక్కరము తెలుఁగు బాసలో నుండిన నావిపులశబ్దానుశాసనుఁ డాయక్కరముం గూర్చి తన శబ్దానుశాసనమున ముచ్చటించియే యుండును.

ఇక రెండవలాక్షణికుఁ డగు నథర్వణునిఁ గూర్చి ముచ్చటించుకొందము. ద్వితీయాచార్యుఁ డనఁబడు నీయథర్వణుఁడు వ్రాసిన యాంధ్ర

వ్యాకరణములందుఁ గూడ నక్షరంబులఁగూర్చిన వివరము విపులముగఁ గలదు. ఈయవి శకటరేఫాదులం గూర్చి ముచ్చటించుచున్నవి. కాని యు అవమునందలి యీవింతయక్కరముం గూర్చి యేమియును ముచ్చటించుట లేదు. వీరభద్రేశ్వరరావుగారు రెండుమూలలము చేతనో వీనిమాటనే తల పెట్టరైరి. సత్యమగు భాషాభిమాను లట్లుచేయవలసినది కాదు. అధర్వణుని వీరేశలింగముగారు తిక్కనకంటె నర్వాచీనునిం జేయ నొకసందర్భముఁ బ్రయత్నించినను మొత్తముమీఁద నన్నప, తిక్కనల నడిమివాఁడని తెలిపి యుండిరి. కొందఱు నన్నపార్యునికంటెఁ బ్రాచీనుఁ డనికూడఁ దలంచుచున్నారు. ఇట్టి లాక్షణికాగ్రణిం గూర్చి యేల వీరభద్రేశ్వరరావుగారు మౌనముద్ర వహించిరో తెలియవచ్చుటలేదు. అఱవమునందలి వింతయక్కరము 13 వ శతాబ్దము తరువాత మన తెలుంగున లోపించిన దని ప్రతివాదులు వాదించుచున్నారు గావునఁ బైలాక్షణికుల లక్షణగ్రంథము లలో నీవింతయక్కరము లేకుండుట వారికి బాధకము కాకపోలేదు. 'చింతామణి' నన్నయవిరచితము కాదను దుర్బలవాదమును తెచ్చిపెట్టుట చేతను నధర్వణుని గూర్చి మౌనముద్రను వహించుటచేతను దమ వాదమునకు బలము కలుగునని ప్రతివాదులు తలంచుట వింతగనున్నది.

## —• ఆంధ్రభాషాభూషణముంగూర్చి •—

కేతనకృతాంధ్రభాషాభూషణమును బైరెండు లక్షణగ్రంథముల తర్వాతఁ బ్రాచీనముగా మనము తీసికొనవలసినదే. ఈలక్షణగ్రంథరాజము కూడ మన ప్రతివాదుల వాదమునకుఁ బ్రతికూల మగుసాక్ష్యము నిచ్చుచున్నది. ఇందు సంస్కృతాక్షరముల ప్రశంసయే కాని యాంధ్రాక్షరప్రశంస లే దను తలం పుండుటచే మనవీరభద్రేశ్వరరావుగారు తమఖండనములో దీనింగూర్చి యిట్లు ముచ్చటించి యుండిరి. "అంతకుఁ బూర్వపు లాక్షణికులు చెప్పలే దందురా ? వారెవరు ? కేతన యొక్కఁడే. అతఁడు తన 'ఆంధ్రభాషాభూషణము' నందు ఆంధ్రాక్షరముల వివరము వేఱుగఁ జెప్పనేలేదు. సంస్కృతవర్ణములే చెప్పెను గాన ఱ ను గుఱించి మాత్రముచెప్ప లేదనుటకు వీలులేదు" ఇది సత్యమగు వ్రాఁతకాదు. కేతనసంస్కృతాక్షరములనుగూర్చి మాత్రమే ముచ్చటించుచున్నా నని యెచ్చటను వ్రాయలేదు. సంస్కృతాక్షరముల నాతఁడు పూర్తిగ నెచ్చటను వివరించియుండలేదు.

క. ఆనులు స్వరములు నచ్చులు, కాదులు రాగిన వ్యంజనములు హల్లులునఁగా
మేదిని నెల్లెడఁ జెల్లును గాదులఁ బైనైదు కూర్పునగు వర్గంబుల్''

అనిమాత్ర మతఁడు వ్రాసినాఁడు ఎ, ఒ, అరసున్నలు అచ్చుల లోఁ బడును. శకటరేఫము రేఫముతోఁ జేరి హల్లులలోఁ బడును. రేఫము లఘ్వలఘుభేదముచే రెండురూపము లందిన దని గదా పూర్వలాక్షణికులు తెలిపిరి. చ, జ, లే దంత్యతాలవ్యభేదముచే రెండువిధము లైన వని గదా యాచార్యులు వక్కాణించిరి. కాన 'ఆనులు' 'కాదులు' అనినప్పుడు నాం ధ్రమున వాడుకలోనున్న యక్షరము లన్నియు ననియే కేతనతలంపు. కావుననే యవసరము వచ్చినచోటులనెల్లఁ గేవలాంధ్రాక్షరములం గూర్చి యాతఁడు తనవ్యాకరణములో ముచ్చటించియే యున్నాఁడు ఎట్లన:—

అఱసున్నంగూర్చి :—ఈ కేవలాంధ్రాక్షరముం గూర్చి కేతన తన వ్యాకరణములో నిట్లు వ్రాసినాఁడు.

క. కుఱుచలపై యరబిందులు, నెఱయఁగ నూఁదినను జెల్లునిడుపులమీఁదన్
నెఱయవు పద్యంబులలో, నెఱబిందువులందు గద్యనికరములోనన్.

క. ననుఁగను నన్నంగను దా, ఘనుఁడు ఘనుండనఁగఁ జెల్లుఁ గవ్యానుమతిచేఁ
దనుఁబోఁటి లోభివాఁడితఁ, డన నిడుపులమీఁదిబిందు లరబిందులగున్.

ఎత్వముంగూర్చి :—ఈయచ్చాంధ్రాక్షరముం గూర్చి తనశబ్దాను శాసనములో నిట్లు వ్రాసినాఁడు.

క. ముదమున నాయీయేలను, పదములతుద నూష్మలుడుగఁ బైవర్ణముతో
నదుకునెడఁ గుదియు సాగును, గుదియునెడన్ జడ్డ్రవాలగుం బైహల్లుల్.

క. ఆకామిని యక్కామిని, యీకాఁడు కిక్కాఁడుకునాఁగ నీయూరియ్యూ
రేకార్యం బెక్కార్యం, బాకథ యక్కథ యనఁగ నుదాహరణంబుల్.''

ఒత్వముంగూర్చి :—ఈయచ్చ తెనుఁగక్షరముంగూర్చి యిట్లు వ్రాసెను.

గీ. ప్రార్థనార్థంబుచోటను బ్రశ్నచోట, సంశయంబుండుచోట నిశ్చయము
చోటఁ, దెగడుచోటను నేత్వంబు తెనుఁగునందు, నోయొలందును సం
శయంబొందుచోట.

క. పోవే వానలుగలవే, నీవే ననుఁ బిలిచి తిరుగు నియతుం డతఁడే,
నీవుపాలియ వేయమృతమొ, క్రొవును విషమో యనఁగ నుదాహరణంబుల్

శకటరేఫముంగూర్చి :—లాక్షణికాగ్రగణ్యు లగుపాణిన్యాచార్యా దులు తకారము నిద్వర్ణముగా గ్రహించినరీతిగా నీతఁడు శకటరేఫద్వయము నిత్సంజ్ఞగాఁ దీసికొని తనవ్యాకృతియందిట్లు దెల్పియున్నాఁడు.

క. వ్రుఱ్ఱగు నుఱ్ఱాంతముపై, ముఱ్ఱగు నఱ్ఱంతశబ్దములపై రెంటన్
దుఱ్ఱగుఁ బురుషాఖ్యలపై, నఱ్ఱుఱ్ఱగు నట్టియెడల నభినవదండీ.

ఇట్లు రేఫమునకుఁ ద్విత్వ మీలక్షణకారునిచేతనే తెలుపఁబడియున్నది. లఘురేఫమున కెన్నఁటికిని ద్విత్వములేదు కదా. కావున శకటరేఫ మీతనిచే వేఱుగఁ దెల్పఁ బడినట్లు తేలుచున్నది.

ఈవిధముగా సందర్భము వచ్చినచోటుల నెల్లఁ గేవలాంధ్రాక్షరములం గూర్చి తనవ్యాకరణములో కేతన ముచ్చటించుచునే వచ్చినాఁడు. కాన నాతఁడు మొదట 'ఆదులు' 'కాదులు' అని నంతమాత్రమున నచ్చతెనుఁగచ్చరము లాతనిదృష్టిలో లే వనఁ జనదు. పాణిన్యాచార్యులవారక్షరసమామ్నాయము నిచ్చుసందర్భములో అ, ఇ, ఉ, ణిత్యాదిసూత్రములఁ దీసికొనిరి. అంతమాత్రముచే వారివ్యాకరణములో ఆ, ఈ, ఊ లోనగు దీర్ఘములప్రశంస లే దనవచ్చునా ? సందర్భానుసారముగ వారు వానింగూర్చి యుగ్గడించియే యున్నారు. అట్లే యిందుఁగూడ గ్రహించునది.

వింతయక్కరముంగూర్చి :—అజవముసందలి వింతయక్కరము కేతననాఁటికి మన తెనుఁగున నుండియున్నచో దానిఁగూర్చి యాతఁ డవసర మగుచోట ముచ్చటించియే యుండును. తనవ్యాకరణములో నాయక్కరముంగూర్చి పేర్కొనవలసినచోటు వచ్చినది. ఐనను నాతఁడు తదక్షరముంగూర్చి యొంతమాత్రమును వక్కాణించియుండ లేదు. ఆసందర్భమే దన.

'డ' కారము 'ళ' కారమగుట:—ఇందునుగూర్చి కేతనయిటులు వ్రాసె.

క. రుబుకుశి లంత్యములైనన్, లులనడఁచి తదంత్యములకుళ్ళగుబహుత్వం
బలుగోళ్లని కొనవ్రేళ్లని, కలగూళ్లక లేళ్లనాఁగఁ గ్రమమైయునికిన్

ఈ సూత్రములో బహువచనబోధకముగా 'ళ్లు' యేయేశబ్దాంత్యాక్షరములకు వచ్చునో తెలుపఁబడియున్నది. అవి యేవి యన.—

'రు' (గోరు-గోళ్లు) 'లు' (వ్రేలు-వ్రేళ్లు) 'డు' (గూఁడు-గూళ్లు) 'డి' (లేడి-లేళ్లు) అనునవియై యున్నవి. ఈతనికాలమునాఁటికి 'కోడి' యున్న గుశబ్దము

లు డాంతములుగాక మనవింతయక్కరముతోఁ గూడినవే యగునెడల నా వింతయక్కరముం గూడ నీతఁ డీసూత్రమున నిచ్చియే యుండును. మనరావుగారు మున్నగువారు తెలుఁగున నా వింతయక్కరము గలపదములకు బహువచనము పరంబగునపుడు తుది వింతయక్కరము 'ళ్లు' అగునని తెల్పిరి. వా రట్టిపదము లని తెలిపినవానికి బహువచనములో 'ళ్లు' వచ్చుట మనము చూచుచునే యున్నాము. 'కోటి' కోళ్లగుటకుఁగాని, 'ఏలు' ఏళ్లగుటకుఁగాని యభినవదండి వేఱుసూత్ర మిచ్చియుండలేదు. రు, లు, డు, డి, లలో నీవింతయక్కరమును జేర్పలేదు. ఇఁక నాంధ్రభాషాభూషణముం బట్టి 'కోటి' కోళ్లగుట యెట్లు? ఈవింతయక్కర మంతమందుఁ గలశబ్దములు తెలుఁగులో నుండియుండినయెడలఁ దనసూత్రములో రు, లు, డు, డి, ల తోడిపాటుగా టి, ఱు లఁ జేర్చియే యుండును. అతనికాలపు నున్నయాంధ్రసారస్వతముననంగాని, లోకవ్యవహారముననంగాని మన వింతయక్కర ముండినయెడల దాని నాతఁడు సూత్రములోఁ జేర్చియే యుండును. లేదు కావుననే బహువచనమున 'ళ్లు' వచ్చునంత్యములపట్టికలో నీయక్కర మాతఁ డిచ్చియుండలేదు. తనసూత్రముచేతనే 'కోడి' మున్నగుశబ్దములు కోళ్లులో నగు బహువచనరూపముల నందునని యాతనిభావమని స్పష్టమగుచున్నది. మన మిప్పుడు ముగ్గురులాక్షణికులంగూర్చి ముచ్చటించుకొనినారము. వారే నాయుదాహరించినప్రాచీనులు. వారెవరన, 1 నన్నపాచార్యుఁడు, 2 అథర్వణాచార్యుఁడు, 3 అభినవదండి. వీరలు సందర్భమువచ్చినను మనవింతయక్కరము తెలుఁగునఁ గలదని తెలిపియుండలేదు. వీరు ప్రాచీనులని మన ప్రతిపక్షులును నంగీకరించియున్నారు. శబ్దతత్త్వవేత్తలగు నీలాక్షణికులు తమలక్షణగ్రంథములలో నీ యక్కరముంగూర్చి ముచ్చటింపలేదు గావున నియ్యది ప్రాచీనకాలమునందునను మనతెలుఁగున లేదని మనము నిశ్చయించుకొనుట ధర్మము.

మనలక్షణకారు లీయక్షరమునూటఁ దలపెట్టకపోవుటకుం గలకారణమేమి? అది యుండిన వారేల దానిపేరు నెత్తరు? తెనుఁగునందు వలెనే యీయక్కరము కన్నడమునందును గలదనియు నయ్యది తరువాత నుభయభాషలనుండియు వశించిన దనియు మనప్రతివాదులు వాదించుచున్నారు. కన్నడమునఁ బూర్వ మిదియుండెడి దనుటకుఁ దల్లక్షణకారుఁడగు కేశిరాజు

ను, తద్విరచితశబ్దమణిదర్పణమును మనలక్ష్మణరావుగారు క్రిందిరీతి నుదాహరించియుండిరి. "కేశిరాజు అనువాఁడు 13వశతాబ్దమున శబ్దమణిదర్పణమను లక్షణగ్రంథ మొకటి కర్ణాటకభాషకు వ్రాసియున్నాఁడు. అప్పకవి శకట రేఫము కలశబ్దములకు జాబితా వ్రాసిన ట్లీతఁడును 'ఱ'కారముగల శబ్దముల పట్టిక యొకటి యిచ్చినాఁడు. శబ్దమణిదర్పణమందలి ౧వఅధ్యాయములోని ౨౩వ సూత్రము చూడనగును. కర్ణాటకవ్యాకరణములందుఁ గలమనవింత యక్కరముం గూర్చిన పెద్దపట్టికలవంటి పట్టికల శకటరేఫముంగూర్చి యొసంగ శ్రమదీసికొనిన మనపూర్వలాక్షణికు లావింతయక్కరముంగూర్చి యేమియు వ్రాయక విడుచుటకుఁ గత మేమి? కేశిరాజువలెనే మనకేతనయు 13వ శతాబ్దమున నున్నాఁడు. తనతోడి కాలపువాఁడగు కేశిరాజు తన కర్ణాటవ్యాకరణములో మనవింతయక్కరము గలశబ్దముల పట్టికనిచ్చియుండఁగా మనకేతన యీయక్కరముంగూర్చియే ముచ్చటింపకుండుట యెట్లు సంభవించును? మనవారీయక్కరముంగూర్చి ముచ్చటింపకుండుటకుఁ గల కారణ మయ్యది మనసారస్వతమున నెప్పుడును లేకుండుట యని మనము గ్రహించుకొనవలసియున్నది. అంతకు మించిన హేతు వేదియును గానరాదు.

లక్ష్యగ్రంథములంగూర్చి:—మనప్రాచీనలక్షణగ్రంథములం బరిశీలించిచూడ నీయక్కరపుజాడ మనవాఙ్మయమునఁ గాన్పింపకుండుటయేగాక ప్రాచీనలక్ష్యగ్రంథములఁ బరికించిచూచినను నీవింతయక్కరము మనయాంధ్రమయప్రపంచమున లేదనుటకుఁ దగిన ఋజువులే కాన్పించుచున్నవి కాని కలదనుటకు నాధారములేవియుఁ గాన్పించుటలేదు. మనలక్ష్మణరావుపంతులవారు మొదలగువారీవింతయక్కరముతోఁ గూడినశబ్దములని వేని నుదాహరించిరో యయ్యవి 'డ'కారముతోఁ గూడినవో మనవింతయక్కరముతోఁ గూడినవో తెలిసికొనుటకు నొకయాధారము కలదు. మనభాషయందుఁ గలప్రాసనియమ మీవిషయమున మనకుఁ దగు సాహాయ్య మిచ్చుచున్నది. కనుఁడు.

ఏడుశబ్దముంగూర్చి:—సప్తసంఖ్యం దెలుపు నేడుశబ్దమునందలి తుది యక్కరము మనవింతయక్కర మని ప్రతిపక్షులు తెలుపుచున్నారు. మన ప్రాచీనమహాకవు లగునన్నయ, తిక్కనాదులకృతులం గన నీయది యట్టిదిగాఁ గాన్పించుటలేదు. (1) నన్నయాచార్యుఁడాదిపర్వమున,

శా. ఏడక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్
రూడిం గౌరవసైన్య మీయుభయమున్ రోషాహతాన్యోన్యమై
యీడంబోవక వీఁకమైఁ బొడువఁగా నేపారుఘోరాజి న
ల్లాడెన్ ధాత్రి శమంతపంచకమునం గష్టాదశాహంబులున్.

సకలభాషావాగనుశాసనుం డగుమనయాదికవి 'ఏడు' శబ్దమునందలి తుదియక్కరమును 'డ'కారప్రాసమునఁ బెట్టియున్నాఁడు. కావున నీశబ్దము పూర్వకాలమందు 'డ'కారధ్వనితోఁ గూడియున్నది కాని మనవింతయక్కరపుధ్వనితోఁ గూడియున్నది కాదు.

(2) ఇంకనుఁ గవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజి తనశాంతిపర్వమున "ఏడుదీవులయందు గ్రీడాగతులఁ దనరథము చలింప నరాతులనఁగ" నని 'ఏడు'శబ్దమునందలి ద్వితియాక్షరమునకును, క్రీడాశబ్దమునందలి ద్వితీయాక్షరమునకుఁ బ్రాసమైత్రిఁ గూర్చె. కాన నీశబ్దము మనప్రాచీనవాఙ్మయమునఁ గూడ 'డ'కారయుతమే కాని విలక్షణద్రావిడాక్షరయుతము కాదు.

కోడిశబ్దముంగూర్చి—ఇదియును మనప్రాచీనవాఙ్మయమున 'డ'కారముతోఁగూడినదిగాఁ గాన్పించుచున్నది కాని వింతయక్కరముతోఁ గూడినదిగాఁ గాన్పించుటలేదు. ఏమన, తిక్కనమహాకవిశిష్యుఁ డగు మారనమహాకవి యిట్లువ్రాసె.

గీ. కోడి నూరఁబందిఁ బేడిఁ జండాలుని, నక్కఁ గుక్కఁ గృతకనారిఁ బతితు
ననఘు పిల్లి నెలుక నాశౌచి సూతిక, నంటినతఁడు నీళు లాడవలయు."

ఇందును కోడిశబ్దము నందలి ద్వితీయాక్షరము 'డ'కారప్రాసమునఁ బడినది కావున నీశబ్దము 'డ' కారముతోఁ గూడినది కాని వింతయక్కరముతోఁగూడినది కాదు. కర్ణాటాదిభాష లందు నీవింతయక్కరమునకును 'డ'కారమునకును నెన్నఁడునుఁ బ్రాసమైత్రి లేదు. కావున నిజముగ మనభాషయందును నీయది యుండిన నయ్యది 'డ'కారముతోఁ బ్రాసమైత్రి లేక యుండవలెను. మనభాషయం దట్లు గాక 'ఏడు' 'కోడి' లోనగుపదముల తుదియచ్చరములు మనప్రాచీనవాఙ్మయమున 'డ'కారముతోఁ బ్రాసమైత్రి కల్గియున్నవి. కావున నయ్యవి మనవాఙ్మయమున నాదినుండియు 'డ'కారయుతములే యని తెలుచున్నది. కోడిశబ్దమునందలి ద్వితీయాక్షరోచ్చారణ మెట్టిదియో భంగ్యంతరముచేఁ గూడఁ గనుఁగొందము.

కోడిశబ్దవ్యుత్పత్తి—కోడిశబ్దవ్యుత్పత్తిం గన నిది మొదట డకారయుతమే యని యుఁ దరువాత కోఁటి కోళి, అనురూపముల నందినదనియుఁ దెలియకపోదు. మనశబ్దశాస్త్రజ్ఞులు సంస్కృతమందలి కుక్కుట శబ్దము నుండి కోడి శబ్దము పుట్టినదని వ్రాసియున్నారు. ఈకుక్కుట శబ్దమే మహారాష్ట్రములో 'కోమ్డు'అను రూపమునందినది. ఇట్టి ప్రాకృతరూపములనుండి కోడి శబ్దము పుట్టియుండును. ఏకవర్గమునందలి టకారము డకార మగుట వింతకాదు. ఈయంశమును నేనిదివఱకే వ్యక్తీకరించియుండ నందుకు శ్రీ రావుగారు నన్ని ట్లధిక్షేపించిరి.

“అయినను దమవిషయముకాని యిట్టి వ్యుత్పత్తిశాస్త్రమునందు దిగి బ్రహ్మయ్యగా రెట్లు హాస్యాస్పదులైరో చూతము. ‘కుక్కుట’ శబ్దములో నుండి ‘కోడి’ పుట్టినదఁట ! ఇంకను బ్రహ్మయ్యగారు కృతయుగమునాఁటి వ్యుత్పత్తులనే పట్టుకొని పెనఁగులాడుచున్నారు. ఈ రెండుశబ్దములకును నొక్క ‘క్’ కారము పోల్కి దప్ప వే ఱేమియు సమానములేదు. ‘కుక్కుటము’ నందు మూఁడక్షరములు, ‘కోడి’యందు రెండు. సంస్కృతపదము అకారాంతము, తెలుఁగుపదము ఇకారాంతము. కుక్కుటశబ్దము కోడి యగుటకుఁ బూర్వము ‘కుట’ ‘కుడ’, ‘కుడి’ ఇత్యాదివికారములను నాయాకాలములందుఁ జెంది యుండవలెనుగదా ! వానిని వీ రెచ్చటనయినఁ జూపఁగలరా ! అట్లుచేయక యందొకపొల్లు, ఇందొకపొల్లు కలిసినంత మాత్రమున నందుండి యిది పుట్టినది యని యన్నయెడల నెందుండి యేమిపుట్టనేరదు ? కోడినుండియే ‘కుక్కుట’ మేల పుట్టియుండఁగూడదు. సమానప్రతికక్షు గల యిట్టియుక్తులవలన నేమి ప్రయోజనము ? ”

ప్రతివాదు లిట్టినిరంకుశవాదమునుఁ జేయుచున్నా రేమిచెప్పవలయును ? మనశబ్దశాస్త్రకారులు వ్రాసినదానినిఁ బ్రమాణముగాఁ దీసికొని నందులకే నేను హాస్యాస్పదుఁడ నగుదునేని మనపెద్దలెంతహాస్యాస్పదులు కావలసియుందురు? తప్పువ్రాఁతలు వ్రాసిన నెవ్వరైనను హాస్యాస్పదులు కావలసినదే యందురా, అవు నది సత్యమే కాని పైవ్యుత్పత్తి నిచ్చుటలో మనవారి తప్పేమున్నది ? ‘కోడి’ శబ్దమునకు వీరు మూలముగా నీయఁబోయిన ‘కోళి’ శబ్దము ‘కుక్కుట’ శబ్దభవమని కర్ణాటభాషాలక్షణకారులు వ్రాసియున్నారు. కేశిరాజకృతశబ్దమణిదర్పణములోఁ దద్భవములఁ జెప్పుచోట—

,,ఉకారక్కౌత్వం — కుక్కుట—కోటి
కురంట—గోరటి
సువాసిని—సోవాసిణి

అత్త్వక్కౌత్వం — ఆషాఢ—ఆసడి, అసడి
కంబల—కంబళి
కుక్కుట—కోటి

అనియున్నది. ఇట్లుండ నాయాభాషల సాంప్రదాయము బాగుగ నెఱుఁగని మనరావుగారయ్యది ,కుక్కుట' శబ్దమునుండి పుట్టలేదనుట మహాసాహసము కాదా ? ,చోడ' శబ్దముంగూర్చి యఱవవా రేమందురో యది మనకు ముఖ్య మనువాదమునకు దిగురావుగారు తమ 'కోళి' శబ్దముంగూర్చి కర్ణాటకులు నఱవలు నేమిచెప్పుచున్నారో యదిప్రధానమని భావించుకొనవలెను గాని తద్వ్యతిరిక్తముగా స్వీయాభిప్రాయములఁ బ్రకటించి వింతప్రసిద్ధినందుట యుక్తమా ? 'కోడి శబ్దమునుండియే కుక్కుటశబ్దము పుట్టినదనరాదా యని వీరడిగిరి ! ,,ముఖమస్తీతి వక్తవ్య'' మ్మను న్యాయమునను సరించిన నేదియడిగినను నడుగవచ్చును. కృతయుగమునాఁటి వ్యుత్పత్తులఁ బట్టుకొని పెనఁగులాడకఁ దమ నవమేధచేఁ గలికాలపు టపూర్వవ్యుత్పత్తులఁ బుట్టించు నీయపూర్వపండితుల యభినవవ్యుత్పత్తిశాస్త్రగమనికం గనుఁడు. అఱవమున ,గాప్పియ' శబ్దమొకటి గలదు. ఈయది సంస్కృత,కావ్య' శబ్దభవ'మని లక్ష్మణరావుపంతులవారే వ్రాసియున్నారు. 'కావ్య'శబ్దము రెండక్షరములు గలది. ,గాప్పియ'శబ్దము మూఁడక్షరములుగలది మొదటిది ,క' కార మాదిని గలది. రెండవది ,గ' కార మాదిని గలది. మొదటిది యిద్రహితము. రెండవది యికారసహితము. మొదటిది వకారయుతము. రెండవది పకారద్వయయుతము, ,కావ్య' శబ్దము ,గాప్పియ' మగుటకు ముందు ,కావియ' ,గావియ' ,గాపియా' దిరూపము లంది యుండవలయును గదా. వానిని వీరు చూపకయే ,కావ్య'శబ్దమునుండి ,గాప్పియ'శబ్దము పుట్టినదనుట నేమనవలెనో చదువరులే యూహించుకొనెదరుగాక. ,కావ్య'శబ్దమునుండి ,గాప్పియ' శబ్దము పుట్టిన దనవేల ? దీనినుండి యది పుట్టిన దనరాదా ? ఇట్టి భేదము లుండఁగా అండ్రాకపోల్లు ఇంద్రాకపాల్లు కలిసినంతమాత్రమునననంహండి యిది పుట్టినది యని యన్న రెండల నెందుండి యేమి పుట్టనేరదు

అనిన నీవవమేధావు లేమనెదరో! 'కుక్కుట', శబ్దము 'కోడ్డాది రూపముల ద్వారముగా కోడి యెట్లయినదో ప్రాకృతవ్యాకరణసూత్రోదాహరణపూర్వకముగా నేను నాతొలివ్యాసములో విస్పష్టముగ వ్రాసియే యున్నాను. కావున నీవిషయమై యింక పెంచి వ్రాయవలసిన యవసరములేదు. కర్ణాటకులును నాంధ్రులును గూడ కుక్కుటశబ్దమునుండియే తమతమపదములు పుట్టినవనుకొనుచున్నారు. అదియట్లుండ నఱవమునందలి 'కోఱి' నుండి తెలుఁగు 'కోడి' పుట్టినదనుకొననేల? దీనినుండి యది పుట్టినదనుకొనరాదా! అ అవరూపమే మూలమనుటకు వీరు చూపిన కారణము నిలుచునదికాదు కావున, 'కోడి' శబ్దము ప్రాచీనాంధ్రమునను 'డ' కారయుతమనుకొనుట యే సర్వవిధముల సమంజసమైయున్న దని యాంధ్రలోకమునకు విన్నవించుకొనుచున్నాఁడను.

—లక్ష్మణరావుగారివాదము సరిక్రొత్తవాదముకాదా—

నేఁటివఱకెవ్వరును నీయక్షరము తెలుఁగున నున్నదని వాదింప మొదలిడలేదు. ఈయంశమును నే నిదివఱకుఁ దెలిపియుండఁగా రావుగారు నన్నిట్లధిక్షేపించిరి. "'ఱ' అను నక్షరమును నిదివఱ కన్ని శాసనములలోను బూర్వలిపిజ్ఞు లందఱును 'డ' అని చదువుచువచ్చి రనియు, దానిని శ్రీలక్ష్మణరావుగారు మాత్రము ఱ అని చదివిరనియు వ్యాసమునందంతటను బ్రహ్మయ్యశాస్త్రిగారు మరలమరల వ్రాసియున్నారు............ఇది నిజము కాదు. కేవలము రామయ్యగారు, వేణుగోపాలచెట్టిగారు తప్ప మఱియందఱు పూర్వలిపిజ్ఞులును, ఈయక్షరమును పూర్వపశ్చిమచాళుక్యరాజుల శాసనములలో నన్నిటిలోను ఱ అనియే చదివిరి గాని 'డ' అనియెవరును చదివియుండలేదు."

ఇట్లు రావుగారు వ్రాసినదానిం బట్టి లక్ష్మణరావుగారి వాద మసత్యమైపోవుచున్నది. ఏమన తెలుఁగున నీవింతయక్కరము కలదని కనుఁగొనుటలో తామే యుపద్రష్టల మని యు నింతకుఁ బూర్వ మెవ్వరు దీనిని మనవాఙ్మయమున నున్నట్లు కనుఁగొని యుండలేదనియు లక్ష్మణరావుగారు తమవ్యాసములోఁ బ్రప్రథమముననే యిట్లువ్రాసిరి. "కాని యీధ్వనియు నక్షరంబును తెనుఁగున నెన్నఁడైన నుండెనని యెవరు ననుకొనలేదు. ఈశాసనమువలన నాసంగతి క్రొత్తగ మనకుఁ దెలియుచున్నది. కావున నీశాస

నయోగ్యత హెచ్చైన దని యెంచవలెను.''

ఇట్లు లక్ష్మణరావుగారు తెనుఁగున నీయక్కఱ మున్నదని యెవరు నిదివఱ కనుకొనలేదనియును గ్రొత్తగ యుద్ధమల్లశాసనపరీక్షాసందర్భమునఁ దాము గ్రహించితి మనియుఁ జాటుకొని యుండుటచే వీరే యీ వింత యక్కఱమును గ్రొత్తగఁ గనిపెట్టిన వారనియు నిదివఱ కెవరును దీనిని గనుఁగొని యుండలేదనియు నేను వ్రాసితిని. లక్ష్మణరావుగారిని నమ్మి నేనట్లు వ్రాసినాను. ఇప్పుడు వీరభద్రేశ్వరరావుగారి వ్రాఁతలవలన సుప్రసిద్ధ పూర్వలిపిజ్ఞులగు హుల్ ష్, కీల్ హార్న్, వెంకయ్యగారు, కృష్ణశాస్త్రిగారు, రైస్ మొదలైనవారు తమకంటె మున్నె తాముదాహరించిన పదములలో మనవింతయక్కఱ మున్నట్లు కనుఁగొని యుండఁగా వారి పరిశోధనములనే యాధారముగాఁ జేసికొని యిందుల కుదాహరణముల నిచ్చిన లక్ష్మణరావుగారు దానిని కనుఁగొనినవారి నామముల దాఁచిపెట్టి ప్రకటింపక విడిచి పైఁగా నీయక్కఱ మాంధ్రమున నున్నదనియు నిదివఱ కెవరును కనుఁగొనలేదనియు ను వ్రాయుట ఘోరాసత్యము కాదా! ఈసందర్భమున మోసమే యున్న దను నెడల నయ్యది లక్ష్మణరావుగారియం దున్న దనవలసి వచ్చుచున్నది. పైవ్రాఁతలు లక్ష్మణరావుగారు వ్రాసియుండఁగా వానిని నమ్మి లక్ష్మణరావుగారే యిందుల కుపద్రష్టలని యెంచి నేను వ్రాసినవ్రాఁత మోసపువ్రాఁత యనుట యనుచితము. తప్పంతయు లక్ష్మణరావుగారి దగుచున్నది. ఇందు నాతప్పేదియు ను లేదు. అదియట్లుండ నిండు. రావుగారుదహరించిన హుల్ ష్ మున్నగు లిపిశాస్త్రజ్ఞు లెల్లరును నిప్పటివారే. ప్రాచీనులు కారు. ప్రాచీను లెవ్వరు నీయక్కఱ మాంధ్రమున నున్న దని యనలేదు. ఇప్పటివారు పూర్వకాలపు స్థితులను బూర్వులకంటె నెక్కుడు సరిగఁ దెల్పఁగలవారు కారు.

## —ఈసందర్భములో రావుగారి సాహసోక్తి—

మనప్రాచీను లగు నన్నయాచార్యాదులు లక్ష్మణరావుగారి వింతయక్కఱము తెనుఁగునఁ గలదని తమలక్షణగ్రంథములలోఁ జెప్పలేదు గావునను దమలక్ష్యగ్రంథములలో వింతయక్కఱమునకు మాఱుగా ఁడ,ళారమునే వ్రాసి యుచ్చరించిరి కావునను నీయది ప్రాచీనాంధ్రములో లేదని తెలిపినవాఁడను నేను ఇక్కాలపువారు ప్రాచీనాంధ్రములో వింతయక్కఱ ము

న్నదనిరి కావున నయ్యది ప్రాచీనాంధ్రములో నుండెనని వాదించువారు ప్రతివాదులు. సత్యమిట్లుండఁగా నవీనులవ్రాఁతను బట్టి ప్రాచీనకాలమున వింతయక్కఱము లేదను కువాదమునకు నేను దిగినట్లుగ మనరావుగా రీక్రిందిరీతిని వ్రాసిరి. «ఇప్పుడు లేదు గనుక నెప్పుడును లేదఁట. ఈభావము బ్రహ్మయ్యగారి వ్యాసమునందంతటను నిండియున్నది. ఈవింతవిపరీతవాదమే నిజమైనయెడల నేఁటికన్నడమునందు ఱకారము లేదు.ఱ లేదు. కావునఁబూర్వమెన్నఁడును లేదు అని చెప్పవలసియుండును. ఇది యనుభవమునకును శాస్త్రమునకును విరుద్ధముగదా! నేఁటి సీతారామాచార్యులవారు నేఁటితెలుఁగున ఱ ఉచ్చారణగల గుర్తు లేనందున, దానిని సూచించుటకు నఱవమందలి యక్షరమునె వాడినంతమాత్రమున ౧౨ వ శతాబ్దమునకుఁ బూర్వము కూడఁ దెలుఁగులో నీయుచ్చారణకావలసివచ్చినప్పుడు, అఱవయక్షరమునే వాడుచుండిరి. వేఱుగుర్తు లేకయుండెను, అని వాదించుట యేతర్కశాస్త్రమో మీమాంసయో మే మెఱుఁగము.»

ఇప్పుడు లేదు గనుక నప్పుడును లేదనియు సీతారామాచార్యులవారఱవమునందలి ఱ గుర్తునే వాడినందునఁ బూర్వమింపుల కీగుర్తును లేదనియు నే నెచ్చటను వ్రాసియుండలేదు. ఇయ్యది చదువరులఁ బెడత్రోవలఁ బెట్టుటకై రావుగారు వ్రాసిన మోసపువ్రాఁత. నే నప్పుడును ఇప్పుడును కూడ లేదని ఋజువు చేసినాను. సీతారామాచార్యులవారి ప్రశంస లక్ష్మణరావుగారి వాద మభినవ మనుటకై తీసికొనివచ్చితినే గాని వా రఱవాక్షరము, వాడియుండిరి కావున నయ్యదియే గాని పూర్వమందుఁ గూడ మఱియొకటి లేదనుటకుఁ గాదు. ఆచార్యులవారు గొప్పపరిశోధకులు. ద్రావిడాదిభాషల నెఱింగియున్నవారు. గొప్పనిఘంటుకారులు. ప్రౌఢవ్యాకరణము రచించినవారు. అర్ధానుస్వార శకటరేఫాదులఁ దెలుపు గ్రంథముల వ్రాసినవారు. వైకృతదీపిక నొనరించినవారు. ఇట్టిపరిశోధకులు గూడ నాంధ్రమున మన వింతధ్వని యున్నట్లు చెప్పలేదు. ఆధ్వని వచ్చినప్పు డఱవాక్షరమునే వాడిరి. 'ఆంధ్రశబ్దచింతామణి' కర్త మొదలు ప్రౌఢవ్యాకరణకర్తవఱకు ననఁగా నాఁటినుండి నేఁటివఱకు నీయక్కఱ మాంధ్రమునఁ గలదనువాదము లేదనియు లక్ష్మణరావుప్రభృతు లభినవముగాఁ దెచ్చినవాద మనియు నేను లోకమునకుఁ దెలిపితిని. నా వ్రాసినదానికి విపరీతార్థమును చేసి లోకవంచనము

చేయు రావుగారు కడఁగిరి. నామొదటివ్యాసము చూచిన చదువరులకు సత్యము తెలియఁగలదు.

ఇప్పటిలిపిశాస్త్రజ్ఞు లందఱు దీని నంగీకరించిరా :—మనప్రాచీనపరిశోధకులును, వారిపద్ధతి ననుసరించిన నవీనపరిశోధకులును నీవింతయక్కరము మనభాషలో నున్న దని చెప్పకపోవుటయే గాక లక్ష్మణరావుగారివంటి నవీనపరిశోధకులు గూడ మొదట నీయక్కరము మనభాషలో లేదనియే వ్రాసిరి. ఈవిషయమై కాల్డువెల్ దొరవా రిట్లు లిఖించిరి :—

"This sound does not now exist in Telugu, and it cannot clearly be proved that it ever had it"

ఇప్పు డీయక్కరము తెలుఁగున లే దనియుఁ బూర్వమున నున్న దనుటకుఁ గూడ నేబుజువును కాన్పించుట లే దనియు దీనితాత్పర్యము.

కాల్డువెల్ దొరవారు లక్ష్మణరాయప్రభృతులవలెనే ప్రాచీనశాసనపరిశోధన గావించి తమసిద్ధాంతముఁ దేల్చినవారు. కాన వీరి నుదాహరణముగా నిచ్చుటకుఁ గారణమైనది. దీనింబట్టి నవీనపరిశోధనముం జేయు నవీనరీతిని ద్రావిడభాష లన్నిటిని బరిశోధించువారుఁగూడ మొదటఁ బ్రతివాదుల వాదమునకు వ్యతిరేకవాదము చేసిరనియే తేలుచున్నది.

—♦ పరదేశపండితనింద ♦—

శిలాశాసన ప్రాచీనగ్రంథాది పరిశీలనపూర్వకముగ దక్షిణదేశము నందలి భాష లన్నిటిని బాగుగఁ బరిశోధించి శబ్దవ్యుత్పత్తిశాస్త్రప్రశంస గావించుచువచ్చిన పండితవరులగు కాల్డువెల్, బర్నెల్ మున్నగువారి వాక్యములఁ గూడ నేనుదాహరించుచు రాఁగా నాపండితులా వీరికిఁ బ్రమాణ మని వారినిఁ గూడ మన నిష్కళంకపండితశిరోమణి తల్లజు లగురావుగారు పరిపరివిధములఁ బరిహసించి తృణీకారభావముఁ జూపుచువచ్చిరి. ఇది యుచితముకాదు. పాశ్చాత్యపండితులు మనవాఙ్మయపరిశోధనవిషయమునఁ జాల శ్లాఘ్యమగుపని చేసి మనకన్నుల *దెఱచియుండిరి. వారు వ్రాసిన దెల్లను నన్నితావులఁ బరమప్రమాణము కాకపోవచ్చును. ఎచ్చట నైనఁ

* శబ్దవ్యుత్పత్తిశాస్త్రమునకు కాల్డువెల్ గ్రంథము మూలాధారముగా నున్నది. విద్యాశాఖవారు దీనినిఁ బట్టపరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నియమించుచున్నారు. ప్రాజ్ఞులెల్లరు దీనిని గౌరవించుచున్నారు. కన్నడభాషాచరిత్రము వ్రాసిన రైసుగారును వీరిని మెచ్చుకొనిరి.

గొన్ని ప్రమాదము లుండి యుండవచ్చును. అట్టిదోషములను మనము సప్ర మాణముగా నవసర మగుచోట్ల ఖండించి సత్యము వెల్లడి చేయవలసినదే కాని యాపండితులా మనకుఁ బ్రమాణమని స్థూలదృష్టితోఁ గట్టకట్టి త్రోసి వేయఁ దగినది కాదు. లక్ష్మణరావుగారి విజ్ఞానసర్వస్వములో నక్షరములం గూర్చిన వ్యాసములో బుహ్లర్ దొరవారు పురాతనలిపిశాస్త్రజ్ఞశిరోమణి యని శ్లాఘింపఁబడియుండిరి. చి॥ తాడ సభాధ్యక్షోపన్యాసములో మనవా ఙ్మయమునకు మహోపకారమొనర్చిన ప్రథమగణ్యులలో బ్రౌను దొరవా రొక్కరుగ లక్ష్మణరావుగారిచే నెన్నఁబడిరి. రైసు మున్నగువారిని మన రావుగారే స్తుతించిరి. కావున నకారణముగ కాల్డువెల్ మున్నగువారిని వీరునిందించుట యనుచితము. తమ కనుకూలురఁ బరమప్రామాణికులుగ భావించి వ్యతిరేకముగాఁ జెప్పినవారిని దూషించినంతనఁ దమవాదమునకు బలము కలుగ నేరదని ప్రతివాదులు గ్రహించుకొనవలెను. నవీనపరిశోధ కు లగు శ్రీరామయ్యగారు ను, వేణుగోపాల చెట్టిగారు ను కూడ మనప్రతి వాదులకుఁ బ్రతికూలురే గదా!

—♦ అభినవవాదదౌర్బల్యము ♦—

ఇయ్యది లక్ష్మణరావుగారు తీసికొనివచ్చిన దైనను హూల్ షు మున్న గు లిపిశాస్త్రజ్ఞులు తెచ్చిపెట్టిన దైనను గూడ నభినవవాదమే యగును. ఇది ప్రాచీనుల యూహలకు విరుద్ధముగా నున్నది. ఐనను నిందేమైన బల ముండినయెడల నంగీకరింతు మనినను నదియును గానరాదు. పొరపడి ప్రా చీనులు విడిచిన యంశములను నవీనులు నూతనముగాఁ దెలుపవచ్చును. వానియందు యాథార్థ్యమున్నయెడల వానిని మనము గ్రహింపవచ్చును. అట్టియాథార్థ్య మేదియు నిందుఁ గాన్పించుటలేదు. ప్రతివాదులు తెచ్చిన ఋజువు లన్నియు మిక్కిలి దుర్బలములు. ఇఁక వారివాదదౌర్బల్య మిూ క్రిందఁ జూపుచున్నాను.

—♦ లిపివిషయములో ♦—

మనప్రాచీనాంధ్రలిపిలో 'డ' కారమున కొకసంజ్ఞ వేఱుగ నుండగఁ గర్ణాటాదిభాషల సాదృశ్యముంబట్టి చూడ నీవింతయక్కరమే కలదనఁదగు నాంధ్రపదము లేవో వానినిఁ దెల్పునప్పుడే మఱియొక సంజ్ఞ వాడఁబడి యున్నది. కావున మేమీవింతయక్కరము మనప్రాచీనాంధ్రమున నుండెడి

దని తెల్పితిమని మనప్రతిపక్షులు వాదించుచున్నారు. ఏపదములను మేము వింతయక్కరముతోఁ గూడిన వనినామో అవియెప్పుడును నావింతయక్కరముతోనే ప్రాచీనశాసనములందుఁ గాన్పించుటకుఁ గారణ మేమని వీరభద్రేశ్వరరావుగా రడుగుచున్నారు. నిజముగా వీరు చెప్పు విలక్షణాక్షరయుతము లనుపదములు ప్రాచీనశాసనములం దెప్పుడును నావిలక్షణాక్షరముతోనే వ్రాయఁబడుటయు సుప్రసిద్ధ 'డ'కార మని ప్రతివాదు లొప్పుకొనిన 'డ'కారరూపముతో వ్రాయఁబడకుండుటయుఁ దటస్థించుచో వారి వాదమునందుఁ గొంతసార మున్న దనవచ్చును. కాని వీరు విలక్షణాక్షరోపేతము లని చెప్పినపదములు కొన్నికొన్నితావుల విలక్షణాక్షరము లనఁబడు రూపములతోడను మఱికొన్నితావులఁ బ్రతిపక్షాంగీకృత 'డ' కార రూపములతోడను గాన్పించుచున్నవి. ఉదాహరణముల నిచ్చుచున్నాఁడ.

## —• చోడశబ్దముంగూర్చి •—

చోడశబ్దము వింతయక్కరముతోఁ గూడిన దని మనప్రతివాదులు వాదించుచున్నారు. కాని యీపదము మనప్రాచీనశాసనములలోఁ గొన్నితావులఁ బ్రతిపక్షాంగీకృత 'డ'కారరూపముతోఁ గాన్పించుచున్నది. శక్తివర్మ పభుబఱ్ఱుశాసనము ప్రాచీనలిపియం దున్నదని శ్రీరామయ్యపంతులవారు వ్రాసిరి. ఇట్టిశాసనమున 41వపంక్తియందు 'వేపితంచోడభీమేన' అనుపదములలో 'చో'తరువాతను 'డ'కారరూపమే కాన్పించుచున్నది. అట్లే 'జటాచోడ' (44వపంక్తి) శబ్దమునందలి యక్కరమును 'డ'కారసంజ్ఞాయుతముగనే యున్నది. నిజముగ నీ'చోడ'శబ్దము వింతయక్కరముతోఁ గూడిన దగుచో నీప్రాచీనలిపిలో 'డ'కారము వ్రాయఁబడుటకుఁ గారణ మేమి? ఈశబ్దము వింతయక్కరము గలదియే యగుచో ప్రాచీనశాసనము లన్నిఁటియందును విలక్షణాక్షరోపేత మయియే యుండవలెఁగదా. అట్లు లేదు. ఇది యట్లులే దని శ్రీవీరభద్రేశ్వరరావుగారును నెఱుఁగుదురు. కావుననే దీనింగూర్చి తమవ్యాసములో నిట్లువ్రాసిరి. "పెక్కుశాసనములలో 'చోఱ'శబ్దము 'ఱ'కారయుతము." పెక్కుశాసనములలో నననేల? కొన్నిటిలో మాత్రము మఱియొక యక్షర మెట్లు వచ్చును. ఈశబ్దవిషయమునఁ బ్రాచీనశాసనములన్నియు నొక్కవిధముగ లేవనియుఁ గొన్ని వింతయక్కరముతోఁ గూడియున్న వనియు మఱికొన్ని 'డ'కారముతోఁ గూడియున్న

వనియు నీ రెఱుంగుదురు. అయినను జదువరుల మోసము చేయుటకై సత్యము గప్పిపెట్టి ‘పెక్కు’ శబ్దమును శరణముగాఁ గొని పెక్కుశాసనములలో ‘చోఱ’ శబ్దము ఱకారయుత మని వ్రాసిరి. ఎన్నిటిలో ‘డ’ కారయుతమో యెన్నిటిలో విలక్షణాక్షరయుతమో మనము లెక్కింపఁ బనిలేదు. కొన్నిటియందైన ‘చోడ’ శబ్దము ‘డ’కారయుత మగుచో ప్రతివాదుల వాదము పడిపోవునుగదా! అదియటులుండ, మనరావుగారు మాత్రమే యిది పెక్కుచోట్ల ‘ఱ’ కారయుత మనిరి, కాని, లక్ష్మణరావుగా రట్లనలేదు. “తెలుఁగుశాసనములలోఁ గూడఁ గొన్నిచోట్ల ‘ఱ’ అను నక్షరముతోఁ గూడ వ్రాయఁబడియున్నది.” అని ‘కొన్ని’ శబ్దమునే లక్ష్మణరావుగారు వాడిరి. లక్ష్మణరావుగారిని మించి ‘పెక్కు’ శబ్దమును వాడి యీరావుగారు చదువరుల మోసముచేయుచున్నారు.

—◆ తాడపశబ్దముంగూర్చి ◆—

ఈశబ్దము ప్రాచీనలిపులలో నెట్లువ్రాయఁబడుచున్నదో శ్రీలక్ష్మణరావుగారే ఆరుంబాకతామ్రశాసనముంగూర్చి వ్రాయుసందర్భమున నిట్లు లిఖించిరి. “ఈశబ్దము శాసనములలో తాఱప, తాలప, తాడప, తాళప అనురూపములతోఁ గానవచ్చుచున్నది. పెక్కుశాసనములలో ‘తాఱప’ రూపము కనఁబడుచున్నది.” ఇట్లు తాడపశబ్దము కొన్నిప్రాచీనశాసనములందైన వింతయక్కరముతోఁ గూడియుండక ‘డ’ కారముతోఁ గూడియుండుటకుఁ గారణమేమి? ఈచోడ, తాడపాది శబ్దములు వింతధ్వనికలవియే యగుచో నావింతధ్వనిని తెలుపునక్కరము వేఱుగనుండఁగ దానితో లేఖకులు వ్రాయక ‘డ’కారముతో నేలవ్రాయుదురు? ఇది ‘డ’కారధ్వనియుతము గాకుండినచోఁ బిచ్చివారైన నట్లు వ్రాయరు కదా! కావున లక్ష్మణరావుగారు వింతధ్వనిఁ దెలుపుదానినిగా నెంచు ‘ఱ’యును, ‘డ’కారరూపమును గా నెంచు ‘డ’యును ‘డ’కారధ్వనిని దెలుపు సంజ్ఞలనుకొనుటధర్మము. శ్రీలక్ష్మణరావుగారు తాడప, తాఱప అను రెండురూపములున్న వని తెలుపుటతోఁ దృప్తినొందక తాలప, తాళప, అనురూపములు కూడ నున్నవని లిఖించిరి. తుది రెండురూపములును నెంచఁ బనిలేదు. ఏమన, సాధారణముగా ‘డ’కారమే లకారళకారము లగుచుండును. మఱియును లళలు ‘డ’ యగుచుండును. లిపిశబ్దమునుండి పారసీభాషలోని ‘డిపి’ పుట్టిన

దందురు. ఇది వేదమునాఁటినుండియుఁ గలదు. 'అగ్ని మీడే పురోహితం,' 'అగ్నిమీళే పురోహితం,' 'అగ్నిమీలే పురోహితం' అని చెప్పవచ్చును. తెలుఁగున క్రాడులు, క్రాళులు' లేడులు, లేళులు మున్నగు నుదాహరణ ములఁ జూచుకొనునది. కావున 'తాడప' 'తాళప' 'తాలప'లగుటలోఁగాని వింత యేదియును లేదు. కావునఁ 'చోడ' 'చోళ,' 'చోల'లగుటలోఁగాని వింత యేదియును లేదు. కావునఁ బ్రాచీనశాసనములందలి లిపులను బట్టి చూచినను నస్మద్వాదమునకు భంగ ములేదు. విశేషించి జయము కలుగుచున్నది.

—•'ఱ'యొక్క ధ్వనియేది •—

ఈయక్షరముతోఁ గూడిన ఏఱు, కోఁడి మున్నగుశబ్దములు 'డ'కారధ్వని గలవానినిగా నన్నపాదిప్రాచీనకవు లుచ్చరించుటను గనుఁగొనినాము. మఱియును చోడ, తాడపాది శబ్దములను ప్రాచీనలేఖకులు 'డ'కారయుత ములుగా వ్రాయుటఁ గనుఁగొనినాము. కాఁబట్టి యీవిలక్షణాక్షరము ప్రాచీనకాలమున 'డ' కారధ్వనిని దెలుపుటకే యుపయోగింపఁబడినట్లూ హించుటయే ధర్మము, ఇట్లుండ రావుగారు "ఇచ్చట ప్రస్తుతవిషయ మేమ న మొదట ౧౨వ శతాబ్దము వఱకు 'అఱుపు' 'చోళ,' 'ఏఱు' మొదలైన శబ్దంబులు అఱవకన్నడదేశంబులలో నెట్లుచ్చరింపఁబడుచుండె? ఎట్లు లిఖిం పఁబడుచుండె? అట్లే తెనుఁగులిపిని (అనగా నప్పుడు తెలుఁగుదేశమునకు గన్నడదేశమునకు సామాన్యమైన తెనుఁగుకన్నడలిపిని) వ్రాయఁబడుచుం డెనేని తెలుఁగుదేశమందున నాశబ్దము లట్లేయాకాలమం దుచ్చరింపఁబడు చుండె నని నిశ్చయింపవలెను." అని వ్రాయుట వింతకాదా? అసత్యపు వ్రాఁతలు వ్రాసి ప్రతిపక్షులు లోకప్రతారణ మెంతకాలము చేయఁగలరో! ఆంధ్రదేశస్థ విబుధమండలి 'డ'కారధ్వనితోఁ జోడ,కోఁడ్యాదిశబ్దముల వాడు చుండుట నెఱిఁగియున్న మనము కర్ణాటవిబుధు లాయాపదముల నెట్లుచ్చ రించిరో దానింబట్టి యాయాపదముల యుచ్చారణ నిర్ణయముచేయవలయు నఁట. ప్రతివాదుల వాదమిట్లు హాస్యాస్పద మగుచున్నది.

'డ' యనకుండిన నర్థమునకై యన్యభాషకుఁ బరుగులిడవలసివచ్చుట.

ప్రాచీనాంధ్రమున నీవిఁతయక్షరము లేదనుటకే యవకాశములు కాన్పించుచున్నవి గాని యున్నదనుటకు నాధారములు కనఁబడుటలేదని పై నుదాహరింపఁబడిన యంశములవలనఁ దెలిసికొనియున్నాము. అంతటితోఁ

బోలేదు. ఆవింతయక్కరము మనతెలుఁగునఁ గలదనినఁ బెక్కులగు ననర్థ ములుఁ గూడ వాటిల్లుచున్నవి. కనుఁడు :—

యుద్ధమల్లశాసనమున ‹ లింగం బడిసిన పాపంబు › అని కలదు. దీనికర్థము చేయుటకై లక్ష్మణరావుగారు రఱవములోనికిఁ జనవలసివచ్చినది. ఆభాషయందు ‹ అఱ్ఱి' యను ధాతువు కలదనియు నదియే కన్నడమందు నుండెననియు గాన నిట్టిది మున్ను తెలుఁగునం దుండియుండు ననియూహింతు మనియు వారు వ్రాసిరి. ఈ ‹అఱ్ఱి ధాతువు తెనుఁగునం దెచ్చటను గాన్పించుటలేదు. తెనుఁగు భాషయందున్న యీశాసనమునందలి ‹ అటిపుట › అను శబ్దమునకుఁ దెలుఁగు భాషం గల ధాతువులఁ బట్టి యర్థము చేయక యది విలక్షణాక్షరోపేత మగుటకై తెనుఁగున లేని కేవలద్రావిడధాతువులంబట్టి యర్థమును సాధింతురంట. అఱవమునందలి ధాతువులం గని మన ముబ్బి తబ్బిబ్బగుటవలన లాభ మేమి ? అఱవమునను గన్నడమునను నీధాతు వున్నది కాన నిందును నుండి తీరవలయు ననుట యేటిధర్మము ? ‹‹మూలమాతృభాషలోని పురాతనరూపములు కొన్ని యఱవములోను గొన్ని తెనుఁగులోను నుండిపోయినవి › అని గదా మనరావుగారు వ్రాసిరి ! కావున నా ధాతువు మన తెనుఁగులో గాన్పింపనప్పు డయ్యది యఱవమున నిలిచియున్న దనియు తెనుఁగులో నిలువలేదనియు తలంచుటే ధర్మముగదా.

మనలో నా ధాతు వున్న దనుట కవకాశ మే మయిన నున్నదా ? ఎచ్చటను గాన్పించుటలేదు కదా! వింత యక్కరముతోఁ గూడిన ధాతువు మనలో లేదు కాని మనభాషయందు ‹ అడుచు › ధాతువొకటి 'డ› కారయుతమైనది కలదు. దానికిని ననేకార్థములు కలవు. కిటెల్ దొరవారు 'అఱ్ఱి› శబ్దమునకు బహ్వర్థములఁ దెలిపిన రీతిగా బ్రౌనుదొరవారు తమనిఘంటువులో మనయడుచుధాతువునకు నీక్రిందిరీతిని ననేకార్థముల నిచ్చియుండిరి. ‹‹ అడుచుట or అడంచుట V. a. To beat, Strike, break, to destroy. కొట్టుట, నశింపచేసుట.›› వినాశము చేయుట లోనగునర్థముల నిచ్చు నీయడుచు ధాతువునన్నయభట్టారకాది ప్రాచీనులకాలమునఁ గూడ ‹డ› కారయుతముగనే యున్నది. ఈధాతువును శబ్దశాసనుఁడు ‹డ› కారయుతముగనే తనభారతములోనిట్లు వాడినాఁడు.

"చ. అడిచిన( దిట్టిసన్ మఱిమహోపరమంబులు పల్కి యల్కతో(
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం
జెడు నిహముం బరంబు నిది సిద్ధము గావు లెఱింగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తముల( బూజలు సల్పుడు నల్లనోడుదున్.॥"

ఇట్లు వినాశ మనునర్థమును గూడ నిచ్చు 'అడుచు' ధాతువు మన భాషయం దుండ(గా దానిని విడనాడి యజ్ఞానమునందలి యా ధాతువుకై పరువులిడ నేల ? మనభాషయం దది యుండెడి దని నిరాధారవు టూహాల( జేయ నేల ? 'అడుచు' ధాతు వగుచో 'అడిచిన' అని యుండవలెను గాని 'అడిసిన' యని యుండవచ్చునా యందురా యీశాసనమం దొకయక్కర మునకు మఱియొకయక్కరము వాడుట సర్వసామాన్యమై యున్న దని లక్ష్మణరావుగారే వ్రాసిరి. లోకమున సామాన్యముగా చూచెనా? యను టకు చూసెనా ? యనియు కాచిన యనుటకు కాసిన యనియు పూచిన యనుటకు పూసిన యనియు ననుట వాడుకయైయున్నది. 'డచ్చి' యనురూ పమున కే 'డస్సి' యున్నదనియు మనవీరభద్రేశ్వరరావుగారే వ్రాసిరి. కాన శాసనలేఖకులు 'అడిచిన' యనుటకు అడిసిన యనుట వింతకాదు. డప్పియ డిపుట అని మూలమున నుండ(గా దాని యర్థమునకై మనప్రతివాదు లఱ వములోనికి( బరువు లిడుచున్నారు. అట్లు చేయనేల? 'డప్పియడుచుట' యనిన 'దప్పిదీర్చుట' యనునర్థము మనభాషయందు లేదా? మనభాషయం దలి 'అడుచు' ధాతురూప మనినను సరియగునర్థము వచ్చుచున్నది కావున నట్లెంచుటయే ధర్మము.

—• 'డ'ను 'ట'చేసిన నున్నయర్థము కూడ నూడును •—

యుద్ధమల్లశాసనములో 'ఒట్టుడస్సి' యను ప్రయోగము కలదు ఈ 'డస్సి'ని గూర్చి రామయ్యపంతులవారీక్రిందిరీతిని వ్రాసిరి.

"'డస్సి—(పం౧౮) డయు ధాతువు క్త్వార్థకరూపము' ఇచ్చుటసకర్మ కముగా బ్రయోగింపబడినది. ఇయొట్టుడస్సి యన(గా నీయొట్టును క్షీణింపజేసి పాటింపక యని యర్థము. ఒట్టుతప్పియనియు( జెప్పవచ్చును." ఈ రీతిగ నర్థవంత మయియున్న 'డస్సి'శబ్దమును మన లక్ష్మణరావుపంతులవారు తమవాదసౌకర్యార్థమై 'టస్సి' చేసిరి. ఇట్లు చేసిన నర్థమేమి? అర్థము వ్యర్థము. ఏమన, 'టస్సి' యనువింత యక్కరముతో( గూడిన ధాతువు మనభాషలో(

గాన్పించుటలేదు. ఇఁక దానికి మనభాషయం దర్థముండుట యెట్లు? లేదు; ఉండనేరదు; పోనిండు 'డ'ను 'ట' చేసి యర్థమునకై యఱవమునకుఁ బరువులిడుచున్నాము. కావున నీశబ్దవిషయముఁ గూర్చి దానియందం జేయుదు మనినను లాభము లేకున్నది. ఏమన, మనలక్ష్మణరావుగారే దీనికి మూలము అఱవమునందుఁ గాని, కన్నడమునందు గాని కానరాలే దని వ్రాసిరి. వారివాక్యమునే యుదాహరింప నిచ్చుచున్నాను. «ఇందలి మొదటిశబ్దమునకు మూలము అఱవమునందుగాని, కన్నడమునందుగాని కానరాలేదు» అని. కొంతనాలుకకు మందువేయుఁగా నున్ననాలుకయూడిన దన్నట్లు నూతనాక్షరసంపాదనమునకై పెనఁగులాడ నున్నయర్థముకూడ నూడినది.

— ♦ పరాశ్రయముపాలు గావలసివచ్చుట ♦ —

యుద్ధమల్లశాసనమున తమతాత మల్లపరాజు వేరడు అనియుండఁగా దానింగూర్చి మనలక్ష్మణరావుగారిట్లు వ్రాసిరి.

“యుద్ధమల్లునిశాసనమున ౩౯, ౪౦ పంక్తులను రామయ్యపంతులుగారు 'తనతాత మల్లపరాజు వేరడు దానుం గట్టించె' అని చదివియున్నారు. 'వేరడు' అనుశబ్దము సందేహముగ నున్న దనియు వ్రాసినారు. ఈ 'వేరడు' అనువానిని 'వేరఱు' అని చదువవలయు నని నాతాత్పర్యము. రామయ్యగారు 'డు' అని చదివిన అక్షరము 'డు' కాదు. 'టు' కాదు. అక్షరగీటు స్పష్టముగ గానవచ్చుచున్నది. కాన నది 'ఱు' అనుట స్పష్టము. కావున నీశబ్దము 'వేరఱు' అననేమి? మూలశబ్దము 'పేరఱు.' ఇందలి పకారము వకారముగ మారిన దని నాతాత్పర్యము. ౪౯ వ పంక్తిలో 'ప్రత్యక్ష' శబ్దము 'వ్రత్యక్షము' అని వ్రాయఁబడినది. అట్లే యిదియు నని యూహింపఁగునది. ఇఁక 'పేరఱు' అన నేమి యని విచారింతుము. ఇందు పెఱ్ + అఱు అను రెండు శబ్దములు కలవు. పెఱ్ అనగా పెద్ద, అఱు అనగా ధర్మము. పెఱ్ శబ్దమునకు పెద్ద అను అర్థము. అఱవము, కన్నడము, తెలుగు అను మూఁడు భాషలయందును కలదు. అఱు అను శబ్దము తెనుఁగున గానరాదు. మిగిలిన రెండుభాషలలోను కలదు. కన్నడమున 'అఱు' అనురూపముననే కలదు. అఱవమున 'అఱ' అనురూపమున నున్నది. ఈమాటలకు నాయాభాషలలో ధర్మము, దానము అని అర్థము. కావున 'వేరఱు' అనగా గొప్పధర్మము అని యర్థము చేయవలెను.»

లక్ష్మణరావుగారు ధర్మమను నర్థముగల 'అఱు' శబ్ద మఱవము నందును కన్నడమునందును గాన్పించుచున్నది గాని తెనుఁగున గాన్పించుటలేదని యంగీకరించియును గూడఁ దెనుఁగుభాషయగుచున్న 'పేరఁడు' శబ్దమున కర్థము చేయుటయందు నఱవభాషను శరణముగాఁ గొని పెద్దధర్మ మని యర్థము చెప్పిరి! ఇంతకంటె వింత యుండఁగలదా! అఱవబాసను బట్టి యా యాంధ్రశాసనమున కర్థముచేయుట!! అది యనుచితము. మఱియును 'తమతాత మల్లపరాజు పెద్దధర్మము తాను గట్టించె' అనిన సమన్వయమే కాన్పించుటలేదు. కాన నయ్యది 'పేరఱు' కాదు. శ్రీరామయ్యగారు చదివినట్లుగా 'పేరఁడు' (పేరిడి) అనునదియే. ఈశాసనమున సాధారణముగా నొకస్వరమునకు నింకనొకస్వరము పడుటకలదు. (పైవారలనుటకు పయ్యావరలు, తాత యనుటకు తత, ప్రత్యక్షమైయున్న యనుటకు ప్రత్యక్షబయున్న, దానికి కలశమిడ్డట్లనుటకు దానికి కలశబిడ్డట్లు, మున్నగునవి యుదాహరణములు కావున 'వేరఁడు' అని మూలములో నున్నదానిని 'పేరిడి' అని మనము చదువుకొనవలెను. 'ప'కు 'వ' వచ్చిన దని లక్ష్మణరావుగారే వ్రాసిరి. కావున మూలమునందున్న వాక్యమును 'తమతాత' మల్లపరాజు పేరిడి తాను గట్టించె అని చదువుకొనవలెను. ఈ 'పేరఁడు' శబ్దమునందున్న తుది యక్షరము 'డ'కారమే. కాని లేఖకుని లేఖిని క్రిందిచెవు వెనుకకుఁ దగులుటచే నడ్డుగీటు పడినట్లున్నది. అంతియకాని యడ్డుగీటు కాదు.

ఇట్లు సమస్తభాషాసాంకర్యము తెచ్చిపెట్టి యర్థము వ్యర్థమైనను లక్ష్మణరావుగా రఱవమునందలి వింతయక్షరమును దెనుఁగులోఁ బలవంతముగాఁ జొప్పింపఁ బ్రయత్నించిరి. మూలభాషలోని శబ్దములుకొన్ని యొకభాషలోను, మఱికొన్ని మఱియొకభాషలోను నిలుచుచు వచ్చిన వని చెప్పు ప్రతివాదులు ద్రావిడభాషలోని 'అఱు' శబ్దము తెనుఁగునం గూడ నుండి తీరవలె నని యెట్లు చెప్పఁగలరో తెలియవచ్చుటలేదు.

—♦ వింతయక్షరము గలపదముల కన్నిటికి నఱవమునుండి యు మూలములు లభించెనా? ♦—

లక్ష్మణరావుగారు తెనుఁగునఁ గనిపెట్టిన మనవింతయక్షరముతోఁ గూడినపదముల కన్నిటికి నఱవమునందును గన్నడమునందును మూలము లున్నవని వీరభద్రేశ్వరరావుగా రొకయసత్యప్రకటనము చేసి [illegible]

రణము సల్ప సాహసించిరి. ఇది మహాసాహసము. ఈక్రింది పదములలో వింతయక్కరము కల దని లక్ష్మణరావుగారు వ్రాసిరి. ౧ ఴస్సి, ౨ అఴపిన, ౩ అఴిపుట, ౪ బోఴిమ, ౫ చోఴి, ౬ వఴు, ౭ వేఴంబా, ౮ ఴచ్చిన, ౯ బాఴు కొడకు ౧౦ పఴకి ౧౧ కొఴచుకొన్న. ఈపదునొకండుపదములలోను నేడు పదములకు (౧,౪,౭,౮,౯,౧౦,౧౧) లక్ష్మణరావుగారు కాని వీరభద్రేశ్వర రావుగారు కాని యఱవమునుండియుఁ గన్నడమునుండియు మూలముల నిచ్చి యుండలేదు. విశేషించి మొదటిదగు ‹ఴస్సి› శబ్దమునకు మూలము లభింపలేదని లక్ష్మణరావుగారే వ్రాసిరిగదా. "‹ఴస్సి› అనుశబ్దము యుద్ధమల్లుని శాసనములోఁ గలదు. దానిమూలము మన కింకను నితరద్రావిడభాషలలో దొరకలేదు" అని వీరభద్రేశ్వరరావుగారును వ్రాసిరి. ఈశబ్దమునకు మూలము వీరు కానరాలేదనిరి కావున దీనితోడిదే యని వీరొప్పుకొనిన ౮ ఴచ్చిన, శబ్దమునకును వీరికి మూలము కానరాలేదనుటయే యగుచున్నది. ఇంక మిగిలిన నాల్గుశబ్దములకు మాత్రము వీరు కన్నడమునుండియును నఱవమునుండియును మూలము లనెడివానిని జూపఁగలిగిరి. అవి ౨-౩-౫-౬ లయి యున్నవి వీనిలో ౨, ౩ లు ఏకధాతురూపములే యని లక్ష్మణరావుగారే వ్రాసిరి. కాన వీరుమూలము లని పేరుతో ద్రావిడపదములఁ జూపినవి మూఁడుశబ్దములకు మాత్రమే. ఇట్లుండఁగా "ఏశబ్దములలో నీయక్షరము వచ్చెనో యవి పూర్వము ఇప్పటికి నఱవమునందును, పూర్వము కన్నడమునందును ழ కారయుతములు కావున నాకాలపు తెనుఁగునను గూడ నీయక్షరమునకు ழ ఉచ్చారణ ముండెనని యెంచవలెను" అని వ్రాయుట ఘోరాసత్యముకాదా?

పైకారణములంబట్టి చూడ నడ్డుగీటు లేనిశకటరేఫాకృతి ‹ఴ› కారధ్వనిఁ దెల్పుటకై మనపూర్వశాసనములందు వాఁడబడినట్లు స్పష్ట మగుచున్నది. ఇంతయేల? యుద్ధమల్లశాసనముంబట్టి చూచిననే యీయక్కరము ‘ఴ’కారధ్వనిని దెలుపుటకయియే వినియోగించునది యైనట్లు రూఢి యగుచున్నది.

### — వింతయక్కరమే ‹ఴ›కార మగుట —

వింతయక్కరముతోఁ గూడిన పని మనప్రతివాదు లెంచుపదములే కొన్ని కేవల ‹ఴ›కారయుతము లగుటను కనుఁగొనినారము. అంతే గాక,

మన ప్రతివాదులు వింతధ్వని గలయక్కర మని చేసిన పేర్కొనిరో యయ్యదియే (అడ్డగీటు లేని శకటరేఫ రూపమే) ప్రాచీనశాసనములందే ఴకారధ్వని దెలుపుసంజ్ఞగా నంగీకరించి తీరవలసిన తావులు తటస్థమైనవి. యుద్ధమల్లశాసనమునందే యీవిశేష ముత్పన్నమైనది. ఈశాసనమునందు బెఴఁగను పద మొకటి కలదు. దానిని ఴకారయుతముగనే శ్రీరామయ్య పంతులవారు చదివియున్నారు. కాని మనలక్ష్మణరావుపంతులవారీపదముం గూర్చి యేమియు ముచ్చటింపక మౌనముద్ర వహించిరి. యుద్ధమల్లశాసనములో శ్రీరామయ్యగారు 33 ఴకారములను జూపిరి. అవి యన్నియు ఴకారములైనదియుఁ గానిదియుఁ బరీక్షింపఁబూని లక్ష్మణరావుగారు పరిశీలనము మీఁద 28 ఴకారములే యని యంగీకరించిరి. మిగిలిన 5లోను 3 (ఴపిన, అఴిపిన, అఴుపుట) విలక్షణాక్షరయుతము లనిరి. 4వది (వేఴడు) శకటరేఫయుత మనిరి. 5వదియగు బెఴఁగు శబ్దముఁ గూర్చి మౌనముద్ర వహించిరి. ఇంతపరీక్ష చేసిన మీరు శ్రీరామయ్యగారు ఴకారయుతముగాఁ జదివిన బెఴగుశబ్దము మాట నెత్తక విడుచుటకుఁ గారణమే మని నేను నా తొలివ్యాసములోఁ బ్రశ్నించితిని. ఐనను దానికి లక్ష్మణరావుగారు గాని మఱి రావుగారు గాని సమాధాన మీయక చల్లగఁ జాఱవిడిచిరి. ఈమౌనమునకు వారు కలిగి యుండుటకుఁ గూడఁ గారణము లేకపోలేదు. వీ రెట్లు చెప్పినను తమపక్షమునకు హానికలుగక మానదు. ఇందలి ద్వితీయాక్షరము ఴకారసంజ్ఞ యని వీ రంగీకరించిన రూపమును బోలియుండక వీరు విలక్షణాక్షర మని చెప్పిన యాకృతిని బోలియుండుట తటస్థించుచున్నది. కావున అడ్డుగీటు లేని శకటరేఫమువంటి యక్షరములు ఴలు కా వనుట కిది యభ్యంతరము కలిగించుచున్నది. పోనిం డిది ఴకారము కాదు మనవింతయక్కర మని యనుకొందమనినను హాని వాటిల్లుచున్నది. ఏమన నీ బెఴగుశబ్ద మఱవమునందును కన్నడమునందును గూడ ఴకారధ్వనితో నొప్పుచున్నది కాని మనవింత యక్కరపు ధ్వనితో నొప్పుటలేదు. కావున దీనింగూర్చి యేమి చెప్పుటకును వలను లేక యుద్ధమల్లశాసనమం దున్న మిగిలిన ఴకారములం గూర్చి విపులముగాఁ జర్చించియును గూడ నీ బెఴగు శబ్దమందలి ఴకారము మాట వలపెట్టక ప్రతివాదులు మూకీభావము వహించిరి. బెఴగుశబ్ద మఱవమునందును, గన్నడమందును నాంధ్రమందును గూడ ఴకారయుతమే కావు

నను నీయది లక్ష్మణరావుగారు చెప్పు ఴకారాకృతిలో లేక వారు చెప్పు విలక్షణాకృతిఁ గలిగియున్నది కావునను నీయక్కరము 'ఴ'కారధ్వనిఁ గలదియే యని మనము గ్రహింపవలసియున్నది.

—ప్రతివాదుల పరస్పర వైరుద్ధ్యము—

యుద్ధమల్లశాసనమందలి 'ఴ'కారమును దెలుపుటలో లక్ష్మణరావుగారును, మనరావుగారును భేదాభిప్రాయముల పొందిరి. ఈ శాసనములో 28 'ఴ'లు మాత్రమే కల వని లక్ష్మణరావుగారు తెలిపియుండఁగా 30 'ఴ'లు కల వని మనరావుగా రనుచున్నారు. శ్రీరామయ్యపంతులుగారి 33 'ఴ'కారములలోను లక్ష్మణరావుగారు వింతయక్కరము లనిన మూఁటిని మనరావుగారును వింతయక్కరములే యని తక్కినముప్పదింటిని 'ఴ'కారము లనిరి. దీనిచే లక్ష్మణరావుగారు శకటరేఫయుత మనిన 'పేరఴు'శబ్దమును, ఉభయులు నేయక్షరయుతమో చెప్పక యుదాసీనభావము వహియించి విడిచిన 'బెఴగు' శబ్దమును 'ఴ'కారయుతములే యగుచున్నవి. 'పేరఴు' శబ్దములో అడ్డుగీటుగల శకటరేఫము లక్ష్మణరావుగారికిఁ గాన్పింపఁగ నడ్డుగీటులేని 'ఴ'కారము మనరావుగారికిఁ గాన్పించినది. పేరఴు'శబ్దమునందలి తుదియక్కరము శకటరేఫాకృతి నుండుటనే గదా విచక్షణు లగులక్ష్మణరావుగారు దానిని శకటరేఫ మనిరి. దానికిఁ గుడిప్రక్కను ఎడమప్రక్కను గూడ మనరావుగారికిఁ గావలసిన 'సున్న' లున్నవి. అనఁగా విలక్షణాక్షరాకృతి కల దన్నమాట. దీనినే గదా మనరావుగారు తుదకు 'ఴ'కారధ్వనిఁ దెలుపు నక్కరమనిరి. ఇఁక వీరివాదము పూజ్యమైన దనుటకు సందియ మేమున్నది ? ఐనను వీరు నేలవిడిచి సాము చేయుచున్నారు.

—వింతయక్కరముంగూర్చిన ప్రతివాదుల 'యుదరగొండము'—

ఇఁక నొకవిశేషము. లక్ష్మణరావుగారు వింతయక్కరముతోఁ గూడిన పదముల విశేషముగాఁ జూపునట్టు లభినయించి కొన్నిశాసనముల పేరులమాత్ర మిచ్చి యందున్న విలక్షణాక్షరయుత శబ్దములేవో చెప్పక విడిచిరి. ఉదాహరణము:—

పదునొకండవశతాబ్దమునకుఁ బూర్వపుశాసనము లని లక్ష్మణరావుగా రిచ్చినవానిలో నాలుగులోను నేమలోను గలపదము లేవో వారు తెలిపి యుండలేదు. మనుజునిపేరులో నీయక్షరము కలదని మాత్రము వ్రాసి

౪. వీరుచూపిన మనుష్యనామ గ్రామనామము లైనను సరిగా గాన్పించుట లేదు. ఏమన లక్ష్మణరావుగా రిచ్చినరూపములకును వీరభద్రేశ్వరరావుగా రిచ్చినరూపములకును నీక్రిందిభేదము కాన్పించుచున్నది.

| శాసనము. | లక్ష్మణరావుగారిపదము. | మనరావుగారిపదము. |
|---|---|---|
| Epi. Ind Vol V. P. 134 | వేళాంబా | మేళాంబా. |
| Do. XI. P. 345. 1. 1 | చోలి | బోలి |
| P. 337. | చోలి | బోలి |
| నెల్లూరుమండలమందలి నలజపాడుశాసనము P.23 | ఊళుకొడకు. | ఊళుకొడుకు. |
| V. P. 118. | బోటిమనామా. | బోటిమనామ. |

లక్ష్మణరావుగారి వ్యాసములు మరలఁ బుస్తకరూపమున 'లక్ష్మణరాయవ్యాసావళి' అనుపేరుతో ముద్రింపఁబడినవి. అందు వారిచ్చిన మొదటి రూపమునకును ద్వితీయముద్రణమునఁ గలరూపమునకును భేద మిట్లు కాన్పించుచున్నది. మొదటిదానిలోని 'బోటిమనామా' రెండవదానిలో 'బోటియనామా' యైనది. మొదటిదానిలోని 'కాలిచుచున్నాన్ను' అనుపది రెండవదానిలో 'కొల్చుచున్నాన్ను' అయినది. ఇట్లీపక్షమువా రిచ్చురూపములలోనే యొకటి కొకటి సందర్భించుట లేదు.

—• ఏవి మూలము లేవి తద్భవములు ? •—

'ఏడు'శబ్దము 12వశతాబ్దమునకుఁ బూర్వమే 'డ'కారయుతముగా నుచ్చరింపఁబడుచున్న దని నన్నయభట్టారకుని భారతముంబట్టి గ్రహించుకొనినారము. ఈశబ్దమే యఱవము లోనగుభాషలలో వింతయక్కరము తోఁ గూడియుండుటను గనుఁగొనినారము. ఇట్లుండఁ దెలుఁగునందలి 'ఏడు' శబ్దమునకు నఱవమునందలి (ఏఴు)శబ్దము మూల మనుకొన నేల? ఆంధ్రమునందలి 'ఏడు'శబ్దమే యఱవమునందలి 'ఏఴు'శబ్దమునకు మూల మనుకొన రాదా? శబ్దశాస్త్రజ్ఞు లగుకాల్డువెల్ దొరవా రట్లే వ్రాసిరే యని నేను లిఖింప శ్రీవీరభద్రేశ్వరరావుగా రీక్రిందిసమాధానరాజ మిచ్చిరి. "ఏఴు (ఏడు)శబ్దమును గుఱించి యిట్లే యేమేమో వ్రాసి 'ఏడు'(తెనుగులోనున్నట్లు) మొదటిరూపమో ఏళు (కన్నడమునయున్నట్లు) ప్రథమరూపమో ఏఴు (అఱవమునయున్నట్లు) ఆద్యరూపమో యెవరు చెప్పగలరు?' అనిసంశయాత్ములైరి. ముప్పది నలువది సంవత్సరములకుఁ బూర్వముగల ద్రావిడభాషా

జ్ఞానముఁ బట్టి వ్రాసినకాల్డువెల్లే శరణముగ గలవారికి నిట్టి కింకర్తవ్యతా విమూఢత సహజమే గాని, స్వయముగ నాలోచింపఁగలవారికి నీప్రశ్నల జవాబు కనుఁగొనుట కఠినము గాదు. 'ఏడు' శబ్దమునకు బహువచనమేమి? 'ఏడేళ్లు నలభై తొమ్మిది' అని బ్రహ్మయ్యగారెప్పుడైన లెక్కలు నేర్పిరా? బహువచనము 'ఏళ్లు' అని కనఁబడుచున్నప్పుడు 'ఏళు', 'ఏడు' కంటెఁ బురాతన మనుట స్పష్టము. కన్నడశాసనములందు 'ఏళు' కంటె 'ఏఱు' పురాతనము. ఇఁక సంశయ మెక్కడ నున్నది?"

ఇది చాల వింతను బుట్టించుచున్నది. నా 'విమూఢత' నటుంచి వీరభద్రేశ్వరరావుగారి విజ్ఞతను గూర్చి యించుక ముచ్చటించుకొందము. 'కోడి' శబ్దబహువచనము 'కోళ్లు' గావునను 'ఏడు' శబ్దబహువచనము 'ఏళ్లు' కావునను నీశబ్దములు వింత యకారముతోఁ గూడినవే యని పండితశిరోమణులగు రావుగారు వ్రాసిరి. 'ళ్లు' బహువచనవర్ణకమైన కారణమున నాశబ్దములు విలక్షణాక్షరయుక్తము లఁట! లెక్కలలో మిక్కుటమగు లెక్కను గాంచిన మనవీరభద్రేశ్వరరావుగారు 'మూఁడుమూళ్లు తొమ్మిది' అని పలుసారులు లెక్కించియుందురు గదా. 'మూఁడు' శబ్దమునకు బహువచనము 'మూళ్లైన కారణమున దాని ప్రథమరూపము 'మూఱు' అయి యుండు నని యెన్నఁడైన నెన్నుదురా? 'పదిదినము లైదు ప్రొద్దులు పదపడి రెన్నాళ్లు' అని వీరభద్రేశ్వరరావుగారు చదివియే యుందురు. కాన 'నాడు' శబ్దముయొక్క ప్రథమరూపము 'నాఱు' (ఱు) అందురా? త్రాడు, లేడి అను శబ్దములు బహువచనమున 'త్రాళ్లు' 'లేళ్లు' అగును. కాన త్రాఱు(ఱు) లేఱి(ఱి) ప్రథమరూపము లగునా? 'లేడి' శబ్దమునకు బహువచనము 'లేడులు' కూడ నగును. 'లేడులను ప్రయోగము లక్ష్మణరావుగారి 'విజ్ఞానసర్వస్వము' నందే కలదు. మన యాంధ్రప్రాచీనలక్షణగ్రంథములఁ గల 'ఏడు' శబ్దబహువచనము 'ఏడులు' కూడఁ గావచ్చును. కావునఁ దెలుఁగునందలి సప్తసంఖ్యాబోధక మగు 'ఏడు' శబ్దము మన రావుగారి వ్రాఁతలను బట్టియే 'డ'కారయుతము గాని విలక్షణాక్షరోపేతము కా దని రూఢిపడుచున్నది. "'కోడి' శబ్దముయొక్క బహువచనము 'కోళ్లు', కోడులు కాదు. కావున నీబహువచనమునకు మూలమైన యేకవచనము 'కోళి' లేక 'కోఱి' అయియుండవలెను" అని యీరావుగారు వ్రాసిరి. 'ఏడు' శబ్దబహువచనము 'ఏడులు' కూడఁ గావచ్చును కావునను

'ఏమ' అని 'ఏ' యుక్తముగ నన్నపార్యు లుచ్చరించిరి కావునను నాంధ్రమున నున్న 'ఏమ' శబ్దమొప్పటికిని ఏకారముతోఁగూడినదే కాని వింతయక్కరముతోఁగూడినది కాదని తేలుచున్నది.

—◆ శాసనములో నొకధ్వనికే రెండుసంజ్ఞ లేల? ◆—

మనము టవర్గములోని తృతీయాక్షరమగు డకారధ్వనికే ప్రాచీన శాసనములందే రెండురూపము లున్నట్లు కనుఁగొనినాము. ఒకటి సర్వసాధారణ డకారరూపమున నుండునది(డ.) రెండవది అడ్డుగీటులేని శకటరేఫము వలె నుండునది(ఱ.) ఒకధ్వనికే రెండుసంజ్ఞలుండుట యసంభవ మనియు దాన ననవస్థాదోషము వాటిల్లు నని యు వీరభద్రేశ్వరరావుగారు వ్రాసిరి. ఇది వింతవ్రాఁత. రెండుధ్వనుల కొకయక్కరముండిన ననవస్థాదోషము పట్టునేమో కాని యొకధ్వనికి రెండుసంజ్ఞ లుండినఁ బట్టదు. ఇట్టివి సర్వసాధారణముగా నన్ని లిపులయందును గలవు. ఒకధ్వనికి బహ్వక్షరము లుండుట భాషాలోపమును సూచించునని రావుగారు సాహసించి వ్రాసిరి. అది యసంగతము. ఒకయుచ్చారణమునకు బహ్వక్షరము లుండుట భాషావైభవమును దెలుపునని ప్రాజ్ఞులు తలంచుచున్నారు. కాని మనరావుగారెంచినట్లుగా 'వర్ణసమామ్నాయము లోపముకలదిగా' భావించుటలేదు. "ఒకే యక్షరమునకు వేఱురూపములు శాసనములలోఁ గానవచ్చిన యెడల నాలిపి పురాతనమైనదైనను, జనులలో వాడుకలో నున్నదైనను వేఱురూపములు దానికిఁ బుట్టినవని చెప్పవలెను" అని లక్ష్మణరావుగారి 'విజ్ఞానసర్వస్వ' మునందే వ్రాయఁబడినది. కాన నొకధ్వనికి రెండుసంజ్ఞ లుండరాదను సిద్ధాంత మపసిద్ధాంతము. యుద్ధమల్లశాసనలిపిలో నొకధ్వని కనేకసంజ్ఞలు పనిఁబూని వాడఁబడియున్నవి.—

(౧) ఏత్వమునకు నాలుగయిదు రూపములు లున్నవి. (౨) ఆకారమునకు రెండుసంజ్ఞలు కలవు. (౩) ఒత్వమునకు రెండుసంజ్ఞలు కలవు. (౪) క్రారకు రెండుసంజ్ఞలు కలవు.

రేఫపు టొత్తును దెల్పుటకై యక్షరములయడుగున శకటరేఫము కొన్నితావుల వాడఁబడియున్నది. ఇది పెద్దవింత. చేబ్రోలను నొకపదమును దెల్పుటకయి శాసనలేఖకుఁడు చేబ్రోలని కొన్నితావులను చేబ్ఱోలని మఱి కొన్నితావులను పనిఁబూని వ్రాసియున్నాఁడు. (సశేషము.)

# భాషాసేవ—తత్ఫలము.

జనమంచి శేషాద్రిశర్మగారు.

భాషాభిమానులారా!

శారదాదేవి భాషాస్వరూపిణి. భాషాదేవి యనియే ప్రఖ్యాతిం గాంచినది. తొలుతటి భాష యేది? అనుప్రశ్నమునకు బదులు చెప్పుటయే కష్టము. సంస్కృతము తొలుతటిభాష కా దని యాశబ్దమే చెప్పక చెప్పుచున్నది. ఇటు లేవో కొన్నిపేరు లుచ్చరించుచు రాఁగా రాఁగా గీర్వాణభాష యనునది కడపటినమాధానము. దానిపైఁ బ్రశ్నము చేయరా దని పెద్దల యాజ్ఞ. అద్దానినుండి యెన్నియో భాషలు పుట్టినవి. వానినుండి మఱికొన్ని భాషలు పుట్టినవి. ఇట్లింతయో కాలమునుండి యెన్నియో భాషలు పుట్టినవి, గిట్టినవి. వానికాలము లివి యని నిర్ణయింప నవకాశమే లేదు. కాని ప్రశ్నించువారు లేక యేమిచెప్పినను దలయూఁచువా రున్నచోట నిది యీకాలమునఁ బుట్టి యీకాలమున నశించిన దని చెప్పవచ్చును.

దేశభాష లేకాలమునఁ బుట్టినవి? ఎట్లు పుట్టినవి? ఏభాషలోనుండి పుట్టినవి? అనుప్రశ్నము కూడ నట్టిదే. ఏభాషలోనైన నాలుగుమాటలకు వ్యుత్పత్తులు చెప్పవచ్చును. దాని మాతృభాష యిది యని నిర్ధారణము చేయవచ్చును. కాని యాపద్ధతి భాషాసర్వస్వమునకుఁ బనికిరాదు. కావున నదియు వాస్తవ మని చెప్ప వీలు లేదు. దీనింగూర్చి విచారించుట యసందర్భ మనువారు కలరు. వారే పుణ్యపురుషులు. విచారించితిమిపో లాభ మేమి? ఒక్కసిద్ధాంతము చేసి "ధన్యాస్స్మః"అనుకొందుము. అది చాలదా యన్నఁ గొలఁదికాలమున కాసిద్ధాంతము తప్పని యేదో యొక్కచోట దోషము కనఁబఱిచి నలుగురిని మెప్పించువా రుందురు. కావున నున్నదానిస్థితి యెట్టి దని వితర్కించిన లాభము గాని దీనికి మూల మేది? దానికో? అనుప్రశ్నసోపానము లెక్కఁబూనిన వానితుదిఁ గాంచుట యసంభవము. కావున దానిజోలి మాన మేలు. మానక యేదో తోఁచినట్లు సిద్ధాంతము చేసినను దానఁ బుణ్యముగాని, పరమపురుషార్థము గాని రానేరదు. వృథాశ్రమ మయ్యెఁగదా యని పరమార్థచింత గలవారికి దోఁపకపోదు.

ఇఁక నీగొడవ వదలుచున్నాఁడను. మనదేశభాషను గూర్చియే ప్రశంసింపఁ బూనెదను. మనభాష యాంధ్రభాషయా తెలుఁగుభాషయా యనునది ప్రశ్నము. త్రిలింగశబ్దభవము తెలుఁగు అనవలయు. త్రిలింగము లేవి? ఇట లింగ మనఁగా జిహ్వమని యర్థము. శ్రీకాళహస్తి శ్రీశైల మహేంద్రపర్వతము లని విఖ్యాతికలదు. ఆమహేంద్రపర్వత మేది? కళింగము చెంత కల దని కొంద ఱందురు. కిష్కింధయందుఁ గల దని కొంద ఱందురు. కృష్ణానదికి దక్షిణభాగ మంతయుఁ గిష్కింధవఱకుఁ దెలుఁగు దేశ మని తేలుచున్నది. ఈసిద్ధాంతము బొంబాయిప్రముఖులలో నొకరు చేయఁబూనియున్నారు. మహారాష్ట్రదేశస్థులకు నీతెలుఁగు వారలకు నాచారములలో నెక్కువపోలిక గలదు. ఇద్దేశమున నాచరింపఁబడువ్రతము లన్నియు మహారాష్ట్రదేశవాసులకుం గలవు. ఇంక నెన్నియో కారణములు గల వని యామహాత్ములు చెప్పఁబూనియున్నారు.

ఆంధ్రదేశము కృష్ణానదికి నించుక యుత్తరము, తూర్పున నున్న దని చెప్పవలయును. అది కాదని యెవ్వ రనఁజాలరు. కాని తెలుఁగుదేశమునకే యాంధ్రదేశ మని పేరు గల దని మాత్ర మందును. ఇం దేది సత్యమో నిర్ణయించుట నావంటివానికిఁ గష్టము గాని పండితులకు సులభముగనే యుండునేమో యని నే నూహించుచున్నవాఁడ. కొన్నియాచారములలో నీయిరుదెగలవారికిఁ జాల భేదము గల దని మాత్రము చెప్పక తప్పదు. క్రమక్రమముగా నందలియాచారములు మార్పు చెందుకాలమున నీచర్చ చేయుటయు వెఱ్ఱితనమే.

ఆంధ్రశబ్దము :—ఇదిమాత్రము నీచార్థబోధకముగ నుండెను.

మేవాంధ్ర చుంచు మద్గూనా మారణ్యపశుహింసనమ్॥ అని మనుస్మృతి పదియవయధ్యాయమున నలువదియెనిమిదవశ్లోకమునఁ గన్పట్టుచున్నది. పూర్వకాలమున జనబాహుళ్యము లేక యడవులుగ నుండి యీభూభాగము మృగసంవృతమై యుండును. అప్పు డెందో నివసించు వారట్టివా రయియే యుండిరి. ఆంధ్రశబ్ద ముపనిషత్తులలోఁ గూడఁ గన్పట్టుచున్న దని సమాధానము చెప్ప వీలున్నది. కాలము జరుగఁగా సజ్జనుల కాలవాలమై యిది పరమపవిత్రభూభాగమైన దని చెప్పినఁ గాదని యెవ్వ రనఁగలరు? అనిరిపో యేమిలాభము! ప్రత్యక్షవిరుద్ధముగా నుండునుగదా.

ఈచర్చయు నెక్కువఁగఁ జేయుయోగ్యత నాయందుఁ గన్పట్టదు. కాన వదలి ప్రకృతమునకుఁ గడంగెద.

ఏభాషకైన నొకకాలము చెప్పి యప్పటినుండి చక్కనిసంస్కారముల నంది వృద్ధిఁగాంచిన దని చెప్పక తప్పదు. ఆకాలమున నీపేరు గలవారీసంస్కారములఁ జేసి రనియుఁ జెప్పవలయుఁ గాని యీమాట నంద అంగీకరింపరు. ఆచెప్పిన పేరు గలవారికి ముందు గ్రంథములు లేకున్న నిట్లు చక్కఁగ నలరింప శక్య మగునా యని ప్రశ్నింపక పోరు. ఐన మీ రెవ్వరిని జెప్పుదు రని యు నడుగవలసివచ్చును. ఎవరో యొక వనమయ్య యని పేరు చెప్పక వ్యాహారకుఁడఁజనదు వారికి ముందును గొంద ఱుండక పోరు సుడీ యనుప్రశ్నము రాక తప్పునా. కాఁగా, అనవస్థాదోష మీవాదమునకుఁ దప్పదు. ఎట్లో సమాధానమున కందఱు వచ్చి వనమయ్యగారు కొండయ్యయే యని సిద్ధాంతము చేసినఁ గాని వ్యవహారము నడువదు.

మనభాషకు నన్నయభట్టు ఆదికవి యందము. దీనిని జాలమంది యంగీకరించి రనియు నమ్మెదము. ఏమూలనుండియో తొలునొలుత నిట్టి నిర్దుష్టకవిత్వము చెప్పశక్యమా. అంతకుముందును గొంద ఱుందురు. వారి గ్రంథములు దుర్ముఖసంవత్సరపుఁ బ్రవాహములలోఁ గొట్టుకొని పోయి యుండవచ్చును. అందొకటి కనఁబడుచున్నది. ఇదియుఁ గొట్టుకొనిపోవుచుండఁగా పాపయ్యగారు పట్టుకొని వచ్చినారు. మనపూర్వపుణ్యమున నది పాడుకాలేదు. అది యిదిగో నన్నెచోడుని కుమారసంభవము. అను ధ్వని వినఁబడక విడుచునా. దానియందుఁ బెక్కు తప్పులున్నవి. ఆపదములు సంస్కరింపఁబడని కాలములో నున్నవియే కదా. వానినేకదా మనవారు సంస్కరించిరి. కాన నన్నయ్య తొలుతటికవి కాఁడు అనుసిద్ధాంతము వెలువడును. ఈమూలనుండి ఆతనికన్న ముందు మహాకవు లుండరని మీ రెట్లు చెప్పఁగలరు ? గ్రంథకర్త లుందురు. పాపయ్యగారు పట్టుకొనుటకు ముందు ప్రవాహములోఁ దూర్పుభాగముగా నీటి కెదురెక్కిపోవు తాటియాకులకట్టను పుల్లయ్యగారు చూచినట్లు మాయింటివాడుక కలదు. అది కాదనవచ్చునా. అను కలస్వన మొక్కండు వీతెంచును. ఇట్లు కాఁగా నెవ్వఁడో యొకఁడు తొలుతటికవి యని పిల్వఁబడును.

ద్రవిడదేశమునం దనఁగా అరవభాష మాటలాడుదేశమున నేఁడో

యొకమూలనున్న యాంధ్రుఁడు, ఇపు డొక్కయుపన్యాస మిచ్చిన నది నన్నయకు ముందున్న భాషయే యగు. నిస్సందేహము. ఆతఁ డొక్కశతకము వ్రాసెనా యది నన్నచోడునకు వేయినూటముప్పదిమూఁడుసంవత్సరముల యెనిమిదినెలలకు ముందున్న దని యొక రుపోద్ఘాతము వ్రాయక తప్పదనుట సిద్ధాంతము. వ్యాకరణదుష్టపదములు వ్రాసినవారెల్ల నన్నయ్య కన్నలే యగుటకు మంచియవకాశము గలదు. ఇట్లనుటచే నన్నయకు ముందు సత్కవులు లేరు. సత్యము. అని నెత్తిన నోరుపెట్టుకొని చెప్పువారిలో నే నొకఁడను గాను. ఈసిద్ధాంత మేకాలముననో మార్పఁబడు నని మాత్రము చెప్పుచున్నాఁడను.

ఇపుడు నన్నయ రాణ్మహేంద్రపురమున నెలకొని భారతమును వ్రాసె ననియు. ఆమహాత్ముఁడే తొలుతటి కవితల్లజుఁ డనియు నొక యూహ నెల్కొల్పి వ్రాసెదను. పాప మానన్నయ కగ్రతాంబూలము నీయఁగూడ దనఁబూనకుఁడని ప్రార్థించెదను. రిత్తతాంబూలమునకుం గూడ నంతరాయ మేల కల్గించెదరు? వల దని చేతు లొగ్గి వేఁడువాఁడ.

అమ్మహాకవిశిరోమణికి మనము కాక నాలుగువందలసంవత్సరములకుం బూర్వమే సృష్టికర్త యనుబిరుదము నొకమహాకవియే ప్రసాదించెను. కాన నమ్మహాకవియే యాంధ్రభాషాబ్రహ్మ యని పేరందెను. దానిని మన్నింపఁబూనుట మనకే గౌరవము. అంతకుముం దేరీతిగాఁ దెలుఁగుండినదో వ్యాకరణమే చెప్పుచున్నది. వ్యాకరణ మంతకుముం దాంధ్రమునకు లే దనక తప్పదుగదా. ఆభాష శ్రుతికటువుగఁ దోఁచినందునను, భాషాశుద్ధి లేనిచో దేశగౌరవము చెడు నను భావ మంకురించినందునను వారు భాషను సంస్కరించిరి. ఏభాషకుఁ గాని యేకాలమునఁ గాని యొక నియమము లేనిచో స్వైరిణివలె మర్యాద దానికుండ దనుట నిక్కము. స్వేచ్ఛగాఁ బ్రవర్తించువారు పెక్కుమంది యుండిన నానగర మెట్లుండునో నియమము లేనిభాషచే దేశ మట్లుండును. కాఁబట్టి భాషకు నియమము తప్పక యుండవలెను. కాంతామణికి శీల మెట్టిదో భాషకు నియమ మట్టిది. అది లేకున్న నెట్లో యిది లేకున్న నట్లు. కాఁబట్టి భాష యేకాలమున సంస్కరింపఁబడినది. ఆసంస్కారములందు మార్పులు గలుగ లేదా యనుప్రశ్నము వచ్చును. కలిగినవి. అనునది సమాధాన మగును. కాని ఆసంస్కారములు ప్రతిక్షణసంజనితములై

నచో నవిభాషావినాశన హేతువు లగు. సంస్కృతవ్యాకరణము వలె వ్యాకరణ ముండియుండిన చో నీతెలుఁగుభాషయు మార్పు నొందక యుండెడిది. దీనివుణ్య మట్టిదికామి నిన్నిమార్పులు కలిగినవి.

భాష కొకనిలుకడయు మానిని కొకనియమము తప్పక యుండవలయు ననుట సర్వసమ్మతము. కాలానుసారము మార్పవలదా యనుప్రశ్నము నకు ఆమార్పు లెట్టివిషయమునం దని ప్రతిప్రశ్నము వేయవలయును. మానినికి నియమములు కాలానుసారముగా మార్పవలదా యన్న మార్పవలసినదే కాని శాస్త్రవిహితవిషయములందుఁ గా దనునది సమాధానము. కాలము మాఱినది. ధర్మశాస్త్రములు మాఱవలసినదే యని :అసత్యంబ్రూయాత్ అని సూత్రము వ్రాయరాదు. శీతోదకస్నానము చేయుశక్తి చాలకున్న నుష్ణోదకస్నానము చేయవచ్చు నని మార్చినను బ్రాయశ్చిత్తము లేదు గాని ముఖ్యవిషయముల మార్పు చేయరాదు. దేశకాలాదుల ననుసరించి మాఱఁదగిన విట్టివే. సత్ప్రవర్తనాదులు పూర్వశాస్త్రప్రతిపాదితములు, అసత్ప్రవర్తనాదు లిప్పటిస్మృతులలోఁ జేర్పఁదగు ననరాదు. అట్లే భాషాగౌరవమును బాడుచేయుమార్పులు చేయరా దని దీనిసారము.

దేశభాషలోఁ గొన్నిలోపములు వ్యవహారమం దుండకతప్పదు. ఎల్లరొక్కరీతిగా నుండరు కదా. విద్యవచ్చినవారు రానివారు కలిసి మాటలాడునపుడు కార్యము సాగుటకై వ్యాకరణయుక్తముగ మాటలాడ వీలుండదు. కాని శాశ్వతముగా నిలుచు పుస్తకముల కాభాష పనికివచ్చునా యన్నచోఁ బనికి రాదనియే చెప్పవలయును విద్యాగంధము లేనివారి కాభాషతో గ్రంథములు వ్రాసిన మేలుకాదా యనుప్రశ్నమునకుఁ దొలుదొలుత నేర్పుభాష శుభ్రముగా నుండవలయునే గాని యపభ్రంశముగా నుండ రా దనియు, అట్టిభాష నేర్పఁబడకయే యలవడును గాన నది పనికిరా దనియు, సులభశైలిలో మంచిభాషను నేర్పఁదగు ననియు సమాధానము చెప్పక తప్పదు.

ప్రశ్నము:—మేము చెప్పునది గ్రామ్యభాష కావలయు నని కాదు. భారతాదిగ్రంథములయందు మహాకవు లుపయోగించిన భాషయే కాఁబట్టి దానికి వ్యవహారభాష యనిపేరిడితిమి. అది గ్రామ్యభాషగా నున్నను “ప్రయోగశరణా వైయాకరణాః” అన్నట్లు మహాకవులు వాడినది గాన నిం

ద్య గ్రామ్య మనఁదగదు గాన వ్యవహారభాష యంటిమి. కలికంటుఁ-కుప్రాణగొడ్డము-ఇత్యాదులు ప్రవాహరూపముగా మహాకవుల నోటినుండి వెలువడినవి. అట్టివి చేర్చి గ్రంథములు వ్రాయవచ్చును.

సమాధానము —వ్యవహారభాష యనుపేరు దానికిం దగదు. అట్టి పదములం గూర్చి పుస్తకములు వ్రాయుట కాభాష చాలదు. అది యాధారముగాఁ గైకొని యిచ్ఛానుసారము గ్రామ్యభాషను జొప్పించు నూహయే గాని వేఱుకాదు. ఇంతియగాక మహాకవులయందు మనకున్న పితృభక్తిని బురస్కరించుకొని వాని నాక్షేపించుట మానిరి గాని వైయాకరణులు అవి సుశబ్దము లనివచించు నూహగలవారు కారు. మనకుం గాళిదాసమహాకవిపై నెంతటిగౌరవ ముండినను "త్రియంబకమ్" అని ప్రయోగించుటకధికారము లేదు. తప్పు అనక ప్రమాద మనుట మర్యాదను దెలుపునే కాని వేఱుగాదు. అవైహీత్యాదిదుష్టసంధులు నిషేధింపఁబడినవి. వారు ప్రయోగించిరని మనము వానినే ప్రయోగింపఁబూనక వారికిం గల కవిత్వశక్తినిం బొందఁగలమా యని ప్రయత్నించుట మేలు. అట్లే నన్నయాదులు ప్రమాదమున నొకానొకచోట గ్రామ్యపదమును బ్రయోగించియున్నయెడల దాని నాక్షేపింపక శిరసా వహించి మన్నించుచు, దానివిమాత్రము నవీనగ్రంథములలోఁ బ్రయోగింపక వదలుచు భాషనుబోషింపవలయు. ఒకప్పుడు మనము అట్టివానిని మఱికొన్నింటిని గ్రంథములఁ జేర్చినచో వాని నితరు లాక్షేపించినచో నట్టిమహాత్ముల కడఁ జేతు లొగ్గి క్షమింపుఁడని వేఁడుకొనవలయునే గాని సాధింపఁ బూనరాదు. ఇది దేశభాషను జక్కఁగాఁ బోషించి దానిగౌరవమును గాపాడు పద్ధతియే గాని వేఱుగాదని నమ్మవలయును.

ప్రశ్నము:—అట్లైనచో భాష వృద్ధినొందు టెట్లు? భాష వృద్ధినొందవలయు ననునూహ యుండవలయునే గాని యున్న దున్నట్లున్నఁ జాలు నను హ్రస్వదృష్టి పనికిరాదు. ఇంతియ కాక దేశ్యపదములు విచ్చలవిడి మనభాషలోఁ జొచ్చియున్నవి. వానిని బండితులు కవులు సామాన్యులు నెల్లరు వాడుచున్నవారు. కావున నట్టివాని గ్రహింపకుండుట న్యాయము గాదు. అట్టిభాషయుఁ గ్రమముగా గ్రంథరూపమై తప్పుగాఁ దోఁపక ప్రశ

తిహిత మగును. కాఁబట్టి యట్టిప్రయత్న మొనరించుట భాషాగౌరవమును హానిచేయుటకుం గాదు.

సమాధానము:— తేనెపూసిన కత్తివలె మాయామాట బాగుగానున్నట్లున్నది? వ్యవహారమున కొక్కభాషయే గాక భిన్నభిన్నభాషలుపయోగింపఁబడుచుండును. అవియెల్ల «కలిపికొట్టరా కస్తూరిరంగా» యన్నట్లు చేర్చుట భాషకు మరియాదఁ దెచ్చిపెట్టుటకుం గాదు. నశింపఁజేయుటకే. సంస్కృతసంబంధము లేనిభాషల కాదుర్గతి పట్టవచ్చును. మనభాష కాదుర్గతి యేల? అపారసాగరమువలె సంస్కృతభాష యున్నది. ఎన్నియోఁ బదము లందుండి చేకొనవచ్చును. భాష నలంకరింపవచ్చును. ఎన్నియో గ్రంథములు వ్రాయింపవచ్చును. వ్రాయవచ్చును. ఈమార్గమును మాని «దేశభాషలందుఁ దెనుఁగు లెస్స» యనుమర్యాదను బోఁగొట్టఁ బ్రయత్నించుట మీకు న్యాయముగాదు. సంస్కృతము తర్వాతిభాష తెనుఁగే. అనుప్రఖ్యాతిని దేఁ బ్రయత్నింపుఁడు. గ్రామ్యవ్యాకరణము వ్రాయఁబూనకుఁడు. దేనినైన బాగుచేయుట కష్టముగాని పాడుచేయుట సులభము. మనకాలములో నా ప్రయత్న మొనరింపకుఁడు. శ్రీకృష్ణదేవరాయలు నిలువెడు విత్తము వ్యయపఱిచి యోపినంతవట్టు భాషాదేవిని గాపాడిరి. పదమణ్యాలంకారముల నలరించిరి. మనము గాజుపూసలచే నలంకరింపఁబూనుట న్యాయము గాదు. రసవదలంకారసంశోభితగాఁ జేయఁజాలకున్న నున్నదానిని బాడుచేయఁబూనకుండుటయే మహత్తర కృత్యము, కాఁబట్టి కరుణాసముద్రుల రగు మీవంటిపండితులందఱు మంచిప్రయత్నము చేసి దేశభాషలలో నిది మిన్న యన్నఖ్యాతిని నింకను బెంపునొందఁ జేయు ప్రయత్నమున బద్ధకంకణులు గావలయు నని మీపాదారవిందముల కనేకవందనము లాచరించి వేఁడుచున్నాఁడను.

మహోదారు లగునోపండితకవీంద్రులారా! కొలఁదిమాటలచే నా భావమును వ్రాసితిని. ఇదిమీకహితముగ నున్న వదలుఁడు. హితమైన గ్రహింపుఁడు. పత్రికలలో ననుఁ దిట్టకుఁడు. బదులు వ్రాయఁజాలను. వ్రాయఁబూనను. మీపాదసేవకుఁడను. నాభావము నంతయు నిట వ్రాయుట కవకాశమీఁబడలేదు. స్థాలీపులాకన్యాయ మనునది శరణము గదా. కావున మీవాదమునకుఁ బ్రతివాదము చేయఁజాలను. భాషాసేవయే ముక్తిమార్గ

మని నమ్మినవాఁడను. అంతియ కాని వాదప్రతివాదములఁ జేసినొండ నెంచువాఁడను గాను. మీరెల్ల ననుగ్రహించు మార్గము వేదతుల్య మని శిరసావహింతును. కాని మీరును నాప్రార్థన మంగీకరించి భాషోద్ధారకులు గాన మంచిపట్టుదలతోఁ గార్యమును సాధింపుఁడు. నన్ను మన్నింపుఁడు తప్పులున్నఁ బత్రికలో దూషింపకుఁడు. ఇదియె మీచరణసేవకుని విన్నపము.



# శ్రీస్కాందపురాణము.

విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు.

భాషావిషయమునఁ బరిశ్రమ మొనర్చువారికి స్కాందపురాణమునందలి విషయజాతము నెల్ల నెఱిఁగియుండు టెంతయు నుపకారకము కావున నావిషయమై నాచేత నైనంతసంక్షేపముగ నిట వివరింతును.

స్కాందపురాణము మహాపురాణ మనియు నుపపురాణ మనియు రెండువిధములుగాఁ బ్రసిద్ధి నొందియున్నది. దానిలో మహాపురాణాష్టాదశకాంతర్భూత మగుస్కాందంబున మాహేశ్వరము, వైష్ణవము, బ్రాహ్మము కాశ్యము, ఆవంత్యము, నాగరము, ప్రాభాసికము ననునేడుఖండములుగలవు. ఈయేడుఖండములును నెనుఁబదియొక్కవేయి నూఱుశ్లోకములు గలిగి యున్నవి. ఈసంఖ్యగలదియే మహాపురాణము గాని యితరము గాదు. దానికి వలయు ప్రమాణము లీక్రిందఁ గననగును.

బ్రహ్మవైవర్త కృష్ణజన్మఖండము 132 అధ్యాయమున, "ఏకాశీతి సహస్రంచ పరమేవ శతాధికమ్। వరం స్కాందపురాణంచ సద్భి రేవం నిరూపితమ్" అనియు బృహన్నారదీయపురాణమున "శృణువత్స్య మరీచేచ పురాణం స్కాందసంజ్ఞితమ్। యస్మిన్ప్రతిపదం సాక్షా న్మహాదేవో వ్యవస్థితః॥ స్కాందాహ్వయ స్తత్రఖండా స్సప్తైవ పరికీర్తితాః। ఏకాశీతి సహస్రంచ స్కాందం సర్వాఘకృంతనమ్" అనియు, ఈస్కాందపురాణముననే ప్రభాసఖండమున నలువదవయధ్యాయమున ద్వారకాప్రస్తావమున "మండితం సప్తభిః ఖండైః స్కాందం యః శృణుయా న్నరః" అనియు తత్పురుషకల్పోక్తమయిన యీసప్తఖండాత్మకమే మహాపురాణ మని స్కాంద అభియుక్తులు "మాహేశ్వరో వైష్ణవ బ్రాహ్మ కాశ్య స్త్వావంతికా నాగర మత్రషష్ఠమ్। ప్రాభాసికో విప్రవరేణ ఖండా స్స్కాందే పురాణే కథితాః సుపుణ్యాః" అనియు నీస్కాందముననే ప్రభాసఖండద్వితీయాధ్యాయమున "స్కాందంతు సప్తధాభిన్నం వేదవ్యాసేన ధీమతా ఏకాశీతి సహస్రాణి శతంచైకం చ సంఖ్యయా" తస్యాద్యో విభాగస్తు స్కాందమాహాత్మ్యసూచకః। మాహేశ్వర స్సమాఖ్యాతో ద్వితీయో వైష్ణవః స్మృతః। తృతీయో బ్రాహ్మణః ప్రోక్త స్సృష్టి సంక్షేపసూచకః। కాశీమాహాత్మ్యసంయుక్త శ్చతుర్థః పరిపఠ్యతే। రేవాయాః పంచమో భాగ స్సోజ్జయిన్యాః ప్రకీర్త

తః షష్ఠః కల్పో నాగరశ్చ తీర్థమాహాత్మ్య సూచకః సప్తమో యం విభాగోయం స్మృతః ప్రాభాసికో ద్విజాః॥ సర్వే ద్వాదశసాహస్రా విభాగాః పరికీర్తితాః॥ అనియును జెప్పఁబడినది. ఇంతియ కాక బృహన్నారదీయ మహాపురాణమున సర్వపురాణములయు సంఖ్యాపరిగణనపూర్వక మగుపరిగణనము గలదు. ఆప్రస్తావమున నీపైని జెప్పఁబడిన రీతిగలదియే మహాపురాణ మని ఘంటాఘోషముగా వర్ణింపఁబడినది.

ఇంతియకాక, సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ। వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్॥ అని వైష్ణవబ్రహ్మాండపురాణముల యందు పురాణలక్షణము వర్ణింపఁబడినది. స్కాందము ప్రభాసఖండ ద్వితీయాధ్యాయమున, బ్రహ్మ విష్ణ్వర్క రుద్రాణాం మాహాత్మ్యం భువనస్య చ। సంహారశ్చ ప్రదృశ్యేత పురాణం పంచలక్షణమ్॥ అనియుఁ బురాణలక్షణము రెండువిధములుగాఁ జెప్పఁబడినది. ఈరెండులక్షణములందును మొదటిలక్షణము దీనియందు యథాక్రమముగ సంబంధింపకున్న నుత్తరలక్షణము మాత్రము సరిగా సంబంధించిన దనియుఁ గావున నీసప్తఖండాత్మకమే మహాస్కాందపురాణ మనియుఁ దెలియనగును. బృహన్నారదీయపురాణమున నీమహాస్కాందముయొక్క సప్తఖండములయందలి విషయములును యథానుక్రమముగా విషయవివేచనసహితముగా నిరూపింపఁబడినవి. కావునఁబట్టి యిదియే అష్టాదశమహాపురాణాంతర్గత మగుస్కాందపురాణ మనియు దీనికంటె నితర ముపపురాణ మనియు నెఱుంగనగును. ఇంక నుపపురాణ మగుస్కాందమును గూర్చి యించుక పరిశీలింపుదము.

లక్షగ్రంథములును నాలుసంహితలును గలది యుపపురాణ మని నిశ్చయముగా నెఱుంగవలయును. (ఈయుపపురాణము లక్షగ్రంథాత్మక మని చెప్పఁబడినను నక్కడక్కడ వేఱువేఱుగా నగపడుచున్న తదీయావాంతరాంతఃపాతిఖండములయొక్క గ్రంథముల లెక్కించినచో నథమము మూఁడునాలుగు లక్షలగ్రంథమయిన నుండును గావున నిది యనేకప్రక్షిప్త భాగములతోఁ గూడి "స్కాందపురాణమునఁ గూడ నీకల్ల లేదు." అను సామెతకు విషయమై యున్నదని సహృదయు లంగీకరింపక తప్పదు.)

స్కాందోపపురాణమునందలి యీనాలుసంహితలలో మూఁడవ దగు శంకరసంహితయందు హాలాస్యమాహాత్మ్యవర్ణనావసరమున, "స్కాంద మ

ద్యాపి వక్ష్యామి పురాణం శ్రుతిసారజమ్। షడ్విధం సంహితాభేదైః పంచాశత్ఖండమండితమ్। ఆద్యా సనత్కుమారో... శాంకరీ ప్రోక్తా చతుర్థీ వైష్ణవీతథా। పంచమీ సంహితా బ్రాహ్మీ షష్ఠీ సా సౌరసంహితా॥ అని వర్ణింపఁబడి యీ క్రిందివిధమున శ్లోకసంఖ్య చెప్పఁబడినది.

సనత్కుమారసంహిత 36000, సూతసంహిత 6000, శంకరసంహిత 30000, వైష్ణవసంహిత 5000, బ్రాహ్మసంహిత 3000, సౌరసంహిత 1000, మొత్తము 81000.

అని యెనుబదియొక్క వేయి గ్రంథములు గల వని యొకమతము. కాళికాఖండమునఁ జెప్పఁబడినట్లు లక్షగ్రంథములు గల వని మఱియొకతా వున గలదు. ««స్కాంద మేత ల్లక్షమానం స్కందో యత్కథయత్పురా॥ (కాశీఖండము.) ఈమతభేదముచేతనే యీగ్రంథమునందలి యధ్యాయాంతములందు ««ఏకాశీతిసహస్రికాయాం సంహితాయాం»» అనియు ««శతసహస్రికాయాం సంహితాయాం»» అనియుఁ బాఠభేదము లగపడుచున్నవి. ఇంకను మానస హింగుల్యాది వైశ్యపురాణాద్యనేకఖండము లసంఖ్యముగా ఉపపురాణముగాఁ బరిగణింపఁబడిన స్కాందముయొక్క ఖండానుక్రమణికలో నగపడకున్నవి కావున నవి యింకను వేఱే కల వని యూహింపనగును. ఇట్టివాని నన్నింటిని లెక్కించినచో గ్రంథసంఖ్య మూఁడులక్షలకుఁ గూడ మించియుండుటకు సందేహము లేదు. ఉపపురాణము లందలిస్కాందము లక్షసంఖ్యాత్మకము గాను మతాంతరమున నేకాశీతిసహస్రాత్మకము గాను పంచాశత్ఖండమండితము గాను సంహితాషట్కవిశిష్టము గాను నుపపురాణములందుఁ గ్రమమున మూఁడవదిగాను దెలియనగును. మహాపురాణాంతర్గతమన్ననో సప్తఖండాత్మకము నేకాశీతిసహస్రసంఖ్యాతము మహాపురాణములందుఁ బదుమూఁడవదియు ననియు నెఱుంగవలయును. ఆర్యులారా! పైని వ్రాసినదానివలన నేది స్కాందపురాణమో యేది యుపపురాణమో యను విషయము స్పష్టముగఁ దెలియుచున్నదిగదా?

ఇంకను నుపపురాణమందున్న భాగము లేవియో దేనియందును లేక యిప్పుడిప్పుడుఁ గూడ రచింపఁబడు చు స్కాందమునఁ గలియుచున్నభాగము లేవియో తెలియుటకై ముందుగా నుపపురాణముయొక్క యనుక్రమము నిట వివరింతుము.

౧ సనత్కుమారసంహిత- 50000 గ్రంథములు. 25 ఖండములు. 1 క్షేత్రఖండము. 2 తీర్థఖండము. 3 కాశీఖండము. 4 సహ్యాద్రిఖండము. 5 హేమాద్రిఖండము. 6 మలయాద్రిఖండము. 7 వింధ్యాద్రిఖండము. 8 మోక్షఖండము. 9 ప్రభాసఖండము. 10 పుష్కరఖండము. 11 నాగరఖండము. 12 నర్మదాఖండము. 13 శ్రీశైలఖండము. 14 అవంతీఖండము. 15 గౌరీఖండము. 16 కురుక్షేత్రఖండము. 17 కేదారఖండము. 18 హరిద్వారఖండము 19 సేతుమాహాత్మ్యఖండము. 20 కాలికాఖండము. 21 తత్త్వవ్యాఖ్యానఖండము. 22 నదీఖండము. 23 ధర్మఖండము. 24 దేశఖండము. 25 వర్షఖండము.

౨ సూతసంహిత 4 ఖండములు. అధ్యా. 67 గ్రం. 6 వేలు.

(1) శివమాహాత్మ్యఖండము (2) జ్ఞానయోగఖండము (3) ముక్తిఖండము (4) యంత్రవైభవఖండము.

3. శంకరసంహిత. 21. ఖండ. 30 వేల గ్రంథములు అధ్యాయములు 2 వేలు-పూర్వార్థమున-

సంభవఖండము, అసురఖండము, వీరభద్రఖండము, దేవకాండము, యుద్ధఖండము, దక్షకాండము, ఉపదేశకాండము, (ఉత్తరార్థమున,) ఉపవీతఖండము, స్వరఖండము, గంగాసాగరఖండము, సాగరఖండము, వేదసారఖండము, సిద్ధఖండము, ప్రమేయఖండము. ఉమాఖండము, నాగరఖండము, ప్రాయశ్చిత్తఖండము, విపాకఖండము, దానప్రశంసాఖండము, కల్యాణఖండము, అగస్త్యఖండము.

౪ వైష్ణవసంహిత. గ్రం. 10 వేలు. 300 అధ్యా. ౫ బ్రహ్మసంహిత. గ్రం. 3 వేలు. (దీనియం దుత్తరభాగమునకు బ్రహ్మోత్తరఖండ మని పేరు.) ౬ సౌరసంహిత. 1 వేయి గ్రం.

అనియావిధముగా నాఱుసంహితలును లక్షగ్రంథములును నేబదిఖండములును గౌరీఖండమున వివరింపఁబడినవి. వీనిని బరిశీలించినచో నీయుపపురాణస్కాందమువిషయమై యనేకసంశయము లుదయించుచున్నవి.

ఈపురాణముయొక్క గ్రంథసంఖ్య యీపురాణమునందే సనత్కుమారశంకరసంహిత ఒకదానియందు ఎనుబదియొక్క వేయి యనియు రెండవదానియందు లక్షయనియుఁ జెప్పఁబడియున్నదిగదా ? ఇందేది వాస్తవము? రెండును వాస్తవములు గానేరవుగదా? మొదటి లెక్కకంటె రెండవ

లెక్క యందు 19 వేల గ్రంథము లధికముగా నున్నవి. ఈ విభేదము సర్దు టెట్లు? శంకరసంహితావాక్యము ప్రమాణమే యైన లక్షాత్మకగ్రంథమునందు 19 వేలశ్లోకములు ప్రక్షిప్తములు కాకతీరదు. కాళీఖండవాక్యమే ప్రమాణమైనచో ఏకాశీతికగ్రంథమున 19 వేలశ్లోకములు క్లుప్తములు కావలసి వచ్చును? ఇందు దేనిని మనము ప్రమాణముగా నంగీకరింపవలయునో తెలియదు. బాగుగ విమర్శించినచో దీనియందలి పరిమాణము మూఁడులక్షలకుఁ గూడ మించియుండు నని యిదివఱకే వివరింపఁబడెను. లక్షకుఁగాని యెనుబది యొకవేయికిఁ గాని సరిపడు గ్రంథముల నుంచి మిగిలినవానిని బరిహరింతమన్నచో వేనిని బరిహరింపవలయునో యెవరు నిర్ణయింపఁగలరు? ఉన్నకథ లన్నియు వానిశైల్యాది కవితాధోరణు లన్నిభాగములయందు నొకరీతిగానే యున్నవి. విషయానుక్రమణిక ననుసరించి నిర్ణయింతమన్న శంకరసంహితలో నదిలేదు. కాళీఖండమున నున్నను అదియే ప్రక్షిప్తమగునెడ దానికిఁ బ్రామాణ్య మట్టేయగును? కావున నీవిషయమున నిదమిత్థమని నిర్ణయించుట కిసుమంతయు నామదికి సాహసము కలుగకున్నది? ఎవరైనఁ బండితమూర్ధన్యు లీపనియొనరించిన లోకమున కత్యంతోపకార మగును.

ఇంతియ కాక మహాపురాణమునం దున్నఖండముల పేరులు గొన్ని యుపపురాణమునందుఁ గూడ నగపడుచున్నవి. చిత్తగింపుఁడు.

కాశీఖండము, ప్రభాసఖండము, నాగరఖండము, అవంతీఖండము, అనునాలుగుఖండములు మహాపురాణమునందును ఉపపురాణీయసనత్కుమారసంహితయందును గలవు. ఇంక మహాపురాణమున మిగిలిన మూఁడుఖండములు వైష్ణవమాహేశ్వరబ్రాహ్మములు ఉపపురాణమందు లేవని యగపడుచున్నది. ఉపపురాణమందు త్రిమూర్తులనామములతో మూఁడుసంహితలు ప్రధానములుగా నున్నవి. వానినే ఖండములుగాఁ బరిగణించినచో మహాపురాణమునందలి ఖండసప్తక ముపపురాణమందుఁ గల దని తేలును. ఈమూఁడుసంహితలను ఖండములుగాఁ గూడ వ్యవహరించిన ట్లాధారములు గలవు. ఇంతియ కాక వీనియం దున్నకథలు గూడఁ జాలవఱ కేకముగానే యున్నవి. మతాంతరమున నుపపురాణము లక్షగ్రంథపరిమిత మయినను ఏకాశీతిసహస్రాత్మక మనుమతమున రెంటింటికి గ్రంథసంఖ్య కూడ సరిపడుచునే యున్నది. అట్టితఱి నీరెండింటికిని భేద మేమి కలదు? రెంటియందు

ను గనఁబడు కథాంశముల నెక్కడో నేర్చి కూర్చినచో నించుమించుగా
నెనుబదియొక్క వేయి గ్రంథభాగములు సమముగ నగును. ఇంకవిడిపోయిన
కథాంశములు న్యాయముచే నీరెంటియందలివియుఁ గావు.

సామాన్యముగ నుపపురాణములు నుత్తరపురాణములును బ్రాచీన
ములుగా నగపడవు. అర్వాచీనులు దమతమబుద్ధివైభవము ననుసరించి తమ
కాలమం దేర్పడిన క్షేత్రములనో వ్రతములనో యధికరించి కొంతగ్రంథము
వ్రాసి పురాణముల కంటఁగట్టుటచే నీయుపపురాణము లుద్భవించుచున్నవి.
మచ్చున కొకటిరెండు చిత్తగింపుఁడు. "వైశ్యపురాణము" ఇయ్యది బ్రహ్మ
మార్కండేయస్కాందపురాణములందలి యుత్తరఖండములందలిది యట.-

ఈపురాణము మహాపురాణమూ కాదు. ఉపపురాణమూ కాదు.
ఉపోపపురాణము గావలయును. అయిన నిది మూఁడు మహాపురాణము
లం దుండుట కేమిహేతువు? ఇందలి కథ రాజరాజనరేంద్రునినాఁటి దం
ట! అది కేవలము చరిత్రవిరుద్ధమే? పోని, యన్నింటిలోను వాస్తవము
లగు గ్రంథభాగమందలిది కాక యెవరు నెఱుంగని యుత్తరభాగములంద
లి దంట. అట్లున్నను నొక్కటి రెండుపేరులు దక్కఁ జాలవఱకు నందలిపు
రుషుల నామములును ననేకకథాంశములును భిన్నభిన్నములుగా నున్నవి.
వీనిని బట్టి యిది కల్పిత మనుట తేలదా? మార్కండేయోత్తర ఖండము
నందలి యుత్తరఖండ మీనడుమనే మదరాసు ప్రభుత్వపు ప్రాచ్యలిఖిత
పుస్తకాగారమునకు లభించినది. దానియందు వర్ణింపఁబడిన విషయములు
ఆంధ్రదేశమందలి క్షత్రియుల వంశావళులును వారిచరిత్రమునే యైయున్న
ది. పెద్దాపురము వత్సవాయివారు విజయనగరము పూసపాటివారు వీరికు
పుర బంధువు లగు కలిదిండి, కాకర్లపూఁడి, మందపాటి, చింతలపాటి, మొ
దలగునింటిపేర్లు గల క్షత్రియకుటుంబము లనేకము లందు వర్ణింపఁబడినవి.
విజయనగరము ప్రభువగు విజయరామగజపతిగారికిని ఈస్టిండియా కంపెనీ
వారికిని పద్మనాభముకడ జరిగిన యుద్ధముకూడ నందు వర్ణింపఁబడినది.
ఇఁక నీపురాణమున కెంతప్రామాణ్య మీయవచ్చునో యెంతప్రాచీనమో
యూహింపనగును. ఇంక నిట్టివే మల్లపురాణము గాంగక్షత్రియపురాణము
మొదలగునవి యనేకము లీకాలమున దృగ్గోచరము లగుచున్నవి.

వీని నన్నింటినిం జూడఁ జూడ నివి కేవలము నూతనకల్పితము లా

ని యెట్టివారికైనఁ దోఁపక మానదు.

కాని మనస్కాందోపపురాణము మాత్ర మిట్టిపుక్కిటిపురాణ మన వీలు లేదు. మన యాంధ్రకవు లనేకులు స్కాందోపపురాణము నాంధ్రీకరించియున్నారు. కాని వారు దాని నుపపురాణముగా మాత్రము పరిగణింపక మహాపురాణముగా గణించి యున్నారు. వాస్తవముగ వారు తెనిఁగించిన భాగము లుపపురాణాంతర్గతములే. శ్రీనాథమహాకవి తాను దెనింగించిన కాశీఖండము మహాపురాణాంతర్గతమే యని చెప్పియున్నాఁడు.

«కథలతో నేకలక్షగ్రంథపరిమాణకలితమై శ్రీమహాస్కాందమొప్పు నమ్మహాస్కాందమునకు సారాంశమైన» «గరిమకెందంబు నగు మహాస్కాందమునకు» "ఇమ్మహాస్కాందంబునకు నవయవంబు లాఱు సంహితలు» అని యిట్లు కాశీఖండము ప్రస్తావనమునఁ జేర్కొనినాఁడు. దీనినిబట్టి చూడ నీ యుపపురాణమే మహాపురాణముగా మన కవు లంగీకరించిరా యనిసంశయము దోఁచుచున్నది. సూతసంహిత మొదలగు కొన్నిసంహిత లాయాకవులచే నాంధ్రీకరింపఁబడి యున్నవి. కావున స్కాందోపపురాణము మాత్రము కొంత ప్రాచీనమే యనకతీఱదు. అయినను నితరోపపురాణోత్తరఖండములందు వలెనే దీనియందు ననేకవ్రతక్షేత్రనదీదానాదిమాహాత్మ్యములం దెల్పు గ్రంథభాగము లనంతముగాఁ జేరియున్నవి. ఇంకను జేరుచున్నవి- కావుననే «స్కాందాబ్ధి, స్కందపురాణనీరనిధి» మొదలగు మనవారివ్యవహార మన్వర్థ మగుచున్నది.

సహృదయులారా! నే నేదియో కొంచెము పరిశ్రమించి నాకుఁ దోఁచినరీతి నిందు వ్రాసియున్నాఁడను, నా యుద్దేశము మొదట స్కాందద్వయము గలదనియు నిది మహాపురాణ మిదియుపపురాణ మనియుఁ దెలుపుటయే. ప్రసక్తానుప్రసక్తముగా ననేకవిషయము లిందు దొరలినవి. నాకుఁ దోఁచినసంశయములను బ్రకటించితినే కాని మీ రివియే సిద్ధాంతము లని గ్రహింపరాదు. మీరు మీకుం దోఁచిన నిర్ణయముల జేసికొనుఁడు. నా వ్రాఁతయందుఁ దప్పులున్న వానిని మన్నించి పరిహరింపుఁడు. ఇప్పటి కొదవిన యవకాశము ననుసరించి యీ వ్యాసము వ్రాసినాఁడ. వీలువెంట నింక నధికపరిశ్రమ మొనరించి పురాణముల చిక్కుసడలింపనున్నాఁడను. ఈకార్యమే యితరు లెవరేని జేసిన మిక్కిలిఁ గృతజ్ఞుఁడ.

# శ్రీకృష్ణభూపతితారావళీ ప్రశంస.

అడిదము రామారావుగారు.

కృతిపతి:—శ్రీకృష్ణభూపతితారావళి యనుపేరఁ బరఁగు నీచాటు కావ్యమునకుఁ గృతినాయకుఁడు శ్రీకృష్ణభూపతిమహారాజు. విశాఖపట్టన మండలములోని మాడుగులసంస్థానము నితఁడు క్రీ. శ. 1834–1876 వఱకుఁ బాలించెను. ఈనృపవరుఁడు మహాదాత. విద్యాభిమాని. అనేకు లగుపండి తులను గవులను బోషించి వన్నెకెక్కినవాఁడు. మంచిరసజ్ఞుఁడు. తెలుఁగు కవిత నెక్కువగా నాదరించి యభినవకృష్ణరాయలనికీర్తిగన్న రాజోత్తముఁడు. 19వశతాబ్దపు ఆంధ్రకవులలో నుత్తమకవి యని ప్రసిద్ధిగన్న మంత్రిప్రెగ్గడ ప్రకాశకవి యీమహారాజునొద్ద నాస్థానకవిగా నుండెను. ఇంద్రగంటి గోపా లశాస్త్రిప్రముఖపండితప్రవరు లీసభ నలంకరించియుండిరి. పండితకవి యను శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, అడిదము బాలభా స్కరకవి (ఈతారావళికృతికర్త) మొదలగుకవు లీభూపాలుని సమ్మానమును బొంది వర్షాశన మనుభవించుచుండెడివారు. శ్రీకృష్ణభూపతిమహారాజు నెఱ మెచ్చులదాత యని చెప్పు నొకపద్య మిచట నుదాహరించుచున్నాను.

సీ. బొండుమల్లెకులసద్భూరిసౌగంధ్యంబు చెఱకుఁగోలకుసమంచితమధురిమ
కంఠీరవమున కుగ్రప్రభావసమృద్ధి యంచకుఁ బాలునీ రెంచునేర్పు
గండుఁగోయిలకుఁ జక్కని కలధ్వనిలీల ప్రహ్లాదునకు హరిభక్తిభియతి
మలయానిలమునకు లలితశీతలవృత్తి వాణికిఁ బ్రాచుర్యవర్ణనంబు
నీకు వితరణశీలంబు లోకమెల్లఁ, బొగడుచుండఁగఁ దోడనె పుట్టెనౌర
మత్స్యకులదీప! దివ్యమన్మథనురూప,పరమగుణధామకృష్ణభూపతిలలామ.

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి.

మహానీయుఁ డగునీభూపాలాగ్రణి క్రీ. శ. 1875 సంవత్సరము డిసెం బరు 25వ తేదీని బరలోకగతుఁ డయ్యెను.

కృతికర్త:—ఈపద్యములను రచియించినది సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁ డగుఅడిదము సూరకవిప్రపౌత్రుఁ డగు బాలభాస్కరకవి. ఈతఁడు క్రీ.శ.1808 సంవత్సరమున జననమొంది 1874 సంవత్సరములోఁ గీర్తిశేషుఁ డయ్యెను. ఇతనికాఁపురము విజయనగరమునకు సమీపముగ నున్న రెల్లివలసగ్రామము

ఇతఁడు తనతాతదండ్రులయొద్ద విద్యాభ్యాస మొనర్చినవాఁడు. సంస్కృతాంధ్రములయందు మంచివైదుష్యము గలవాఁడై మనోహరముగఁ గవిత్వము చెప్పి పండితులమెప్పును గొని యశస్సు నార్జించినధన్యుఁడు. తన ప్రపితామహుఁడగుసూరకవివలెఁ గవితావృత్తిచే దేశాటనముఁ జేయుచుండువాఁడు. శ్రీకృష్ణభూపతిమహారాజుసభలో సమ్మానము నొందినవాఁడని తత్సంస్థానకవివరుని యీక్రిందిచాటుపద్యము చెప్పుచున్నది.

క. పాగాగలకవు లిద్దఱు, బాగొందిరి కృష్ణమూర్తిభాస్కరులు మహా
 భోగులు గన్యానురాగులు, గోగణపాలకులు మాడుగులసభలోనన్.

(మంత్రిప్రెగడ ప్రకాశకవి.)

బాలభాస్కరకవి శ్రీవేంకటేశ్వరశతకము, జానకీరామశతకము, భోగలింగశతకము, సింహాశైలనృసింహశతకము మొదలగు కొన్నిశతకములను, పదములు పద్యములు గలపెక్కుచాటుకృతులను జెప్పెను. చిత్రబంధకవిత్వములయందుఁ గూడ నీతనికి మంచిసామర్థ్యము గలదు.

## శ్రీకృష్ణభూపతితారావళి.

క. శ్రీమన్మృగరాజ"అశ్విని", సోమకళాభరణగౌరి సంభవద్విభవ
 స్తోమ మిము నీవ శ్రితసుర, భూమిజ మత్స్యకులకృష్ణభూపలలామా.

క. సిరియును నాయువు తేజము, నిరుపమరథమును గజాశ్వనిచయము లెలమిన్
 గరుడాశ్వనీకు నీవు తే, సరసాగ్రణి కృష్ణభూప స్మరనిభరూపా.

క. వరరత్నాంచితవలయా, "భరణి"తకరుఁడ వగునిన్నుఁ బ్రస్తుతి సేయం
 దరమా సత్కవివరులకు, సరసాగ్రణి కృష్ణభూప స్మరనిభరూపా.

క. "కృత్తిక"మనీయవాసుఁడు మత్తగజాందోళికలనమహి నీకుఁ గృపా
 యత్తమతి నొసఁగు నృపకుల, సత్తమ శ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. చారుశరీరమరాళా, శ్యా"రోహిణి", నీయశోమహత్త్వము గని గం
 భీరత చెడి బెగడొందెను, దారత శ్రీకృష్ణభూప దర్పకరూపా.

క. నట్టడవిని "మృగశిర"ముం, గొట్టినరఘురాముకరణిఁ గుటిలారితతిం
 గొట్టఁగ నెట్టితపము తొలి, పుట్టినఁ జేసితివొ కృష్ణభూపలలామా.

క. అనుపమపండితకవులకు, మును కోని కరుణార్ద్రభావమున ముత్యసరాల్
 ఘనమగు గుజాలనొసఁగెద పసఘా శ్రీకృష్ణభూప యంగజరూపా.

క. హరిభవదాగారములను, గరుణఁ "బునర్వసు" రథాశ్వగజవాహనసం
భరితములు చేయుఁగావుత, సరసాగ్రణి కృష్ణభూప స్మరనిభరూపా.

క. ఘన "పుష్యమి" హితుఁడవు సుజ్జనులకుఁ గుజనులకు గ్రీష్మసవితృఁడ వంచుం
వినుతింతురు నిను సతతము విను మవహితకృష్ణభూప విభవోద్దీపా.

క. నీమృదువా "గాశ్లేషలు," కామారికినైన నెన్నఁగా వశమె గుణ
స్తోమా రిపుభీమా రవి, ధామా శ్రీకృష్ణభూప దర్పకరూపా.

క. శత "మఘ" విభవస్ఫురణన్, వితతమహాభోగమహిమ వెలసితివి కళా
శతధృతి బుధనుతి వాచ, స్పతిమతి శ్రీకృష్ణభూప భావజరూపా.

క. పలుమఱువల "పుబ్బ" గమగు వలుగని మరుఁడనుచు నిన్నుఁ బలుకుదురుతమిం
గులపావన ఖలవిదళన విలసద్యశ కృష్ణభూప విభవోద్దీపా.

క. లో"కోత్తర" చారిత్రా, ప్రాకటకవిపద్మమిత్ర వరశుభగాత్రా
శ్రీకర సుగుణాకర రిపు భీకర శ్రీకృష్ణభూప విభవోద్దీపా.

క. వరశంఖచక్రతోమర, సరసిజకులిశాంకుశాది చారుతరశుభా
కరరేఖాంకిత "హస్తాం," బురుహో మత్స్యకుల కృష్ణభూపలలామా.

క. "చిత్ర"తరము లగునీచా, రిత్రము లెన్నంగ హరిగిరీశులవశమా
గోత్రారివిభవ రణహత, శాత్రవ శ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. "స్వాతి"శయ మొదవు రిపుసం, ఘాతంబుల నొంకమణఁచి ఘనతరవరవి
ఖ్యాతిని భాసిల్లితి వౌ, భూతలి మత్స్యకులకృష్ణభూపలలామా.

క. ధరణి "విశాఖా"త్మజసుర, ధరణీమహాసదృశకీర్తిఁ దనరితివి మహా
భరణా వరకరుణా కవి, శరణా శ్రీకృష్ణభూపస్మరనిభరూపా.

క. అనిశ "మనూరాధా" వర, వనజేక్షణ కృష్ణభక్తవత్సల యనుచున్
మనమున శ్రీహరిదలఁచెదు జననుత శ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. ధరణిసుర "జ్యేష్ఠా"దులు, నిరతమువర్ణింప లేని నీసద్గుణముల్
వెర పమర నాకుఁ బొగడఁగఁ, దరమా శ్రీకృష్ణభూప దర్పకరూపా.

క. సుగుణములకెల్ల "మూల"ము, జగతిం దాతృత్వమనుచు సంతస మొప్పం
దగినట్లర్థుల కొసఁగుచుఁ బొగడొందితివయ్య కృష్ణభూపతివర్యా.

క. "పూర్వాషాఢ"పు నెల డివిఁ, బర్విన జీమూతకాంతి భాసిలు హరి మి
మ్మూర్విన్ బ్రోచుత రిపుమద గర్వాపహ కృష్ణభూప కాయజరూపా.

క. అరిజనకువలయసముదయ, హరణంబానరించె "నుత్తరాషాఢ" దివా

క. హరిచరిత„శ్రవణం"బన వరతము గావించుచుండి పరఁగితివి బుధా
దరణా రిపుహరణా శ్రిత శరణా శ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. వారిజభవాదు లైనను, నేరరుగద నీసుబో„ధనిష్ఠ"లు శ్రితమం
దారా రణశూరా సువి చారా శ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. కలుషగద„శతభిష"క్కని, పలుకందగు హరినిఁ గొలిచి భాసిలు నినుని
చ్చలు మెచ్చఁగ నాతరమా, సలలితశ్రీకృష్ణభూప స్మరనిభరూపా.

క. ఆదిత్య„పూర్వభాద్రా", పాదక వసుదేవపుత్ర పాహియటంచున్
మోదమునఁ దలఁచుచుందువు, శ్రీదయితునిఁ గృష్ణభూప చిత్తజరూపా.

క. ధరణీశో„త్తర ! భాద్రా" కర ! రక్షింపుమను శత్రుగణములనెల్లం
గరుణించి ప్రోచుచుందువు, సరసాగణి కృష్ణభూప స్మరనిభరూపా.

క. „రేవతి"యనుకామినితను సేవింపఁగఁదలఁచు సుగుణశీలికి ననుజుం
డైవిలసిల్లెడు వానిన్ భావించెదు కృష్ణభూప భావజరూపా.

క. తారావళి యనుకావ్యము, తారావళికరణిఁగూర్చితనరఁగనీకుం
జేయగనొసఁగితినిదిగొని, భూరికృపం బ్రోవుకృష్ణభూపతివర్యా.



# కావ్యగుణములు.

వఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు.

విచక్షణులారా !

సువర్ణపుగుణములను బరీక్షించుటకు నికషోపలమువలెఁ గావ్యవాఙ్మయమునందలి గుణదోషములను బరిశీలించుట కలంకారశాస్త్ర మత్యంతావశ్యకమై యున్నది. అలంకారశాస్త్రము కావ్యవాఙ్మయమునందలి గుణదోషములను విమర్శించి యుత్తమమార్గములను జూపుచు నుత్తమకావ్యముల యభివృద్ధికిఁ బ్రధానసాధనము కానోపునని చెప్పుటకుసందేహము లేదు.

అట్టి యలంకారశాస్త్ర మాంధ్రవాఙ్మయమునకు లేనిలోపమును దీర్పనెంచి కొందఱాంధ్రకవులు సంస్కృతవాఙ్మయస్థ మగునలంకారశాస్త్రమును మూలముగాఁ గొని యాంధ్రభాషలో వ్రాయ సమకట్టినందులకు వారియెడల నాంధ్రలోకము కృతజ్ఞతను జూపవలసియున్నది.

అట్లాంధ్రమున నలంకారశాస్త్రగ్రంథములను రచించినవారిలోఁ గావ్యాలంకారచూడామణికర్త యగువిన్నకోట పెద్దనార్యుఁడును, నరసభూపాలీయకర్త యగుప్రబంధాంకము మూర్తికవియుఁ బ్రధానులై యున్నారు. వీ రిద్దఱును నాంధ్రుఁడే యగువిద్యానాథుఁడు కాకతివంశీయుఁ డగుద్వితీయప్రతాపరుద్రున కంకితముగా రచించిన కావ్యాలంకారసంగ్రహ మను నామాంతరము గలప్రతాపరుద్రీయమును జూచి తమతమప్రభువుల కంకితములుగా నట్టిగ్రంథముల రచించిన ట్లగపడుచున్నది. మూర్తికవివలె నొక్కయలంకారశాస్త్రరచనముతోడనే తృప్తినొందక పెద్దిరాజు తనగ్రంథమున ఛందోవ్యాకరణవిషయములనుగూడఁ జేర్చియున్నాఁడు.

పెద్దిరాజు తనగ్రంథమును జాళుక్యవిశ్వేశ్వరరాజున కంకితముగ రచించినను విద్యానాథునివలెఁ దనప్రభువుపేరితోఁ దనగ్రంథమునకు విశ్వభూపాలీయ మని నామకరణము చేయలేదు. మూర్తికవి యట్లుగాక నరసభూపాలీయ మని తనగ్రంథమునకుఁ బేరిడుటయే గాక విద్యానాథునిమార్గము నె యనుసరించి కావ్యాలంకారసంగ్రహ మనికూడ దానికిఁ బేరుపెట్టెను.

శ్లో॥ చిరేణ చరితార్థోభూ త్కావ్యాలంకారసంగ్రహః। ప్రతాపరుద్రదేవస్య కీర్తిర్యేన ప్రకాశ్యతే. (ప్రతాపరుద్రీయము I ప్ర. 3 శ్లో)

మ. అని యూహించి మదీయసంఘటితకావ్యాలంక్రియాసంగ్రహం
బనఘం బై వెలుఁగొంద కున్న రవివంశాధీశ్వరుండౌ నృసిం
హ ప్రపాలాగ్రణికీర్తివర్ణనముచే నాశాంతవిశ్రాంతపా
వనమౌఁ గావున నందు నాయకమహావంశంబు వర్ణించెదన్. (నర.1ఆ)

ప్రతాపరుద్రీయములో ననేకస్థలములయందు లోపము లున్నవి. మూర్తికవియును బెద్దిరాజును గొన్ని సందర్భములందుఁ బ్రతాపరుద్రీయ భాగము నుపేక్షించి గ్రంథాంతరములలోని విషయములను దమగ్రంథము లందు నిల్పియున్నారు. కాని యట్లు మార్చినను నాలోపములు చక్కఁబడ కుండుటచే వారచట విద్యానాథునిలోపములను గ్రహించి సవరించుకొన యత్నింపలేదనియు, గ్రంథసంక్షేపముం గోరి యాయాసందర్భములందుఁ గావ్యదర్పణములలోని విషయములను సంగ్రహించిరనియుఁ దోఁచుచున్నది. మఱియు వీరు మతాంతరముల ననాలోచితముగ మేళగించుటవలన మూలభూతప్రతాపరుద్రీయములోని లోపములే గాక మఱికొన్ని స్వయంకృతాపరాధములకుఁ గూడఁ బాల్పడవలసి వచ్చెను. ముఖ్యముగఁ బ్రతాపరుద్రీయములోని గుణప్రకరణమున విరోధము లధికముగ నగపడుచుండుటం జేసి యావిషయము నిట విమర్శించుచున్నాను.

"శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవం । హారాదివదలంకారాస్తత్ర స్యురుపమాదయః॥ శ్లేషాదయో గుణాస్తత్ర శౌర్యాదయ ఇవస్థితాః । ఆత్మోత్కర్షావహాస్తత్ర స్వభావా ఇవ రీతయః । శోభామాహార్యకీం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా । పదానుగుణ్యవిశ్రాంతి శయ్యా శయ్యేవ సమ్మతా । రసాస్వాదప్రభేదా స్స్యుః పాకాః పాకా ఇవ స్థితాః । ప్రఖ్యాతా లోకవదియం సామగ్రీ కావ్యసంపదః॥" (ప్రతాపరుద్రీయము 2 ప్రకరణము 2 శ్లో)

క. తను వగు శబ్దార్థంబులు, ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్
(నరస-2ఆ-53)

పాలకోసము కాలు మోసినట్లు లోకసామగ్రితోఁ దాల్యమును నిరూపించుటకై యిట్లు కావ్యసామగ్రి పెంచి వ్రాయఁబడెనే గాని విమర్శించి చూచినచోఁ బెక్కుభేదాలుఁ గనఁబడిన విషయముల కంతగాఁ బరస్పరభేదమే

కనుపట్టుచున్నది. ఈసందర్భమునఁ బ్రతాపరుద్రీయములో నుదాహరింపఁబడిన యిరువదినాల్గుగుణముల విషయమునందును ననేకము లగువిప్రతిపత్తులు తోఁచుచున్నవి.

"మిథ స్సంశ్లిష్టపదతా శ్లేష ఇ త్యభిధీయతే" (5ప్రక-4శ్లో) "యా పృథక్పదతా వాక్యే తన్మాధుర్యం ప్రకీర్త్యతే" (5ప్ర-7శ్లో) ఇందువలన శ్లేషమాధుర్యగుణములు పరస్పరవిరుద్ధము లని తేలుచున్నది. అట్టియెడల నీరెండింటికి సంగతియే లే దనవలసివచ్చును గదా ? మఱియు వాక్యస్థపదములు విడివిడిగా నున్నను గలిసియున్నను గుణమే యగు నపు డెట్లున్నను క్షితి లేదు గదా ? వీనిని బ్రత్యేకించి పేర్కొన నేల ? ఇంతియ కాక యేక పదమువలెఁ దోఁచునట్లు పదములు సంధించుట శ్లేష మనులక్షణమునకు లక్షణకర్తృరచితలక్ష్యములె గాని వేఱె వాఙ్మయమున లక్ష్యములు దొరకుట దుర్లభము గదా ! కావున వాఙ్మయస్థ లక్ష్యపరంపరలను బట్టి దండ్యాచార్యుఁడు చెప్పినట్లు పదబంధమున విసర్గవ్యంజనాదులమూలమున శైథిల్యము లేకుండుట శ్లేష మనులక్షణమె యుక్తతర మని గ్రహింపవలయును.

"సుకుమారాక్షరప్రాయం సౌకుమార్యం త దుచ్యతే" (5ప్రక-8శ్లో) "వికటాక్షరబంధత్వ మార్యై రౌదార్య ముచ్యతే" (5ప్రక-11శ్లో) అనులక్షణములచొప్పున, వికటాక్షరము లున్నను సుకుమారాక్షరము లున్నను గుణమే యగునపు డింకనె ట్లున్నను సరేగదా ? వీనిని బ్రత్యేకించి చెప్పనేల ? ఈగుణము లిరువదినాల్గును బాటించునపుడు వీనిచే నిరాకృతము లగుచున్న (చూడు-ప్రతాప-5ప్రక-2శ్లో) క్లిష్టప్రక్రమభంగశ్రుతిదుష్టాపుష్టార్థాశరీరగ్రామ్యానుచితార్థచ్యుతసంస్కార పరుషవిసంధిన్యూనాధికపదాశ్లీలపతత్ప్రకర్షాది దోషములను మరల వేఱ యీతఁడు దోషప్రకరణమున నేల చెప్పవలయునో తెలియరాకున్నయది. ఇంతియ కాక కేవలశబ్దధర్మము లగు శ్లేషసుకుమారతౌదార్యాదిగుణములను ఆత్మధర్మభూతశౌర్యాదులతో నుపమించుట యెట్లు పొసఁగునో తెలియరాకున్నది.

పైరీతిని విద్యానాథుఁడు దండ్యాచార్యాదులు చెప్పినగుణముల లక్షణములను జాలవఱకు మార్చివేసినను నీతఁ డంగీకరించినచొప్పున నైతము మీఁదికావ్యసామగ్రి యెల్ల గుణాంతర్భూతమె యగుచున్నది.

« ధ్వనిమత్తాతు గాంభీర్యమ్ » (ప్రతాప 6 ప్రక 19 శ్లో) అను లక్షణము గలగాంభీర్యమును నిర్వహించునపుడు కావ్యజీవితభూతవ్యంగ్యమె

భవము సిద్ధమె యగును. గుణీకృతము కానివ్యంగ్య మెల్ల ధ్వనియే యగు టచేతను, రసభావాదులు ధ్వన్యంతర్భూతము లగుటచేతను గావ్యజీవితము వ్యంగ్యవైభవ మన్నను ధ్వనియన్నను రసమన్నను నవి గాంభీర్యగుణమున సిద్ధింపక తీరదుకదా !

'ఉదాత్తత, ప్రేయము, విస్తరము, సమాధి' అనుగుణములమాట యటుండఁగా "ప్రౌఢి రుక్తేః పరీపాక ఇతి కావ్యవిదో విదుః" విదగ్ధభణితి ర్వా స్యా దుక్తిం తాం కవయో విదుః" (ప్రతాప 6 ప్రక 22, 23 శ్లో) అనులక్షణములు గల ప్రౌఢియు నుక్తియు ననుగుణములను నిర్వహించునప్పు డలంకారరూపసామగ్రి సిద్ధింపక తీరదు. "ప్రాచా మార్యాణాం మతేన సంఘటనాశ్రయత్వమేవ గుణానాం తదుక్త మలంకారసర్వస్వే సంఘటనా ధర్మత్వేన శబ్దార్థధర్మత్వేనచ గుణాలంకారాణాం నిరూపితస్స్వరూపభేదః అన్యథా స్వరూపభేదస్య దుర్నిరూపత్వాత్" (ప్రతాప 6 ప్రక 227 పుట) అని యిట్లు గుణాలంకారములకు భేదమును నిరూపించుటకు విద్యానాథుఁడు యత్నించెను. కాని గుణములు సంఘటనాశ్రయములు లనఁగా వాక్యరచనామార్గనిరూపకము లని కదా యర్థము. అట్టియెడ వాక్యరచనావిషయమున విదగ్ధభణితులును, నుక్తిపరిపాకమును నత్యావశ్యకము లని తాను జెప్పినప్పు డట్టివాక్యములం దలంకారములు సుఘటములు గాక మానవు గదా ! మఱియు అలంకారేణ రహితం నిరలంకార ముచ్యతే. (ప్రతాప. 5 ప్ర. 51) అను చొప్పునఁ గావ్యవాక్యరచనము నిరలంకృతికమై యుండ నే యుండరాదు గదా !

"రీతిర్నామ గుణాశ్లిష్టపదసంఘటనా మతా" (ప్రతాప. 2 ప్రక. 20 శ్లో.) అను లక్షణముగల రీతులు గుణములకంటె భిన్నములు కానేర వని యాతని రీతిలక్షణమె యుద్ఘోషించుచున్నది. వైదర్భ్యాదిరీతీనాం శబ్ద గుణాశ్రితానా మర్థవిశేషనిరపేక్షతయా కేవలసందర్భపాకమార్దవప్రౌఢత్వమాత్రవిషయత్వాత్ కైశిక్యాదిభ్యో భేదః (ప్రతాప.2 ప్రక. 33 పుట) అనుచొప్పున రీతులవంటివే యగువృత్తులు సైతము గుణాత్మకములే యగుచున్నవి. అనఁగా వైదర్భీరీతియుఁ గైశికీవృత్తియు మాధుర్యసుకుమారతాదిగుణముల చేతను, ఆరభటీవృత్తియు గౌడీరీతియు నోజఃకాంతిగుణముల చేతను, గతార్థములు కాకతీర దని గ్రహింపవలెను. ఇంక రీతులకన్న వృత్తు

లకు రసానుకూలరచనాత్మకత్వరూపభేదము గల దని చెప్పుట యెంతమాత్రమును యుక్తము కాదు. కావ్యస్థవాక్యములయందలి పదసంఘటనము రసానుగుణమే యయి యుండక తీరదు. అట్లుండనిచో "రసానుగుణా రీతి,ర్వృత్తారీతి తదుచ్యతే." (ప్రతా. 4 ప్రక. 28 శ్లోక) అను లక్షణము గల యరీతిక మను దోషము దుర్నివార మగును. విద్యానాథుఁడు చెప్పినట్లు వృత్తిరీతులకు భేదము నంగీకరించినచో శుద్ధరీతి లక్ష్యము లాదనిదుతమున నియతముగ నరీతికతాదోషమునకు లక్ష్యములై యుండక తప్పదు.

పయిరీతిని ప్రతాపరుద్రీయములోని గుణసందర్భ మనేకదోషముల కవకాశ మిచ్చుచున్నది. మూర్తికవియుఁ బెద్దిరాజును నీసందర్భమునఁ బ్రతాపరుద్రీయములోని గుణసందర్భము నుపేక్షించి కావ్యాదర్శములలోని గుణసందర్భమును జాలవఱకు గ్రహించియున్నారు. కాని వీరు పైదోషములను గ్రహించి వానిని చక్కఁజేసికొనుటకై యిట్లు గ్రంథాంతరవిషయములను స్వీకరించిన ట్లగపడదు. వీరు గ్రహించిన కావ్యాదర్శాదులలోని గుణములకుఁ గూడ వెనుక నుదాహరించిన కావ్యసామగ్రి యెల్ల భిన్నము కానేరదు.

ప్రతాపరుద్రీయమతమున నంగిభూతరస మలంకార్యము ఉపమాదులలంకారములు కావ్యాదర్శమునమతమున నన్నచో యంగభూత మగు నసఁగా గుణీభూతమగు రసమువలెనే యంగిభూతరసము కూడ నలంకారమే యగును. ఇఁకఁ దన్మతమునఁ గావ్యమె యలంకార్యము. కావుననె కావ్యాదర్శమున రసములు నను ప్రాసాదులును మాధుర్యగుణమున నంతర్భూతముగ నంగీకరింపఁబడినవి.

"మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః యేన మాద్యంతి ధీమంతో మధునేవ మధువ్రతాః॥ యయా కయాచిత్ శ్రుత్యా య త్సమానమనుభూయతే। తద్రూపాహి పదాసత్తిః సానుప్రాసా రసావహా (కావ్యా 1 ప. 51, 52) ఆవృత్తిం వర్ణసంఘాతగోచరాం యమకం విదుః తత్తు నైకాంతమధుర మతః పశ్చా ద్విధాస్యతే॥ కామం సర్వో ప్యలంకారో రస మర్థే నిషించతి. (1 ప61, 62) అని యిట్లు మాధుర్యగుణసందర్భమున దండ్యాచార్యుఁడు చెప్పియున్నాఁడు. మఱియును గుణములకును నలంకారములకును దండ్యాచార్యుఁడు భేదము నంగీకరింపనే లేదు. కావ్యశోభాకరధర్మ

ము లెల్ల నలంకారములె యగుటచేత "శ్లేషః ప్రసాద స్సమతా మా
ధుర్యం సుకుమారతా అర్థవ్యక్తి రుదారత్వ మోజఃకాంతిసమాధయః"
అను గుణములెల్ల నలంకారములే యనియు నింకను గావ్యమునకు శోభ
కల్గునట్లుగాఁ గవి కల్పించెడి కథావస్తుచమత్కృతి పాత్రౌచిత్యములు పా
త్రసం ప్రసంగములు నుచితవర్ణనములు మున్నగున వెల్ల నలంకారములే
యని యాతఁ డంగీకరించియున్నాఁడు. "కావ్యశోభాకరాన్ ధర్మా నలం
కారాన్ ప్రచక్షతే..... కాశ్చి న్మార్గవిభాగార్థ ముక్తాః ప్రాగ ప్యలంక్రియాః
సాధారణ మలంకారజాత మన్య త్ప్రదర్శ్యతే (కావ్యా. 2 ప్రక. 1.3.)
తద్భావిక మితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్ భావః కవే రభిప్రాయః
కావ్యే ష్వాసిద్ధి సంస్థితః పరస్పరోపకారిత్వం సర్వేషాం వస్తుపర్వణాం
విశేషణానాం వ్యర్థానా మక్రియాస్థానవర్ణనా ఉక్తిః క్రమబలా ద్వ్యక్తి ర్గంభీ
రస్యాపి వస్తునః। భావాయత్త మిదం సర్వ మితి తద్భావికం విదుః। యత్తు
సంధ్యంగ వృత్త్యంగ లక్షణా ద్యాగమాంతరే వ్యావర్ణిత మిదం చేష్ట
మలంకారతయైవ నః (కావ్యా. 2 ప్రక. 364-67 శ్లో.)

ఇట్టిస్థితిలోఁ గావ్యమున ధ్వని జీవ మనియు నలంకార్య మనియు, నుపమాదు లలంకారము లనియు శ్లేషప్రసాదాదిగుణములు జీవాత్మధర్మ ము లగుశౌర్యాదిగుణములను బోలఁదగు ననియుఁ బ్రతాపరుద్రీయానుసారముగాఁ జెప్పెడి మూర్తికవి పెద్దిరాజుల కట్టికావ్యాదర్శగుణప్రకరణము మాత్ర మెట్లు సంపర్భపడును.

ఏ రిట్లు తమకు బాధించుస్థలములందు సవరించికొని మైన నున్నట్లగపడదు. ఇనువును దండిచెప్పినచొప్పుననే మాధుర్యగుణమునకు లక్షణమును జెప్పియున్నారు.

"మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః। (కావ్యా1-ప్రక1-51కారిక) కం. పటుబంధంబులు మృదుల। స్ఫుటవిన్యస్తాక్షరములుఁ బూరితరస
సం। ఘటితపదార్థంబులు నై। చ్చట నగు మాధుర్య మనఁగఁ జను నది
కృతులన్॥ (కావ్యాలంకారచూడామణి 1-4 ఉల్లాసము-84 పద్యము.)
కం. సరసము లగువాక్యంబులు। వరుసను వే ర్వేఱ మించువగ మాధుర్యంబు
(నరసభూపాలీయము 4 ఆశ్వాసము,60)

అయినను నిచ్చటఁ బ్రతాపరుద్రీయమార్గమును విడిచినందునఁ గొం

తాళన్యాయమున వీరికిఁ గొన్నిలోపములు తప్పిపోక పోలేదు. వీరు బుద్ధి పూర్వకముగా నవరించికొనఁదలఁపనందున మీఁద నుదాహరించినరీతిని గొన్నిదోషములు తప్పినవికావు.

ఈసందర్భమునఁ గావ్యాలంకారచూడామణిమార్గము బొత్తిగాఁ గలుషిత మైయున్నది. ఈపెద్దనార్యుఁ డాకరిమార్గమునఁ బోక రీతులవిష యమున వామనసూత్రములవారిని గుణాలంకారవిషయమునఁ గావ్యాదర్శ మార్గమునను నడపియున్నాఁడు. మఱియు నిందు స్వకపోలకల్పితములను గూడఁ జేర్చియున్నాఁడు. ఇట్లు మూర్తికవియు నుదారతా కాంతిగుణములను నిరుపయోగముగా దండిమార్గమును దప్పి మార్చియున్నాఁడు. పైకారణ ములచేత వీరియీభాగములు కేవలము కలుషితములై యున్నవి.

వేయేల? వీరిరువురును నాంధ్రవాఙ్మయమున కలంకారశాస్త్రమును రచించుచున్నా మనువిషయమును మఱచినవారుపోలెఁ దమగ్రంథముల నాంధ్రవాఙ్మయవిమర్శనోపయోగులుగా రచియింపక చాలవఱకు మక్కీకి మక్కీగా సంస్కృతగ్రంథములనే యనుసరించుచువచ్చిరి. ప్రాచీనాంధ్రకవులకు గలదండ్యాచార్యనిరూపితగౌడీరీతి లాలసత్వముచేతను ముఖ్యముగ నాంధ్ర భాషకుఁ గలయతిప్రాసములనిర్బంధముచేతను సాహిత్యసంపత్తిచాలని య సమర్థులకుఁ గూడఁ గావ్యరచనోత్సాహము వెల్లివిరియుచుండుటచేతను దండ్యాచార్యుఁడు చెప్పినభావికాలంకారమును బాటింపక కథావస్తువున నడపుచు శ్లేషయమకప్రధానముగఁ గవిత్వమును జెప్పనభిలాష మాంధ్రకవుల కుద్రేకించుటచేతను నష్టాదశవర్ణనములను నెల్లైనఁ జేయకతప్ప దనువింతయభిప్రాయముతో నస్థానవర్ణనములను ననుచితవర్ణనములను జేయు టకు వెనుదీయనికవులు బయల్వెడలుచుండుటచేతను నాంధ్రవాఙ్మయము నకుఁ గల్గుచున్న ముప్పును వీరు విమర్శింపనేలేదు. అట్లే ప్రాచీనాధునాత నాంధ్రమహాకవులకవిత్వములలోని గుణపరంపరలను శ్లాఘింపనులేదు. వే యేల! సంస్కృతమున శ్లోకములందు యతినియమముండుటచే నది తప్పి నచో యతిభంగదోష మగు నని సంస్కృతాలంకారికులు చెప్పఁగా వీరు ను దమగ్రంథములలో యతిభంగదోషమును మాత్రమే చెప్పిరి గాని యాంధ్రభాషలో విశేషించియున్న ప్రాసనియమము దప్పినయెడలఁ బ్రాస భంగదోష మగునను సామాన్యమగువిషయమును గూడఁ జేర్చియుండలే

డు. కాని వీరిధర్మమా యని యతిభంగము నుదాహరించునపుడు సంస్కృతమునందువలెనే పదచ్ఛేదరూపయతిభంగము నుదాహరింపక యాంధ్రవాఙ్మయమునకు సరిగావర్ణసాజాత్యరూపయతిభంగము నుదాహరించిరి. అప్రసక్తమని యీవిషయమున విస్తరింపలేదు గాని యిట్టిలోపములు పెక్కువీరిగ్రంథములం దగపడుచున్నవి.

పైరీతిని గొన్నిలోపము లున్నను వీరాంధ్రవాఙ్మయమున కలంకారశాస్త్రమును రచించుటలోఁ దీర్ఘకరులవంటివా రగుటంజేసి ప్రశంసనీయులును నాంధ్రలోకమునకుఁ గృతజ్ఞతాపాత్రులును నయియున్నారు. అకారణమున వీరిగ్రంథములందలి లోపములను జూపుటయెల్ల నాంధ్రవాఙ్మయపురోభివృద్ధిని గోరుతలంపుననే గాక వేఱుకారణమునఁ గాదని విమర్శకులు గ్రహింతురుగాక!

పైకారణములచే నాంధ్రవాఙ్మయమునకు శుద్ధమును సర్వాంకషమును నగునలంకారశాస్త్రగ్రంథరాజమును రచింపించుభార మాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై బద్ధకంకణులై యున్నయాంధ్రసాహిత్యపరిషత్తువారిపైనున్న దని విన్నవించుచున్నాను.



# అహోబలపతి.

జయంతి రామయ్య పంతులుగారు, బి.ఏ., బి.ఎల్.

ఈతఁడు "అహోబలపండితీయ" మనునామాంతరము గలకవిశిరోభూషణ మనునాంధ్రవ్యాకరణగ్రంథమును సంస్కృతభాషలో రచియించిన మహావిద్వాంసుఁడు. ఈతని పేరు "అహోబలపండితుఁ"డని వాడుకలో నున్నది గాని యీతనిచే రచియింపఁబడిన గ్రంథములలో "అహోబలపతి" యనియే యున్నది. కవిశిరోభూషణముగాక, యీతఁడు "కాళిందీకన్యాపరిణయ" మనునాశ్వాసముల యాంధ్రప్రబంధమునుగూడ రచియించి శ్రీరామచంద్రున కంకితము చేసెను. ఈప్రబంధ మచ్చుపడలేదు. వ్రాఁతప్రతి యొకటి నాయొద్ద నున్నది.

కవిశిరోభూషణ మాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్య. ఇఁదు, కాకునూరి అప్పకవిమత మచ్చటచ్చట ఖండింపఁబడినది. ఈగ్రంథము రచియించుటచేతనే "అభినవనన్నయభట్టారక" బిరుదమును అహోబలపతి తనకుం బెట్టుకొనియెను. ఈబిరుదము కాళిందీకన్యాపరిణయాంతగద్యమునందుఁ గూడ నుండుటచేతఁ దొలుతఁ గవిశిరోభూషణమును బిదపఁ గాళిందీకన్యాపరిణయమును రచియింపఁబడినట్లు స్పష్టపడుచున్నది.

కవిశిరోభూషణమం దచ్చటచ్చట సందర్భోచితముగా నథర్వణకారికలనువ్యాకరణసూత్రము లుదాహరింపఁబడుటయే కాక యాకారికలను వేఱుగాఁ జదువ నక్కఱలే దనునర్థ మిచ్చునట్లు—

యస్సారో ధర్వణగ్రంథే సోప్యత్రైవ విధీయతే
తేన తత్ఫక్కికాలోకలోలతా త్యజ్యతాం బుధైః.

అని చెప్పఁబడి యున్నది. ఇటీవలివా రొకరిద్దఱు కారికలకుఁ డీక రచియించినారు. ఎవరికైనను అహోబలపతిపాఠమే శరణ్యమైనది. అంతకంటెఁ బ్రాచీనపాఠ మెవ్వరికిని దొరకకుండుటచేతను అహోబలపతియే యాకారికల రచియించి యథర్వణునిపేరఁ బ్రకటించెనని కొందఱందురు. అట్లనుట సరికా దని కొందఱయభిప్రాయము. సత్య మేదియైనను ఆంధ్రశబ్దచింతామణికి బాలసరస్వతియు హరికారికలకు శిష్టు కృష్ణమూర్తిగారునువలె నథర్వణకారికల కహోబలుఁడే ప్రథమప్రకాశకుఁ డనుట స్పష్టము.

అహోబలపతి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు గాలివారు. ఈయనకు మొదటిపేరు నరసరాజు. గ్రంథములం దింటిపేరు | పభంజ

నముపా రనియుఁ బే రహోబలపతి యనియు మార్పఁబడెను. ఈకుటుంబ ము వా రిప్పుడు గుంటూరుమండలమునందలి వినుకొండతాలూకాలోని ము మ్మడివరగ్రామమం దున్నారు. వీరు సాధారణ వైదికాచారమునే యవలంబిం చి తమపేళ్ళచివర శాస్త్రి యనుబిరుదముఁ జేర్చుకొనుచుందురు.

ఈకవికాల మెచ్చటను స్పష్టముగా వక్కాణింపఁబడి యుండలేదు. కాని అప్పకవికిఁ దరువాతివాఁ డనుట స్పష్టము. అప్పకవీయరచనము ౧౫౭౨వ శకసంవత్సరములోఁ బ్రారంభింపఁబడిన ట్లాగ్రంథములో నున్నది. అహోబలుఁడు దీనికి రమారమి నూఱేం డ్లిటీవలివాఁ డనుకొన్నచో నిప్పటి కించుమించుగా నూటయిరువదియేండ్లు పూర్వపువాఁ డగును. అంతర మింతకంటెఁ దక్కువగా నుండిన నుండవచ్చును.

పోలూరి మాధవసోమయాజి తనకు గురు వైనట్లును, అతఁడు మహావిద్వాంసుఁ డైనట్లును దన రెండుగ్రంథములందు నీతఁడు విస్తరించి చెప్పెను. ఆపద్యములను గ్రంథాంతములందలి గద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను. మాధవసోమయాజిం గూర్చి చెప్పిన పద్యములు—

(క) కవిశిరోభూషణమునుండి—

క. పోషించి మాధవార్యుఁడు, నీషి ననున్ సంస్కృతాదినిర్మలభాషా
భాషి నొనర్చి త్రిలింగజ, భాషాసామ్రాజ్యపట్టభద్రునిఁ జేసెన్.

(చ) కాళిందీకన్యాపరిణయమునుండి—

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు నక్క, పాదకణచరజైమినివ్యాసమాని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతని మద్గురు మాధవు నభినుతింతు.

చ. కొదవ లెఱుంగ కెప్పుడు నకుంఠమహోదయవైభవంబు వే
పొదలఁగ భూరిసత్కళలు పూని తమోహతి లేక యార్జవం
బొదవఁ గళంకిత న్వదలి యార్జితవాగ్మిజయోగ మింపుగా
మదిఁ గొను మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రమున్.

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిఱ్ఱబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబు చేసి
యతులసాహిత్యవిద్యాచారదీర్ఘిక లాలిత్యప్రీతిచే నోలలాడి
కపిలసాఖ్యవతేయఘనతంత్రవాక్సుధాధారలఁ గోరిక లూరఁ గ్రోలి

చెలఁగుయద్రసనాభామయలంతమాలి, యతని శ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతు సుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి.

శా. మోహాంభోరహృదంబుజాంతరములో ముమ్మాటికిం గొల్చెదన్
మోహాద్రిప్రతిషిద్ధదోషగుణసమ్యక్చ్ఛన్నిరాసక్రియా
సాహిత్యప్రతిపన్నచిత్రసరఘురీసంబంధకృన్మానసున్
సాహిత్యశ్రీరమ్యతానతామితివచస్సంపాదితశ్రీయుతు
న్నాహిత్యాంబుధిపారగు న్సకలశాస్త్రజ్ఞు న్......మాధవున్.

గీ. ఎవ్వనియశంబుజగమెల్ల నెనసిచుట్టు,కొండయవ్వలితమమెల్లఁ గొదవపఱుప
నల్పమూభేయమనిపల్కదధికభూమ, యతనికీ నరిఁతునతిమాధవార్యమణికి.

గీ. ఏకదినమేళనంబూను నెపుడుపూర్వ, పక్షలాలితిగొనుఁగళల్ పదియునాఱుఁ
దాల్చుశశినవ్వునతచతుర్దశకలై క, హారిఁ బ్రార్థింతు మాధవయజ్వచంద్రు.

క. కవివాక్పతులై యెవ్వని, సవిధస్థితులైనపురుషసత్తము లెల్లం
గవివాక్పతులం గేరుదు, రవురా నుతియింతు నతని నన్నతస్వామిన్.

—◆ గ్రంథాంతగద్యములు ◆—

(క) కవిశిరోభూషణాంతస్థగద్యము—

ఇతి శ్రీమత్సీతారామచరణారవిందమిళిందాంతఃకరణేన శ్రీమ త్పో లూరి మాధవయజ్వపండితాఖండల సముజ్జ్వలత్కృపారససముత్థి ప్తకటాక్షా సాదితపాండిత్యాభరణేన ప్రభంజనవంశముక్తామణినా నిరంతరారాధితసం ఖ్యావన్మణినా భినవనన్నయభట్టాచార్యే ణాహోబలపత్యాచార్యేణ విరచి తాయా మాంధ్రశబ్దచింతామణివ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదః.

(చ) కాళిందీకన్యాపరిణయాంతగద్యము—

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరిమాధ వయజ్వసముజ్జ్వలత్కృపోత్క్షిప్తకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజనవం శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టారక అహోబలపత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారకరచితంబైన కాళిందీక న్యాపరిణయం బనుమహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.

మంజువాణీముద్రాక్షరశాలలో నచ్చుపడిన యహోబలపండితీయము నందుఁ బీఠికాశ్లోకములు కొన్ని లేవు. పరిషత్పుస్తకభాండాగారములోని 871

సంఖ్యగల గ్రంథములో నున్నవానిని బాతకు సంయుపయోగార్థము నేనీ క్రిందం జేర్చుచున్నాఁడను. ఈపద్యములఁబట్టి మాధవసోమయాజులు అహోబలున కు మేనమామ యయినట్లు కనఁబడుచున్నది.

శ్రీమద్భూమితలోదరీతనుభవావక్షోజపత్పంజర
స్ఫాయత్కీరమణి ర్గిరిప్రవరజాచిత్తాబ్జభృంగాగ్రణీః
భక్తవ్రాతమనోవ్యథాదవశిఖాప్రోద్భూతవర్షాంబుదో
రామ స్సర్వజగంతి పాతు సతతం కారుణ్యపాథోనిధిః. ౧

తాపం నో హరతా ద్ధరోజ్జ్వలశిరోలంకారపాదాంచితో
గాఢోన్నిద్రకలావిలాసవసతిః పద్మాసుహృద్ద్వైతనః
జీవాతు స్సతతం సమస్తసుమనోబృందస్య మాద్యత్తమో
భేదీ శీతలగోవిభూతి రమలః శ్రీరామచంద్రో విభుః. ౨

మిత్రత్రాణపరోపి సాధ్వసహృతి ర్వ్యగ్రోరుతేజాః సరి
న్నాథౌద్ధత్యవిదారిమంజులకరస్సర్వజ్ఞసంఘాశ్రయః
నిర్దోషాంబుజభూహితోదయయుతో మందోదరీహృద్వల
ద్భోగేచ్ఛాభహరణాకృతి ర్ద్దిశతునః శ్రీరామచంద్రస్సుఖమ్. ౩

నిష్పీడక్షీణకాంతి స్సతతముదయవా న్సర్వదానిష్కళంకో
నిర్దోష స్సర్వవర్తీ ప్రచురతరరుచిః పోషితాశేషలోకః
స్వాధీనో రక్తభావః ప్రథితకుటిలతాదోషశూన్యశ్చ నిత్యం
మిత్రశ్రీదానశౌండో భవతు సుఖకరో రామచంద్రో నవీనః ౪

నానాజాండఫలాన్వితోద్భుతయశః సౌరభ్యవిభ్రాజిత
స్స్వచ్ఛాభసుమగుణప్రసూనమహితః సర్వేష్టదానక్షమః
శుద్ధస్వాంతమునీంద్రహృన్మధుకరై ర్నిత్యం సమాలింగితో
నిర్బీజో రఘురామకల్పకతరు ర్భూతోష్ణవతాన్న స్సదా. ౫

యత్పాదాంబుజజం రజో మునివరం త్రేతాగ్నిపూజాక్రియా
కర్తారం ప్రచకార యత్కరపయోజాతోజ్జ్వలో మార్గణః
పౌలస్త్యాంబుజలోచనామృదులదృక్సంసారపాటచ్చరో
జాత స్తం ప్రణమామి మామకమనఃపంకేజగేహం విభుమ్. ౬

సీతే తేకుచచక్రవాకయుగళం పశ్యాధునా త్వద్భుతం
ప్రాప్తం నోఖలు రామచంద్రకరసంస్పర్శాద్వియోగం మిథః

భిన్నం నైవపుపోష కాంతి మధికా మిత్యాలపన్ జానకీ
వక్షోజా పరిమర్దయన్ రఘుపతి ర్మహ్యాం ప్రదిశ్యా త్సుఖమ్. ౭
యన్నామామృతపానవైభవవశా ద్గౌరీకురంగేక్షణా
ప్రాణేశః కటుకాలకూటగిళనే దక్షస్సనోవ్యాత్ ప్రభుః
రామః శ్యామలకోమలాంబుదరుచిస్తోమాభిరామః కృపా
రామో మైథిలినందనేందువదనారామో విరామోంహసః. ౮
సంసారనీలవిషభృత్పరిదష్టదష్టసా .....ఞ్జనత్వో భవదిష్టసారః। భక్తప్ర
జస్తదఖిలామరసేవ్యమానం రామాభిధానపరమామృతమాశ్రయామః.
లోకేఽజం ద్యోతయితుం జనానాం శృంగారనాథత్వ మివాతిలీలమ్
వందారువాచం(యమ)పారిజాతం వందేనిశం లక్ష్మణపూర్వజాతమ్ ౧౦
లంకాయాం య దుదారవిక్రమయశస్సారప్రకాశక్రియా
దక్షోద్యాపివిభీషణాకృతిజయస్తంభ శ్చిరన్నద్భుతః
రూఢో రాజతి రాజతాచలనిభాహంకారనిర్వాపణ
ప్రోద్యత్కీర్తిధురంధరం త మనిశం సేవే రఘూణాంపతిమ్. ౧౧
వసంత మంతరే నిత్యం పరప్రకృతిజీవయోః
వందే ఘనాఘనశ్యామం పరాత్మానాం మహాశ్రయమ్. ౧౨
పూ(జ్యాహి) పరశివాంతాః స్యు ర్బ్రహ్మోద్యా యదభేదతః
దేవా స్తదేకం రామాఖ్యం బ్రహ్మానందామృతం నుమః. ౧౩
యామాయాశబలాప్రపంచజననత్రాణక్షయాకారణం
మాయామాయాం ప్రతిబింబితా వసతిచ క్షేత్రేషు సర్వేషు యా
సత్యా తత్త్వమసీతివాక్య మపరిచ్ఛిన్నాంచ యాం లక్షతే,
వేద్యాన్యాం హృది సంస్మరామి నిరతం రామాభిధాంతాంచితమ్. ౧౪
మారారీంద్రాబ్జసూతిప్రముఖసురశిరఃస్వర్ణకోటీరకోటి
స్ఫాయన్మాణిక్యబాలద్యుమణిఘనరుచిస్మేరపాదాంబుజాతాన్
సాపేక్షాలేశమాత్రప్రసరణపృషితప్రాణినో దూషణారే
ర్దారా స్థీరా సుదారాన్ ప్రథితగుణమణీచ్ఛాయహారాన్ భజేహమ్. ౧౫
దృగ్భృంగీ బాహుశాఖా కుచఫలసహితా హారపుష్పాళియుక్తా
హస్తాంచత్పల్లవాంకా స్ఫురితపరిమళా సత్కృపా పుష్పవారిః
సర్వాభీష్టప్రదాత్రీ నిఖలభువనగా స్వర్గహేతు ర్నవీనా
శ్రీసీతాకల్పవల్లీ వసతు మనసి మే సర్వదా సుప్రసాదా. ౧౬

ఓమ్వర్ణరూపిణీం వందే షడ్వర్ణప్రకృతిం సతీమ్
శ్రీరామవామపార్శ్వస్థాం ఘోరాసురశిరోపహామ్. ౧౭
యన్మూలం రామదేవస్య తాటస్థ్యం ప్రతిపాదితమ్
వాక్యై ర్వేదశిఖాయూథై స్తాం జగజ్జననీం భజే. ౧౮
అసంసార్యపి సంసారీ యన్మహిమ్నా పరాత్పరః
తామాలంబే సదాలంబాం మదంబా మంబికార్చితామ్. ౧౯
యాం వినా తారకాధ్యక్షః స్పందితుం నాపి శక్నుయాత్
సా మాన్యా భూమికన్యా మే మానసే రమతాం సదా. ౨౦
మందస్మితద్యోతజితోడుకాంతా మిందిందిరీబృందసమాలకాంతామ్
బృందారకీవందితపాదుకాంతాం వందేతికాంతాం రఘురామకాంతామ్.
హరినాభీసరోజాతే వసంతం భ్రమరం భజే
వేదనాదనినాదం తం చతుర్వదన మద్భుతమ్. ౨౨
యత్సౌందర్యాతిరేకః వదతి కమనతాం జన్మకర్తుర్విధాతుః
సర్వబ్రహ్మాండజాగ్ర న్నిఖిలకమలదృఙ్మండల స్యాతిదూరమ్
వందే తా మిందురేఖాభరణభరణకృత్కేశహస్తాగ్రదేశా
మాశాధీశాలికేశాగణగణితవిభామానితాంగీం నతాంగీమ్. ౨౩
సుధాహారప్రభాహారిస్ఫురద్దేహాన్ విధేర్గృహాన్
సుధాధారాధరా న్వందే సుధాకరకళాధరాన్. ౨౪
విద్యాసంగీతనామా మృదురపి కుచతాం ప్రాప్యతే ప్రాపత్రీవం
కాఠిన్యం తే స్వభావః కఠిన ఇతివదన్ జాతకోపాం విధిర్యామ్
దోర్భ్యా మాలింగ్య చక్రే వదనవనరుహప్రస్ఫురన్మందహాసాం
సా దేవీ మే ముఖాబ్జే నివసతు నకులీశారదా పారదాభా. ౨౫
నీలాభం కేశపాశం సవిధతలగతా యానకేళీమరాళీ
దృష్ట్వా భీత్యా ప్రయాయా త్సజలఘన ఇతి భ్రాంతిలీఢాంతరంగా
వాహిత్వం మే కథం స్యా దితి విధి రనిశం యాం ముఖాబ్జే వ్యభాక్షీత్
సాపాయాదాయతాక్షీ రుచివిజితశరన్నీరదా శారదా మామ్. ౨౬
యద్వర్ణాక్షరదచ్ఛదామృతరసం వేధాః పిబన్నాననై
రుక్తైర్నైః క్రమశశ్చతుర్భి రధికం స్వీయాననానాం త్రయమ్

త్యక్త్వం వా చతురాననాబ్జసహితాం యాం వా విధాతుంస్ఫుర
త్కాన్తస్సానకులీ ముదా వసతు మే చిత్తాంబుజాతేనిశమ్ ౨౭
పంచాక్షరీమనుశిరోమణితారవర్ణైః సంబోధ్యతే సగుణనిర్గుణరూపయుగ్మైః
వందేతమిందుకలికాభరణాభిరామంరామాభిషిక్తవరదేశికసార్వభౌమమ్.
విద్యాకుముద్వతీచంద్రరేఖాం విద్యాంగనామణిమ్
నీలకంఠమనస్తోష వర్షాకాదంబినీం భజే. ౨౮
యద్దేహామృతబిందుసంగమవశాత్ త్వత్యాజనాగాధిపః
కంఠేభూతపతేర్వసన్ విషధరప్రఖ్యాభవం దుర్యశః
కించ బ్రహ్మకపాలపాళిరనిశం వేదాన్ సమాభాషతే
వందే తా మరవిందసుందరముఖీం తాం తాంగసౌధాలయామ్. ౩౦
అత్యంతశీతలసుధారసదీపితాంగీ మామ్నాయదివ్యసరసీరుహచారుభృంగీమ్
హ్రీంకారసౌధతలమంగళదీపరేఖాం విద్యాం భజామి పరమాద్భుతరూ
(పరేఖామ్. ౩౧
యా వేదాంతసరోజినీమధుకరీ యాభక్తచిత్తవ్యథా
గాఢధ్వాంతనివారణద్యుమణిరు గ్యాలోకసమ్మోహినీ
యామృత్యుంజయహృత్కరీంద్రబలవద్వారీ దయాసారిణీ
వందే తాం పురవాసినీంసుజఘనాం హ్రైంకారసింహాసనామ్. ౩౨
యా గంగాధరదేహపంజరశుకీ యాసాధకవ్రాతదృ
క్నీలాంభోరుహకౌముదీ సురసతీ సంకల్పితస్వర్గవీ
యా వారణ్యకముండకామ్యపనిషజ్జాలాంబుజాతాకర
క్రీడచ్ఛ్వేతపతత్రిణీ గిరిసుతా సాపాతు మామన్వహమ్. ౩౩
ఓం హ్రీం దుం బీజసంపన్నమనురాజాధిదేవతామ్
పోషితాశేషసద్వర్గాం వనదుర్గాముపాస్మహే. ౩౪
నానాదర్శనమర్మభేదనమహామేధాలసద్వల్లికా
బీజం మంత్రిసమాసలోచనమనోభీష్టార్థచింతామణిః
నానాస్త్రీపురుషాంతరంగవశతానిర్వాహసిద్ధిక్రియా
విద్యారామపదారవిందయుగళీ సైవైవ మే జీవనమ్. ౩౫
యద్వ్యాకరణవైదుష్యేన హృతా లోకావవాగ్గుజా
విద్వత్సహస్రనేత్రం తం దాక్షిసూనుముపాస్మహే. ౩౬

ఉత్పాదితప్రాకృతలక్షణోఽపియో నిర్ద్రాక్షితప్రాకృతలక్షణ భవ్య
తం కావ్యకల్పద్రుమకుంభవారిధిం ప్రశస్తౌమి వల్మీకిసుతం సతాంవరమ్.
నిర్వికారమనస్యాయా వికృతేః కారణే అపి
తౌ వందే కవితామూలకందవాగనుశాసనౌ. ౩౮

సిద్ధా దదృష్టచర మశ్రుతపూర్వ మేతం
గ్రంథం సమాప విశదం చ చకార వాచ్యమ్
యాగాధగూఢ మపి బాలసరస్వతీసా
నుత్యాకథం ను నభవే దెలకూచివంశ్యా. ౩౯

షడ్దర్శినీలాభరతా మునీంద్రాః షడ్దర్శనీజన్మభువో వితంద్రాః
యస్మాత్కీర్తిమాయు స్తమదారవిద్యాధుర్యంప్రపద్యేహ్యాదిమాధవార్యమ్
యత్కీర్తి స్ఫారదీప్త్యా గతవతి నిఖిలేచిత్రవర్ణే ప్రపంచే
శ్వైత్యం కంజాతజాతో వికృతినిజకృతిప్రేక్షణే లజ్జితస్సన్
నాభౌ విష్ణో ర్విలీన స్తమిహబుధమణేః స్తోతుమూర్వ్యాం క్షమఃస్యా
త్కోవా శ్రీమాధవార్యం మధురగుణమణీసింధుమార్యౌఘబంధుమ్. ౪౧
యత్కీర్తిరోచిచ్ఛురితా (ఖనద్యాః) ప్రస్పర్ధినీసూర్యభవాబభూవ
తం పోలూరీవంశపయోధిచంద్రం వందామహే మాధవవిద్వదింద్రమ్. ౪౨
వాణీ కానన దేశసంతతగతేః ప్రాప్తాంగఖేదాభవం
యాతా తత్రపరాఙ్ముఖీ పతికృతస్వాస్నేహనాశంకినీ
యస్మాత్రాత్ర పరివర్ధితాంతికజనాజాగర్తి సర్వాంకమః
సోయం మాధవపండితో విజయతే సత్యస్య నిత్యాలయః. ౪౩
యత్పాండిత్యాధిపత్యశ్రవణపరిణతాశ్చర్యతాధూతమస్తే
శస్తే చతుశ్శ్రవసస్త్రి శ్రవణవిఘటనాజ్ఞాతతచ్ఛింజితాంకే
భద్రం నిద్రాత్యనిద్రః కలశజలనిధేః శ్రీనిధి స్త్రీప్రఘోషా
త్తం శక్తః కః ప్రణోతుం యదిభవతి మతిః సాహసేహైవమూలమ్ ౪౪
లోకాలోకధరాధరచ్ఛదివృతే విశ్వంభరావాలకే
యత్కీర్తిస్ఫుటకల్పభూజలతికా నిర్బాధ ముజ్జృంభతే
రారాజత్సుమనోమనఃప్రమదకృత్సౌరభ్యవిభ్రాజితా
వందేహం త మనింద్యసద్గుణగణాధారం గురుం మాధవమ్. ౪౫

మూకాః సదభ్రసుమమాల్యమనోజ్ఞచూడా
    వంధ్యాసుతాః పదవియోజితవాక్ప్రసారాః
    నీలచ్ఛవిచ్ఛురిత దేవధునీ .....త్వం తే
    నిందంతి మాధవగురో రయశఃకదంబమ్. ౪౬

యద్వాచామధురిమ్ణి ధూతసదృశే ప్రద్యోతమానేధికం
    జీవాతు ర్దివిషద్గణస్య సతతం సంఖ్యావదభ్యర్హితమ్
    ప్రాయా త్తల్వమృతం క్షయా మితి ముదం ప్రాప్నో త్యవేలాంతమ
    స్త్రత్వాప్యస్య విధురం కథంను నభవే ద్వర్ణ్యోగురు ర్మాధవః. ౪౭

వాత్సీపుత్రకణాదగౌతమఫణిప్రాగ్ర్యాదిసంఖ్యావతో
    ద్రష్టుం యేభిలషంతి పండితజనా స్తే పూర్ణకామాస్ఫుటమ్
    యత్సందర్శనతో నిదర్శితకలావైశద్యదాతానత
    స్వాంతాత్యంతతమోబలం తమతులం ధ్యాయామి మన్మాతులమ్. ౪౮

నిష్పంకా పీతభంగా సతత మతిశితా సర్వతో నిర్వికారా
    నిర్వేలాక్లృప్తదేశా నిఖిలవిబుధరాట్కర్ణభాగైకవేద్యా
    సర్వశ్లాఘానుగమ్యా సకలసుజననిర్హారిగంధానుబంధా
    పాయా న్మాం మాధవాఖ్యా మధుర బుధమణేః కీర్తిగంగా ప్రవంతీ. ౪౯

భగ్నే స్వప్రాణభర్తు ర్భవతి శశభృతో బింబసర్వస్వభావే
    గాఢం గాధావగాధాఖిలవచనత తే ర్మద్గురోస్ఫీతకీర్త్యాః
    సందేహాందోళితాంతఃకరణకలుషితానంతరం హా స్తమోగ
    ప్రాప్తాంకప్రత్యభిజ్ఞా భజతి హృది ముదం రోహిణీమోహనాంగీ. ౫౦

శ్రీమన్మాధవయజ్వమౌళివిలసత్కీర్తీందునా కః సమ
    స్తుల్యశ్శారదపూర్ణిమా హిమకరస్తుల్యః కళంకీకథమ్
    తాదృక్సోపి కథం న సర్వమమునా వ్యాప్తం జగత్తత్కథమ్
    జాగర్తి ప్రతికూలభావవిదుషాం నీలః కళంకో మహాన్. ౫౧

విష్వక్ప్రకాండగణనాకృతిభిః ప్రయుక్తో
    యద్వాచి పండితపదాదవధారణేమః ?
    సం తం సుధీహృది సతీర్థ్యవనీవసంతం
    ప్రణౌమి సతతం మమ మాతులం తమ్. ? ౫౨

భీతాయత్యః సకలవేదశిఖావతంసా
    భూభ్రాత్తధా ప్యమలరామపదైకవాచ్యా

సాచి? ర్యదీయహృదయాంబురుహోలసన్తీ భూ
ద్రామాభిషి(ష)క్త మణిరస్తు గురు ర్మదేసః. ౪౩
అస్యైవ నాన్వయం యాతి వినా సన్వయభూషణమ్
యన్నతిప్రవణా వాచో యష్టారం తం గురుం నుమః. ౪౪
యః ప్రేమాపండితాగ్రేసరపరిగణితాఖండమద్దర్శినీవా
శ్చాండిత్యోదారలీలాచతురిమకలనాదక్షిణామూర్తి దేవే
పుత్రే తన్నామ్ని తస్మా దపి గురు రుదభూ ద్యస్యమయ్యా త్తభాగ్యే
మన్నాతు ప్రాఖ్యాతరం తం సకలగుణనిధిం మాధవం భావయామః ౪౫
యేషాం సుధీకృతఘటాంతరసత్పదార్థా
జీవాతవో లసతి నేతరి మూకతైవ
తత్ స్నేహసౌఖ్యమతినైవ ముదావహం స్యా
త్తేషాం హి దుష్కవిశునా మిహాన ప్రసంగః. ౪౬
నిర్నిమిత్తకృపాధారమావసానాం సుధీమతామ్
ధర్మపుత్రే మయి కథం కరుణా సార్థకా భవేత్. ౪౭
దోషోపిగుణతాం యాతి పండితానా మనుగ్రహాత్
అయస్సువర్ణతా మేతి సంస్పర్శాత్స్పర్శవేధినః. ౪౮
దోషోమహీయా నణుతాం గుణోత్యల్పోప్యనల్పతామ్
యన్మహిమ్నా భవే త్తస్య బుధస్యాంఘ్రావహాం లవః. ౪౯
యేషాం మతి స్సకలశాస్త్రరహస్యభేత్రీ
యేషాంక్రియానిగమవాఙ్మహిమానుయాత్రీ
యేషాం భవే త్ప్రకృతిరేవ గుణప్రమాత్రీ
తేభ్యో నమో నమ ఇదంబుధతల్లజేభ్యః. ౫౦
గ్రంథేస్మి న్వర్తతే నైవ దుష్టశంకాపిశాచికా
పండితానుగ్రహోదగ్రదివ్యరక్షాభిరక్షితే. ౫౧
యజ్జ్ఞానధుర్య ధియఏవ సుధీవతంసా
విద్వామణాంధ్రకవితాభరణా భవంతి
సోయం సుధీజనశిరోమణి రంధ్రశబ్ద
చింతామణి ర్విజయతే ఖిలగూఢభావః. ౫౨
సేయంకృతి ర్విములవాడభీమ ప్రబంధకర్త్రాహితవత్సరేణ

గోదాజలే నాశమవాపితాభూ దిత్యద్గతాసీ ద్భువి కింవదంతీ. ౬౩
శబ్దానుశాసనకృతాదిమపర్వముఖ్య
పర్వత్రయేఽకథితం పదమేవ యోగ్యమ్
నాన్యత్ప్రయోగసరణా వనుశాస్త్రదృష్టే
రేవంకృతోఽపి నియమః కవిరాత్మనేవ. ౬౪
శ్రీతిక్కయజ్వప్రముఖవిచక్షణసుధాంశవః
తదభ్యుపగమాయత్తచేతసః కవనేరతాః ౬౫
వాచానుశాసనాద్భూమిలోకవాచానుశాసనాత్
నిర్మాణకాలపవేషం గ్రంథం జగ్రాహ బుద్ధిమాన్. ౬౬
రాజరాజతనూజాతః సారంగధరబాలకః
సకృతః పాణిపాదేన రహితోఽజనిహేతునా. ౬౭
మత్స్యేంద్రనామసిద్ధేంద్రమహిమ్నా సిద్ధతాం గతః
జగ్రాహవ్యాకృతిం తస్మా త్కవి ర్బాలసరస్వతిః. ౬౮
ఎలకూచిసుధాంభోధి శరద్రాకానిశాకరః
సమస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే. ౬౯
తత్రపంచపరిచ్ఛేదాః శబ్దశాస్త్రే నియంత్రితాః
ఆర్యాఖ్యపద్యై స్తత్సంఖ్యా సంమితాస్యా ద్గజైర్గజైః ౭౦
మతంగశైలవిప్రేంద్రా దన్యద్వ్యాకృతిపుస్తకమ్
కాకునూర్యప్పకవినా గృహీతం తత్రతద్గతాః ౭౧
పాఠభేదాస్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే
మయాప్రాయః సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే. ౭౨
అప్పార్యపుస్తకారూఢ పాఠభేదా ద్యదుత్థితమ్
మయాసంగృహ్యతే రూపం తదప్యాథర్వణోక్తితః ౭౩
నియామకత్వమారూఢా నూత్నదండిముఖాః కథమ్
పూజ్యాభవేయు రాచార్యసరణే రతిదూరగాః. ౭౪
ప్రసిద్ధసారంగధరేణటీకా మపి స్ఫుటీకర్తు మతీవహర్షాత్
వాతూలవంశేవతతారభూయః శ్రీనన్నవిద్వా న్సహమేవ సోఽస్మి ౭౫
టీకా బాలసరస్వతీకవికృతా శుద్ధాంధ్రవాగ్గుంభితా
మాత్రప్రోతపదార్థమాత్రకథనప్రక్షీణశక్తిస్తతః

కస్తుష్యేద్భువిపండితః కవివరః కిం చాంధ్రపద్యైర్మితో
గ్రంథోప్యప్పకవే ర్మ్రదం దిశతు నో విద్వత్కవీనాం ఘనామ్. ౭౬
శ్రామం సంతు పదశ్శతా స్సుకవయో గంభీరవాగ్గుంభనా
రంభోజ్జృంభితవైభవా మదుదితం వాక్యం శ్రుణుధ్వంపరమ్ ౭౭
విద్వాంసః కవయో స్త్వహోబలపతేః కోవాంధ్రభాషామణి
ర్విజ్ఞానేసదృశో విచక్షణమణిః సర్వాపనీమాడతే. ౭౭
యస్మాన్నాస్త్యా కవితామూలకందవాగనుశాసనో
జాగృతోహోబలపతీ రాజతే సవిచక్షణః. ౭౮
శ్రీమత్పోలురిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫుర
త్సారశ్శాస్త్రవిదర్చితాఖిలబుధో వాతూలవంశాగ్రణీః
సర్వానందదవాగహోబలపతి ర్వ్యాఖ్యాం కరోతిస్ఫుటం
శ్రీమన్నన్నయభట్టసూత్రవితతేః శ్రీరామకారుణ్యతః. ౭౯
వ్యాఖ్యా మదీయాద్యవచోనిబద్ధా శబ్దార్థతాత్పర్యవివేచకీయమ్
మోదాయభూయాద్విదుషాంహిసీతారామాంఘ్రిపంకేరుహయోరధీనా
యస్సారోధరణ్యగ్రంథే సోప్యత్రైవ విధీయతే
తేనతత్పక్కికాలోకలాలసా త్యజ్యతాం బుధైః. ౮౧
ఏతా మాంధ్రపదాంకితాం సుకవితాం నిందంతి కేచిజ్జనా
గాఢాజ్ఞానవిజృంభితా నహితతో న్యూనత్వ మస్యాభవేత్
శైలూషేవ సభాసదో విరచయ త్యానందపూర్ణాన్ సతః
సర్వా నంధ్రమయీ సువాగ్బహువిధా తత్తద్రసామోదినీ. ౮౨
సీతాం పద్మకరాం స్వవామతలగాం విద్యుత్ప్రకాశాం ముదా
పశ్యన్నీలపయోదసన్నిభతనుర్విజ్ఞానముద్రాన్వితః
జానున్యస్తకరః సభూషణగణో మచ్చిత్తసింహాసనే
నిత్యం ప్రస్ఫురతా త్కృపాజలనిధి ర్మత్పుణ్యరాశేః ఫలమ్. ౮౩
భాషాకావ్యమనర్హ మన్యవిషయం నోచేత్స్వభాషాం వినా
గీర్వాణోక్తిపురాణమాత్రపఠనా న్నార్థావబోధో నృణామ్
వ్యాసాద్యాశ్చ కథం కథావిరచనే వ్యర్థప్రయాసా నతే
కో భేదోస్తి పురాణవిత్కవివరవ్యాఖ్యానతత్కావ్యయోః. ౮౪
కావ్యే బమ్మెరపోతరాజసుకవే రాంధ్రే కృతీశః స్వయం

కించిత్తస్య సుదుష్కరం రచితవాన్ సర్వజ్ఞచూడామణిః
లక్ష్మీశః స్వరహస్య మాదరభరా త్పద్యైతిహ్యాద్యై పదై
ర్వ్యస్యాజ్ఞాబలతో వివేకచతురా లోకే భవేయుర్జనాః ౧౪
శాపానుగ్రహదక్షతా వసతయో భీమాదయో విశ్రుతాః
కృత్యర్థం భృశమర్థితా నృపవరై స్తైతిక్కయజ్వాదయః
చక్రుర్దిగ్విజయం వశీకృతనృపాః శ్రీనాథభట్టాదయో
నాంధ్రాణా మిహ శక్యతే హి మహిమా స్తోతుం కవీనాంబుధైః ౧౫
వ్యుత్పత్తి ర్జలవర్ణపంక్తిసదృశీ శ్రోతుస్త్వకావ్యాద్ధ్రువం
దోషాస్స్యుః సుధియోపి వక్తుముచితా నోవర్ణనా భూయసీ
ఛందోలక్షణశోభితా నరచనా పౌరాణికోక్తి క్షితౌ
భాషాకావ్య ఇమాని సత్కవికృతే నైవక్షతా న్యంచితే. ౧౬
జ్ఞాత్వార్థం హ్యుభయత్రవాక్యరచనా వ్యుత్పత్తి రాకర్ణనే
నేతౄణాంచ పురాదివర్ణనమపి శ్రేయఃప్రదత్వం తథా
శ్లాఘ్యత్వం భగవద్గుణాదికథనే తద్వర్జనే శ్లాఘ్యతా
తద్భేదో నపురాణసత్కవిరాడ్జల్పాంధ్రసత్కావ్యయోః. ౧౭



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౫. | క్షయనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు | సంచిక ౩.

## గోమహిషసంవాదము.

### గీతమాలిక.

—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు—

గోగణంబులు మహిషాళి గూర్చి పలికె, నన్నలార! జగంబోము దున్నలార!
గేదెలార! పాలకుఁ జెనుగాదెలార, మధురరసపదార్థంబుల మహితకృపనుఁ
బాఁడిభాగ్యంబు వెలయించు పనులయందు, సోదరులమటుగావున నాదరమున
మాదుపలుకుల నాలించి మన్ననమెయి బదులఁజెప్పంగఁ బూనఁగవలయు
(వినుఁడు

పద్మకల్హారపరిమళభరితములయి, ముత్తెములఁబోలు జలములఁబొలుచునట్టి
విమలపద్మాకరములెన్నొ వెలయుచుండఁ, గుళ్ళుకంపుగల బురదగుంటలందుఁ
గడఁకఁబొరలంగ నాసక్తి పడుదురేల, కోపమందక బదులిండు కూర్మిమీఱ
ననుచు గోజాతి మహిషాళినడుగ నవ్వి, నవ్వియీరీతి బదులిచ్చె నవ్యఫణితి.
ఎద్దులార! మర్యాదకు హద్దులార! యావులార! సరసతకుఁ ద్రావులార!
యెలమిమీరాడుచున్నట్టి పలుకులువిని, నెమ్మనంబునఁ దర్కించి నెమ్మిమీఱ
నిచ్చుచున్నాము బదులివె యింపుమీఱ, నాలకించి యందుఁగల సత్యంబు
(గనుఁడు

వెన్నలోపలఁ బన్నీరు వెలయఁబోసి, పలుదెఱంగుల యత్తరుల్పైనఁ జిలికి
మెసపఁగల్గిన మృష్టనాఁ బొదలి యెంతొ, పరిమళయుతమును మృదువును
(భాసురమగు

కర్దమమునందు మీకేల కలుగదిచ్చ, చింతవొడమెడు దాని దూషింతురేల
పూతనీరములని మీరు పొగడునట్టి, జలములోపల సారంబు గలదె యింతే

కలితపరిమళ మింతయుఁగలదె యుందు, రుచులు లేనట్టివాని నిరూపణంబు
సలుపునప్పుడు నీళ్ళతోఁ సరి యటంద్రు, కాన నిస్సారనీరంబు ఘన మ దెట్లు
చందనాగరుచర్చల సుందరముగఁ, దనువు వెలసినభాతిఁ గర్దమము పూయ
వేయిమహుగులుగొప్పగా వెలయకున్నె, మీకునవగాహనం బింత లేకయుంటఁ
బలికియున్నారు పైరీతి భ్రాంతులగుచు, పుత్రుఁడెంతయుఁ గరముల మెదిపి
(మెదిపి

భాసురం బగు తేజిడి చేసినట్టి, కర్దమంబును దూషింపఁ గడఁగఁదగునె
యంచు ధృతిమించి మహిషంబులెంచి పలుక, గోవు లాలించి లాలించి
(తీవిమీఱ

మరలఁబలికెను నీరీతి సరసముగను, ముక్కుపగిలించుకంపున మునుగుచుండు
బాడె పరిమళయుత మనఁబాడియగునె, యేరుపల్కుదు రీరీతి మీరుదక్కఁ
బుడమికంతకు మీరలే బుద్ధిగలరె, యంచు భాషించుగోవుల నాలకించి
మహిషరాజంబులీవగ మాఱువల్కెఁ, గట్ట! సత్యంబు గనుఁగొనఁగడఁగకుండ
నస్మదాదులబలమును నరయకుండఁ, గూపకూర్మంబులట్టులు గోవులెయిలఁ
బ్రకృతితత్త్వంబుఁ గనుఁగొన వలఁతు లనుచు, గర్వముం జెందఁ దగునె
(గోగణములార;

బాడెమెచ్చెడివారలు బహుతరముగ, మమ్ముకంటెనుగలరు జగమ్మునందు
నరయసూకరరాజంబు లవనియందుఁ, బంకమునుగన నానందపడుచునెపుడు
నొలినోలలఁగావింప నుత్సాహగనవె, వేయివిధములహాకంబు వేడ్కఁగనవె,
బొమ్మడాయులు లేటులు ముమ్మరముగఁ
గప్పలునుమట్టగిడునలుఁ గర్దమమున, సంతతము సంతసమున సంచారములను
జలుపుచుండుటగాన మేసరసగతులఁ, గుక్కలును బాడెఁ బొరల వేకొంతవలుకుఁ
గలదుమాపక్షమునఁగూడఁ బల మదెంతొ, యవనిఁ గలజంతుజాలంబు
(నరసిచూడ

బురదబాపలుఁ వారిగణముబోధపడును, నాఁగగోవులువలుకు నీలాగునవడిఁ
గట్ట! పందులుఁగుక్కలుంగడకుమీకు, దొడ్డసాక్షులుగాఁగనుదోఁపదగునె
యనఁగమహిషాళి గర్వించియనిమొ నిట్లు, ఏఁడు మనలను సృజియించినాఁ
(డొయట్టి

యీశ్వరుండెవానిని సృజియింపలేదె, వానితక్కువ యెట్టిదో పలుకవలదె?

ప్రవిమలేశుఁడు కాలభైరవుఁడుగాఁడె, యాదినారాయణుఁడు వరాహంబు
(గాఁడె?

అనినగోజాతి ఘననీతి నవ్వుచుపల్కె, నవ్వురయిట్టులు లోకానుభవముఁగను
దారుణవిరోధముగలుగ మీరుపలుకు, చొప్పుగన సువాదమునకుఁ జోటులేదు
వట్టివ్యర్థంపువాదంబు వలదుమనకు, ఫలము దానను గలుగ దావంతమైనఁ
గ్రొత్తగాఁ బ్రవహించుచుఁ జెత్త గలిగి ; సర్వజనపదపంకసంసక్తమగుచుఁ
బ్రచురతర రసగాంభీర్యభాసురఘన, సరసులకు నెక్కఁజాలని స్వల్పరసము
కలిగికుపథస్థితినిబొంది కలఁగియుండి, కలుషితంబయి మురికిగెడిజలమువిడిచి
పావనంబునుసంస్కారభాసురంబు,సుకవిగ్రాహ్యంబుమధురంబుసుఖదరసము
నై నరుచిరపదార్థంబు లంది వాని, వేడుకలరంగఁ జక్కఁగా వాడునెపల
సుకృతితనుగాంచునెప్పుడుఁ జూడనగును, నాఁగ మహిపాళిపలికె నీలాగు
(మరల

మీరుచలిపెడి వాదమే ఘోరమగుచుఁమీరిలోకానుభవమునుమించిపోయె
ఆదినుండియుమాజాతులనుభవించు, ననుభవముఁబట్టియే మేమునయముగాను
బలుకుచున్నాము కులధర్మపథముఁబట్టి, తలఁపమీరుచేసెడికువాదంబువలన
ఫలము లేశమాత్రంబైనఁ గలుగఁబోదుఁమానుఁడీకమీఁదనీరీతిమానరహిత
వ్యర్థవాదంబు దానిచేఫలములేదు, సత్యరతిగల్గి వాదంబు సలుపవలయు
కర్దమమెసుఖదంబును, గదహరంబు, మార్దవాంచితమత్యంతమంజులంబు
జలజకహ్లారములయందు సౌరభంబు, తనరఁజేసెడునద్ది కర్దమముగాదె
సులభసాధ్యంబు శుభదంబుసురభిళంబు, దానివలననె సుకృతితేపనరుచుండు
గానఁగర్దమమెమనకు గ్రాహ్యముసుఁడీ, యనుచు వాదింప మొదలిడె హాలి
(కమెయి

నిట్టులెవరివాక్కులు వారి కింపులగుచు, ధర్మమును హితం బగుచును దనరఁ
(జొచ్చె.

# గ్రంథవిమర్శనము.

---

## 1 శ్రీకృష్ణావతారతత్త్వము.

ఇది కడప మునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానపండితులు కావ్యతీర్థ బ్ర॥ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచియింపఁబడుచున్న యనేకసంపుటములలో మొదటి సంపుటము. శ్రీమహావిష్ణువు గోలోకమున భుజద్వయవిరాజితుండై రాధాదిగోపికలం గూడి శ్రీకృష్ణుఁడై యొప్పుచుండు ననియు దుష్టనిగ్రహమునకు శిష్టపరిపాలనమునకుఁగా నియమింపఁబడిన దిక్పాలురు, బలవన్నృపాలురు వీరికి వశముగాకుండ దుష్టు లుద్రేకించినసమయమున శ్రీకృష్ణుఁడు గోలోకమునుండి భూలోకమున కవతరించి యమానుషములును దేవతలుఁగూడఁ జేయఁ జాలనివియు నగు ఘనకార్యము లొనర్చినాఁ డనియు శాపకారణమున నదితికశ్యపులు మనుష్యులై దేవకీవసుదేవులుగా జనింప వారిగర్భమున భూలోకమున కవతరించె ననియు నితరావతారములవలెఁ గాక యీ శ్రీకృష్ణావతారము విచిత్రచరిత్రము గలదనియు, లోకగురువుగా ధర్మముల నుపదేశించుట, సాక్షిమాత్రుఁడుగాఁ దా నుండి యితరులచేఁ గార్యములఁ జేయించుట, తానూడిగము చేయుట, వయస్సునకుఁ దగని యద్భుతకృత్యముల నొనరించుట మొదలగునవి శ్రీకృష్ణావతారమునందలి మహిమ లనియు నిందుఁ దెల్పఁబడినవి. పురాణభేదములను బాటించి దేవతాదూషణము చేయుట మహాఘోరకార్య మనియు భక్తిదృఢతమ మైనచో నేదేవు నుపాసించినను ఫలము గల దనియు, నిందుఁ దేలుసారాంశము. ఈతత్త్వమును బహుపురాణములు చదివి యాయాయవతారహేతువులను దెల్పుచు సమయోచిత కథలతో లలితశైలిని రచించుచున్నారు. తుదముట్ట నీతత్త్వముం జదివినవారికిఁ గృష్ణునిచర్యలను గొంద ఱాక్షేపించుట యవివేకమని తెలియవచ్చును. పీఠికలోని రెండుమాటల నిందుదాహరించుచున్నారము.

„శ్రీకృష్ణపరమాత్మ యొనరించిన యొక్కొక్క కృత్యమును అమానుషత్వమును వెల్లడింపకపోదు. అట్టి కథల నన్నిటి యొక్కొక్క విషయమునే ప్రధానముగా గ్రహించి లోకవ్యవహారములతో దానిం బోల్చి యిది

యసభ్యము గదా యని వ్రేలెత్తి చూపుట యేటికో తోcచకున్నది. భ్రాత నాసంహారమును మఱుcగుపఱిచి నవనీతహరణమును వెల్లడించుచు భగవంతునియందుc జోరత్వ మారోపించు టేలొక్కో తెలియcజాలకున్నాcడను. షోడశసహస్రస్త్రీల యిండ్ల నేకకాలమం దున్న కథను గప్పిపుచ్చి శ్రీకృష్ణునియందు జారత్వము గల దని చాటుట యేటికో...గోవర్ధనోద్ధరణమును బ్రస్తావింపక గోపికావస్త్రాపహరణమును బయలుపఱుపcజూచుట యేపనికో—త్రివక్రదూషిత యగుపని తను నిర్వక్రగ నొనరించి యోషామణి యనఁ జేయcగాంచ నొనరించిన యత్భుతమహిమమును మఱచి పరస్త్రీసక్తుc డని వ్రాయcగారణమేమో"...

344 పుటలుగల యీ సంపుటము వెల రు 1-8-0 కావలసినవారు గ్రంథకర్తగారికిc గాని చెన్నపురము వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండుసన్సు వారికిc గాని వ్రాసినc బడయcగలరు.

2. చంపకమాలినీపరిణయము.

ఇది యొకయచ్చ తెనుcగు గ్రంథము. ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము వారి చతుర్థభూషణము. కర్త శతావధాని మ॥ పండిత పెనుమెత్స సత్యనారాయణరాజుగారు. మూcడాశ్వాసములలో రమారమి 380 పద్యములు గలవు. రాజునకు సంతానము లేమిచే వగవు పుత్రలబ్ధికై స్వప్నము, వేcట, ఉద్యానవనములో నిద్రించు నొకవింత పురుషుని విహారమునకయి వచ్చిన యొక రాజకన్యక చూచుట, యన్యోన్యవిరహము, వివాహము నిందలి ముఖ్యవిషయములు.

ఏమcబందీ కలనుటకు, ఏదుcబందిముం డ్లని, చంగుచంగున నోరు సాcచి, గాంధ్రుమని పెద్దగనోరుc జాcచి తేనిపై— యనుచోట నోరుదెఱచి యనియు, మాట్లాడుటకు మాటలాడుటయని యుండుటలెస్స. పదంప డేమనిను తత్తడనcగ, వన్నెవత్రు, మొదలగునవి కొందఱకింపుగా నుండవు— అచ్చుతప్పులు గలవు.

వీరికాకారు లనినట్లు— ఈకాలమున నీకవిగా రీయచ్చ తెనుcగు గ్రంథము విరచింప గమకించుట చూడ వారికి భాషపైఁగల యభిమానమే కారణము. గట్టిగా నూఱునూటలు స్వేచ్ఛగాc జెప్పవచ్చును గాని పట్టి పలుపూని యిట్టిపద్యములు నాలు గల్లుట కష్టము. కాcబట్టి యీ కవివరుని

పరిశ్రమము సఫల మౌనట్లు వారకు లాదరింతురుగాక. కొన్ని యిందలి పద్యములు.

గీ. మేటియామని యనువాలిమేరలోని, చిగురుఁగొమ్మలు చిలుకవజీరుపోఁజు
విందుగుడుపంగరమ్మని పిలుచుకరణి,గాలితాఁకున కిటునటుఁగదలుచుండె

గీ. విన్నహొన్నఁ దన్న నన్నవ లేఁగాను, మించుమించు నెంచు మెలఁత (యొడలు
చివురుసవురు జవురు, జేడియకెమ్మోవి, లేడితోడి సూడు లేమికనులు.

గీ. తావిచూడని క్రొవ్విరిపూవు గోళ్ళ, నంటనిచివురు మూచూడనట్టి తేనె
పూనిబెజ్జంబు వేయని మానికంబు, పున్నెములమూట యెవ్వాఁడువొందఁ (గలఁడొ.

ఈపుస్తకము, ఆంధ్రప్రబోధినీగ్రంథమాలాప్రకాశకులయొద్ద, కృష్ణా జిల్లా, లింగాలపోష్టు, మంశపల్లిలో రు ౦-౧౦-౦కు దొరకును.

౩. మంగతాయి.

ఇది విలాసికయను నొక నాటకభేదము. బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిచే రచియింపఁబడినది. పందొమ్మిది రంగములతోఁ గూడి యేకాంకముగ విరాజిల్లుచున్నది. దీనిం జదివి బోధపఱుచుకొని యానందించుటకుఁ బ్రపంచానుభవము, తాత్కాలికాచారవిజ్ఞానము, సంస్కృతాంధ్రాంగ్లేయ భాషాపరిచయమును గావలయును. కాఫీ, సిగరెట్లు, కిల్లీ, సోడా మొదలగు దురభ్యాసములు గలవారికిఁ జీట్లాడువారికి నీతిబోధగలదు. వేశ్యలు, తన్మాతలును గావించు ధనార్జనయంత్రములో లోకుల కాలునేతులు పడకుండ భద్రముగానుండుఁడని యెఱ్ఱజెండా యెగురుచున్నది. స్వపత్నీవ్రతము, పాతివ్రత్యము వీని లక్షణములిందు, ఆచ్ఛాదితములైనను వానిప్రభలుమాత్రము పైకుబుకుచునే యున్నవి. భాషాభిజ్ఞులు, కవులును బ్రస్తుతకాలభాషాదుస్థితి నెఱుఁగు మార్గము లున్నవి. ప్రకృతమున జరగుచుండు సంస్కారములు మొదలు నిన్నమొన్నటి హెల్తువీకు ప్రశంసవఱకు సమస్తవిషయములు నిండిమిడియున్నవి. పద్యములు శైలి మనోహరముగానున్నది. వచనము సంభాషణోచితముగ నున్నది. హాస్యరసమున్నది. స్థలానుగుణముగ నాయాపాత్రముల సంభాషణ మింగ్లీషుతోఁ గలపియు

న్నది. "సిల్కు లాగుంటాది" మొదలగు భావకవిత్వ మున్నది. కొన్ని మచ్చు పద్యములు.

గీ. తమమనెడుపంకమునరాత్రిదగిలియుండు, జీవరాసులఁగరములలేవఁదీయు బుద్ధితోఁ బూర్వపంకిలాంభోధినుండి, మిత్రుఁడుదయించునెప్పుడుమిత్రవర్య.

గీ. కాముఁడనియెడువిలుకాఁడుకాముకాళి, నేయమదిలోనభావించియెక్కువెట్టి
నట్టిపూవిల్లునాఁగను నమరియుండు, మొగ్గవేసిన యీపణ్యమోహనాంగి

మ మతమూపాడగు శీలమూత్రోలఁగు, ధర్మంబాచెడున్ బంధుప
మ్నతమాయుండదు పాపమా పెరుఁగు గర్వంబాకడున్ క్షీణమా
హితమా శూన్యము గాంచెడున్ సుగుణసాహిత్యంబు మాయంబగున్
వ్రతమూపాడగు భాగ్యమూ యడఁగిపోఁ బణ్యాంగనాసంగతిన్.

ఈపుస్తకము గ్రంధకర్తగారియొద్దనే కాకినాడలో రు ౦కు దొరకును.

## 4 స్తుతికదంబము.

ఈచిన్నపుస్తకమును శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరుగారి మూఁడవభార్యామూర్త వ్రాడేవు శ్రీరంగనాయకమ్మగారు రచించిరి. ఇందు 285 పద్యములతో వివిధదేవతాస్తుతులు పదేడు కావింపఁబడినవి. పితృస్తుతి, మాతృస్తుతి యీ రెండు మాత్రము సీసపద్యములు. తక్కినవన్నియుఁ గందపద్యములు. భక్తిభావమున నీమె దేవతాభేద మెన్నక "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" యని క్రీస్తునాథస్తవముగూడఁ గావించెను. ఈమె బాల్యములోనె, ప్రథమప్రయత్నముననె యింతటిమధురకవిత వెలయించుట స్తవనీయాంశము. పద్యములు లలితములు భావయుతములు వ్యర్థపదరహితములునై యున్నవి. ఇట్టిభక్తిభరితకావ్యము లీమె పెక్కులు రచింప వాణి వాగ్ఝరి దయచేయుంగాత! కావ్యరచనము సాధారణముగాదు. దానివలననే మోక్షముసిద్ధించును. అద్దినత్కావ్యమై భక్తిభరితమైన "సద్యఃపరనిర్వృతి" యేగదా. మచ్చునకుఁ గొన్నిపద్యములు.

సీ. అవనీభరక్షమ నాదిశేషువుఁబోలి వాక్పటుత్వమున సర్పపతిఁబోలి
గుణమణిగణముచే ఫణివల్లభునిబోలి యీశ్వరభక్తి నహీనుఁబోలి
బహుముఖైశ్వర్యతఁ బాఁపఱేనింబోలి హరిభజించుటయం దనంతుఁబోలి
ఆయురారోగ్యవిద్యల వ్యాళవరుఁబోలినామసామ్యమునఁబన్నగశ్రేష్ఠుఁబోలి

వెలయు శ్రీభుజగక్ష్మావిభుని జనకు
నాత్మజావత్సలుని విభవాతిశయుని
శాంతమతి సజ్జనప్రియు సత్కవీంద్రు
భయవినయభక్తియుక్తులఁ బ్రస్తుతింతు.

సీ. అనుపమానక్షమ నవనీసతిని బోలి సత్ప్రజాభరమున క్షమనుబోలి
వితతలక్ష్మీసమానత భూమినింబోలి గుణరత్నఖనులకు క్షోణిఁబోలి
విమలపాతివ్రత్యవిశ్రుతిధరఁబోలి ధనధాన్యవృద్ధి భూతరుణిఁబోలి
వాసుదేవాసక్తి వసుధావనితఁబోలి ఫలదాతృతను బంటపొలఁతిఁబోలి
వెలయు శ్రీభుజగక్ష్మావిభునిధర్మ
పత్ని మజ్జనయిత్రిఁ గృపాసముద్రఁ
బుత్రికావత్సలను భూరి పుణ్యనిధినిఁ
జిన్నమాంబను సంస్తుతిసేయుదాన.



## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

(గతసంచిక తరువాయి.)

యుద్ధమల్లశాసనమే యిట్లొకధ్వనికే పలుసంజ్ఞలు కలిగియుండఁగా నాశాసనమునందు 'డ' కారమునకు రెండు సంజ్ఞ లుండుటను మనరావుగారు శంకించి యొకశాసనమునందే యొకధ్వనికి రెండు సంజ్ఞలుండవు కావున రెండవ 'డః'కారసంజ్ఞను మఱియొక ధ్వనిగా భావింతు మనుట విపరీతవాదముకాదా? వీరేశలింగముగారి స్వీయచరిత్రములో నాయన తన భార్యకు కృతియిచ్చుచు వ్రాసిన వ్రాఁతయక్కరముల పోలికనున్న యచ్చులేఖలో 'క' కారమునకు రెండురూపములు వాడఁబడి యున్నవి. (క, క్ర)వీరిట్లు 'క, కారధ్వనిని దెల్పుటకై యొక్కలేఖయందే రెండక్కరముల వాడుట తప్పునవచ్చునా? కూడదు. ఆంగ్లలిపిలో నొక యక్కరమునకే పలుసంజ్ఞలున్నవి, దాన హానికలిగెనా? కాన నీరావు గారి వాద మనుచితము. యుద్ధమల్లశాసనమందలి వివాదాక్షరములు రెండును 'డ,కారధ్వనిగలవే యని గ్రహించుకొనుటయే యొప్పిదము.

—ఱను 'డః'కారధ్వనిగలదానినిగా నెన్ననేల?—

శ్రీరావుగారు రద్దుగీటులేని శకటరేఫమువలె నుండు వింతయక్కరమును 'డః'కారధ్వని గలదానినిగా నెంచుకొననేల? అని శంకించుచున్నారు. (1) ఆసంజ్ఞ ప్రాచీనశాసనంబులలో 'డః'కారధ్వనిఁ దెలుపుసంజ్ఞగా వాడఁబడియున్నది. కాన 'డః'కారరూపముగా నెన్నవలసి వచ్చుచున్న దనునది సమాధానము. (2) యుద్ధమల్లశాసనమందలి 'బెడఁగు' శబ్దమందలి 'డః'కారధ్వనిని దెల్పుటకును ప్రాచీనమగు తరువోజ యందలి 'ఖాండద్దము' అను చోటునఁగల 'డః'కారధ్వనిని దెలుపుటకును నీ యక్కరము వాడఁబడినది కావున దీనిని 'డః'కారరూపముగ నెంచుట యగుచున్నది. (3) 'వడు' 'కోడి' 'చోడ' మున్నగు శబ్దములు పూర్వశాసనములలో 'డ'కారరూపముతోఁ గూడ వ్రాయఁబడి యుండుటను, (4) వానియందలి ద్వితీయాక్షరము 'డః'కారప్రాసస్థానమున నన్నపాదిప్రాచీనలాక్షణికులచే వాడఁబడియుండుటను నాయాశబ్దముల ద్వితీయధ్వనిని దెలుపుటకై పూర్వశాసనములందు నీవింతయక్కరము వాడఁబడుటను నీయది 'డః'కారధ్వని గలదని తోఁచఁబడుచున్నది. (5) ఈవింతయక్కరము ప్రాచీనసంధికాలమునందే 'డః'కారధ్వనిని దెలుపుటకు వాడఁబడిన దని ప్రతిపాదిత

యంగీకరించుచున్నారు కావునను నీయది 'డ'కారధ్వనిని దెల్పునదిగా నెంచఁబడుచున్నది. (6) ప్రాచీనలిపిజ్ఞు లగు శ్రీరామయ్యపంతులవారు మున్నగువారు దీనిని 'డ'గఁ జదివి ప్రాచీనకాలమునందే యాధ్వని కీయక్షరము వాడఁబడిన దని చెప్పుచున్నారు కావునఁ బైకారణములకు వీరియూహను గూడ నూతగఁగొని దీనిని 'డ'కారధ్వనిగల దానినిగా నెంచుట వైనది. (7) యుద్ధమల్ల శాసనమందలి బెడగుశబ్దము వింతయక్షరము గలదై యుండఁగా దానిని 'డ'కారయుతముగానే శ్రీరామయ్యగారు, చెట్టిగారు, వీరేశలింగముగారు మున్నగువారు చదువుచున్నారు కావునను అట్లుచదువఁ గూడ దని లక్ష్మణరావుగారును వారి పక్షమువారును నిషేధింపలేదు కావునను దీనిని 'డ'గఁ జదువుటకుఁ గారణ మగుచున్నది. (8) పైశాసనమునందలి 'వేరడు' శబ్దమునందలి తుదియక్షరము శకటరేఫాకృతి నందియున్న దని లక్ష్మణరావుగారే చెప్పియుండఁగా దానిని మనరావుగారే 'డ'కారయుతముగా భావించి చదివినందున దీనిని 'డ'కారధ్వనిఁ గలదానినిగా నెంచవలసి వచ్చినది. (9) ఈశాసనమునందలి 'ఱస్సి' శబ్దము శ్రీరామయ్యగారు చదివినట్లుగా 'డస్సి'యని చదివిన నర్థము కలదు గావునను, లక్ష్మణరావుగారు చదివినట్లు '...స్సి'అని చదివిన నర్థములేదు కావునను నీయక్షరమును 'డ'కారధ్వని గలదానినిగా నెంచవలసివచ్చినది. ఇట్టి కారణములన్నియుఁ బైని వివరింపఁబడియే యున్నవి. లక్ష్మణరావుగారి 'ఱస్సి'వలె నిష్కారణముగాఁ జదువఁబడియుండలేదు. 'అ'అను దానిని అకార మనుటకును, 'క'అను దానిని 'క'కార మనుటకును నేదికారణమో 'ఱ'అను దానిని 'డ'కార మనుటకు నదియే కారణము. ఇప్పటివలె ఒత్తులేక ఇప్పటి దకారమువలె నుండునక్షరము యుద్ధమల్లశాసనమున నుండ దానిని ధకారముగాఁ జదువుటకుఁ గారణమేదియో యీవిలక్షణాక్షరమును 'డ'అని చదువుటకు నదియే కారణము. ఈశాసనమునంగల మూఁడు నాల్గు భిన్నసంజ్ఞల నేత్వసూచకముగా మనమెట్లు గ్రహించినామో అట్లే దీనిని 'డ'కారసంజ్ఞగా గ్రహించినాము. ఇట్టికారణములచే నీయక్షరము 'డ'కారముయొక్క రెండవరూపముగా నెన్నఁబడుచున్నది. ప్రతిపక్షులు ప్రాచీన సంధికాలమందైన నీయక్షరము 'డ'కారధ్వని దెలుపుటకు వాడఁబడిన దని యంగీకరించిరి గదా. అప్పుడైన నీయది యాధ్వనిని దెలుపునదియని యనుకొనననేల?

యని ప్రశ్నించిన వీరేమి సమాధానము చెప్పుదురో యాసమాధానమునే ప్రాచీనకాలమునుండియు నిద్ది ఁడ,కారధ్వనిని దెలుపుననుటకు నుపయోగింతుము. సందర్భము లేని ప్రశ్నలు వేసి చదువరుల మనస్సుల నదరగొండము పాలుచేయఁ బ్రయత్నించుట మోసపుకృత్య మనియు నది తగదనియు నిప్పటికైన శ్రీవీరభద్రేశ్వరరావుగారు గ్రహించుకొందురు గాక!

—♦ వింత యక్కరముయొక్క రెండవరూపము ♦—

ఈ యక్కరమునకే అడ్డుగీటులేని శకటరేఫరూపముగాక మఱియొకరూపము గూడ నున్నదని లక్ష్మణరావుగారును మనరావుగారును గూడ వ్రాసిరి. రెండు సున్నలను నొకదాని ప్రక్క నొకటి జోడించిన నెట్లుండునో యది మొదటిరూపమఁట! ఈయక్కరమే యొక కన్నడశాసనములో "శకనృపకాలాతీత సంవత్సరంగళ్ ఏఁణ్నూఱె రిప్పత్తాఱనెయ," అను వాక్యమందున్న దని రావుగారు వ్రాసిరి. శకగతసంవత్సరములు 796 లో నీయక్షరము శాసనములలో వాడుకలో నున్నదనిన ఒక్క ఁఱకారధ్వనికే రెండుసంజ్ఞలు వాడుకలో నున్నట్లు స్పష్టమగుచున్నది కదా! దీనివలన ననవస్థాదోషము సంప్రాప్తమగుట లేదా? లక్ష్మణరావుగారు ఆఱవశతాబ్దము మొదలుకొని యడ్డుగీటులేని శకటరేఫరూప మీవింతధ్వనిని దెలుపుటకుఁ గర్ణాటభాషలో వాడఁబడిన దని తెలిపిరి. శ్రీ వీరభద్రేశ్వరరావుగారు తొమ్మిదవ శతాబ్దమునఁగూడ నీయక్కరము (రెండుసున్నలను ఒక దాని ప్రక్క మఱియొకదాని నుంచి జోడించిన నెట్లుండునో అట్టి తొలిరూపము) కర్ణాటశాసనములలో వాడుకలో నున్నట్లు లిఖించిరి. ఇది వింతకాదా ?

ఇదిగాక పూర్వశాసనములందే ఁడఁకారధ్వనిని దెల్పుటకు రెండు సంజ్ఞలు మన తెలుఁగుశాసనములలో వాడఁబడినట్లు రావుగారు వ్రాయవలసినవారైరి. (లక్ష్మణరావుగారు సామాన్యరూప మని యిచ్చిన దొకటి అడ్డుగీటులేని శకటరేఫముపైఁ దలకట్టిచ్చిన నగు రూపమొకటి) ఇది యీ రావుగారు తెచ్చిపెట్టినది.) ఇవి యనవస్థాదోషముం దెచ్చిపెట్టవా? ఇట్ల స్వమతమును ద్రోసివేయుటకై రావుగారు కల్పించిన యనవస్థాదోషము తుదకుఁ దమ్మునే పట్టుకొని బాధించుచున్నదని గ్రహించుకొందురుగాక ! ఇట్టియసత్యవాదములతో వీరెంతకాలము లోకవంచనము చేయఁగలరో తెలియవచ్చుటలేదు. పెక్కేల యొక్క ధ్వనికే రెండురూపములు సాధా

రణముగాఁ బ్రతిభాషయందును వాడఁబడుచున్న వని పైదానివలన మనము తెలిసికొన్నాము. కావున యుద్ధమల్లశాసనములో రెండు 'డ'కార రూపము లుండుటవలన వచ్చినహాని యేదియును లేదు.

—◆ అధర్మమార్గ మవలంబించినవా రెవరు? ◆—

అఱవమునందలి వింతయక్కరమును ధ్వనియును దెలుఁగునఁ గలవని ఋజువు చేయలేక మనప్రతిపక్షు లనేకాధర్మమార్గముల నవలంబించి లోకవంచనము చేసి తమవాదము నెట్లయిన నిల్పుకొనఁ గుచ్చితప్రయత్నములు చేయుచున్నవారయ్యెను, 'మగనిగొట్టి మొగసాలకు మొఱ్ఱలు పెట్టిన' దనినట్లు నే నధర్మమార్గ మవలంబించుచున్నట్లు లోకమునకు దోఁపఁ జేయ సాహసించుచున్నారు!

—◆ రాభణన్యాయము ◆—

అఱవమునందును గన్నడమునందును వింతయక్కరముతోఁ గూడియుండుపదములు తెలుఁగులో 'డ' కారధ్వనితోఁ గూడుకొని యుండుననుట సాధారణధర్మమై యున్న దని లక్ష్మణరావుగారే యంగీకరించి తదుదాహరణముగ నీక్రిందిపట్టిక నిచ్చిరి.

| అఱవము | కన్నడము | తెలుఁగు |
|---|---|---|
| కోఴి | కోళి | కోడి |
| మఴి | సుళి | సుడి |
| పా... | పాళు | పాడు |
| కూ... | కూళు | కూడు |

ఇప్పుడు 'ళ' కారయుతముగా నున్నకోళి మున్నగు కన్నడపదములు మొదట వింతయక్కరముతోఁ గూడియుండెడి వని తెలుపునాధారములు కలవు. ఇఁక మన తెనుఁగువిషయమున నన్నయో 'డ' కారయుతములు గా నున్న 'కోడి' మున్నగు శబ్దములు ప్రాచీనకాలమునఁగూడ 'డ' కారయుతములే యనుటకుఁ బైనిఁ దెల్పిన యాధారములు పెక్కులు గలవు గాని విలక్షణాక్షరయుతము లనుటకు నవకాశములు లేవు. ప్రతిపక్షు లట్టియాధారములఁ జూపఁ బ్రయత్నించి విఫలమనోరథులై హాస్యాస్పద మగునొకవింతన్యాయమునూఁత చేసికొని తమవాదము నిలుపుకొన నుద్యమింపఁ జొచ్చిరి!! కోడి మున్నగు పదములు కన్నడమునను నఱవమునను విలక్షణాక్షరయు

తము లఁట. ఆరెండును నాంధ్రమునకు సోదరభాషలు కావున నాంధ్రము నందలి కోడ్యాదులుఁగూడ మనప్రాచీనులను మనము నుచ్చరించురీతిని డకారయుతములు కాక సోదరభాషలలోని విలక్షణాక్షరయుతములే యని మన మూహించుకొనవలె నంట! ఇది ,,రాభణాన్యాయము,, గా నున్నది. ఇందును గూర్చి యొకప్రాచీనశ్లోక మిట్లు తెల్పుచున్నది.

కుంభకర్ణే భకారోస్తి భకారోస్తి విభీషణే
రాక్షసానాం కులశ్రేష్ఠో రాభణో నచ రావణః.

సోదరుల నామద్వితీయాక్షరములం బట్టి రావణుఁడు ‘రాభణుఁడు, కావలెనఁట! మనప్రతివాదులవాదము నిట్లే యున్నది. మనయాంధ్రమున నఱవమునందలి వింతయక్కరమును, ధ్వనియును గలవనుటకుఁ బ్రతివాదులకు మిగిలిన యాధార మేది? సోదరభాషలలో నున్నది కాన నిందును నుండవలె ననునదియే. ఇది యెన్నఁడైనను ధర్మము కాఁగలదా? అఱవము, కన్నడము, తెలుఁగు సోదరభాష లైనంతన నొకదానియం దున్నధ్వను లన్నియుఁ దక్కినవానియందును బూర్తిగఁ గల వనవచ్చునా? ఏకోదరు లైనను సర్వవిధముల సమాన మగుపోలికఁ గలిగి యుందురా? సోదరులందుఁ గొన్ని సమానధర్మములును మఱికొన్ని యేవ్యక్తికావ్యక్తినిఁ దెల్పు విశేషలక్షణములు నుండును. సోదరభాషల లక్షణములును నిట్లేయుండును.

—◆ ఇతరభాషలందు లేనిధ్వనులు ◆—

అఱవమునందును గన్నడమునందును నెన్నఁడును లేనిధ్వనులు మొదటినుండి యుఁ దెలుఁగునఁ గలవు. అర్ధానుస్వారమును, దంత్యము లగు చ, జ, లును నొక్కయాంధ్రమున మాత్రము కలవు. కాని తక్కినద్రావిడభాషలలో లేవు. ద్రావిడభాష లన్నియు సోదరభాషలుగానఁ బైయాంధ్ర ధ్వను లఱవమునను గల వని యెవ్వరైన నూహించుచున్నారా? అట్లూహించుట కవకాశము కలదా? ఏయవకాశమును లేదని భాషావిదు లెల్లరు నెఱుఁగుదురు. అట్లే యఱవమునందలి వింతధ్వని తెనుఁగున లేకపోవుటలో వింత యే మున్నది! అట్లున్న దనుటకు నేయాధారమును లేకున్నను ప్రాచీనసారస్వతము లే దనుటకే యవకాశముఁ జూపుచుండఁగను సోదరభాషలలో నున్నది కావున నిందును నుండవలె ననుట యనుచితము కాదా? అది ధర్మమా? యుక్తియా? ఏదియును గాదు.

—• వర్ణరూపసాదృశ్యభ్రమ •—

అఱవలిపియందలి వింతధ్వనిఁ దెలుపుటకే యాకృతి కన్నడలిపిలో వాడఁబడెనో యా యాకృతి పూర్వాంధ్రదేశస్థశాసనములలోఁ గాన్పించుచున్నది. కావునఁ బూర్వ మాంధ్రలిపియం దావింతయక్కరమును ధ్వనియు నుండెడి వనుతలంపునకు వచ్చితి మని ప్రతిపక్షులు వాదించుచున్నారు. ఇదియే ప్రతివాదులకున్న తుదియాధారము. ఆకృతిసాదృశ్యమును గని భ్రమసి యిప్పటిశాసనలిపిపాఠకులు తెలుఁగునందుఁగూడ నఱవమునందలి వింతధ్వని యుండెడిదని దూరమాలోచింపకఁ దలంచిరి. ఒకభాషలోనున్న యొక యక్షరసంజ్ఞ యేధ్వనిని దెలుపునో యాధ్వనినే యితరభాషలందలి సమానరూపముగల యక్షరసంజ్ఞలును దెలుపు ననుకొనరాదు. ఏలిపిలక్షణము లాలిపివి. ఎట్లన, ఆంధ్రమున నర్ధానుస్వారధ్వని కలదు. దానిని దెలుపుటకుఁ బూర్వపు టాంధ్రలిపిలో ననుస్వారరూపమే వాడఁబడుచుండెడిది. యుద్ధమల్లశాసనమునందు నట్లు వాడఁబడినది. ఆంధ్రకర్ణాటకలిపియందున్నయీయనుస్వారసంజ్ఞను గని మనమర్ధానుస్వారముగ నుచ్చరించుచున్నాము. ఈయనుస్వారసంజ్ఞ కన్నడభాషం గలప్రాచీనశాసనము లందును గలదు. ఐనను మన మాశాసనములఁ జదువునప్పుడు ఖండబిందుధ్వనిఁ జదువము. ఆంధ్రప్రాచీనశాసనములఁ జదువునప్పుడు మాత్రమే యర్ధానుస్వారధ్వనిని జేకొందు[illegible]ట్లే యద్దుగీటు లేనిశకటరేఫరూపమువంటిరూపము తెలుఁగుశాసనములలోఁ గాన్పించినంతన యయ్యది కన్నడమునందలిధ్వనిఁ గలదిగా భావించి యట్లే సిద్ధాంతముచేయరాదు. ఇది యిందు 'డ'కారధ్వనిఁ గలది గాని వింతధ్వనిఁ గలది గాదని పూర్వశాసనములను బట్టియే తెలిసికొనినాము.

ప్రతివాదు లీయక్షరధ్వనిని కర్ణాటకులు దీని కిచ్చు ధ్వనినిబట్టి నిర్ధారణము చేయుదురఁట. అట్లు చేయనేల? ప్రాచీనాంధ్రులే దీనికి 'డ'కారధ్వని నిచ్చియున్నప్పుడు మనవా రిచ్చుధ్వనిని బట్టియే కర్ణాటకాక్షరధ్వని నిర్ణయింపరాదా? ఒకకర్ణాటకాక్షరరూపమువంటిరూపముగల యక్కరము తెలుంగునఁ గాన్పించినంతన దానిని కర్ణాటకధ్వనిఁ గలదానినిగా భావించుటయుచితమా? అక్షరరూపసాదృశ్యమునుబట్టియా ధ్వనిని నిర్ణయించుటకై

దీనింగూర్చి నేను నాతొలివ్యాసమున —

•. అఱవమునందలి గ్రంథాక్షరములలోని 'డ' మన తెనుంగు 'బ, వ'లె

నుండును. అఱవమునందలి ‹ఱ› కారము తెలుఁగునందలి ‹ల› కారపుఁ బోల్లువలె నుండును. అంతమాత్రముచే మన ‹బ› ను ‹డ› యనియు ‹ల› ను ‹ఱ› యనియు నుచ్చరింపవలసియుండునా? హళకన్నడపు ‹చ› తెనుఁగు ‹బ› వలె నుండును. కాన మన తెనుఁగు ‹బ› ను ‹చ› యనుకొనవలసియుండునా? కూడదు. ఇంతయేల? తెలుఁగులిపిలోనే పూర్వపు ‘ధ’ యిప్పటి ‘ద’ నుబోలియుండును. కాన నక్షరరూపసాదృశ్యముంబట్టి రెండిట ధ్వని యొక్కటి యని నిర్ణయింపఁ బూనరాదు. అది చాలినంత ఋజువుకాదు.” అని వ్రాసి యుండఁగాఁ గర్ణాటకమునుండియుఁ బ్రాచీనాంధ్రమునుండియు నేను జూపినయుదాహరణములను బుద్ధిపూర్వకముగాఁ గప్పిపుచ్చి యఱవప్రశంసమాత్ర మెత్తుకొని రావుగారీక్రిందిరీతిని మోసపువ్రాఁత వ్రాసిరి.

“అఱవమునందలి ‹ఱ› కారము తెలుఁగునందలి ‹ల› కారపుపోల్లువలె నుండును. అంతమాత్రముచే మనము ‹బ› ను ‹డ› యనియు ‹ల› ను ‹ఱ› యనియు నుచ్చరింపవలసియుండునా?” మొదలయిన యసంబద్ధయుక్తులు వ్రాసి సంబంధములేని యఱవభాషలోని యక్షరములతోఁ దెలుఁగక్షరముల లక్ష్మణరావుగారు పోల్చుచున్నా రన్నదురభిప్రాయము చదువరులకుఁ గలుగునట్లును, ఆంధ్రకర్ణాటలిపుల పూర్వైక్యము వారికిఁ దోఁపకుండగను అదరగొండము చేసిరి”.

నేను కర్ణాటకాక్షరముల నుండి పోలికల నీయక ద్రావిడాక్షరముల నుండి మాత్ర మిచ్చిన మీరు వ్రాసినది కొంతవఱకు సమంజసముగ నేయుండును. నేను కన్నడమునుండి యుదాహరణము లిచ్చినను వానిని గప్పిపెట్టి అఱవమునుండి మాత్రమే యుదాహరణములఁ దీసికొనినట్లును, నయ్యది లోకవంచనార్థమై కావించినట్లును రావుగారు వ్రాయుట కడు నింద్యము. మోసపుతలఁ పెవరికిఁగలదో చదువరులు గ్రహింపవలెను. కన్నడము నుండి యుదాహరణముల నిచ్చినఁ జాలదా యఱవమునుండి యేల యిచ్చితి వందురా? కన్నడాక్షరములవలెనే యఱవాక్షరములును నశోకుని శాసనలిపినుండియే పుట్టినవి ఈయంశము లక్ష్మణరావుగారి ‘విజ్ఞానసర్వస్వము’ వలన బోధపడఁగలదు. కాన దూరసంబంధముగలయఱవమునుండియు నత్యంతసమీపసంబంధము గలకన్నడము నుండియు నుదాహరణముల నిచ్చితిని. ఇందు మోస మేమున్నది? నేను ఆంధ్రకర్ణాటాక్షరముల పరస్పరభేదము లే

లియుటకై యిచ్చిన యుదాహరణములు లోకులదృష్టిపథమునఁ బడకుండఁ జేయుటకును, సంబంధ మంతగా లేనియవమునుండి యనవసరోదాహరణముల నిచ్చినట్లు మాత్రమే లోకులు తలఁచి నావ్యాసము సరసముగ లేదని భావించి త్రోసివేయునట్లును జేయు పావనోద్దేశముతో రావుగారీమోసపువ్రాఁత వ్రాసిరి. ఏమైననేమి? అడ్డుగీటులేని శకటరేఫాకృతిగల యక్కరమునకుఁ గన్నడమున నేధ్వనికలదో యాధ్వనియే యాంధ్రాక్షరమాలయందుఁ గల యాయాకృతికిని గల దని యూహించుట మహాసాహసము గాకపోదు. అఱవమునందును, గన్నడమునందును వింతధ్వనితోఁ గూడిన పదములు తెనుఁగున 'డ'కారధ్వని గలవగునని లక్ష్మణరావుగారే యంగీకరించిరి. నన్నపాముల వ్రాఁతలవలనను నాయాపదములు 'డ'కారధ్వని గలవిగా మాత్రము కాన్పించుచున్నవి. వింతధ్వని తెనుఁగునఁ బూర్వకాలమందైనఁ గలదను ఋజువును దేనిని లక్ష్మణరావుగారుకాని మనరావుగారుకాని చూపియుండలేదు. కావునఁ బ్రతివాదులవాద మంతయు నగ్రాహ్యము. ప్రతివాదుల మోసపువ్రాఁతలఁ గని చదువరు లెవరును వంచితులుగాకుందురని తలంచెదను.

## —◆ ఇతరశాసనప్రశంస ◆—

అడ్డుగీటు లేనిశకటరేఫమువలె నుండు సంజ్ఞమనశాసనములలో 'డ'కారధ్వనిని దెలుపుటకై వాడఁబడియున్న దనుసంగతి ఋజువుచేయుటకై కందంపూడిశాసనమును, నీశ్వరభట్టసోమయాజిశాసనమును నే నుదాహరణముగాఁ దీసికొంటిని. ఈయక్కరము సంస్కృతపదములలో నుండిన నాయంశము నిశ్శంక మగునుగావున మొదటిశాసనమునుండి 'చూడామణిః', 'క్రీడయా' అనుశబ్దములందును రెండవశాసనమునుండి 'మండలి' శబ్దమునను గల 'డ' ల నెత్తిచూపితిని. వానిలో మొదటిరెండును నిప్పటియచ్చుడానుబోలియున్నవని రావుగారు నొక్కివక్కాణించిరి. పాపము శాంతించునుగాక! అవి రెండు ఛాయాచిత్రములను సమముగాఁ గలిగి విలక్షణాక్షరముఁ బోలియేయున్నవి. ఇప్పటి 'డ' లవలె లేవు. వలయువారు శాసనములఁ జూచుకొనఁదగును. 'క్రీడయా' యనుపదములోని 'డ' కారమునకున్నతలకట్టు మూలములో నక్షరపు కుడికొనఁ దగిలియుండఁగా నేను నడుమ వేలాడులాగున నుంచి మోసముచేసినట్లు వీరు వ్రాసిరి. అట్లుచేసిన నాకువచ్చు లాభ మేమి

లును లేదు. ఇటుగాని యటుగాని తగులక యక్కరమునకు నడుమ వ్రేలాడు నట్లు తలకట్టుండు వింతయక్కరమువంటి ఉ, ఊ లు శాసనములలోఁ గలవు. నేను చూపిన 'మండలి' శబ్దమునం దట్లే యున్నది. ప్రతిపక్షులా 'మండలి' శబ్దము మాటనెత్తక చల్లగ జారవిడిచిరి. కాని మోసము ప్రతివాదులందు న్నది కాని నాయందు లేదు. 'గుముడూరి' శబ్దము నిచ్చుటలోఁ గూడ నేను మోసముచేసినట్లు వీరు లిఖించిరి. దానిని నేను ప్రమాణముగానే తీసికొనలేదు. "గుముడూరిని మీఁదిచ్చవచ్చినట్లు పలికినను మండలి శబ్ద బెజవాడశబ్దముల నట్లు పలుకవలను కాదుకదా," అని నేను వ్రాసియున్నాను. నేను సాక్ష్యముగాఁ దీసికొనిన మండలి బెజవాడ శబ్దముల మాటఁ దలపెట్టక నేను ద్రోసివేసిన గుముడూరిశబ్దవిషయమున నేనేమో మోసముచేసి నట్లు రావుగారు వ్రాయుటకంటె దారుణసాహసము వేఱొండుండఁబోదు.

—• శాసనకాలములంగూర్చి •—

ఈశ్వరభట్టసోమయాజిశాసనమును, యుద్ధమల్లశాసనమును నేకకాలమునాఁటివే యని చదువరులకుఁ దోఁచునట్లు చేయుటకై పైమోసము గావించితి ననియు "యుద్ధమల్లశాసనము గలదానిమీఁదనే చెక్కఁబడియున్న యీశ్వరభట్టసోమయాజుల శాసనములో", నని లిఖించితి ననియు రావుగా రధిక్షేపించిరి. ఇదియు ననాలోచనపూర్వక మగు తప్పువ్రాఁతయే. సోమయాజిశాసనమును యుద్ధమల్లశాసనముకంటెఁ బ్రాచీన మని నాతలంపు. దాని నిదివఱకు నాంధ్రపత్రికాసారస్వతానుబంధములోఁ బ్రచురింపఁబడిన "నన్నయకుఁ బూర్వము పద్యములు కలవా?" అనుశీర్షిక గలవ్యాసములో ఋజువుచేసియున్నాను. అట్టి నేనీరెండుశాసనములు నేకకాలమునాఁటివని తలంపుఁ బుట్టింప నేల ప్రయత్నింతును? రెండులిపులకును భేద మున్నదని నే నంగీకరించియే యున్నాను. రావుగారు విమర్శించిన నా వ్యాసములో యుద్ధమల్లశాసనము ప్రాఁతకత్తులో నున్నదనియు సోమయాజిశాసనమును నందంపూడిశాసనములో నాయుదాహరించిన భాగమును గ్రొత్తకత్తులో నున్నవనియు వీనికిఁ దలకట్టున్నదనియు నదియే భేదమున్నదనియు నేను విస్పష్టముగా వ్రాసియే యున్నాను. ఐనను దానినంతను గప్పిపెట్టి యుద్ధమల్లశాసనముగల దానిమీఁదనే చెక్కఁబడియున్న యీశ్వరభట్టసోమయాజుల శాసన' మని నేను వ్రాసినదానిని బురస్కరించుకొని రెండుశాసనములు

నేకకాలమునాఁటివే యని తోపఁజేయుటకై నేనట్లు వ్రాసితినని రావుగారె త్రిపాడిచిరి. ఇది పెద్దవింత. యుద్ధమల్లశాసన మున్నఱాతిమీఁదనే యున్న యీశ్వరభట్టసోమయాజులశ్శాసన మనిన రెండును నేకకాలము నాఁటివను నర్థము బాలుఁడైనఁ జేసికొనునా? అందు స్థలనిర్దేశము కలదు కాని కాలనిర్దేశమేది? యుద్ధమల్లశాసన మున్నఱాతిమీఁదనే యని ఏవకారప్రయోగ మేల చేసితి వందురా? ఆరెండుశాసనములనుండి నే నిచ్చిన యక్కరములు పోల్చిచూచుకొనుటకు నెక్కుడగు ననువుగలదని చదువరులకు సూచించుటకట్లు వ్రాసితిని. ఆ వ్రాఁత రెండును సమకాలమునాఁటివే యనియెన్నఁడును దోఁపఁజేయదు. ఇది రావుగారును నెఱుంగుదురు. ఐనను నాయందు నిష్కారణదోషారోపణము చేయుటకై బుద్ధిపూర్వకముగా నిట్లువ్రాసిరి. ఇది వారివాదవైఖరి!

యుద్ధమల్లశాసనలిపికిని యీశ్వరభట్టసోమయాజి శాసనలిపికిని గల కాలభేదమును దెలుపుటలోఁ గూడ రావుగారు పెద్దమోసము గావించిరి. ఎంతయో కాలభేదము గల దని చదువరులకు భ్రమపెట్టుటకై యీరెండు లిపులకును "ఎన్నియో వందలయేండ్లయెడ మున్న"దని సాహసించి వ్రాసిరి. ఇది ఘోరాసత్యము. యుద్ధమల్లశాసన మేనాఁటిదో శాసనముం బట్టి తెలియదు. దానికాలముంగూర్చి పలువురకు పలువిధములైనయూహలు గలవు. ఈశ్వరభట్టసోమయాజి శాసనమున నన్ననో కాల మీఁబడియున్నది. కాని, యాకాలనిర్ణయము చేయుటలోఁగూడ నభిప్రాయభేదములు గలవు.

—♦ ఈశ్వరభట్టసోమయాజిశాసనకాలము ♦—

ఈశాసనకాలము శా. శ. 1087 అని రావుగారు వ్రాసిరి. ఇదియొక మోసపువ్రాఁత. ఈకాలనిర్ణయము శ్రీరామయ్యపంతులవారిచేఁ జేయఁబడినది. కాని యీనిరూపణమును శ్రీజగన్నాథరావుగా రధిక్షేపించి యాశాసనకాలము శాలివాహనశకము 1019 అని నిర్ణయించిరి. ఈవిషయమై లక్ష్మణరావుగారే యిట్లు వ్రాసిరి.

"కుడిప్రక్క నున్న యీశ్వరభట్టుశాసనముఁ దీసికొందము. అందలి శకము 1087 (క్రీ. శ. 1165) అని రామయ్యపంతులువారు వ్రాసిరి. అది 1019 (క్రీ. శ. 1097) అని జగన్నాథరావుగా రనుచున్నారు. కాని వాదసౌకర్యమునకై బ్రహ్మయ్యగారి కనుకూలమైన 1087 నే తీసికొందము."

దీనింబట్టి శాసనకాలము శా. శ. 1087 గ నావాదసౌకర్యార్థమై లక్ష్మణరావుగారు తీసికొనినట్లు కాన్పించుచున్నది. కాన వారియూహ నిజముచే జగన్నాథరావుగారియూహతో నసఁగా శా. శ. 1019 (క్రీ. శ. 1097) అనునూహతో నేకీభవించినట్లు తేలుచున్నది. ఈశ్వరభట్టసోమయాజి శాసనము క్రీ. శ. 1097 అని తెలిసికొనినాము ఇఁక యుద్ధమల్లశాసన కాలము గూర్చి ముచ్చటించుకొందము. ఈయుద్ధమల్లుఁడు చాళుక్యులచిన్న శాఖలోనివాఁడనియుఁ బ్రథమయుద్ధమల్లుని మనుమఁడనియు లక్ష్మణరావుగారే వ్రాసిరి. ఈతఁడు క్రీ. శ. 927–34 వఱకుఁ బరిపాలించినట్లుగ నారుంబాకతామ్రశాసనముంగూర్చిన వ్యాసములో లిఖించిరి. కావున లక్ష్మణరావుగారి మతమును బట్టియే క్రీ. శ. 10 వ శతాబ్దములోనిది యుద్ధమల్లశాసనమును, పదునొకఁడవ శతాబ్దములోనిది యీశ్వరభట్టసోమయాజిశాసనమును నగుచున్నవి. ఇట్లుండఁగా నీ రెండుశాసనముల లిపులకును నెన్నియో వందలయేండ్ల యెడ మున్నదని రావుగారు వ్రాసినది లోకవంచనార్థము కాకుండునా? అది యటుండ మనయుద్ధమల్లశాసనము యుద్ధమల్లుని మనుమఁడైన యుద్ధమల్లుని దని చెప్పుట కింతయు నవకాశములేదు. మనశాసనములో యుద్ధమల్లునితాత మల్లపరాజని స్పష్టముగఁ దెలుపఁబడియున్నది. యుద్ధమల్లుని మల్లుఁ డనవచ్చును గాని మల్లపరాజనిన యుద్ధమల్లుఁ డనరాదని లక్ష్మణరావుగారే సిద్ధాంతీకరించిరి. యుద్ధమల్లునకు మల్లపనామము కూడ నున్నట్లు ప్రమాణము లభించినఁగాని మల్లపనాముఁడే యుద్ధమల్లుఁ డనరాదని వారు నొక్కివక్కాణించిరి. కాన మనశాసనమునందలి మల్లపరాజే ప్రథమయుద్ధమల్లుఁ డనుటకు నవకాశ మింతయును లేదు. ఈ ప్రథమయుద్ధమల్లునకు మల్లపనామ మున్నదేమో కనుఁగొనఁ లక్ష్మణరావుగారు విశ్వప్రయత్నము చేసిరి గాని తుదకు విఫలమనోరథులైరి. రెండవ యుద్ధమల్లునకు మల్లపనామము కూడఁ గలదని కనుఁగొంటి మనిరి. కావున మల్లపరాజు మనుమఁడైన యుద్ధమల్లుఁడు క్రీ. శ. 1027 మొదలు 1034 వఱకుఁ బరిపాలించిన ద్వితీయయుద్ధమల్లుని మనుమఁడైన మఱియొక యుద్ధమల్లుఁడై యుండవలయును. అట్టివాఁడైనచో నాతఁడు రాజరాజనరేంద్రుని కాలములోనివాఁ డగును. అట్లగుచో యుద్ధమల్లశాసనమును సోమయాజిశాసనమును నొక్కశతాబ్దమునందే యనఁగా పదునొకండవ శతాబ్దమునందే పుట్టిన

వగును. మఱి యొకవిశేషము కలదు. యుద్ధమల్లశాసనము రెండవయుద్ధమల్లుని కాలములోని దని వాదమునిమిత్త మొప్పుకొనినను దానియందున్న లిపికిని సోమయాజిశాసనలిపికిని నెన్నియో వందలయేండ్ల యెడమున్నదనుట మఱియొకవిధముచేతఁ గూడ నుచితముకాదు. ఏ మన యుద్ధమల్లశాసనలిపి దానితో నంతముకాలేదు. ఇంకను గొంతకాలము నడచినది. తరువాత మఱియొకక్రొత్తక త్తేర్పడినది. అది యేర్పడినకాల మేదనిన రాజనరేంద్రుని కాలమని శ్రీరామయ్యపంతుల వారు వ్రాసిరి: నందంపూఁడి శాసనమే హద్దనిరి. రాజనరేంద్రుని కాలమువఱకు యుద్ధమల్లశాసనమందలి పూర్వలిపియే వాడుకలో నున్న దని లక్ష్మణరావుగారి విజ్ఞానసర్వస్వము కూడఁ దెలుపుచున్నది. ఈవిధమునఁ జూచినను యుద్ధమల్లశాసనలిపికి సోమయాజిశాసనలిపికి నెడమెంతయూ లేదని యు నేకశతాబ్దమునందే రెండును వ్యాప్తి చెందినవనియుఁ దేలుచున్నది. ప్రతివాదులమతమును బట్టియే యిట్టిసిద్ధాంత మేర్పడుచుండఁగా మనరావుగారి రెండులిపులకును నెన్నియో వందలయేండ్ల యెడ మున్నదనుట ఘోరవంచనము కాకుండునా?

—• ఈధ్వని యాంధ్రముననుండఁ దగినదియా? •—

మృదుమధురమైన తేనెవంటి తెలుఁగుభాషలో బహుధ్వనులుకలిసి యున్న యీవింతయక్షరము కలదనుటకే యవకాశము కాన్పించుటలేదు. ఇట్లు నేనిదివఱకే వ్రాసియుండఁగా "ళకారమునకు బండిఱాకు లేనికర్కశత్వము దీని కెట్లారోపింపవచ్చును? కేవలానూయచేఁ దమకుఁ దెలియనిపరులభాషను వర్ణోచ్చారణను నిందించిన నది హేతు వగునా? సంస్కృతమందలి ఠకార ఢకారంబులు తెలుఁగు తేనెలోఁ గలిసిపోఁగా సంగీతమునకుఁ బ్రఖ్యాతిఁ జెందిన కన్నడమందలి ೞ ( ழ ) కారము తెలుఁగువారి గొంతులో నడ్డుపడునా? అట్లు చెప్పుట యొకయుక్తియా?,, అని వీరభద్రేశ్వరరావుగారు నన్ను గేలిచేసిరి. కాని యిది తగదు. ఏమన, సంస్కృతఠకారఢకారములు తెలుఁగు తేనెలోఁ గలిసిపోయినవి. కాని యిది యట్లు కలిసిపోలేదు. పదమూఁడవశతాబ్దమునుండి యీయక్షరము తెలుంగునుండియుఁ గర్ణాటకమునుండియు జాఱిపోయినదని ప్రతిపక్షులే యంగీకరించిరి. ఱ, ళ, ఠ,ఢలు జాఱిపోక నేటివఱకును దెలుఁగున నిలిచియుండఁగ మనవింతయక్షరము పూర్వకాలమునందే జాఱిపోవుటకుఁ గారణ మేమి? అది కర్ణాటకపక్షు

కును విశేషించి యాంధ్రులకును సరిపడని వింతధ్వనియై గొంతులో నడ్డువడుటచేతనేగదా దానిని క్రమక్రమముగా వదల్చుకొనిరి! ఆ హేతువుననే గదా లక్ష్మణరావుగారును దీనిని వింతయక్కర మనిరి!

(౩) «కాల్డువెల్ దొరవారు దీనిని "The peculiar vocalic of Tamil" అనిరి.»

ఇంతయేల? అఱవవారి యక్షరసమామ్నాయమును బరిహాసింపనివారెవరు? వాఙ్మయచరిత్రకారులు ఈయక్షరమాలను బలుపరివిధముల నిందించిరి. నావ్యాసమున్న పరిషత్పత్రికయందే ప్రక్కపుటలోనే బ్ర॥శ్రీ ముడిగొండ నాగలింగశాస్త్రిగారీవింతయక్కర మాంధ్రులగొంతున కడ్డువచ్చుననునభిప్రాయము తేలురీతిగా «నాంధ్రభాషాప్రశంస» యను పద్యవ్యాఖ్యానములో నిట్లు లిఖించిరి.

«అందవు మోకలై గొనబులౌ లలిపల్కుల నానువారికి। నొవ్వందొనరింపవచ్చు మఱి వెణ్ణాయి కోఴియ...... రళ్లిరళ్లిందను ద్రావిడోక్తి యెనయెట్లగు దీనికి.»

వింతయన నిప్పటితెలుఁగువారి కపరిచితము అని శ్రీవీరభద్రేశ్వరరావుగారు తెల్పిరి. లక్ష్మణరావుగారట్టితలఁపుతో వింతపదప్రయోగమును గావింపలేదు. వీరు వింతయక్కర మనుటయే గాక «అఱవమున ఴ అను నొకవింతయైనయుచ్చారణగల యక్షరము గలదు» అనికూడ వ్రాసిరి. దీనింబట్టి యీ యక్షరోచ్చారణమందే వింతయున్నట్లు లక్ష్మణరావుగారి వ్రాఁతవలననే తేలుచున్నది. వీరికి ఱ,ళ,ఠ,ఢలు వింతయక్కరములుగాఁ గాన్పింపలేదు. అవియేకాదు వివాదములో నున్నయక్కరము తప్పఁ దక్కినవేమియు వీరికి వింతయుచ్చారణముఁ గలవిగాఁ గాన్పింపలేదు. వీరభద్రేశ్వరరావుగారు దీనికి భిన్నార్థమునకై చేయుప్రయత్నమంతయు వంచనార్థమైనదగుచున్నది. «అఱవమునందును దానిపుత్రికయగు మళయాళమునందును నేఁటివఱకును నిలిచియున్నది కాని కన్నడమునుండి పూర్వమునందే జాఱిపోయినది. «సంగీతమునకుఁ బ్రఖ్యాతిఁజెందిన కన్నడమందలి ೞ (ழ) కారము తెలుఁగువారిగొంతులో నడ్డుపడునా?" అని రావుగారు శంకించిరి. దీనిని అఱవమునందలి వింతయక్కర మని లక్ష్మణరావుగారు తెలిపియుండఁగ నిది కన్నడమునందలి దని యీరావుగారు తెలుపుట మఱింతవింత! ఇది కన్నడమునందు స

హాజముగు నక్కారమే యగుచో నఱవమునందువలెఁ గన్నడమునందును నిలిచియే యుండును: అట్లు నిలువలేదు. కావునఁ గన్నడపువారియుచ్చారణమునకుఁ గూడ నిది సరిపడదని తేలుచున్నది. అదియట్లుండ, కన్నడము సంగీతమునకుఁ బ్రసిద్ధికెక్కినట్లు రావుగారు లిఖించిరి. అది సంగీతమునకుఁ దెలుఁగు కన్న నెక్కుడు ప్రసిద్ధి కలది కాదు. సంగీతమునకుఁ బ్రసిద్ధికెక్కినది తెలుఁగే. ఇది తేనెవంటి భాష. ఇందు మార్దవము హెచ్చు. కావుననే జన్మముచేఁ గర్ణాటకుఁ డగు కృష్ణదేవరాయలు 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యని దీనిని బొగడియున్నాఁడు. పాశ్చాత్యులును దీనిని 'ఇటాలియన్ ఆఫ్ ది యీస్టు' అనికొనియాడిరి. బహుభాషాభిజ్ఞులును రాజధానికళాశాలలోని సంస్కృతపండితులు నయిన యం. యే. శేషగిరిశాస్త్రులవారి యాంధ్రశబ్దతత్త్వగ్రంథపీఠికలో 'తెనుగు ద్రావిడభాషలలో మిక్కిలి సుందరమైనది' అని వ్రాయఁబడి యున్నది. ఆంధ్రవాఙ్మయచరిత్రకారులు :—తమ యాంధ్రవాఙ్మయచరిత్రలో 'వినుటకు శ్రుతికటువుగ నుండునదియగు బొమ్మరాళ్ళతంబళమునుండి, తేనెవంటి తేటతెనుఁగు వచ్చెననుకొను తెనుఁగుచరిత్రకారుల నేమనవలెనో తెలియకున్నది' అని వ్రాసిరి. ఇంతమృదుమధురభాషలో నిట్టిదని తెలుపశక్యముగాని వింతధ్వనిగల యపూర్వాక్షర ముండుట యసంభవము. అఱవమునకు సమీపమున నున్న కర్ణాటకముననే నిలువలేని యీవింతధ్వని తెలుఁగులో నుండఁజాలు నెట్లు?

అదిగాక, నాకుఁ దెలియనిపరులభాషలోని యీవింతయక్కరమును నేను అసూయచే నిందించినట్లు వీరభద్రేశ్వరరావుగారు సాహసించి లిఖించిరి. ఇది దారుణోక్తి. దానిని కర్కశాక్షర మనియైన నేనెచ్చటను వ్రాయలేదు. శ్రీలక్ష్మణరావుగారు ప్రయోగించిన 'వింత' పదమే నేనును వాడినాను. ఇందు లక్ష్మణరావుగారిని మించి నేను చేసిననింద యేమున్నది? 'అఱవమునందలి వింతయక్కరము తేనెవంటి తెలుఁగున నుండఁగలదా?' యనిన బరులభాషను నిందించుట యగునా? వివేకు లెవ్వరైన నట్లు తెలుపఁగలరా? తాము ఆఙ్గ్లవర్ణసమామ్నాయమును లోపముగలదానినిగాఁ బరిహసించిరి. అది తమకుఁ దెలియనిపరులభాషను నిందించుటగాదా? నేను నిర్హేతుకముగా నఱవవారిభాషను నసూయతో నిందించినట్లు [illegible]జేసి వారికి నాపైఁ

గోపమువచ్చునట్లు చేయుటకై రావుగారీయెత్తు నెత్తిరి. రావుగారి యీ కల్యాణగుణము మిక్కిలి స్తోత్రపాత్రముగా నున్నది.

దాని నటులుంచి తేనెవంటి మృదుమధురమగు నాంధ్రభాషలో బహుశ్వాసంకలితమైన యఱవమునందలి వింతయక్కరముండుట కవకాశము లేశమును లేదని యాంధ్రప్రపంచము గ్రహించుకొనునుగాక!!

—♦ ఉపసంహారము ♦—

ప్రధానవిషయవిమర్శనము చేయుటలో రావుగారి వైదుష్య మెంత చక్కగ నడచినదో తెలిసికొనినాము. ఇఁక దూషణపాండిత్యమునందు వీరి కున్న విదగ్ధతంగూర్చి యొక్కింత ముచ్చటించుకొందము. అఱవమునందలి వింతయక్కరముంగూర్చి నేను గావించిన విద్యావిషయకవాదముంగని రావుగా రెంతలకో నాపై మితిలేనియాగ్రహము వహించి కోపమూర్ఛితులై నన్నుఁ బరిపరివిధములఁ బరిహాసించిరి. ఇందైన విచక్షణతచూపిరేమోయన నదియును గాన్పింపదు. రావణునకు రామునందు విరోధభక్తి యున్నట్లుగా యుద్ధమల్లశాసనమందు నాకు విపరీతభక్తి గలదనిరి. రావణునితో నన్నుఁబోల్చుటకు వారు సాహసించినను నే నాఘనవిద్వాంసునితో నేవిధమునను దులతూఁగఁ గలవాఁడను గాను. రావణుఁడు సంస్కృతమున గొప్పకవి. వేదవేదాంగవేత్త. ఆంధ్రభాషావిషయమున నన్ననో దానిని బ్రథమమున శాసించిన ప్రథమాచార్యుఁడు. ఈతఁడు తెలుఁగున నొకవ్యాకరణము విరచించెనఁట. దానికే రావణీయమను పేరఁట. అట్టిఘనవిద్వాంసునితో నన్నుఁ బోల్చి వికటహాస్యముచేయఁబోయి తుదకు రావుగారు ప్రకటహాస్యము పాలగుచున్నారు. విద్యావిషయమున రావణునితోఁ బోల్కి యెవనికిఁ గలుగునో వాఁడు ఘనుఁడే యగునని రావుగారు గ్రహించుకొందురుగాక!

"ఱయను పురాతనాక్షర మీశాసనమునందు గలదని తేలెనేని దానికిఁ బురాతనత్వము వచ్చునేమో యన్న శ్రీ బ్రహ్మయ్యగారిభీతియే యీ లేఖకుఁ గారణము" అని మఱియొక వింతవాక్యమును వీరులిఖించిరి. నాకట్టి భయమేల యుండవలెను? అది ప్రాచీనమైనను నావాదమునకు భంగము లేదు. ఈవింతయక్కర మాంధ్రశాసనములలో శా. శ. ౧౨-వ శతాబ్దము వఱకునున్నదని ప్రతివాదులలే యీక్రిందివాక్యములలో నంగీకరించిరి.

"ఇఁక 'నీఁ' అను నక్షరచరిత్రమును జూతమా, యిది శా.శ. ౧౨వ శతాబ్దమువఱకు దెనుఁగు శాసనములలో ఞ అను నుచ్చారణముతోడనే యుండెను."

ఇఁక నీయక్షరము యుద్ధమల్లశాసనమున నుండినంతమాత్రమున నయ్యది క్రీ. శ. ౧౧-వ శతాబ్దమునకుఁ బూర్వపుదెట్లగును? తరువాతఁ గూడ నీయక్షరము కాన్పించుచున్నది గదా! ఇఁక దీనివలన నా శాసనము నన్నయకుఁ బూర్వపు దైపోవునేమో యన్నభీతి నాకుంజవలసిన యవసరము లేదని తేలుచున్నది కదా. కావున నీవాదమువలన స్వపక్షమునకే హానిగల్గుచున్నదని రావుగారు తెలిసికొనవలెను. ఏమన నియ్యది క్రీ. శ. ౯-వ శతాబ్దమువఱకే యాంధ్రశాసనములలో నున్నదని లోకమును నమ్మింప కీ. శే. లక్ష్మణరావుగారు తమవ్యాసములోఁ బ్రయత్నించిరి. వారి యీ క్రింది వాక్యములు దానిని ఋజువుచేయుచున్నవి.

1. "తెనుఁగుభాషయందు నీవర్ణము యుద్ధమల్లునిశాసనకాలమువఱకు నుండెననుట స్పష్టము."

2. "ఇంకను గుఱించి శోధింపఁగా ౧౧-వ శతాబ్దమునకుఁ బూర్వపు తెనుఁగు దేశపుశాసనములలో నీయక్షరము కానవచ్చుచున్నది."

దీనింబట్టియే లక్ష్మణరావుగారే యీ తలతోఁక లేని శాసనమునకు నెట్లయినఁ బురాతనత్వముఁ గల్పింప నిక్కముగు వింతయక్కఱపు చారిత్రమును దాఁచిపెట్టిరని తేలుచున్నది. మఱి రావుగారు శా. శ. ౧౨-వ శతాబ్దమువఱకు నీయక్షర మాంధ్రశాసనములలో నున్నదని వ్రాసి లక్ష్మణరావుగారి మనోరథమును భగ్నము గావించిరి. శాసనమునందలి వాక్యములంబట్టియైన నేమి, యందలి యొకయక్కరముంబట్టియైననేమి తుదకు శాసనశిలం బట్టియైన నేమి యీశాసనము బ్రాచీనముఁ జేయ లక్ష్మణరావుగారు విపరీతప్రయత్నములఁ జేసిరి. కావున దీనియందు విపరీతభక్తిగలవారెవరో చదువరులే తెలియుఁగుదురుగాక!

నన్నయకుఁ బూర్వము తెలుఁగునఁ బద్యరచన లేనేలేదని నేను 'నన్నయభట్టారక చారిత్రము'న నుడివినట్లుగా రావుగారు లిఖించిరి. ఇది యసత్య ప్రకటనము. నన్నయభట్టారకుఁ డాంధ్రకవితాజనకుఁ డనిచెప్పినవారు మన ప్రాచీనకవులు. నన్నయ భారతమునందలి 'తనకులబ్రాహ్మణు' వను సీ

సపద్యము తెనుఁగుసారస్వతములో మొదటిదనినవారు లక్ష్మణరావుగారు. నేను 'నన్నయభట్టారకచారిత్రమున వ్రాసిన దేదో వీరెవ్వరు నెఱుఁగరు. వీరెల్లరు రోషకలుషితనేత్రులై దానిని జూచినవారగుటచే నందలిసత్యమును గ్రహింపఁజాలక వికటహాస్య మొనరించి ప్రకటహాస్యాస్పదు లగుచున్నారు. ప్రతివాదులు శాంతచిత్తులై తమనేత్రపుండరీకముల విప్పి 'నన్నయభట్టారకచారిత్రము'ను జదువుకొనిన నేను విపరీతవాక్యము లేవియు వ్రాయలేదనుసత్యము వారికిఁ దెలియఁగలదు.

వీరివ్యాసఫలితార్థము:—

„13-వ శతాబ్దమువఱకు నీయుచ్చారణ తెలుఁగుదేశమున లోపించినది. త్వరలోనే యీ యక్షరము కూడ లోపించినది. ఈ సంధికాలములో ననఁగా నుచ్చారణలోపించి యక్షరము లోపింపనికాలములలో నెప్పుడైన నిది 'డ' కారమునకు బదులుగ వాడఁబడిన వాడఁబడి యుండవచ్చును.''

ఇందుమూలమున నన్నయకుఁ దరువాత కూడ మన యాంధ్రమున నీఱింతయక్కరము కలదనియు నయ్యది 'డ' కారస్థానమునఁగూడ నొకప్పుడైన వాడఁబడి యుండవచ్చుననియుఁ బ్రతివాదు లంగీకరించినట్లు స్పష్టమగుచున్నది.

'చిత్' అయిన దెవరో లోకము గ్రహించుకొనుఁగాక!

„సత్యమేవజయతి నానృతమ్''



# మహాభారతమీమాంస.

— చర్ల నారాయణశాస్త్రిగారు —

ఓం

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీంచైవ తతో జయ ముదీరయేత్॥

అర్థము — నారాయణుని, అనఁగా శ్రీకృష్ణుని నరులలో, నుత్తముఁ డగు నరుని, అనఁగా అర్జునుని, నమస్కరించి సరస్వతీదేవినిగూడ నమస్కరించి పిమ్మట 'జయము' అనుపేరుగల గ్రంథమును అనఁగా మహాభారతమును జదువవలయును.

## ప్రస్తావము.

భారతవర్షమునందలి ప్రాచీనగ్రంథములలో వేదముల తరువాత నైతిహాసికదృష్టిచే మహాభారతమునకు నెక్కువ మహత్త్వము కలదు. ఇంతియేకాక వేదములు ప్రాచీనమైన యార్యభాషయందు నున్నవి. ఇంకను వానిలోని చాలభాగము యజ్ఞములకు సంబంధించిన యనేకవర్ణనలతోడను వైదికదేవతల స్తోత్రములతోడను నిండియున్నది. కాఁబట్టి వైదికసాహిత్యమునుండి చారిత్రికమైన యనుమానములు అస్పష్టముగను స్వల్పముగను మాత్రము బయలుదేఱఁగలవు; కాని మహాభారతగ్రంథము లౌకికమైన సంస్కృతభాషయందుఁ జాలవఱకు సుగమముగా నున్నది. అందుఁ బ్రాచీనములైన యనేకచారిత్రికకథలు ఒక్కచోటనే చేర్పఁబడి యున్నవి. ప్రాచీనకాలమున నశ్వమేధము మొదలైనదీర్ఘసత్రములు, లేక, చాలదినములవఱకు నగు యజ్ఞములు జరగుచుండెడివి. ఆయజ్ఞములయందుఁ దీక్షితులైనవారు చారిత్రికగాథలు, లేక, యాఖ్యానములు చెప్పుటయో చదువుటయో వాడుకయై యుండెను. ఇట్టి సమయములయందుఁ బఠింపఁబడిన యనేకములగు నైతిహాసికాఖ్యానములు మహాభారతమున నొక్కచోఁ గూర్పఁబడియున్నవి. ఇదిగాక మహాభారతమునందుఁ బ్రతిచోటను ధర్మము, తత్త్వజ్ఞానము, వ్యవహారము, రాజనీతి, మొదలగు విషయములనుగూర్చి విస్తరముగా వివేచన చేయఁబడి యుండెను. ఆవిస్తృతమైన వివేచనవలన దానిని ధర్మగ్రంథమని కాని రాజనీతిగ్రంథమే యనికాని చెప్పవలసియున్నది. తాత్పర్యము, మహాభారతప్రశంసమునను ప్రారంభమున ఏయిదిచె

ప్పఁబడెనో—ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ పురుషర్షభ యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్। అది యెంతయు సరిగానున్నది. ప్రాచీనకాలమున సర్వసంస్కృతసాహిత్యము చాలవఱకు మహాభారతము మీఁదనే యాధారపడి యున్నది. సారాంశ మేమనఁగా ఈ గ్రంథమువలన మనమునుపటి భారతపరిస్థితులకు సంబంధించి విశ్వసనీయములును విస్తృతములు నగు ప్రమాణముల యాధారమునఁ జాల నైతిహాసిక విషయముల యొక్క జాడ తెలియుచున్నది. ప్రాచ్యులు పాశ్చాత్యులు నగు విద్వాంసు లీదృష్టిచేతనే మహాభారతమును జదివి తమతమ గ్రంథములయందు దాని నాధారము చేసికొని తమతమ మతములను లేక సిద్ధాంతములను బ్రకటించియున్నారు. వేబరు, మేక్డానల్డు, హాఫ్కైన్సు మొదలుగా ననేకపాశ్చాత్యవిద్వాంసులు ఐతిహాసికదృష్టితో నీగ్రంథమును మిగులఁ బరిశీలించియున్నారు. ఇదేవిధముగా లోకమాన్యతిలకు, దీక్షితుఁడు, ఐయ్యరు మొదలైన చాలమంది ప్రాచ్యవిద్వాంసులుకూడ నైతిహాసికదృష్టితో నీగ్రంథము నధ్యయనము గావించిరి. ప్రతిభారతీయార్యుఁడును నీగ్రంథము మీఁద మిక్కిలి యెక్కువయైన శ్రద్ధను గలిగి యున్నాఁడు. కనుక లోకులమనస్సునందు, ఈగ్రంథమువల్ల నేయే యైతిహాసికానుమానములు చేయఁబడఁగలవో యని జిజ్ఞాస యుత్పన్నమగుట యెంతేని సహజము; స్వాభావికముకూడ నై యున్నది. ప్రాచ్యులయుఁ బాశ్చాత్యులయుఁ బరీక్షాదృష్టి యందుఁ జాలభేద ముండుట స్వాభావికమే యై యున్నది. అయినను, ఈ గ్రంథమునకుఁ బ్రప్రకృతియైన మరాఠీభాషాంతరముయొక్క ప్రారంభమున నుపోద్ఘాతములో నాయావిషయములయొక్క విచారముచేసి చూపఁబడియెను. మనము ఈగ్రంథమున మహాభారతమును సాంగోపాంగముగా నైతిహాసికదృష్టితో విచారింపవలసి యున్నది. భారతవర్షములోని ప్రాచీనపరిస్థితియొక్క యేస్వరూపము మన మిచ్చట విచారింపవలసి యున్నదో, అస్వరూప మాయుపోద్ఘాతములో స్పష్టీకృతమై యున్నది. ఈమహాభారతమీమాంసాగ్రంథమందుఁ జదువరులయెదుట నేవిషయము లుంచవలయునో, యవి సంక్షేపముగా నీక్రిందివిధమున నున్నవి. (1) మహాభారత-గ్రంథమును వ్రాసినవా రెవరు? దానియందు నేవిధమైన జ్ఞాన మున్నది. (2) ఈగ్రంథమునందలి ప్రమాణములవల్లను మఱి యితర ప్రమాణముల-

వల్లను దీనికి నేకాలము నిశ్చితమగుచున్నది. (3) ఈగ్రంథమందు నేభారతీయయుద్ధము వర్ణింపఁబడినది, అయ్యది కాల్పనికమా? లేక యైతిహాసికమా? (4) ఆయుద్ధము ఐతిహాసికమేని యది యేసమయమున జరిగినది? యెవ రెవరికి జరిగినది. ఈగ్రంథమందు వర్ణితమైన ప్రాచీనభారతయుద్ధమును సంబంధించి ముఖ్యముగా నీనాలుగువిషయములు తమయెదుట నుంచఁబడుచున్నవి. ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసు లుభయులు విస్తృతమైన రీతి నీయున్నవిషయములను విమర్శించి యున్నారు. కాఁబట్టి తమరా పాశ్చాత్యుల విచారము గ్రాహ్యమో యగ్రాహ్యమో చూడవలసియున్నది. ఇది గాక యీగ్రంథమునుండి ప్రాచీనకాలస్థితికి సంబంధించిన యేయనేకప్రకారసూచనలు మీకు లభించుచున్నవో వానినుండి మీరు చాల విషయములను దెల్సుకొనఁగలరు. భూగోళము, జ్యోతిషము, సేనయు, యుద్ధమును, వర్ణాశ్రమవిభాగము, సంప్రదాయమును ఆచారమును, శిక్ష, అన్నము, వస్త్రము, భూషణము లోనుగాఁ గలవానికి సంబంధించిన బహువిషయము లిచ్చటఁ జెప్పఁబడును. ఇవిగాక రాజధర్మము, వ్యవహారము, నీతి, మోక్షధర్మము నుద్దేశించి ప్రాచీనభారతీయార్యులు త్రికాలాబాధితములైన యేనిరుపమానసిద్ధాంతములను స్థిరపఱిచిరో యవి యన్నియు నీలోకోత్తరమగుగ్రంథమున గ్రథితములై చేయఁబడియున్నవి; ఈభిన్నభిన్నములైన విషయములన్నియుఁ దమకుఁ బరిచితములు కావింపఁబడును. తాత్పర్యమేమనఁగా, ఆమరాఠీభాషాంతరముయొక్క యుపోద్ఘాతమందు నేయనేకములైన ముఖ్యముఖ్యవిషయములు వర్ణింపఁబడియెనో, ఆయన్నిటియొక్క వివేచన యీమహాభారతమీమాంసాగ్రంథమునఁ జదువరులయెదుట నుపస్థితము చేయఁబడును.

మహాభారతములో నేపరిస్థితులవర్ణన యున్నదో, వానిననుసరించి యొకవైపున మహాభారతగ్రంథము వైదికసాహిత్యముదాఁకఁ జేరియున్నది. రెండవవైపున నర్వాచీనకాలికములగు బౌద్ధజైన గ్రంథములతోడను గ్రీక్కుల ప్రాచీనేతిహాసగ్రంథములతోడను వచ్చి కలియుచున్నది. కాఁబట్టి పూర్వోక్తమైన వివేచన గావించునప్పుడు మన మేప్రకారముగా వైదికసాహిత్యము నాధారముగాఁ గైకొనఁదగునో, ఆప్రకారముగా బౌద్ధజైనగ్రంథములను విశేషముగా గ్రీక్కుగ్రంథములయొక్క విషయములను స్వహస్త

ముగాఁ గైకొనఁదగియున్నది. రాఁబోవు వివేచనయందు మన మిట్లే ప్రయత్నము గావించితిమి. వాస్తవమున మహాభారతగ్రంథముయొక్క కాలము మిక్కిలి విస్తృతమైయున్నది; కనుక వేర్వేఱు సమయములయందలి పరిస్థితుల యొక్క వర్ణన కావించుచున్న మనకు "మహాభారతకాలము" విషయము నఁగొంచెము భేదముచేయుట యావశ్యకమై యున్నది. "మహాభారతకాలము" వలన మనము మహాభారతముయొక్క యంతిమ స్వరూపసమయమును అనఁగా సాధారణముగా సికందరునకు సమకాలికులైన గ్రీకులసమయము నర్థముగాఁ దీసికొనియుంటిమి. ఇఁక "మహాభారతయుద్ధకాల శబ్దముయొక్క ప్రయోగమును మనము మహాభారతకాల ప్రారంభసమయముయొక్క యర్థమునఁ జేసియుంటిమి. అవుఁగాక, ముఖ్యవిషయము మీఁద విచారము చేయకముునుపు విస్తీర్ణ మహాభారతము విషయమైయొక కోష్ఠకమునిచ్చుట మిక్కిలి యావశ్యకమైయున్నది. ఆకోష్ఠక మిట్లున్నది:—

| | అనుక్రమణికాధ్యాయములోపలఁ జెప్పినదాని ననుసరించి. | | గోపాలనారాయణప్రతి ననుసరించి. | | గణపతికృష్ణప్రతి ననుసరించి. | | కుంభకోణము ప్రతి ననుసరించి. | |
|---|---|---|---|---|---|---|---|---|
| | అధ్యా. | శ్లోక. | అ. | శ్లో. | అ. | శ్లో. | అ. | శ్లో. |
| 1 ఆదిపర్వము ... | 227 | 8884 | 234 | 8619 | 234 | 8466 | 260 | 10998 |
| 2 సభాపర్వము ... | 78 | 2511 | 81 | 2712 | 81 | 2709 | 103 | 4377 |
| 3 వనపర్వము ... | 269 | 11664 | 315 | 10494 | 315 | 11854 | 315 | 11081 |
| 4 విరాటపర్వము. | 67 | 2050 | 72 | 2272 | 72 | 2327 | 73 | 3575 |
| 5 ఉద్యోగపర్వము. | 186 | 6698 | 196 | 6559 | 196 | 6618 | 196 | 6752 |
| 6 భీష్మపర్వము ... | 117 | 5884 | 122 | 5969 | 122 | 5817 | 122 | 5908 |
| 7 ద్రోణపర్వము ... | 170 | 8909 | 202 | 9572 | 202 | 9593 | 203 | 10127 |
| 8 కర్ణపర్వము ... | 69 | 4964 | 96 | 4964 | 66 | 4987 | 101 | 4986 |
| 9 శల్యపర్వము. ... | 59 | 3220 | 65 | 3618 | 65 | 3608 | 66 | 3594 |
| 10 సౌప్తికపర్వము. | 18 | 870 | 18 | 803 | 18 | 810 | 18 | 815 |
| 11 స్త్రీపర్వము ... | 27 | 775 | 27 | 825 | 27 | 826 | 27 | 807 |
| 12 శాంతిపర్వము ... | 329 | 14732 | 365 | 14938 | 366 | 13732 | 375 | 15153 |
| 13 అనుశాసనపర్వము | 146 | 8000 | 168 | 7639 | 169 | 7839 | 274 | 10983 |
| 14 అశ్వమేధపర్వము. | 103 | 3320 | 92 | 2736 | 92 | 2852 | 118 | 4543 |
| 15 ఆశ్రమవాసిపర్వము | 42 | 1111 | 39 | 1088 | 39 | 1085 | 41 | 1098 |
| 16 మౌసలపర్వము. | 8 | 320 | 8 | 287 | 8 | 287 | 9 | 300 |
| 17 మహాప్రస్థానపర్వ | 3 | 123 | 3 | 110 | 3 | 109 | 3 | 111 |
| 18 స్వర్గారోహణపర్వము. | 5 | 209 | 6 | 320 | 6 | 307 | 6 | 337 |
| మొత్తము ... | 1923 | 84244 | 2109 | 83525 | 2111 | 83826 | 2325 | 9854 |
| 19 హరివంశము ... | | 12000 | 263 | 15485 | | 12000 | | 1200 |
| | | 96244 | 2372 | 99010 | | 95826 | | 11054 |

ఈకోష్ఠకమువలనఁ జదువరులు మహాభారతమునందు నీయఁబడిన శ్లోకసంఖ్యకంటెఁ జెన్నపురిప్రతియందు మిక్కిలి యెక్కువశ్లోకము లున్నవని సహజముగాఁ దెలిసికొనఁగలరు. కాని బొంబాయిప్రతులు రెండిటియందు నావిషయము లేదు. వానిలోని శ్లోకసంఖ్య తఱచు సమానముగానే యున్నది. అదిగాక మహాభారతములో నీయఁబడిన శ్లోకసంఖ్యకు సరిపోవుచున్నది. కుంభకోణప్రతియందు నేయధ్యాయములను సందిగ్ధములనుగా నెంచి చిన్నలిపిలో నిచ్చియుండెనో, వానిని మనము కోష్ఠకముయొక్క లెక్కలోఁ దీసికొనియుండలేదు. అయినను ప్రతిపర్వమునను దఱచుగా నొకటిరెండువేలు శ్లోకములు పెరిఁగినవి; మహాభారతమునఁ జెప్పినట్లు హరివంశములోని 12000 శ్లోకములుగూడ దానియందుఁ గలిపిన యెడల నీప్రతిలోని శ్లోకసంఖ్య యొకలక్ష పదివేలవఱకుఁ జేరుచున్నది. అనఁగా మహాభారతములోఁ జెప్పఁబడిన యొక లక్షసంఖ్యకంటె నీసంఖ్య చాలఁ బెరిఁగిపోయినది ఈదృష్టితోఁ జూచుచున్న మనము కుంభకోణప్రతి నైతిహాసికవిచారములోఁ దీసికొనఁదగదని చెప్పుటలో వచ్చినయిబ్బంది యేమియు లేదు; కనుకనే మనము దానిని మనవిచారములోఁ దీసికొననులేదు.

హరివంశమును విడిచిపెట్టితిమేని బొంబాయిలోని రెండుప్రతులును మహాభారతమునం దీయఁబడిన శ్లోకసంఖ్య ననుసరించియే యున్నవి. ఆలోచింపఁగా నధ్యాయములసంఖ్య పెరిఁగియున్నది. అయినను మొత్తముకలిసి శ్లోకసంఖ్య తక్కువయే యున్నది. ఈకారణముచేత నైతిహాసికవిచారము చేయుటలో నీప్రతులయుపయోగము మిక్కిలి యెక్కువగా నుండునని చెప్పవచ్చును ఇంతియేగాక చతుర్ధరనీలకంఠ టీకాకారుఁడు చాలనను సంధానముతో నెక్కడెక్కడ గౌడులపాఠభేదమున్నదో, అక్కడనక్కడ నాపాఠభేదము నిచ్చుచున్నాఁడు. మఱియు నెక్కడనైన నేదేని శ్లోకము గౌడులపాఠమున లేకున్నచో నదికూడఁ డీకయందుఁ జూపించుచున్నాఁడు కావున నీలకంఠుని టీకయున్న బొంబాయిప్రతి మహారాష్ట్రగౌడప్రతులు రెండిటియందును సర్వసమ్మతమై యున్నది. అదికారణముగా నైతిహాసిక విచారమందుఁ గైకొనుటకు యోగ్యమగుచున్నది. రాఁబోవు మీమాంసయందు మనము దానినుపయోగించితిమి. బొంబాయిప్రతులయందు రెండిటియందును మిక్కిలి కొంచెముమాత్రము భేదమున్నది: ఏదోయొకసమ

యనున మాత్రము మనమాక్షేపములవిషయమై ధ్యానముంచవలసి యుందును. ఈప్రస్తావమునందు నింతమాత్రముచెప్పి యిప్పుడు మనము మీమాంసలోని భిన్నభిన్నవిషయములకంటె ముందు మహాభారతకర్తల సంబంధమున విచారమును జేయుచున్నాము.

### మొదటి ప్రకరణము

## మహాభారతకర్తలు.

మహాభారతగ్రంథమున నొకలక్ష యనుష్టుప్ శ్లోకములు కలవనియు దానికిఁ గర్త కృష్ణద్వైపాయనుఁడైన వ్యాసుఁడనియు నీవిషయమంతటను బ్రసిద్ధమైయున్నది. మహాభారతమందుఁ జెప్పఁబడిన విధముగా వాస్తవికమైన శ్లోకసంఖ్య, ఖిలపర్వముతో సహితము 96244 అయియున్నది: ఖిలపర్వమును విడిచిపెట్టినయెడల నాసంఖ్య 83525 లేక 83826 అగుచున్నదనియు హరివంశసహితముగా శ్లోకసంఖ్య తక్కువకంటెఁ దక్కువ 95826 అట్లే యెక్కువకంటె నెక్కువ 100010 యగుననియుఁ జదువరులకు ముందటి కోష్ఠకమువలనఁ దెలియుచున్నది. సారాంశము, ఈచెప్పిన వస్తుస్థితిని బట్టి మహాభారతగ్రంథమందు దగ్గఱదగ్గఱగా నొకలక్షశ్లోకములు ఉన్నవని తేలుచున్నది. ఇంతటి పెద్దగ్రంథముయొక్క రచన నొకమనుష్యుఁడే గావించియుండుననుట యసంభవముగా గనపడుచున్నది. వీనిఁబట్టి మహాభారతకర్తలు ఒకనికంటె నెక్కువరై యుందురని యనుమానింపవలసివచ్చుచున్నది. మహాభారతముయొక్క వర్ణనానుసారముగానే యీకర్తలు ముగ్గురై యుండిరి.—వ్యాసుఁడు, వైశంపాయనుఁడు, సౌతియును. భారతీయయుద్ధమునకుఁ బిదప వ్యాసుఁడు జయనామకమైన యితిహాసమును రచించెను. ఈయితిహాసమును వ్యాసశిష్యుఁడగు వైశంపాయనుఁడు పాండవుల మునిమనుమఁడైన జనమేజయునికి, అతఁడు సర్పసత్రము చేయునప్పుడు వినిపించెను; అచ్చట నాకథనువిని సూతుఁడు రోమహర్షణునికిఁ బుత్రుఁడయిన సౌతియుగ్రశ్రవుఁడు నైమిశారణ్యమున సత్రము గావించిన ఋషులకు వినిపించెను. ఈకథయొక్క వర్ణన భారతమందే యున్నది. ఏప్రశ్నోత్తరములు వైశంపాయన జనమేజయుల నడుమ జరిగినవో, అవి వ్యాసమహర్షి మూలగ్రంథముకంటెఁ గొంచెమధికము గాకమానవు. ఇది నిస్సందేహము. ఇదే ప్రకారము సౌతి శౌనకులమధ్య జరిగిన ప్రశ్నోత్తరములు వైశంపాయను

ని గ్రంథముకన్నఁ గొంచె మెక్కువయై యుండవలయును. సారాంశము, వ్యాసుని గ్రంథమును వైశంపాయనుఁడును, వైశంపాయనుని గ్రంథము సౌతియుఁ బెంచి యొకలక్షశ్లోకములను జేసియుండిరి. ఇందులకుఁ బ్రమాణముగా సౌతియొక్క వచన మిట్లున్నది. "ఏకం శతసహస్రంచ మయోక్తం వై నిబోధత" (ఆ.అ. 1, 109) అనఁగా ఒకలక్ష శ్లోకములయొక్క మహాభారతమును నేను జెప్పితిని,' అని యిందువలన స్పష్టమగుచున్నది. విచారింపఁగా నందఱును సమస్తమహాభారతముయొక్క రచనయు నొక్కవ్యాసునిదే యనియే తలఁచుచున్నారు. అయినను లక్షణవల్లనే దీనియొక్కయర్థమును దీసికొనవలయును. వైశంపాయనుఁడును సౌతియు నేవర్ణనగావించిరో లేక వారేయంశమును బెంచిరో, అదంతయు వ్యాసమహర్షి ప్రేరణవల్లనే జరిగిన దని కాని యతనిమతముల యాధారముననే రచింపఁబడిన దని కాని యెంచినచో వ్యాసమహర్షికి లక్షశ్లోకములకర్తృత్వము నిచ్చుటలో నేయాటంకమును లేదు. వాస్తవమున మహాభారతకర్తలు ముగ్గు రని యెంచవలయును. వారు వ్యాసుఁడు, వైశంపాయనుఁడును సౌతియును. చాలమందివిద్వాంసులు మహాభారతమును రచియించినవారు ముగ్గురికంటె నెక్కువ యుండిరని చెప్పుచున్నారు. కాని యీయూహ నిరాధారముగా నున్నది. ఇంతియేకాక యీయొక గ్రంథమునకై ముగ్గురు కవులకంటె నెక్కువమందియొక్క యక్కఱయు నగపడదు.

ముగ్గురుకర్తలు మహాభారతమునకు వర్తమానస్వరూపము నిచ్చియుండి రనుటకు నింకను గొన్ని యనుకూలప్రమాణములు కలవు. అందు మొదటిది యిది– ఏదియనఁగా– ఈగ్రంథమునకు మూఁడుపేరులున్నవి. ఈ విషయమీగ్రంథమునుండియే స్పష్టముగాఁ బ్రకటమగుచున్నది. ఆదిపర్వమందును సంత్యపర్వమందును "జయో నామేతిహాసోయమ్" అనియున్నది. అనఁగా మూలగ్రంథ మైతిహాసికమైయున్నది. దానిపేరు జయము. ఒక కొంత గడచినపిదప నీగ్రంథమునకుఁ భారతనామము ప్రాప్తమయ్యెను. మిక్కిలి విస్తరిల్లినపుడు దానిని మహాభారతమని పిలువనారంభించిరి. ఈ మూఁడుపేరులు భిన్నభిన్నులైన ముగ్గురుకర్తలయొక్క కృతులకుఁజక్కఁగా నుపయుక్తములైనవి; అనఁగా వ్యాసమహర్షియొక్క గ్రంథమునకుజయము, వైశంపాయనునియొక్క గ్రంథమునకు భారతము, సౌతియొక్క గ్రంథమునకు

మహాభారతము' అని చెప్పఁగలము. జయముచేత పాండవుల విజయము సూచింపఁబడుచున్న దనియు, ఇదేనామముగల మూలము ఇతిహాసగ్రంథమై యుండు ననియు నెంచుట యుక్తిసంగతముగా నగపడుచున్నది. ఈగ్రంథమందలి మొదటినమస్కారము సుగృహీతమైన 'నారాయణంనమస్కృత్య' శ్లోకమునందుఁ గలదు. నిస్సందేహముగా నీశ్లోకము వ్యాసమహర్షిదే యైయున్నది కాఁబట్టి యందు మొట్టమొదట వ్యాసమహర్షినామ ముండదు. కొందఱ యీశ్లోకమున కీపాఠాంతరము దలఁచుచున్నారు—'దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్'. కాని యీపాఠము తరువాతఁ గల్పింపఁబడినట్లు తోఁచుచున్నది. 'దేవీం సరస్వతీం చైవ' ఇదే పాఠ ముచితముగా నగపడుచున్నది. ఇదియునుగాక వ్యాకరణముఁబట్టికూడ, చైవ, పదమునకే యావశ్యకత యున్నది. ఇంతేగాక యీనమస్కారశ్లోకమునందు మహాకవియొక్క కుశలతకూడఁ జూపట్టుచున్నది; కావున నీశ్లోకము వ్యాసమహర్షిదే యగుననియు నిందతఁడు తననామమును నమస్కారమునకై వ్రాసియుండఁ డనియుఁ, జెప్పవలసియున్నది. గ్రీకు కవిశిరోమణి హోమరు తనఇలియడ్ నామకమైన మహాకావ్యముయొక్క ప్రారంభమున నిట్లు చెప్పియున్నాఁడు—'ఓ వాగ్దేవి! ఏకిలీజుయొక్క క్రోధమును నీవు వర్ణింపుము', (Cf. Achilles wrath to greece of heavenly goddess sing.) ఈవాక్యమునందుఁ గవి మూఁడువిషయములను జెప్పియున్నాఁడు—అనఁగా కావ్యనాయకుఁడు ఏకిలీజు, కావ్యవిషయము వానియొక్క క్రోధము, వాగ్దేవియొక్క స్మరణము. ఇదేరీతిగా మనప్రాచీనమహాకవి వ్యాసమహర్షియుఁ దననమస్కారవిషయకశ్లోకములో నీమూఁడువిషయములనే సమావేశపఱిచెను—అనఁగాఁ గావ్యనాయకులు నరనారాయణులు (అర్జునుఁడు శ్రీకృష్ణుఁడును) కావ్యవిషయము వారియొక్క జయము; వాగ్దేవియొక్క స్మరణమును, దీనిఁబట్టి యీనమస్కారశ్లోకము వ్యాసమహర్షిదే యనియు; ఆతనిగ్రంథనామము జయమనియుఁ దోఁచుచున్నది. ఇప్పుడు వైశంపాయనునియొక్క గ్రంథమునకు భారతనామ మెట్లు ప్రాప్తమయ్యెనో యది చూడవలసియున్నది. ఈగ్రంథమందు వైశంపాయనునిదొట్టి యైదుగురు శిష్యులకు వ్యాసమహర్షి తనగ్రంథమును జదివించె ననియు వారు భారతసంహితను జదివి రనియు, నగపడుచున్నది: ప్రతిశిష్యుఁడును ప్రత్యేకముగా

నెక్కొక్క సంహితను జేసిరి. ఇట్టిచో వైశంపాయనునియొక్క గ్రంథమునకు భారతనామము స్వభావముగాఁ బ్రాప్త మగుచున్నది; ఇఁక సౌతియొక్క యొకలక్షశ్లోకములు గలబృహద్గ్రంథమునకు మహాభారతనామము ప్రాప్తించియుండు నను విషయముకూడ స్వాభావికము యుక్తిసంగతము నై యగపడుచున్నది. భారతము మహాభారతము అని పేరులుగల వేఱువేఱు గ్రంథము లొకసమయముననే ప్రచలితములై యుండె నని తెలియుచున్నది. సుమంతు, వైశంపాయన, పైలాదుల నుచ్చరించునపుడు ఆశ్వలాయనునియొక్కసూత్రము (ఆ. గృ. ౩. 4.)న భిన్నభిన్ననామములఁ 'గైకొని «భారత మహాభారతాచార్యాః॥' అని చెప్పఁబడియున్నది. ఇందువలన వైశంపాయనాదిఋషులకు భారతాచార్యబిరుదము ప్రసిద్ధమయ్యెననియు భారతమహాభారతనామకములగు భిన్నభిన్నగ్రంథము లొకసమయమందుఁ బ్రచలితములయ్యెననియు, ననుమితి కలుగుచున్నది.

మహాభారతమునకు ముగ్గురు కర్తలనుటకు రెండవప్రమాణము మహాభారతముయొక్క యారంభము మూఁడు స్థానములతో నగుట యై యున్నది. ఈవిషయము గ్రంథమునందే యగపడుచున్నది. « మన్వాది భారతం కేచిత్ » ఇత్యాదిశ్లోకములయందు మను, ఆస్తీక, ఉపరిచర, అను మూఁడుస్థానములు ఈగ్రంథముయొక్క యారంభములుగా నెంచఁబడుచున్నవని యున్నది. రాజైన యుపరిచరుని యాఖ్యానమునుండి (ఆదిపర్వ-అ 63) వ్యాసుని గ్రంథముయొక్క యారంభము, ఆస్తీకుని యాఖ్యానము(ఆది అ-13) నుండి వైశంపాయన గ్రంథముయొక్క యారంభము; ఎందుచేత ననఁగా వైశంపాయనుని గ్రంథము సర్పసత్రసమయమునఁ బఠింపఁబడెను. కనుకనే యాస్తీకునికథ ప్రారంభమునఁ జెప్పుట యావశ్యకమయ్యెను. సౌతియొక్క విస్తీర్ణమహాభారతగ్రంథముయొక్క ప్రారంభము మనుశబ్దముతో అనఁగా «వైవస్వత» శబ్దముతో నగుచున్నదని తెలిసికొనుట స్వాభావికమై యున్నది.

ఇప్పు డీమూఁడుగ్రంథముల విస్తర మెంతయుండె నను విషయము విచారింపవలసియున్నది. వ్యాసమహర్షియొక్క మూలగ్రంథమగు «జయము»నందు నెన్నిశ్లోకము లున్నవో యిది సరిగాఁ జెప్పుట శక్యముకాదు.

8800 అయి యుండెనని చెప్పుచున్నారు. కాని యీమతము మనకు గ్రహింపఁదగినదికాదు. ఎందుచేతననఁగా: ఇది కేవలము తర్కమునాధారము చేసికొని సమర్థింపఁబడినది. సత్యమైన విషయమిది, ఏదియనఁగా మహాభారతమున 8800 సంఖ్యయొక్క యుచ్చారణము వ్యాసమహర్షియొక్క కూటశ్లోకములనుద్దేశించి వచ్చినది. ఈయుచ్చారణమునే ముందువెనుకలఁ దలాఁగి మూలగ్రంథములోని శ్లోకములసంఖ్య యింతియే (అనఁగా 8800) యగు ననుటకుఁ బ్రమాణముగాఁ జెప్పఁబడఁగలదు. దీనియాధారమున సరలముగా నిట్టియనుమానము బయలుదేఱఁజాలదు. వర్తమానమహాభారతమునందు 8800 కూటశ్లోకము లున్నవని కూడ నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁజాలము; మనమీ విషయమై ధ్యాన మిచ్చినయెడల నొక్కొకటి శ్లోకమంతయుఁ గూటము (గూఢార్థము) గాలేదు. ఇఁక నేమంటేఁ గొంతకొంత యంశమునందే యీగూఢార్థ మగుచున్నది. దానిఁ బట్టి శ్లోక మంతయు నర్థము కాకపోవచ్చును. అట్టికూటశ్లోకములను లెక్కింతుమేని యీచెప్పినసంఖ్య యంత యెక్కువకాదు. ఈయభిప్రాయమును స్పష్టపఱుచుటకై నిం దొకటిరెండుదాహరణము లీయఁబడుచున్నవి. విరాటపర్వమున "జిత్వా వయం నేష్యతి చాద్యగావః," ఈవాక్యము కూటశ్లోకమునకుఁ బ్రసిద్ధమైన యుదాహరణముగా నున్నది. ఎపుడు మనమిట్లు పదచ్ఛేదము చేయుదుమో—జిత్వా, అవ, యం, నేష్యతి, చ, అద్య, గాః, వః,—అపుడు దీనికర్థము వచ్చుచున్నది. ఇట్టిశ్లోకములు మొదటిపర్వములలో నధికముగా నున్నవి. క్రమక్రమముగాఁ బోయినకొలఁదిఁ దక్కువ యగుచున్నవి. అయినను మహాభారతమున గూఢార్థకశ్లోకము లెక్కువ యున్న వనుటకు సందేహము లేదు. ఇటువంటి శ్లోకములయందుఁ గొన్నిశబ్దము లప్రసిద్ధార్థమున వ్యవహరింపఁబడియున్నవి. ఎట్లనఁగా "నాగైరివ సరస్వతీ," ఇక్కడ సరస్వతీ = సరస్ + వతీ = సరోయుక్తము, ఈయర్థమున నున్నది. మహాభారతమున, సరళములయ్యు నుక్తప్రకారముగా భిన్నమైన గూఢార్థములకు ద్యోతకములైన శబ్దములు గల యిట్టిశ్లోకము లనేకము లున్నవి. ఇట్టిచోఁ గూటశ్లోకములసంఖ్య సరిగా 8800 లేదు. కాఁబట్టి యీసంఖ్యయందుఁ గొంత యతిశయోక్తి యున్న దని చెప్పవచ్చును.

---

§ అష్టౌ శ్లోకసహస్రాణి అష్టౌ శ్లోకశతానిచ। అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వానవా॥

ఆమాట యెట్లున్నను ఈశ్లోకములవలనఁ బైసంఖ్య వ్యాసమహర్షియొక్క మూలగ్రంథపుదే యని యనుమానము చేయఁబడఁజాలదు. ఇదిగాక యింక నొకవిషయమున్నది. వ్యాసమహర్షి యహోరాత్రములు పరిశ్రమము చేసి మూఁడుసంవత్సరములకుఁ దనగ్రంథమును బూర్తిగా ముగించెనని మహాభారతమున స్పష్టముగా నున్నది. ఇందువలన వ్యాసమహర్షివంటి ప్రతిభాశాలియైన సంస్కృతకవికిఁ బ్రతిదినము నెనిమిదింటికంటె నెక్కువ యనుష్టుప్ శ్లోకములను రచింపఁగలుగుట మిక్కిలి సులభముగా నుండె నని యెంచవచ్చును. సారాంశము, వ్యాసమహర్షియొక్క మూలగ్రంథములోని విస్తారమెంతయుండెనను విషయము నిశ్చితరూపముతోఁ జెప్పఁబడఁజాలదు. వైశంపాయనుని 'భారత' మందు శ్లోకములసంఖ్య 24000 కావచ్చును. "భారతసంహిత 24000 శ్లోకములుగలది మిగిలిన 76000 శ్లోకములయందుఁ బూర్వులయొక్క మనోరంజకములైన కథలు వర్ణింపఁబడినవి," అని మహాభారతమునందే స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. దీనిచేత నుపాఖ్యానములను విడిచి మిగిలిన 24000 శ్లోకములయందు భారతసంహితయొక్క రచన చేయఁబడియెనని యనుమానము కలుగుచున్నది. సంహితాశబ్దము అథ మొదలుకొని ఇతి వఱకు నొక్కవ్యవస్థతో వ్రాయఁబడినగ్రంథము అని యర్థమును బోధించుచున్నది. ఇదికూడఁ బ్రసిద్ధమై యున్నది. ఏమనఁగా వ్యాసమహర్షియొక్క యైదుగురుశిష్యులు ప్రత్యేకముగాఁ దమతమభారతసంహితలను రచించిరి. దీనిఁబట్టికూడ సంహితాశబ్దమునకుఁ బైని చెప్పఁబడిన యర్థమే ప్రకటమగుచున్నది. అప్పుడు భారతసంహితయొక్క విస్తారము 24000 శ్లోకసంఖ్యగలది యను నీవాక్యమువలన వైశంపాయనుచేత రచింపఁబడిన గ్రంథమున 24000 శ్లోకములుండె ననియే ప్రకట మగుచున్నది. సౌతియొక్క గ్రంథమువిషయమై దానియొక్క విస్తార మెంత యున్నదో చెప్పనవసరములేదు. వైశంపాయనునియొక్క భారతమందు నుపాఖ్యానములను గలిపి సూతుఁడొక లక్షశ్లోకములయొక్క మహాభారతమును నిర్మించెనని యందఱు నెఱుఁగుదురు.

వైశంపాయనునియొక్క గ్రంథమునకు మొదట ఆస్తీకునికథ చెప్పఁబడియుండు నను విషయము స్వాభావికమై యున్నది. అట్లగా నాకథను ముందటి యధ్యాయమ్ము మాత్రమ్ము సౌతివి యనుటకు సందేహములే

అనఁగా అనుక్రమణికాపర్వము, పర్వసంగ్రహాపర్వము, పౌష్యపర్వము, పౌలోమపర్వము వీనిని గలిపి 12 అధ్యాయములు గలవి. ఈ మొదలిటి యధ్యాయములలో, ఇప్పటి గ్రంథరచనాపద్ధతినే యనుసరించి; సౌతి, ప్రస్తావనను, ఉపోద్ఘాతమును, అనుక్రమణికను సమావేశపఱిచెను; ప్రతిపర్వమున నెన్నిశ్లోకములు ఎన్నియధ్యాయములు గలవో లెక్కపెట్టెను. ఇందువలన సౌతియొక్క గ్రంథమునకుఁ బ్రాయికముగా స్థాయియైన రూపము ప్రాప్తమైయున్నది. ఇప్పటిమహాభారతమున నగపడుచున్న శ్లోకములసంఖ్య సౌతిచెప్పిన సంఖ్యకంటె నించుమించుగా 1000 తక్కువ యగుచున్నది. కొన్నిపర్వములయందు శ్లోకములసంఖ్య తక్కువయై యున్నది. కొన్నిపర్వములయందు నెక్కువయై యున్నది; కాని యీతారతమ్యముయొక్క పరిమాణము మిక్కిలి యల్పము. భారతటీకాకారుఁడు కూడ నీన్యూనాధికభావముయొక్క యుల్లేఖమును గావించెను. ఈన్యూనాధికభావము లేఖకుల పొరపాటువలననై యుండు నని యాతనియభిప్రాయము. కాని యిచట నొక ప్రశ్నము కలుగుచున్నది. ఏమనఁగా సౌతిచెప్పిన సంఖ్యకంటె నెక్కువ శ్లోకసంఖ్యగల యిపుడు ప్రచలితములైన సంస్కరణములయందు లేఖకులపొరపాటెట్లెంచఁబడును? అనఁగా లేఖకులు హృదయపూర్వకముగా శ్లోకములసంఖ్యను వృద్ధిచేసిరని స్పష్టపడుచున్నది. ఇట్లు వృద్ధి నొందింపఁబడిన శ్లోకములు ముఖ్యముగా వనపర్వమందును ద్రోణపర్వమందును మాత్ర మగపడుచున్నవి. ఆదిపర్వమున సౌతి 227 అధ్యాయములను జెప్పియున్నాఁడు. దానియందుఁ డీకాకారుఁడు చెప్పినవి 237 అధ్యాయములైయున్నవి. ఈ యన్నియధ్యాయముల యందును శ్లోకసంఖ్య తక్కువగా నున్నది. కాఁబట్టి యధ్యాయములయొక్క యధికసంఖ్య లేఖకులపొరపాటువలన వ్రాయఁబడి యుండునని యెంచఁబడఁగలదు. కాని వనపర్వమందును ద్రోణపర్వమందును నధ్యాయములు నధికముగానున్నవి. శ్లోకములు నధికముగానున్నవి. ఈవృద్ధినొందిన శ్లోకసంఖ్య యెక్కువలేదు; అనఁగా వనపర్వమందు దాదాపు 200 శ్లోకములును ద్రోణపర్వమందు దాదాపు 600 శ్లోకములును జెరిగినవి. ఈప్రకారము రెండుపర్వములయందుఁ గలిపి 800 శ్లోకములుమాత్రము; రెండుపర్వముల మొత్తము 21000 శ్లోకములలోఁ జేరియున్నవి. సమస్తమహాభారతమునందును సౌతి లెక్కించిన శ్లోకసంఖ్యకంటె నేఁడు ప్రచ

లితములైన సంస్కరణములయందు 1000 శ్లోకములు తక్కువగా నున్నది. న్యూనాధికభావముయొక్క పరిమాణముకూడ మిక్కిలి స్వల్పము. ఈయన్నివిషయములవల్లను జెప్పవలసిన దేమనఁగా నేఁడు 2000 సంవత్సరములు గడచిపోయిన తరువాతఁ గూడ (ఈకాలముయొక్క నిర్ణయము ముందుకుఁ బోయి కావింపఁబడును) సౌతియొక్క గ్రంథమందు నెంతయో యంతరము లేదు.

సౌతి తనగ్రంథమునకుఁ బదునెనిమిదిపర్వముల నేర్పఱిచెను. ఈ పర్వవిభాగము క్రొత్తదియును నతఁడే కావించినదియు నైయున్నది. వైశంపాయనుఁడు ‹భారత›మందు నేపర్వముల నేర్పఱిచెనో, అవి మఱియొకవిధముగా నున్నవి, చిన్నవి మఱియును వానిసంఖ్య 100 అయియున్నది. ఈ సంగతి మహాభారతమందు సౌతియొక్క యనుక్రమణికవల్లనే ప్రకటమగుచున్నది. ఏగ్రంథకారుఁడును, తనయొక్క గ్రంథమందే ఒక్క పేరుగల విభాగములనే గొన్ని చిన్నవిగను గొన్ని పెద్దవిగను నెప్పుడును జేయఁడు. అతఁడు తనగ్రంథములోని చిన్నపెద్దభాగములకు వేర్వేఱు పేరుల నిచ్చును; ఎట్లనఁగా, కాండము దానియొక్క యంతర్గతమగు నధ్యాయము లేక సర్గము. ఇందువల్ల నుక్తమైన రెండుప్రకారముల విభాగములు భిన్నభిన్నగ్రంథకారులు చేసినవేయని స్పష్టముగాఁ దెలియుచున్నది. అనఁగా వైశంపాయనుని భారతగ్రంథమందుఁ బర్వములని పేర్లుగల విభాగములుండెను. అవి మిక్కిలి చిన్నచిన్నవిగా నుండెను; సౌతి యీచిన్నపర్వముల నొక్కచోఁజేర్చి తన బృహద్గ్రంథములోని 18 భాగములను జేసెను. ఈవిభాగముల కాతఁడు పర్వము లనియే నామములనుగూడ నుంచెను. దీనియొక్క పరిణామమిది యయ్యెను. ఏదియనఁగా, ఒకపెద్దపర్వమందు నదే నామముగల చిన్నయుపపర్వములు గూడఁ గలిసిపోయియున్నవి. ఉదాహరణ మేమనఁగా సౌప్తికపర్వమున సౌప్తికపర్వమున్నది. సభాపర్వమున సభాపర్వమున్నది. అశ్వమేధికపర్వమున నశ్వమేధికపర్వమున్నది. వైశంపాయనుని మూలభారతమందు సరిగా 100 పర్వములుండె నని యనుమానము కూడఁ గాఁగలదు. ఒక్కొక్కచోట సౌతి క్రొత్తపర్వములనుగూడ రచించెను. ఎందుచేత నన(ఁ)గా అనుక్రమణికాపర్వము, పర్వసంగ్రహపర్వము, పౌలోమపర్వమును పౌష్యపర్వమును సౌతికావించినవనుటకు సంశయము లేదు. హరివంశము ఖిలపర్వ

మని చెప్పఁబడుచున్నది. 'ఖిల' శబ్దమునకుఁ దరువాతఁ గలుపఁబడినదియని యర్థము. దీనియొక్క పర్వసంఖ్య 18 కంటెను 100 కంటెను వేఱైయున్నది. దీనిని సౌతి గ్రంథవిషయముయొక్క పూర్తికై కలిపియున్నాఁడు. కనుకనే దానికి "ఖిలపర్వ" మని పేరుపెట్టి పందొమ్మిదవపర్వముగు జేసెను. అందుఁ జిన్న చిన్నవి మూఁడుపర్వము లున్నవి. ఈపర్వములకుఁ గర్త సౌతి కాఁడని తెలియుచున్నది. మహాభారతమున నిట్లు స్పష్టమైన వచనమున్నది. "ముందు వ్యాసమహర్షి 100 పర్వములను రచించెను; పిమ్మట సూతపుత్రుఁడు లోమహర్షణి నైమిశారణ్యమందు 18 పర్వములను మాత్రము పఠించెను".

ఏతత్పర్వశతం పూర్ణం వ్యాసేనోక్తం మహాత్మనా ।
యథావ త్సూతపుత్రేణలోమహర్షణినా తతః॥
ఉక్తాని నైమిశారణ్యే పర్వా ణ్యష్టాదశైవతు. (ఆ. అ. 2-84.)

దీనివలన 18పర్వముల విభాగమును సౌతియే చేసె నని నిర్వివాదముగా సిద్ధించుచున్నది.

వర్తమానమహాభారతకర్త లగువ్యాస, వైశంపాయన, సౌతు లనెడి మూఁడువ్యక్తులు కల్పితములుకావు. ఐతిహాసికములై యున్నవి. కృష్ణయజుర్వేదకాఠకమునఁ బారాశర్యవ్యాసుని నామము వచ్చినది. వ్యాసుఁడు భారతయుద్ధమునకు సమకాలికుఁడు. మహాభారతములోని యనేకవర్ణనలు ప్రత్యక్షముగాఁ జూచినవి వలె నగపడుచున్నవి, వానియందలి యనేకవిషయములు తరువాతికవులు కల్పింప లేనివిగాఁ గూడ నున్నవి. వైశంపాయనుఁడును వ్యాసమహర్షి కొకశిష్యుఁ డని చెప్పఁబడియున్నది. (అతఁడు ప్రత్యక్షము శిష్యుఁడుకాక కేవలము శిష్యపరంపరయందే యుండుటయు సంభవము) ఇతనిపేరు ఆశ్వలాయనగృహ్యసూత్రములలో నగపడుచున్నది. ఇతఁడు అర్జునుని మునిమనుమఁడగు జనమేజయునికి సమకాలికుఁడు. సమస్తమహాభారతములోని భాషయు, న్రాచీనభాష యాధునికసంస్కృతభాషకంటె వేఱయియున్నదో, యేది ప్రత్యక్షముగా మాటాడునపుడు వచ్చుభాషతో సమానముగా నగపడుచున్నదో అట్టిభాషగా నున్నది. మహాభారతమునందలి కొన్నిభాగములయొక్క భాష బహుప్రాచీన మైనదిగను, మిక్కిలి ప్రభావంతముగను నున్నదనుటలో సందేహము లేదు. ఈవిషయములోని సత్యత భగవద్గీతవంటి కొన్నిభాగముల భాషవలనఁ బ్రకటము కాఁగలదు.

సౌతివిషయమున విచారము చేయునపుడు ఈవిషయమై ధ్యాన ముంచవల యును. ఏదియనఁగా సూతులు తఱచు కథలను జదివెడు పని చేయుచుం డెడివారు. అట్లయ్యును లోమహర్షణునికిఁ బుత్రుఁడగు నుగ్రశ్రవుని సౌతి యనుటకు గారణ మేమియు నగపడదు. ఎందుచేత ననఁగాఁ సూతశబ్ద ము జాతివాచకనామమై యున్నది. సూతుఁడు శౌనకునికి ననేకకథలను వినిపించె నని కూడఁ బురాణములయందు నున్నది. కాని సూతుఁడును సౌతియు నైతిహాసికవ్యక్తు లగుటలో నేవిధమైన సందేహమును లేదు. సౌతి వైశంపాయనభారతమును బెంచి మహాభారతస్వరూపము నెందులకిచ్చెను? ఎట్లిచ్చెను? అనునీవిషయములు ముందుకుఁ బోయి విచారింపఁబడును కాని గ్రంథకాలనిర్ణయమువల్ల నీసౌతి వైశంపాయనునికి సమకాలికుఁడు కాఁడను సంగతిలో భ్రాంతిగా సంశయ ముండ నేరదు. ఇట్టిచో భారతప్రారంభమున వ్రాయఁబడిన „సర్పసత్రసమయమున వైశంపాయనుని ముఖమునుండి నేను భారతకథను వింటిని" అను విషయమును లాక్షణికకథనమో లేక యతిశ యోక్తియో యని యూహింప వలయును. సౌతి వైశంపాయనుల నడుమ వేలకొలఁది సంవత్సరములు కాకపోయినను గొన్నివందలసంవత్సరము లైన ను వ్యవధి తప్పక యుండియుండును. వ్యాసమహర్షియొక్క మూలగ్రంథ మందును వైశంపాయనునియొక్క భారతమందును బరిమాణవిషయమునను భాషావిషయమునను విశేషభేదము లేదు. కాని యేసమయమున సౌతి 24000 శ్లోకములను వృద్ధిచేసి యొకలక్షగ్రంథమును జేసెనో ఆసమయమునఁ గాల భేదము ననుసరించి భాషావిషయమున భేదము సంభవించుట స్వాభావిక ము. అయినను సౌతి తనవిలక్షణ బుద్ధిచాతుర్యముచేత గ్రంథమంతకు నేక త్వమును దీసికొనివచ్చి దానిని బూర్వాపరసంబంధయుక్తముగఁ గావించెను. అప్పటికిని రెండుమూఁడు చోటులను జమత్కారమును గుఱించిన యసం బంధము జనింపక తప్పినది కాదు. చూడుఁడు- (1) గ్రంథారంభముననే యీకథయున్నది. ద్వాదశవార్షికసత్రసమయమున సౌతి యుగ్రశ్రవుఁడు కులపతి యగుశౌనకునియొద్దకు వచ్చెను, అతఁడు సౌతిని „నీ వెక్కడనుండి వచ్చితివి" అని యడుగఁగా నపు డాతఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను „నేను జనమేజయుని సర్పసత్రమునుండి వచ్చితిని, అచ్చట వైశంపాయనకథితమైన వ్యాసకృతమహాభారతమును నేను వింటిని" కాని యాదిపర్వముయొక్క

నాల్గవయధ్యాయమునకు మొదట మరల నదేవిషయము గద్యములో నిట్లు చెప్పఁబడియున్నది. ఎట్లనఁగా, సౌతి శౌనకునియొద్దకుఁ బోయి ,,నీ వేకథ వినవలయు నని యున్నది?'' యని యడిగెను. అప్పుడు శౌనకుఁడు భృగువంశవర్ణనమును జేయు మని చెప్పెను. దీనికిఁ బిమ్మట 'సౌతి రువాచ' యను దానికి మాఱుగా 'సూతఉవాచ' యని యున్నది. ఈపరస్పరవిరుద్ధ మగు వచనమునకుఁ గారణ మేమి ? టీకాకారుఁడు తనప్రాచీనపద్ధతి ననుసరించి యీవిరోధమును మహాభారతముయొక్క యీభిన్నభిన్నములైన యారంభములు భిన్నభిన్నకల్పములతో సంబంధించియున్న వనిచెప్పి పరిహరించెను. కాని యీకారణము తృప్తికరముగా నగపడదు. వైశంపాయనభారతమునకు బృహత్స్వరూపము నిచ్చుటకై తండ్రియుఁ గొడుకు నిద్దఱును బ్రయత్నించి యుందు రనుట సంభవము. ఈరెండారంభములుఁ గాల్పనికములు సంభవములు నైయున్నవి. ఏమనఁగాఁ దండ్రియు నిట్లే కొడుకు నొకరియం దొకరికి నాదర మున్న కారణముచేత నారెండిటికిని గ్రంథమున స్థానము నిచ్చి యుందురు. సౌతి కథలను జదివెడివాఁడు. అతని కేపౌరాణికవిషయములు తెలిసియుండెనో, వానియొక్క యుపయోగము, నతఁడు భారతమునకు సర్వమాన్యమును, ధార్మికము నైనస్వరూపము నిచ్చుటయందు నెందుకు నెట్లు కావించెనో, యీసంగతియొక్క విచారము ముందు చేయఁబడును. కాని యీప్రకారముగా నుపయోగించునప్పు డింకొకయసందర్భము సంభవించె ననుటలో సందేహము లేదు. అదియిది:- (2) మూఁడవయధ్యాయమందు నొక గద్యగ్రంథము యొక్క యవలంబము చేయఁబడెను. ఆకథయొక్క సారాంశమిది — ,,రాజు జనమేజయుఁడు కురుక్షేత్రమున దీర్ఘసత్రము నొనర్చునప్పుడు యజ్ఞమండపమున కొకకుక్క వచ్చెను. దానిని జనమేజయునియొక్క సోదరులు కొట్టి వెలుపలికిఁ దఱిమిరి. అప్పు డది యేడ్చుచుఁ దనతల్లి దేవశునియొద్దకుఁ బోయెను. అది యజ్ఞమండపమునకుఁ జని 'నీకార్యమునకు నాకస్మికమగువిఘ్నము జనించుఁగాక' యని జనమేజయునికి శాపమిచ్చెను. జనమేజయుఁడు తనసత్రమును బూర్తిచేసి హస్తినాపురమునకు వచ్చి యీపాపకృత్యమునకుఁ బరిహారము నెవరు చేయుదు రని విచారింప నారంభించెను. తరువాత నతఁడు శ్రుతశ్రవుఁడనెడి ఋషికిఁ బుత్రుఁడగు సోమశ్రవుని దనపురోహితుఁడుగఁ జేసికొనియెను. కాని శ్రుతశ్రవుఁడు తనకుమారు

నియొక్క కఠిననియమము విషయమై జనమేజయునికి ఎవ్వరైనను బ్రాహ్మణుఁడు యాచనకొఱకు వచ్చి యేది యేమి యడిగినయెడల నాకుమారుఁడాయాచకునికి నిష్టమైనవస్తువు నిచ్చివేయును. ఈనియమము నీకు సమ్మతమగునేని నీవితనిఁ దీసికొనిపొమ్ము' అని స్పష్టముగాఁ జెప్పెను. జనమేజయుఁ డంగీకరించి సోమశ్రవుని దనరాజధానికిఁ దీసికొనివచ్చి సోదరులతో 'ఈపురోధసుఁ డిచ్చినయాజ్ఞ యెల్లఁ బూరింపవలయు' నని చెప్పెను. దీనికిఁ బిదప జనమేజయుఁడు తక్షశిలాదేశమును జయింపఁబోయెను. ఆదేశమును స్వాధీనపఱుచుకొని యతఁడు తనరాజధానికిఁ దిరిగి వచ్చెను'. ఈకథ వచనమందే వ్రాయఁబడియున్నది. సౌతి దీనిని మఱియొకగ్రంథమునుండి కైకొనినట్లు లగపడుచున్నది, కాని యతఁ డీకథను భారతీయకథతోఁ గలిపియుండలేదు. దీనితరువాత నరుణియొక్క గురునిష్ఠను గుఱించి పెద్దకథ నుడివి యీయధ్యాయము నిట్లే యసంబద్ధముగా విడిచివైచెను. పురోహితుఁడైన సోమశ్రవుఁడు జనమేజయునియొక్క పాపకృత్యమునకుఁ బరిహారమును గావించెనో లేదో, సోమశ్రవుని నే బ్రాహ్మణుఁ డేమి యడిగెనో, అతఁ డిచ్చెనో లేదో, దానియొక్క పరిణామ మేమయ్యెనో యిత్యాదివిషయములయొక్క జాడ కొంచెము నగపడదు. తరువాత నాల్గవయధ్యాయమునందు మఱల సూతశౌనకుల కలయికయందలి ప్రసంగము వర్ణింపఁబడినది, భృగువంశవర్ణనము నారంభించి కథలు చెప్పఁబడినవి. దీనితరువాతఁ గొన్నియధ్యాయములయందు నాస్తీకపర్వము సర్పసత్రకథయు నున్నవి. ఈసర్పసత్రకథతో దేవశునిశాపమునకును సోమశ్రవుని నియమమునకునుగొంచెమేని సంబంధ మగపడదు. ఇంతయేకాదు, ఈసర్పసత్రకథయందు సోమశ్రవునిపేరుకూడఁ గనుపట్టదు. ఆస్తీకుఁడు జనమేజయుని 'సర్పసత్రము నాపవలయుననియుఁ దక్షకునికిఁ బ్రాణదానముఁ జేయవలయుననియుఁ బ్రార్థించెను. ఋషులందఱుఁ జెప్పుటవలన జనమేజయుఁ డీప్రార్థన నంగీకరించెను. ఇట్టియవస్థయందు సోమశ్రవుఁ డాస్తీకునిప్రార్థనను సేకరించి జనమేజయుని మతమునకు విరుద్ధముగా వానిసర్పసత్రమునకు విఘ్నము నాపాదించె నని చెప్పుటయు నుచితముకాదు. సారాంశము వచనమునందు నీఁబడిన దేవశునీశాపకథయు, సోమశ్రవఃపురోహిత కథయు, నేలాగున నున్నవి యాలాగుననే యటునిటుఁ గాకుండెను. మఱియు గ్రంథమున నసంబద్ధత యుత్ప

న్నమయ్యెను. ఇట్టియసంబంధము మహాభారతమునందు మఱియెచ్చట నగపడదు. సౌతి యుపాఖ్యానములను జేర్చినప్పు డొక్కొకచోటున నేదో యొకయంశమున నసంభావ్యత యవశ్య మగపడుచున్నది; కాని, యసంబద్ధత అనఁగాఁ బూర్వాపరవిరోధము మిక్కిలి తక్కువగా నగపడుచున్నది. కొన్నికొన్నిచోట్ల ప్రాచీనపద్ధతికి ననురూపములైన శ్లోకములను గావించుటకుఁ బ్రయత్నించియుండెను. ఉదాహరణము:-వైశంపాయన భారతమున భారతముయొక్క సారాంశ మొకయధ్యాయమున నున్నది. కాఁబట్టి సౌతి మొదటియధ్యాయమున యదాశ్రౌషం, అనుశ్లోకముతో నారంభించి పెద్దవృత్తములగు 69 శ్లోకములను జెప్పియుండెను. మఱియును వీనియందు ధృతరాష్ట్రుని ముఖమునుండి మహాభారతసారాంశమును జెప్పించుటకుఁ బ్రయత్నించెను. ఈశ్లోకములు ప్రాచీనభాషతోఁ దుల్యమైన భాషగలిగి పెద్దవృత్తములయందు నున్నవి. వానియందు వైదికరచనయొక్క ఛాయకూడఁ గనఁబడుచున్నది, కాని యీఛాయ బొత్తిగాఁ గృత్రిమమైనది. శ్లోకములయందుఁ గావింపఁబడిన వర్ణనంబట్టి యవి తరువాతఁ జేర్పఁబడినవని కూడ స్పష్టమగుచున్నది. ఈశ్లోకములయొక్క రచన సౌతిదే యనుటలో సందేహము లేదు. ఎందుచేతననఁగా నివియన్నియు మొదటియధ్యాయమందే యున్నవి. ఈయధ్యాయమంతయు సౌతియే కలిపియున్నాఁడు. ఎవరైనను యదాశ్రౌషం మొదలుగాని 69 శ్లోకములను ధ్యానపూర్వకముగా బఠించు నెడల వాని కివియన్నియు సౌతివే యని విశ్వాసము కలుగఁగలదు. గ్రంథములోని యొక ప్రధానపాత్రయొక్క ముఖమునుండి గ్రంథముయొక్క సారాంశమును జెప్పించుట యిదియొక మంచియుక్తి యనుటలో సంశయము లేదు. కాని సమస్తభారతసారాంశమును వర్ణించుచున్న యీవిధమైనశ్లోకము కావింపఁబడుట యసంభవమువలె నగపడుచున్నది. దీనియొక్క సృష్టి వ్యాసునివంటి మహాకవియొక్క బుద్ధిచేత నెప్పుడును గాఁజాలదు. ఈశ్లోకవర్ణనయందు సౌప్తికపర్వమునకుఁగూడ నావలిదగు నైషీకపర్వముయొక్క యంశము వచ్చియున్నది. వాస్తవమునకు ఉత్తరాగర్భమున నున్నశిశువుమీఁద నశ్వత్థామ యస్త్రప్రహారముఁ గావించినపుడు ధృతరాష్ట్రుఁడు తన స్వభావము ననుసరించి ప్రసన్నుఁడు కావలసియుండెను, కాని, యిట్టి వర్ణన యీశ్లోకములయందు నగపడదు. ఇదిగాక, మహాభారతములోని, యేభాగ

ములు సౌతి చేర్చిన వని నిశ్చయింపఁబడి యున్నవో యవి కూడ నీశ్లోకము లందుఁ జర్చింపఁబడియున్నవి. యక్షప్రశ్నాఖ్యానము సౌతి దేయని ముందు నకుఁ బోయి స్థిరము చేయఁబడును. ఈయాఖ్యానములోని. విషయములు కూడఁ బైశ్లోకములయందువర్ణింపఁబడియున్నవి ఇదేవిధముగా నుద్యోగపర్వములో శ్రీకృష్ణుఁడు మధ్యవర్తియైనపుడు విశ్వరూపదర్శనముయొక్క యే భాగముకలదో, దేనిని మనము తరువాతఁ గలుపఁబడినది యని సిద్ధము చేసి చూపింతుమో యది కూడఁ బైశ్లోకములయందు వర్ణింపఁబడి యున్నది. ఈశ్లోకములయందు పితామహుఁడగు భీష్ముఁడు పాండవులకుఁ దాను మరణించు నుపాయమును జెప్పినాఁడని వర్ణనకూడ నగపడుచున్నది. కాని, యీవర్ణన తరువాతఁ గలుపఁబడినది. సారాంశము యదాశ్రౌషం అనియున్న శ్లోకములు గ్రంథారంభమునఁ దరువాతఁ గలుపఁబడినవి. ఆలోచింపఁగా నవి కథలోని సారాంశముయొక్క దృష్టివలన నెంతయు సరిగా నగపడుచున్నవి. అయినను వానియందుఁ శోకవర్ణన చేయఁబడియున్న కారణమున వానికి నుచితమైన స్థానము యుద్ధానంతరమే కాఁగలదు. ఈభాగము వ్యాసరచితము కాదు. సౌతి దీనిని రచించి తనయుపోద్ఘాతములోఁ దరువాతఁ జేర్చియుండెను. ఈప్రకారముగాఁ గొన్నికొన్నిచోట్ల సౌతియొక్క కొన్నిదోషము లగపడుచున్నవి; కాని మహాభారతమునకు వర్తమానబృహత్స్వరూపము నిచ్చుటయందు నతనియొక్క విలక్షణమైన బుద్ధియుఁ, గుశలతయుఁ జూడఁబడుచున్నది. సౌతి యేవో కొన్ని సాధారణమైన కథలను మాత్రము చదువఁగల పురోహితుని వంటివాఁడుకాఁడు. ప్రస్తుతసమయమందు నేప్రకారముగాఁ గథచెప్పునట్టి యొకప్రసిద్ధపండితుఁడు, రామాయణములోని యొకానొకశ్లోకము నందుకొని, మూఁడునాలుగుగంటలదాఁక నుపన్యసించుచుఁ దనశ్రోతలకు మిక్కిలి వక్తృతాసహితముగను రసప్రధానముగను గథను వినిపింపఁగలఁడో, యదేప్రకారముగా సౌతి యందుఁగూడ గథను జెప్పెడుపట్ల నద్భుతమైన శక్తియుండెను. నిస్సందేహముగా నతఁడు గొప్ప తరగతిలోని పండితుఁడుగా నుండెను. ఆతనికి సమస్తపౌరాణికవిషయము లందును జ్ఞానముకూడ హెచ్చుగా నుండెను. వ్యవహారముఁ, రాజధర్మము, తత్త్వజ్ఞానము వీనిని గుఱించి మహాభారతకథకు నెట్టి యుదాత్తస్వరూపము వ్యాసమహర్షి చేతఁ బ్రకటింపఁబడినదో యట్టిని. సౌతియొక్క యుత్కృ

తవిస్తృతమగు గ్రంథమందుఁగూడ నెటులనున్నది యటులనే చేయఁబ
డెను. కనుక సౌతి యీగ్రంథముగుఱించి చేసినప్రశంస సత్యమైయున్నది. ఈభారతవృక్షము సమస్తకవులకు నేకయాధారస్తంభము. ఈదివ్యవృక్షము యొక్క సాహాయ్యమువలన భూమియందలి రసికులును జ్ఞానసంపన్నులునగు లోకులకు సంపూర్ణమైన కాలక్షేపము సంభవించును. ఈయలౌకికవృక్షము నందు ధర్మరూపమును మోక్షరూపము నగు మధురములైన ఫలపుష్పము లయొక్క సంపద యెల్లపుడు నివసించును. సారాంశము, అనేక కవికల్పనా తరంగములందును నీతిశాస్త్రమునందును నుత్తమశిక్ష నిచ్చునట్టి చిత్తాకర్షక ములైన ప్రసంగములును, ఆత్మలకు శాంతిని, సుఖము నిచ్చునట్టి తత్త్వజ్ఞా నముయొక్క యుదాత్తవిచారములు నీగ్రంథమునందు గ్రథితములైయున్నవి కాఁబట్టి "మహాభారతమునందు సమస్తమునుగలదు. ఏది యీగ్రంథమునందు లేదో, యది మఱియొకచోటఁగూడఁ బ్రాప్తముకానేరదు" అని సౌతి చెప్పిన యీగర్వోక్తి యథార్థమే యని చెప్పకతప్పదు.

ఇటువంటి గ్రంథముయొక్క విచారము వివేచకదృష్టితోఁ గావించుట యెంతవఱకు నుచితమైయుండును ఈవిషయమై కొంతచర్చ చేయుట యిచ్చట నావశ్యకముగా నగపడుచున్నది. మహాభారతమునందు నీభాగము సౌతి వృద్ధిచేసిన దని యెపుడు ప్రతిపాదింతుమో, యపుడు, శ్రద్ధాభక్తులు కలచదువరులయొక్క మనఃప్రవృత్తియందు రసభంగము కలుగునని భయమగుటలో సందేహములేదు. కాని యథార్థమునఁ జూచినయెడల నిట్టిప్రవృత్తియగుటకుఁ గారణ మేమియును లేదు. మొదటిది, గ్రంథముయొక్క వాస్తవికస్వరూపమును దెలిసికొనుటవలనఁ జదువరులకు నానందము కలుగక యెప్పుడు నుండదు. రెండవసంగతి, అసంభావ్యమైనకథలయొక్క యథార్థమైన మూలస్వరూపమును దెలిసికొనవలయు నని ప్రతిమనుష్యునికి స్వాభావికమైన యిచ్ఛ కలుగును. ఇట్టిజిజ్ఞాసను బూర్తిచేయుటయే వివేచక గ్రంథకారునికిఁ బ్రధానకర్తవ్యమై యున్నది. మూడవసంగతి, మహాభారతగ్రంథమును మహాభారతకథను వివేచకదృష్టితోఁ బరీక్షించినప్పటికిని, ఆగ్రంథమునకును నాకథకును నేస్వరూపము శేషించియుండునో యది వ్యాసమహర్షివిషయమునను మహాభారతమువిషయమునను వాచకులహృదయమునం దున్నపూజ్యభావము నిసుమంతయుఁ దగ్గింపఁజాల

నియంత మనోహరము నుదాత్తమునై యున్నది. కనుక వివేచకదృష్టితో విచారించుటయందు నే హానియులే దని మనము దృఢముగా విశ్వసింపవచ్చును. ఇదే యెంచి యిపుడు మనము సౌతి మహాభారతము నెందులకు నెట్లు విస్తీర్ణము గావించె నను విషయముల నుద్దేశించి విస్తృతమైన రూపముతోఁ జర్చఁగావించెదము.

భారత మెందుకుఁ బెంచఁబడియెను?

ఎప్పటినుండి సౌతి మహాభారతమునకు వర్తమానస్వరూపము నిచ్చెనో, అప్పటినుండి యిప్పటివఱకు దానియందు మిక్కిలి క్రాలఁది భేదమే తటస్థించెనని మనము ముందే చెప్పియుంటిమి. వేయేల సౌతిచేసిన మహాభారత మెటులనున్నది యటులనే మనకీసమయమునఁ బ్రత్యక్షమై యున్నదని చెప్పవచ్చును. ఇప్పుడు అతఁడు తనబృహద్భారతముయొక్క రచన నెపుడు చేసెనో తెలిసికొనెదమేని అపుడు అతఁడు వైశంపాయన భారతమునకు మహాభారత బృహత్స్వరూపము నెందులకు నిచ్చెనను విషయము ననుమానించుటకు సదుపాయమేర్పడును. శకమునకుఁ బూర్వము మూఁడవశతాబ్దిని మహాభారతమునకు వర్తమానస్వరూపము ప్రాప్తమయ్యె నని మనసిద్ధాంతమై యున్నది. మనసిద్ధాంతము సర్వసామాన్యము కూడ నయ్యెను. ఇదివిస్తరించిన తరువాత వివేచింపఁబడును. ఆసమయమునందలి పరిస్థితులమీఁద ధ్యాన ముంచినయెడల మహాభారతనిర్మాణ మెందుకుఁ జేయఁబడినదియుఁ దెలియఁగలదు. ఆసమయమునందు భారతవర్షమున రెండుక్రొత్తధర్మము లుత్పన్నములైయుండెను. వానియొక్క ప్రచారముకూడ బాగుగా జరుగుచుండెను. శకమున కించుమించుగా 600 సంవత్సరములకు మునుపు తీర్థంకరమహావీరుఁడు ముందుగా బీహారుప్రాంతమున జైనధర్మము నుపదేశించెను. ఇంచుమించుగా నా సమయముననే తరువాత గౌతమబుద్ధుఁడు తన బౌద్ధధర్మముయొక్క ప్రచారమును గావించెను. ఈ రెండు ధర్మములయొక్క యభివృద్ధియు నాసమయమున నయ్యెను. విశేషించి బౌద్ధధర్మముయొక్క విజయధ్వజము నాలుగువైపులను గావుపలూ నుండెను. అశోకచక్రవర్తి యాధర్మములకుఁ దనశాసనబలము నాశ్రయముగా నిచ్చెను. ఇందువలన లోకులయందు ననేకప్రకారములైన వేదవిరుద్ధమతములు వ్యాపించి వేదములయందుఁ బూజ్యభావము నశించెను. ఈ రెండు ధర్మములును ప్రబలముగా

వేదములయొక్క ప్రామాణికత్వమును నిరసించెను. ఏది తనబుద్ధికి నుచిత మనితోఁచునో, యదే ధర్మమగునని తఱుచుగా నెల్లరుఁ జెప్పనుకూడ నారంభించిరి. అదివఱకు బ్రాహ్మణులకుఁ గల శ్రద్ధకూడ నాసమయము నందుఁ దీసికట్టునకు రామొదలిడెను. ప్రాచీనార్యధర్మమున మిక్కిలి సుప్రసిద్ధులైన పెద్ద పెద్దలనీ రెండుక్రొత్తధర్మముల యనుయాయులును దమతమ వైపులకు నాకర్షించికొని పోఁ బ్రయత్నించిరి. తమతమ ధర్మములకుఁ బ్రాచీనత సిద్ధించుటకొఱకే యీప్రకారము ప్రయత్నము చేయఁబడుచుండెను జనసమూహామునందు నేప్రాచీనవ్యక్తులకు గౌరవ మెక్కువగా నుండెనో, యావ్యక్తులను దమధర్మము ననుసరించు వారినిగాఁ జెప్పుకొని, జనసమూహాముయొక్క యానుకూల్యమును సంపాదించుకొఱకు, నీప్రయత్నమంతయుఁ జేయఁబడుచుండెను. ఉదాహరణమేమనఁగా, వేదములయందు వర్ణింపఁబడిన ప్రథమరాజర్షి యగు ఋషభుఁడు మాకు మొదటి తీర్థంకరుఁ డని జైనులు వ్రాసుక చేసిరి. ఇదేవిధముగా బౌద్ధులు, దశరథరాముని బుద్ధుని యొక్క పూర్వజన్మములందలి యొక యవతారముగాఁ జెప్పుకొనిరి. శ్రీకృష్ణుని విషయమున మాత్రము వారు మిక్కిలి తిరస్కారమును బ్రకటించిరి. జైనధర్మముయొక్క యొకగ్రంథమున, అరిష్టనేమియొక్క యుపదేశమువలన యాదవులు జైనమతము ననుసరించి రనియు శ్రీకృష్ణుఁ డుమాత్ర మట్లు కా లేదనియు వర్ణింపఁబడియున్నది. ఆగ్రంథమునందు, అరిష్టనేమి శ్రీకృష్ణునితో నిట్లు చెప్పెనని కూడ వ్రాయఁబడియున్నది :— ,,నీ వనేక యుగములవఱకు నరకమున నివసింతువు; మరలనీ జన్మము మనుష్యయోనియందుఁ గాఁగలదు; తిరిగి యెప్పుడు నీకు జైనధర్మముయొక్క యుపదేశము లభింపఁగలదో, యప్పుడు నీవుద్ధరింపఁబడుదువు'' ఈకథవలన శ్రీకృష్ణుని విషయమున జైనధర్మమెట్లు విలక్షణమైన యనాదరభావముయొక్క ప్రచారమును జేసియుండెనో బాగుగాఁ బ్రకటమగుచున్నది. ఇదే ప్రకారముగా నీ రెండుధర్మములును వైదికదేవతలకుఁ గూడ గొప్పదుర్దశను దెచ్చిపెట్టెను. ఈ రెండు ధర్మములయందును, ఇంద్రాదిదేవతలు జైనునియొక్క లేక బుద్ధునియొక్క యెదుటఁ జేతులుజోడించుకొని నిలువఁబడియుండునని ప్రతిపాదింపఁబడ నారంభించెను; ఇంతియేకాదు వారు వారియొక్క పాదముల యడుగుభాగమునఁ బడియున్నారు. ఈధర్మములు

వేదములోని యజ్ఞయాగాదికర్మములను నిందించుటకు మొదలుపెట్టెను. వైదికయజ్ఞములయందుఁ బశుహింస జరుగుచుండెను. ఈక్రొత్తధర్మములు „అహింసా పరమోధర్మః„ యనుదానియందు గట్టిపట్టుదల గలిగియుండెను, కాఁబట్టి వానికి నీవైదికములైనయజ్ఞయాగాదికర్మములన్నియు నిష్టములు కాకుండెను. సనాతనధర్మమందుఁ గూడ నహింసాతత్త్వముయొక్క యుచితమైన యుపదేశము చేయఁబడియే యుండెను; కనుక లోకులకు హింసాయుక్తములైన యజ్ఞములయందు మెల్లమెల్లగా మిక్కిలి క్రౌర్యము కలుగుటకు నారంభమయ్యెను. ఈరెండు క్రొత్తధర్మములయొక్క ప్రచారము హెచ్చిపోవుటయే దీనియొక్క ఫలితమయ్యెను. ఈధర్మములు ప్రాచీనతీర్థస్నానములుఁ వ్రతములు మొదలుగాఁగల విషయములయందుఁ గూడఁ దమ యనాదరభావమును బ్రకటించెను. బుద్ధుఁ డొక సమయమునఁ దీర్థములయందు మునుఁగుటవలనఁ బుణ్యమోక్షములు వచ్చునేని కప్పగూడఁ బుణ్యమోక్షములను బొందునని చెప్పెను. ఇట్లు చెప్పి యతఁడు కాశ్యపుఁడనియెడు నొక బ్రాహ్మణుని దీర్ఘస్నానమునుండి మరలించెను. ఈప్రకారముగా సనాతనధర్మముయొక్క మతములయందును బూజనీయ వ్యక్తులయందును ననాదరభావముయొక్క ప్రచారమును జేసి యీక్రొత్తధర్మములు తమ్ము వృద్ధిచేసికొనుచుండెను. సనాతనధర్మము మీఁదఁ గావింపఁబడిన యీముట్టడి భారతవాసుల యితిహాసమున మొదటిదై యుండెనని జ్ఞప్తి యుంచుకొనవలయును.

బౌద్ధులయు జైనులయు ధర్మము ప్రసరించినందువలన, సనాతనధర్మముయొక్క యొక ప్రధానభాగముమీఁదఁ దిరుగుబాటు సంభవించెను. చాతుర్వర్ణ్యసంస్థ సనాతనధర్మమునకు నొక్క ప్రధానాంగమై యున్నది. బౌద్ధధర్మము, జైనధర్మముగూడఁ నీవ్యవస్థను ద్యజించినవి. అన్నిజాతులయందును బౌద్ధసన్న్యాసులుండుటకు మొదలిడిరి. అందఱు నొకచోటనే భోజనము చేయనారంభించిరి. కాశ్యపుఁ డను బ్రాహ్మణుఁడును, ఉప్పలి యను మంగలియు బౌద్ధసన్న్యాసులై సర్వసాధారణమైన యాదరభావమునకుఁ బాత్రతను బడయనారంభించిరి. చాతుర్వర్ణ్యముయొక్క ప్రాచీనమైన నియమముల నట్లేయుంచి, మోక్షధర్మమునందు నందఱకు సమానమైన యధికారము నిచ్చుటకు శ్రీకృష్ణుఁడు గావించిన ప్రసిద్ధమైన వ్యవస్థ

# మన్నారుదాసవిలాసనాటకము

—: పీఠిక :—

ఈనాటకమును రంగాజమ్మ యనుస్త్రీ రచియించెను. ఇందుఁ గథానాయకుఁడు తంజాపురీనాయకుఁ డగు విజయరాఘవనాయకుఁడు. ఈయన విజయవిలాసాదికృతిపతిభర్తయు, వాల్మీకిచరిత్రాదికృతికర్తయు నైన రఘునాథనాయకుని కొమారుఁడు. మన్నారుకోవెలలో వేంచేసియున్న శ్రీరాజగోపాలస్వామి రఘునాథనాయకుని యిష్టదైవము. ఈదేవునకు మన్నారుస్వామి యను పేరుగూడఁ గలదు. మన్నారుస్వామి ప్రసాదముచేఁ బుట్టుటవలన నీతనికి మన్నారుదాసుఁ డనుబిరుదము కలిగెను. ఈయనయే తంజాపురరాజ్యము నేలిన యాంధ్రరాజులలోఁ గడపటివాఁ డని చెప్పవచ్చును. ఈతఁడు మధురాపురరాజగు చొక్కనాథనాయకునితో యుద్ధము చేసి క్రీ. 1674 సంవత్సరప్రాంతమందు నిహతుఁడయ్యెను. మఱి రెండేండ్లకు శివాజీ తమ్ముఁడైన ఎక్కోజీ (వెంకాజీ) యీదేశము నాక్రమించి దక్షిణదేశమందు మహారాష్ట్రరాజ్యమును స్థాపించెను. విజయరాఘవనాయకుఁడు క్రీ. 1633 సంవత్సరమందుఁ బట్టాభిషిక్తుఁడైనట్లును జనిపోవునప్పటికి 80 సంవత్సరములవయసుగలవాఁడైనట్లును గ్రంథాంతరములవలనఁ దెలియుచున్నది. ఈనాటకము క్రీ. 1660 ప్రాంతమందుఁ బుట్టియుండెనేమో.

రంగాజమ్మ మన్నారుదాసవిలాసము, ఉషాపరిణయము నను రెండు ప్రబంధములుగూడ రచించెను. ఆకాలమందుఁ దంజాపురాస్థానకవులలోఁ బెక్కండ్రు స్త్రీలుగూడ నుండిరి. చంపకవల్లి, కస్తూరి, అంబుజవల్లి, శశిరేఖ, మోహనమూర్తి, కృష్ణాజి, అలమేలు, సీత, మదనరేఖ మొదలగు పేళ్ళు గ్రంథాంతరములందుఁ గాన్పించుచున్నవి. వీరందఱు నాయకరాజుల యుంపుడుకత్తెలై యుందురని యూహింపఁదగి యున్నది.

రఘునాథనాయకుఁడు విద్వత్కవి. పెక్కుగ్రంథములు రచించెను. విజయరాఘవనాయకుఁడు గూడ రఘునాథాభ్యుదయాది గ్రంథములు కొన్ని రచియించినట్లును, విద్యావినోది యైనట్లును గనుపట్టుచున్నది.

ఆకాలమందు యక్షగాననాటకము లనేకములు పుట్టినవి. సర్ఫోజీసరస్వతీమహాలులో "ప్రాకృత తెలుగులిపి నాటకాలు" అను శీర్షికక్రింద

247 గ్రంథము లుదాహరింపఁబడినవి. వీనిలోఁ బెక్కులు తెనుఁగు నాటకములే. విజయరాఘవకృత రఘునాథాభ్యుదయము, కామరుసు వేంకటపతి సోమయాజి రచిత విజయరాఘవచంద్రికావిహారము, కోనేటి దీక్షితవిరచిత విజయరాఘవకళ్యాణము మొదలగు తెనుఁగు నాటకములును, యజ్ఞనారాయణదీక్షితోక్త రఘునాథవిలాసాది సంస్కృతనాటకములును గలవు.

సంస్కృతనాటకములఁ బోలిన పద్యగద్యాత్మకాంధ్రనాటకము లిటీవల వెలసినవి, గాని, పూర్వము తెలుఁగునాటకము లన్నియు యక్షగానరూపములుగానేయున్నవి. ఈదేశమందుఁ బూర్వకాలమునఁ బ్రదర్శింపఁబడుచుండిన పారిజాతాపహరణనాటకము, ప్రహ్లాదనాటకము మొదలైన వీథినాటకము లిట్టివే. తంజావూరినాటకములు గూడ నీరీతివే. రాజభవనమందు నాట్యరంగ మొకటి యుండినట్లును నం దీనాటకము లప్పుడప్పుడు ప్రదర్శింపఁబడుచుండినట్లును గనఁబడుచున్నది. రఘునాథాభ్యుదయనాటకము రఘునాథనాయకుని యెదుట నాడఁబడినదఁట.

ఈనాటకములకవిత్వము ద్విపదలు, దరువులు, వచనములునను మూఁడువిధములుగా నుండును. వీని శైలి ప్రబంధశైలికంటెఁ దేలిక. వీనియందు దేశీయవేషభాషలు నాచారవ్యవహారములును సందర్భోచితముగా వర్ణింపఁబడినవి. హాస్యరస మొక్కటి విశేషము.

ఈనాటకములందు లక్షణవిరుద్ధములగు ప్రయోగములు కొన్నిగలవు. అవి తఱచుగా హాస్యరసప్రధానము లగునచనభాగములందే యున్నవి. ఇది ప్రౌఢకావ్యములలో నెన్నఁదగినది కాకపోయినను దేశచరిత్రపరిశోధనకును భాషాచరిత్రపరిశోధనకు నుపయోగించును గావునను స్త్రీకవిత్వ మగుటచేతను బండితాదరము నొందకపోదని నమ్ముచున్నాము.

జ. రామయ్య.



# సకలవిద్యోద్దేశము.

లోకహితముగా అకు కేలదీసింహాసనాధీశ్వరుఁ డయిన బసవేం ద్రభూమిరమణుఁడు రచించిన శివతత్త్వరత్నాకరమునందు సకలవిద్యోద్దేశ మను విషయసూచిక సంగ్రహ మిట వ్రాయఁబడుచున్నది.

"స్వామీ ! చక్షురాదిబహిరింద్రియములకు గోచరించు వస్తుజాత మంతయు నెన్నివిధములు? దేనినుండి పుట్టినది? దానికిఁ బ్రమాణమును, రూపమును నిరూపించి చెప్పవలయును." అని సోమశేఖరుఁ డను కుమారుఁడు బసవేంద్రు నడుగఁగాఁ జెప్పుచున్నాఁడు. "పుత్రా నీబుద్ధి సూక్ష్మదర్శిని కాన దుర్బోధమగు నీవిషయమునఁ బ్రవర్తించుచున్నది. కావునఁ బ్రత్యుత్తరము వినుము. సమస్తవిద్యలను బరిశీలించి యర్థమును విచారించి వాగ్రాశిచే శివతత్త్వరత్నాకర మనుకృతిరచించితిని." అనిన "దేవా! తాము పరిశీలించిన విద్యలన్నియు నెన్ని?" అని పుత్రుఁ డడిగెను. అది విని యీక్రిందిరీతిని విద్యావివరణము తండ్రి చేయుచున్నాఁడు.

అష్టాదశమహావిద్యలు.

మహావిద్యలు పదునెనిమిది, అంగములాఱు, వేదములు నాల్గు, మీమాంస, న్యాయవిస్తరము, పురాణము, ధర్మశాస్త్రము, నివి చతుర్దశవిద్యలు. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రమునునియు పవేదములు నాలుగు పిమ్మటఁ జెప్పఁబడినవి. ఈపదునెనిమిది భిన్నమార్గములు గలవిద్యలకు నాదికర్త సాక్షాచ్ఛూలపాణి యని వేదప్రమాణము.

వేదములు:—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము నని నాలుగు. ఉపనిషత్తులకు వేదశిరస్సులని ప్రఖ్యాతి.

ఉపనిషత్తులు:—శ్రీరుద్ర, బృహదారణ్య, శ్వేతాశ్వతర, ముండక, కైవల్య, కాలాగ్నిరుద్ర, కఠవల్లి, బాష్కల, హంస, పరమహంస, బ్రహ్మనారాయణ, కాత్యాయన, బ్రహ్మబిందు, ఆరుణి, అమృతబిందు, పంచబ్రహ్మ, జాబాల, తేజోబిందు, ముద్గల, బోధాయనీయ, చర్చి, శ్రవణ, పరాక్రమ, ప్రాత్య, శౌనకీయ, శివసంకల్ప, ఆసురాయణ, మైత్రాయణీయ, వాజసనేయ సాంఖ్యాయనీయాదులు.

వేదాంగములు:—శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఛందము నషడంగములు.

ఉపాంగములు:— మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, స్మృతి, యీనాలు నుపాంగములు. ఆయుర్వేదము, అర్థవేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము ననునాలు గుపవేదములు.

మీమాంస; న్యాయస్మృతికర్తలు:—మీమాంస పూర్వమీమాంసయనియు, నుత్తర మీమాంసయనియు రెండు తెఱఁగులు. తర్కముగూడ న్యాయకాణాద భేదములచే రెండువిధములు. స్మృతులును ఉపస్మృతులును బదునెనిమిది, పదునెనిమిదివిధములు. వేదమార్గానుసారముగ మనువు బృహస్పతి దక్షుఁడు గౌతముఁడు యముఁడు అంగిరసుఁడు ప్రచేతసుఁడు శాతాతపుఁడు పరాశరుఁడు సంవర్తుఁడు ఉశనసుఁడు శంఖుఁడు లిఖితుఁడు అత్రి విష్ణువు ఆపస్తంబుఁడు హారీతుఁడు నను నియమవ్రతులైన మునులు పదునెనమండ్రు వీనికర్తలు. కావున నీపదునెనిమిది స్మృతులయందును వారివారి నామములు చిహ్నితములై యున్నవి.

ఉపస్మృతికర్తలు:—జాబాలి నాచికేతుఁడు స్కందుఁడు లౌగాక్షి కశ్యపుఁడు వ్యాసుఁడు సనత్కుమారుఁడు శంతనుఁడు జనకుఁడు క్రతువు కాత్యాయనుఁడు జాతుకర్ణుఁడు కపింజలుఁడు బోధాయనుఁడు కాణాదుఁడు విశ్వామిత్రుఁడు పైఠీనసి గోభిలుఁడు వీరుపదునెనమండ్రు. వీరిపేరులు నాయాయుపస్మృతులయం దంకితములై యున్నవి.

అష్టాదశపురాణములు:—బ్రాహ్మము పాద్మము వైష్ణవము శైవము భాగవతము నారదీయము మార్కండేయము ఆగ్నేయము భవిష్యత్తు బ్రహ్మకైవర్తము లైంగము వారాహము స్కాందము వామనము కౌర్మము మాత్స్యము గారుడము బ్రహ్మాండము ననునవి పదునెనిమిదిపురాణములు.

ఉపపురాణములు:—సనత్కుమారము, నారసింహము కుమారస్వామి చేరచింపఁబడినస్కాందము నందికృతమగు శివధర్మము దుర్వాసకృతమును నారదీయము కాపిలము మానవము ఉశనసము బ్రహ్మాండము వారుణము కాళీపురాణము కాలకంఠము వాసిష్ఠము లైంగము మాహేశ్వరము సాంబపురాణము పారాశరము మారీచము భార్గవము నివియున్నియు బ్రహ్మజ్ఞానమును గలిగించునవి.

ఆగమములు:—శివప్రోక్తములైనవి యిరువదియెనిమిది తంత్రములు. అవియే శివాగమ[illegible]లు. అవి వరుసగా కామిక యోగజ; చింత్య

కారణ అజిత దీప్త సూక్ష్మ సహస్ర అంశుమంత విజయ విశ్వాస స్వా
యంభువ అనల వీర రౌరవ మకుటములును విమల చంద్రజ్ఞాన బింబ
లలిత సిద్ధ సంతాన పరమేశ్వర కిరణ వాతులములును ననునవి. మఱి
యునిట్లే శివప్రోక్తములగు ననేకతంత్రములు గలవు. వానిలోఁ గొన్ని
మహామాయాశంబరము యోగినీజాలశంబరము తత్త్వశంబరము భైరవాష్ట
కము బహురూపాష్టకము యామలాష్టకము చంద్రజ్ఞానము వాసుకి మహా
సమ్మోహనము మహోచ్ఛుష్మ మహాదేవ వాతులవాతులోత్తరములు, హృ
ద్భేద మాతృభేద గుహ్యతంత్ర కామికములు కలపాద కళాసార కుంజి
కామాయోత్తర వీణా త్రోతల త్రోతలోత్తరములు పంచామృతరూప
భేద భూతోడ్డామర కులాసార కులోడ్డీశ కులచూడామణులును సర్వజ్ఞానో
త్తమ మహాశివమత మహాలక్ష్మీమత సిద్ధయోగీశ్వరమత కురూపికామత
రూపికామత సర్వవీరమత విమలామత పూర్వ పశ్చిమ దాక్షిణ్య ఉత్తర
నిరుత్తరములు వైశేషికము జ్ఞానము వీరయోగము అరుణేశ మోహనేశ
విశుద్ధేశ్వరములు, ననునవియు మఱియునితరములు కోట్లకొలఁది సర్వజ్ఞా
నాకరములు శివప్రణీతములుకలవు. వైఖానసము పాంచరాత్రము భాగవ
తమునను వైష్ణవదర్శనములు తంత్రజ్ఞులచేత మూఁడువిధములుగాఁ జెప్పఁ
బడుచున్నవి. ఖిలము ఖిలాధికారము పూర్వతంత్రము ఉత్తరతంత్రము వా
సాధికరణము చిత్రాధికరణము ప్రతిగ్రహము అధికారము నని మునిప్రణీత
ములైన యెనిమిది సంహితలు; ప్రథమతంత్రము ఉత్తరము విష్ణుతంత్రము
ఆత్రేయతంత్రము నని నాలుగు తంత్రములు. సంతాన కాశ్యపీయ తర్క
జ్ఞాన, జయవీరసంజ్ఞానంద విజయ విజిత సత్య ఆంగీరస పంచకాండములును
మొదలైన వైష్ణవసంహితలు పెక్కులు గలవు.

ఇంక నానాప్రయోగకారిణులు, మహైశ్వర్యకారిణులు నగు అఱువ
దినాలుగు తంత్రములు చతుష్షష్టికళలకును విద్యలకును మూలభూతములై
నవి కలవు. అవి యేవియన:—

అవ్యాజపాలిని, రాజ్యలక్ష్మీప్రసాదకము, సర్వసామ్రాజ్య, అంగార
గమన, రాజ్యోపాంగేశి, శ్రీబాలరాజ, చామరద్వంద్వ, ప్రహర్షరాజ, ధీర,
గ్రామపాలన, జీవిని, మిత్రలక్ష్మీప్రయోగ, దుర్గపాలన, క్షోణలక్ష్మీప్ర
యోగ, ప్రభాలక్ష్మీప్రయోగ తోయలక్ష్మీప్రయోగ, గంధలక్ష్మీప్రయోగ
పుష్పలక్ష్మీప్రయోగ, కామరూప కళాజీవనిక, కుంజకంబల, కనకప్రయోగ,

బోధినీ, సత్యలక్ష్మీప్రయోగ, పాదుకా, ప్రజ్ఞాలక్ష్మీప్రయోగ, ఖేటక, చాప, లేప, శల్య, భీమలక్ష్మీప్రయోగ, మణిస్థానప్రయోగ, పాతాలగమన, మర్దినీ, స్ఫులింగలక్ష్మీ, శంఖమర్దల, చక్రాయుధప్రయోగ, భైరవాదిప్రయోగ, గజ, వాజి, గోరక్షక, రూపలేఖ, పృథివి, ఐశ్వర్యలక్ష్మీ, శుల్క, మిశ్రలక్ష్మీప్రయోగ, జీవిని, గిరి, వన, స్థానాపత్యప్రయోగ, శ్రీసర్వదర్శిని, విఘ్నవిచ్ఛేద, భారత, శృంగవాద్యప్రయోగ, నరవాహన, స్తంభిని, దాహిని, మారణి, ద్వేషిణి, ఆకర్షణి ఉచ్చాటన, తోషిణి, శ్రీసర్వదండిని, తంత్రములు. ఇవి మంత్రయంత్రాత్మకములై రాజ్యలక్ష్మీప్రసాదమువలన స్మరించినంతన సిద్ధించును. ఇట్లే యథాక్రమముగా విద్యలకును పేరులను దెలిసికొనవలయును.

ఇదియంతయు విని పుత్త్రుఁడు గురువు నడుగుచున్నాఁడు. తండ్రీ! నానావిధములగు విద్యలపేరులు వినినపిమ్మట బహుమార్గములుగల యావిద్యల స్వరూపములను దెలిసికొనఁ గుతూహలపడుచున్నాఁడను" అనవుడు గురువు చెప్పుచున్నాఁడు.

ఋగ్వేదము రురుమృగవర్ణమును కుంచితశ్మశ్రుకేశములును రెండుమూరలుపొడుగు విగ్రహమును గలది. ఈఋగ్వేదమున కేడుభేదములుగలవు.

యజుర్వేదము కృశమును, స్థూలమును తామ్రవర్ణమునుగలిగి, కపాలమునుబట్టుకొని కాంచనాక్షులతో నయిదుమూరల పొడవు విగ్రహము గలది. దీనిలో నెనుబదియాఱు భేదములు గలవు.

సామవేదము శుచియై పట్టుబట్టకట్టికొని దండము ధరించి మెప్పుడును బూవులహారలు వైచుకొని, చర్మవంతముగ నాఱుమూరల ప్రమాణము గలిగి యుండును. ఈవేదమహాదిత్యవర్ణము గలది. దీనిలో వేయిభేదములుగలవు. అథర్వణవేదము కృష్ణవర్ణము కామరూపము క్షుద్రకర్మము స్వదారపరితోషణము పరదారరతము గలిగి తొమ్మిదిభేదముల నొప్పును.

విధి అర్థవాదము మంత్రము ననుభేదములవలన అన్నివేదములకును భేదములు తెలియఁదగినవి. విధియనునది రాజాజ్ఞవలెనే ధర్మమును స్వతంత్రముగాఁ బ్రవర్తింపఁ జేయుచున్నది.

వేదములు మరలఁ బూర్వభాగము నుత్తరభాగము నని రెండువిధములుగా భాగింపఁబడినవి. అందుఁ బూర్వభాగము కర్మప్రతిపాదకము, ఉత్తరభాగ ముపనిషత్తులు. బ్రహ్మమును బోధించుటచేత బ్రహ్మకాం

డ మనియును బిలువఁబడును. భస్మరుద్రాక్షాది ధారణము జ్ఞానదాయకము. ఈచతుర్వేదములకును నాలు గుపవేదములు గలవు. ఋగ్వేదమున కుపవేద మాయుర్వేదము. యజుర్వేదమున కుపవేదము ధనుర్వేదము. సామమునకు గాంధర్వవేదము. అథర్వణమున కర్థశాస్త్రము. హేతు లింగౌషధములచేత నారోగ్యసాధనమైన దాయుర్వేదము, ధర్మార్థకామములను మూఁడు పురుషార్థములచేత నాయుర్వేదమును నరులు తెలిసికొనఁదగినది. విరోధులను నివారించునది ధనుర్వేదము. సప్తస్వరభేదములు గలవి సామ,గాంధర్వ వేదములు. దక్షిణ ఆజ్య పురోడాశ చరుసంపాదనాదులచే నన్నపానాదిప్రదాన మఖతత్పర మర్థవేదము. దానిఫలము చతుర్వర్గపురుషార్థ మని తెలియవలయును.

షడంగలక్షణములు:—శిక్షాదులైన యీయంగములకును వేదమందుపయోగము. స్పష్టముగా వేదోచ్చారణలక్షణమును శిక్షించునది శిక్ష. సంహితాపదలక్షణమును దెలుపునది వ్యాకరణము. స్ఫుటముగాఁ బదనిర్వచనము చేయునది నిరుక్తము. వైదికకర్మలకుఁ గాలనిర్ణయముం జేయునది జ్యోతిశ్శాస్త్రము. కర్మప్రయోగముల క్రమముం దెలుపునది కల్పము. మంత్రాక్షరముల సంఖ్యను దెలుపునది ఛందస్సు. వేదములకు ఛందస్సు పాదములు, కల్పము చేతులు, వ్యాకరణము ముఖము, శిక్ష నాశిక, జ్యోతిషము నేత్రములు, నిరుక్తము శ్రోత్రములు.

ఉపాంగములు:—ఉపాంగములు నాలుగింటి యుపయోగమును షడంగములవలెనే చెప్పఁబడుచున్నది. అందు మీమాంస వేదార్థవిచారణపరాయణము. ఆమీమాంస పూర్వోత్తరభేదములచే రెండువిధములు. ఆపూర్వమీమాంస కర్మప్రతిపాదకమగుటచేతఁ గర్మమీమాంసయందురు. ఉత్తరమీమాంసపరబ్రహ్మవిచారణకుఁ గారణమగుటచే బ్రహ్మమీమాంసయందురు. యుక్తులచేఁ బదార్థముల తత్త్వనిర్ధారణముఁ జేయునది న్యాయము. అది న్యాయము కాణాదము నని రెండువిధములు. గౌతమప్రణీతమైనదిన్యాయము, కణాదమునిచేతఁ జెప్పఁబడినదికాణాదము. శివప్రసాదమువలన వేదములందలి సప్తభాగములను వ్యాసుఁడుప్రకాశము చేసెను. మఱియు నావ్యాసుఁడే పురుషార్థసాధనములైన ప్రధానములగు పదునెనిమిది పురాణములను గథారూపమున రచియించెను. పదునెనిమిది యుపపురాణములు

వ్యాసమునిచేతను నితరమహాత్ములచేతను రచియింపఁబడిన సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము వంశానుచరితమునను లక్షణములతోఁ గూడినవి వర్ణాశ్రమానురూపముగ ధర్మాధర్మములను విభజించుచు ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడిన ధర్మముల నియమించుచున్నవి.

ఆగమస్వరూపము:—శివునివక్త్రమునుండి వచ్చి గిరిజాముఖమునఁ బ్రవేశించినవి గావున వాసుదేవునిచేత వాని కాగమము లని పేరిడఁబడెను. అవి క్రియాపాద, యోగపాద, చర్యాపాద, జ్ఞానపాదము లనునవి నానావిధాగమములందు నాలుగు ముఖ్యపాదములు. క్రియాపాదమునందు ఆత్మయొక్క నిత్యకర్మలు పశుత్వనాశనము శివత్త్వము నిత్యాదులను బ్రతిపాదించును. యోగపాదము మంత్ర, లయ, హఠ రాజాభిధానములచే నాలుగువిధములు. అవి యీశ్వరునియందు చిత్తసంధానరూపమును దెల్పును. జపమాలాలక్షణము స్కందుఁడు, నంది వీరలరూపములు ప్రాయశ్చిత్తాదికర్మములు చర్యాపాదమునంగలవు. పతి పశు పాశము లను మూఁడు జ్ఞానపాదమునందుఁ జెప్పఁబడినవి. పతి, కుండలినీ, మాయా, పశు, పాశ, దీక్ష లనునవి యాగమములం దాఱుపదార్థములు కీర్తింపఁబడుచున్నవి. ప్రధానాగమములలోనుండి పుట్టిన యుపాగమములు లెక్కలేనివిగలవు. అందుఁ గొన్ని బహుమత ప్రవర్తకములైనవి మఱికొన్ని మూలత్వమునే పొందినవి.

### 7 చతుష్షష్టికళలు.

ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకారనాటకములు, గాయకత్వ, కవిత్వ, కామశాస్త్ర, దురోదరములు, దేశభాషాలిపిజ్ఞానము, లిపికర్మ, వాచనము, గణకము, వ్యవహారము, స్వరశాస్త్రము, శాకున, సాముద్రిక, రత్నశాస్త్ర గజాశ్వరథాకౌశలములు మల్లశాస్త్ర, సూపకర్మ, వృక్షదోహదములు, గంధవాద, ధాతువాద, ఖనివాద, రసవాద, బిలవాదములు అగ్నిస్తంభ, ఖడ్గస్తంభ, జలస్తంభ, వాచస్తంభ, వయస్తంభములు వశము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటన, మారణ, కాలవంచన, పరకాయప్రవేశములు, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఐంద్రజాలికము, అంజనముపరదృష్టివంచనము, స్వరవంచనము మణి, మంత్ర ఔషధసిద్ధులు చోరకర్మము, చిత్ర లోహాశ్మ మృద్దారువేణుకర్మములు చర్మకర్మవస్త్రకర్మములు అదృశ్యకరణ, దన్తికరణ మృగయావిధులు, వాణిజ్య పాశుపాల్యములు కృషి, ఆసవకర్మము లావకుక్కుట మేషాదియుద్ధకారక కౌశలము నని యఱువదినాలుగు కళలు.

# శబ్దలక్షణసంగ్రహము

—విద్వాన్ కత్తి సాంబమూర్తిశాస్త్రిగారు—

---

ఆంధ్రభాషయందు నిర్దుష్టమును సరళమును బాలుర కనువైనశైలిని వచనరచనము గావించి యాంధ్రులకృతజ్ఞతం జూఱగొన్నవారిలో మొట్ట మొదటివారు కీ. శే. శ్రీమాన్ పరవస్తు చిన్నయ్యసూరిగారు. వీరు రచించి నసీతిచంద్రిక యిప్పటికిని భాషాభిలాషులకరంబుల నలంకరించుచునే యున్నది. శ్రీసూరిగారు భాష కొనర్చిన మహోపకారములలో నీతిచంద్రిక, బాలవ్యాకరణమును ప్రధానములు. బాలవ్యాకరణము పూర్వలక్షణగ్రంథముల కవిరుద్ధమై బహుళప్రమాణశబ్దరూపముల నిష్పత్తి నెఱింగించును. శ్రీసూరిగా రాంధ్రభాషకు జీవాతుప్రాయ మగు నొక నిఘంటురాజమును రచింపనెంచి కొన్నిభాగములను బూర్తిచేసిరే కాని యామహాగ్రంథము పూర్తికాకముందే వారు పరమపద మందిరి. (ఆనిఘంటు వ్రాతప్రతి ప్రస్తుతము శ్రీ శ్రీ పిఠాపురము మహారాజాగారికడ నున్నది.) ప్రస్తుతము సూరిగారియశఃకాయమున కంగములుగా నిలిచినవి యీసూక్ష్మ గ్రంథములేయని యెల్లరెఱింగిన విషయమే. శ్రీసూరిగారి జీవితచారిత్ర మింతవఱ కెక్కడను సమగ్రముగాఁ బ్రకటింపఁబడలేదు. సుమారు నాలుగేండ్లకు ముందు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు సంగ్రహముగా మాత్రము ముద్రింపఁబడినది. ఆచరిత్రము శ్రీసూరిగారి రెండవకోడలికి సోదరు లగు ఆసూరి భాష్యకారులు అయ్యగారిచే వ్రాయఁబడిన చిన్నలేఖ నాధారముచేసికొని ప్రకటింపఁబడినది. ఆచరిత్రమందు శ్రీసూరిగారు మదరాసు నార్మల్ స్కూలు (ప్రస్తుత మదియే ప్రసిడెన్సీకాలేజి) నందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయులుగా నుండి రనియు పురాణము హయగ్రీవశాస్త్రులుగారు వీరిస హోపాధ్యాయు లనియు శబ్దరత్నాకరనిఘంటునిర్మాత లగు బహుజనపల్లి సీతారామాచార్యులుగారు వీరి శిష్యులనియుఁ దెలియుచున్నది. శ్రీసూరిగారి పాండిత్యాతిశయము కాశీ మొదలగు స్థలములందలి మహాపండితులచే స్థిరపఱుపఁబడిన తరువాత దొరతనమువారు సూరిగారికి స్వర్ణకంకణముఁ గూడ బహూకరించి రని యాచరిత్రవలనఁ దెలియుచున్నది. లేఖవ్రాసిన భాష్యకారులయ్యగారు లేఖవ్రాయుకాలమున కించుమించుగా డెబ్బదిస్థా

డేండ్ల వయస్సు గలవారు. సూరిగారికి సన్నిహితబంధువులు, సూరిగారిని బాగుగ నెఱింగినవారుఁ గావున వారి వ్రాఁత ప్రమాణమే యని యంగీకరింపక తీఱదుగదా? దీనినిబట్టి బ్ర॥ శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికయందుఁ బ్రకటించిన యుక్తులకెల్ల జలాంజలినీయక తప్పదు. శ్రీ వేంకటరామశాస్త్రిగారు స్వపాండిత్య ప్రకర్షమున గొప్పగొప్పయుక్తులను బ్రకటించిరే కాని వారికి వాస్తవచరిత్ర మించుకంతయుఁ దెలియలేదని నమ్ముటకాధారములు గలవు. వాని నెల్ల నిటఁ జర్చించుట కాలహరణమగును. ప్రకృతాంశమునకు వత్తము.

శ్రీసూరిగారి గ్రంథములు మూఁడే యగపడుచున్నవి. రచించినవియు మూఁడేయని యందఱకు నమ్మిక. బాలవ్యాకరణమునకు మూలమగు సంస్కృతభాషాత్మక మగుసూత్రములరచించితి నని శ్రీసూరిగారే వ్రాసికొని యుండిరిగాని యాగ్రంథ మెవ్వరు నెఱుఁగరు. అది యెక్కడ నశించినదో? లేక కాలగర్భమున నడంగి యున్నదో?

ఈవిషయ మిట్లుండ ‹‹శబ్దలక్షణ సంగ్రహ›› మనునొక వ్యాకరణ సూత్రగ్రంథము సూరిగారిచేత రచింపఁబడినదిగా నగపడుచున్నది. ఇది ఓ. వై. శ్రీ దొరసామయ్యగారిచే 1902 వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడినది. కానిభాషాపరిచితులగు ననేకుల కీగ్రంథము నునికియే తెలియదు. ఇది కేవలము సూత్రాత్మక[illegible] భాషామయము. ఇట్టి సూత్రగ్రంథముండఁగా దీనినే వివరింపక [illegible] బాలవ్యాకరణము నేల రచింపవలసి వచ్చెనో యని సంశయ ముదయించుచున్నది. ఇది సూరిగారిచే రచింపఁబడినది కాదందుమా దీని వ్రాఁతప్రతియే కావలయును సూరిగారి సజాతీయు లొకరికడఁ జూచితి నని మ॥ కొత్తపల్లి సూర్యరావుగారు చెప్పియున్నారు. కావున బాగుగ విమర్శింపకయే యిదమిత్థమని నిర్ణయింప వలనుగాదు.

సూరిగారు బాలవ్యాకరణపీఠికయందును గ్రంథాంతమందలి పద్యమునందును బాలవ్యాకరణమునకు మూలముగ సంస్కృతసూత్రములు స్వరచితములు గలవని చెప్పియున్నారు. ‹‹పెక్కులక్షణములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించికొని నానేర్పుకొలఁదిని సంస్కృతభాషతో సూత్రగ్రంథ మొకటి కావించితిని.

## పీఠిక.

క. మునుమదుపజ్ఞం బగుచుం, దనరినవ్యాకృతిని సూత్రతతి యొక్కొంతం
దెనుఁగించి యిది ఘటించితి, ననయము బాలావబోధము శుభంగాఁ దగన్.

క. తెనుఁగునకు శబ్దలక్షణ, మనయం బరయంగ వేర్పడఁ జదివెడువారల్
తనరఁగనీ వ్యాకరణం, బున మూలం బమరసంస్కృతిని బోలఁగఁ దగునన్.

ఈయవి బాలవ్యాకరణము చివరిపద్యములు. ఇందువలన బాలవ్యాకరణమునకు మూలము సంస్కృతసూత్రము లని స్పష్టమగుచున్నది గదా? ప్రకృతశబ్దలక్షణసంగ్రహము సూరిగారిచే విరచితమనుట కివి ప్రబలానవరోధము గల్పించుచున్నవి. బాలవ్యాకరణమూలమునకు దీనికిని సూత్రతతిత్వమునందుఁ దక్క సామ్య మేమాత్రమును లేదు. ఇంతియకాక శబ్దలక్షణసంగ్రహమందుఁ గొన్ని తెలుఁగుపద్యములును రెండు సంస్కృత శ్లోకములును గలవు. బాలవ్యాకరణమునందుఁ గూడఁ గొన్ని తెలుఁగుపద్యములును నొక సంస్కృతశ్లోకమును గలవు. వానినెల్ల సరిపోల్చి చూచిన శైలిలో విశేషభేద మగపడుచున్నది. చిత్తగింపుఁడు.

శ్లో. కరోదరధృతోద్భూత వనజాతౌ సనాతనౌ
శేషాద్రిశేఖర త్త్వాదచ్ఛాయౌ జాయాంపతీస్తుమః.

శ్లో. పూర్వేషాం లక్ష్మలక్ష్యాణి విక్కృతే ర్వీక్ష్యభూరిశః
క్రియతే బాలబోధాయ శబ్దలక్షణసంగ్రహః. (శబ్దల)

శ్లో. శ్రీస్తనాంచితకస్తూరీపంకసంకలితోరసే
పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళమ్. (బాలవ్యాకరం.

క. శ్రీచరణ సరోరుహలా, క్షాచారు విశాలవక్ష సంశ్రితజనర
క్షాచరణదక్షదుష్టని, శాచరకులశిక్ష శేషశైలాధ్యక్షా (శబ్దద్వితీయపరి)

క. శ్రీగృహమేధికి నతనిధి, కాగమవేద్యునకుఁ ద్రిభువనారాధ్యునకున్
భోగాపవర్గదాయికి, నాగాధిపశాయి కంజనాభరథాంగికిన్. (శబ్ద. ౩ప)

క. శ్రీనయనోత్పల శీతల, భానుఁడు కలుషాంధకారభానుఁడు గరుణా
ధీనుం డాశ్రితశుభసం, ధానుం డధ్యుషితశేషధరసానుఁడొగిన్. (శబ్ద. రప)

క. శ్రీలోచనాంజనాంక, శ్రీలలితాధరుని చేతఁ జిరభద్రగుణ
శ్రీలుని చేతన్ దీనక్కృ, పాలుని చేతన్ వృషాద్రిపాని చేతన్. (శబ్ద. ౫ పరి)

క. మానితపు నడకపేరిమి, మానసమునకింపుఁ బెంప మనునంచలకున్

బోసిడి నీరసనీరము, జానుగ క్షీరంబుగొనుట సహజముకాదే. బాల.

క. శ్రీలతపసం ప్రాఁకయి వృష, శైలంబున వెలసి తనదుచాయకెలయు ధ
వ్యాళిపగమాన్చికోర్కులు, చాలంగా నొసఁగుకల్పసాలముఁ గొలుతున్. (బాల)

క. అనయము లలితోక్తులతో, నొనరుపసంగూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణా, బనఁగాలక్షణమొనర్తు నాంధ్రంబునకున్. (బాల)

ఆ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణముగానఁ బూర్వకవుల లక్ష్య
ములను లాఁతిలక్ష్యములఁ గాంచి తక్కుల
క్షణ మెఱింగికొనుఁడు చతురమతులు. (బాల)

బాలవ్యాకరణ మందలి చివరిపద్యము లిదివఱకే స్థలాంతరమున నుదాహరింపఁబడినవి. వీనిని బరిశీలించినవారికి రెంటికి భేదము స్పష్టముగ నగపడలేదా? శబ్దలక్షణ సంగ్రహమందలి పద్యములు కేవల సంస్కృతపదభూయిష్ఠములై కఠినప్రాసములు గలిగి క్లాంతయర్థసందర్భము కూడ సరిపడనివై వీనులకు వెగటుగ నున్నవి. బాలవ్యాకరణ మందలివో చక్కనితెలుఁగు పలుకుల నలరారుచు ముద్దులు మూటగట్టు నడక, ప్రౌఢకల్పనములను గలిగి రసముప్పతిలుచు హృదయంగమములుగా నున్నవి. నీతిచంద్రికలోని పద్యములం గూడఁ జూచినచో సూరిగారి కవితాశైలి స్పష్టముగనే తెలియును.

ఉ. శ్రీయనుమించు మించొలయ సేవకచాతకలోకమోచనం
ఛాయకుఁదై యుదారకరుణారసవృష్టి దురాపతాపముల్
వాయఁగఁ జేయుచు న్సకలవాంఛితసస్యము లుల్లసిల్లఁగాఁ
జేయుచు వేంకటాద్రిని వసించుఘనుం డిడుఁగాత భద్రముల్.

క. కరుణ తెలుంగున హరియెద, నిరవుకొని యఘాళి నోరయనీక యతని చే
నిరతము సంశ్రితజనులం, బరిరక్షింపించుతల్లి భజియింతు మదిన్.

చ. వనజభవాండభాండములవారిగ నెవ్వని తుందకందరం
బున నొకమేల నింటరముఁ బొందక పొందుగ నిల్చునమ్మహా
త్మ్యుని నిజభోగశయ్యనిడి పొత్తులకందువ నట్లు లాలనం
బొనరుచు నయ్యనంతుమహిమోన్నతుసన్నుతియింతు నిచ్చలున్.

గీ. నీతి లేనివాని నిందింత్రు లోకులు, లేదు సేగి లాఁతి లేకయున్నఁ
గానమానవుండు పూనిక నయవిద్య, గడనసేయు మొదలఁ గడఁగవలయు.

క. పసువంబు కలిమి దొరతన, మరయమి యనునట్టి వీనియం దొకఁ డొకఁడే
పొరయించు ననర్థము నాఁ, బరఁగిన చో నాల్గు చెప్పవలయునె చెప్పుమా.

క. పలుసందియములఁ దొలఁచును, వెలయించు నగోచరార్థవిజ్ఞానము లో
కులకక్షి శాస్త్ర మయ్యది, యలవడ దెవ్వ'కి వాఁడె యంధుఁడు జగతిన్.

చిత్తగించితిరా సూరిగారికవిత- బాలవ్యాకరణనీతిచంద్రికలందలి పద్యముల శైలిలో నేమాత్రమును భేద మగపడ లేదు. శబ్దలక్షణసంగ్రహ పద్యముల శైలికన్ననో వీనితోఁ బోలికయే లేదు.

కొందఱు కవులు తమప్రబంధములందు, ఉత్తరాశ్వాసాది పద్యమందలి కథాంశము ననుసరించి యందలి ప్రధానపదములు యద్విభక్త్యంతములో తద్విభక్త్యంతపదకలితములుగానే పూర్వాశ్వాసాంతపద్యములను ఆశ్వాసాదిని కృతిపతిసంబోధనపద్యములును రచించుట యొకనియమముగా నేర్పఱిచికొనిరి. ఈనియమము ననుసరించినవారు నన్నెచోడఁడు తిక్కనసోమయాజి పింగళిసూరన కేతన విన్నకోట పెద్దన మొదలగువారు కొలఁదిమంది మాత్రమే కలరు. కాని యనేకు లీ మార్గము నవలంబింప లేదు. ఈ నియమ మేలక్షణగ్రంథమందును చెప్పఁబడినట్లు గానరాదు. అయిన నీశబ్దలక్షణసంగ్రహమున దానికై యొకసూత్రము నిర్మింపఁబడినది.

"సరూపవిభక్తికనాయకవిశేషణంబులతోడ నాశ్వాసాంతంబునందును విూఁదం దదాదిని విశేష్యాంతంబులతోడను మంగళం బార్యు లభివర్ణింతురు (ప్రకీర్ణక. ౧౫౦సూ)

ఈసూత్రము ననుసరించియే యిందలి ప్రతిపరిచ్ఛేదాదిని గలపద్యములందు విభక్తులు మార్పఁబడినవి. కాని వానికి వేనితోను సమన్వయము లేదు. సరిగదా వెక్కిరించినట్లుగూడ నగపడుచున్నవి. ప్రబంధములందు విభక్తులమార్పు కథాంశముతోఁ బొత్తుగలిసి హృద్యముగా నుండును. ఈ శబ్దలక్షణసంగ్రహమం దన్ననో కథ లేదు. కృతిపతి లేఁడు. అవధారణ మవసరమే లేదు. ఇంక నీమార్పెందునకో తెలియదు. మఱియొక విశేషము. సూరిగారు వైష్ణవమతస్థులు చాత్తనితెగలోనివారు. వారు వైష్ణవమత సంప్రదాయానుసారముగా గ్రంథాది నిష్టదేవతాప్రార్థనము గావించి యు

నారు. బాలవ్యాకరణమందుఁ గేవలము వేంకటేశ్వరస్వామి నొక్కనిని మాత్రమే స్తుతించియున్నారు. నీతిచంద్రికాదిని గూడ వేంకటేశ్వరుని గేవల మొకపద్యముతో స్తుతించి పిదప లక్ష్మిని అనంతుని బూర్వకవులను స్తుతించియున్నారు. వైష్ణవమతమువారెల్ల శ్రీనారాయణదేవుని ప్రధానముగాను, లక్ష్మీదేవిని అప్రధానముగాను వర్ణింతురు. కాని లక్ష్మిని ప్రధానము గావింపరు. ఇది యామత సాంప్రదాయము. శబ్దలక్షణసంగ్రహమందు దానికి విరుద్ధముగా మంగావేంకటేశ్వరు లని సంస్కృతశ్లోకముతో జంటగా ప్రధానముగా నుతింపఁబడిరి. కావున నీశ్లోకము సూరిగారిది కానేరదు. ఇంకను దృతీయపరిచ్ఛేదాదిపద్యమందు "నాగాధిపశాయి కంజనాధరపతికిన్", అని కలదు. అంజనపర్వతము గాని అంజనాపర్వతముగాదు. సూరిగా రిట్లు గణము కొఱకు తప్పులాడువారు గారు గదా?

ఆర్యులారా యీవ్రాసిన దానివలన శబ్దలక్షణసంగ్రహమందలి పద్యములు సూరిగారు రచించినవి కావని తేలినదిగదా? ఇఁక సూత్రములు గూడ సూరిగారివి కావని ఋజువుచేయుటకుఁ బ్రయత్నింతును. హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును. సంజ్ఞా 14. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు సంజ్ఞ 15. ఇవి బాలవ్యాకరణమందలి సూత్రములు. ఖండంబునకుఁ బూర్ణంబగు. సంజ్ఞ 28. అంతటదీర్ఘంబునకుఁగాదు. సంజ్ఞ 29. ఇవి శబ్దలక్షణసంగ్రహమందలివి. బాలవ్యాకరణము సూత్రమందు హ్రస్వంబుమీఁదియను విశేషణము శబ్దలక్షణసంగ్రహమందు లేదు. బాలవ్యాకరణమందు దీర్ఘముమీఁది సాధ్యపూర్ణము నిషేధింపఁబడఁగా శబ్దలక్షణసంగ్రహమందు బిందుసామాన్యము నిషేధింపఁబడినది. ఆసూత్రమందలి "అంతట", శబ్దమున కవసరము గాన్పింపదు. "రా ననం బరంబగుచోనని యెఱుంగునది." శబ్ద. సంజ్ఞ ౩౮.

ఈసూత్రము కేవల సంఖ్యాపూరకమే. సూత్రములందు "రాన్, అన్నను "పరం బగుచో", అన్నను సమానమే. సమానార్థకపదములందు లాఘవగౌరవవిచారణ మవసరము లే దని వైయాకరణసమయము, కావుననే బాలవ్యాకరణమందు స్పష్టప్రతిపత్త్యై బహుళముగ పరంబగు ననుపదమే ప్రయోగింపఁబడినది.

అనాదివిభక్తిచువర్ణములందు బహుళంబు శబ్ద. సంధి ౨ సూ.

ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగును. బా సంధి. సూ ౨.

బాలవ్యాకరణమందు శత్రర్థచువర్ణ మని విస్పష్టముగాఁ జెప్పఁబడి "నగిం చటుగాక చెప్పినన్," ఇత్యాదిస్థలములందలి చువర్ణకసంధి నిరసింపఁబడినది. శబ్దలక్షణసంగ్రహమం దన్ననో యాప్రయోగము గూడ సాధింపఁబడినది. ఈసూత్రమందలి బహుళగ్రహణమున కర్థమేమో?

కవివ్యవహారసిద్ధంబు గ్రామ్యంబు. శ. సంధి ౪౧.

అదోషంబున కప్రయోగదోషంబు లే దని యార్యులు వక్కాణింత్రు. శ, సంజ్ఞ. సూ ౪౨.

ఈసూత్రద్వయము గ్రామ్యపదగ్రహణమును జెప్పుచున్నది. ఆర్యవ్యవహారసిద్ధంబు గ్రామ్యం బన్నంతనే దాని కప్రయోగదోషంబు తొలంగిపోఁగా ద్వితీయసూత్రమునకు ఫలమేమో తెలియదు. ఇదియు సంఖ్యాపూర్తికే.

బాలవ్యాకరణమున అనుకరణమునందు నమశ్శబ్దము నత్వమున కోత్వము విభాషగా విధింపఁబడియుండ దీనియందు నిత్యముగానే విధింపఁబడినది. దీనివలన "తుభ్యంనమ" యను ప్రయోగము సాధ్యముకామి నిది సూరివిరుద్ధముగ నున్నది. బాలవ్యాకరణమందుఁ బేహాదుల కాలుశబ్దంబు పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు నని సూత్రింపఁబడియుండ దీనియందు నిత్యంబుగనగునని వ్యర్థముయిన నిత్యపదమధికముచేర్పఁబడినది. కర్మధారయపదము విడువఁబడినది.

భయముపడు భయపడు భయంపడు నిత్యాదిప్రయోగసాధనమునకై "పడ్వాదులు పరంబులగునప్పుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు"నని సూత్రింపఁబడఁగా దీనియందు పత్తిక్రియార్థంబులురా మువర్ణకంబునకు మాఱు నెఱబిందువును విభాషనగు," అని సూత్రింపఁబడినది. బాలవ్యాకరణమున పడ్వాదు లని గణముగఁ జెప్పి సూత్రపట్టిన "ఇత్యాదిప్రయోగములు సాధింపఁబడినవి. శబ్దలక్షణసంగ్రహమం దట్టిప్రయోగసాధనము లేదు. బాలవ్యాకరణమున కర్తృవాచిమువర్ణకంబునకు లోపబిందునిషేధము గావింపఁబడి గజముపడియె నిత్యాదిస్థలములందు గజపడియె నిత్యాద్యనిష్టరూపములు వారింపఁబడినవి. దీనియం దవి లేవు. పడ్వాదులెల్ల

పత్త్రికిచ్చూర్థంబు లని యర్థముచెప్ప వలనుగాదు గదా? బహువచన నామ ర్థ్యమునంజేసి పత్త్రీత్యాదులు గ్రాహ్యము లందురా యాక్లేశము వీడి పద్యా దులని సూత్రించుటయే సమంజసము.

„నిమాల ద్వితీయ. కి కు యొక్క లోపల షష్ఠీఇత్యాది సూత్రములు

బాలవ్యాకరణమున కత్యంతవిరుద్ధముగ నున్నవి. బాల వ్యాకరణము నందు ద్వితీయావిభక్తి ప్రత్యయముగాను వర్ణకమును మాత్రమే విధించి దానికిఁ గొన్నిస్థలములందికారాంతాదేశమును బహుత్వమున లడాగమమును విధింపఁబడినది. కువర్ణకము విషయమునఁగూడ నట్లే. దీనియందో ని, కు, ల, అనుమూఁడు ప్రత్యయములు ననికముగా నంగీకరింపఁబడినవి.

„క్లీబలింగకంబులు మిత్రాదులు పుంలింగతుల్యంబు లౌంత నగు" శబ్దలక్షణసంగ్రహము.

ఈసూత్రవిషయమున బాలవ్యాకరణమందు మహాద్వాచకపదము చేర్పఁబడి, సింగంబుమిత్రుండు జంబుకంబు ఇత్యాదిరూపంబులు వారింపఁ బడినవి. దీనియం దావిశేషణము లేమిచే ననిష్టరూపాపత్తి దుర్వారమే. దానిని వారింపనేకాపలయు „కొన్నియెడలం దడఁబాటుం జూపడియెడి" నని మఱియొకసూత్రము కల్పింపఁబడినది.

„బిందువున కచ్చురా మకారం బగు" శ. ప్ర. ౨౧ సూ.

ఈ సూత్రము భాషావిరుద్ధముగా నున్నది. సంస్కృతమునందుఁగాని ఆచ్ఛికమునందుఁగాని ముందుండునవి నకారమకారములును వానికిఁ గాల క్రమమున సంభవించిన మార్పుబిందువులనియు లాక్షణికుల కెల్లఁ దెలిసినది. నకారముగాని మకారముగాని హల్లునకు బూర్వమున్ననే బిందువు లగును గాని అచ్చు పర మగునపుడు గావు. అచ్చు పర మగునపుడు బిందుస్థితియే యుండ నపు డీసూత్రము వ్యర్థముగాదా? ప్రథమావిభక్తి ప్రథమమునఁ బూర్ణబిందుపూర్వక బువర్ణముగాను దరువాత నుచ్చారణావశమున మకార ద్వయసంయోగముగాను పిదప నేకమకారముగాను దరువాత బిందువు గాను మాఱినదని పరిశోధకులమతము. ఇది యాంధ్రమున స్వాభావికపరి ణామము. సంస్కృతమునఁ గూడ నిట్లే యించుమించుగఁ బరిణమించును. దీనింబట్టి చూడ నీసూత్రము లోకవిరుద్ధమని తేలలేదా?

కావుననే యిందలిసూత్రములు గూడ సూరిగారిచే రచింపఁబడలే వని నేను దలంచుచున్నాఁడను.

కొందఱు శబ్దలక్షణసంగ్రహమును సూరిగారే రచించిరనియుఁ దరువాత బాలవ్యాకరణము రచించువేళకుఁ దమపూర్వకృతియందలి దోషముల సవరించిరనియుఁ జెప్పుచున్నారు. కానియిది యుక్తిసహము గానేరదు. బాలవ్యాకరణరచనాసమయమునకుఁ దమకుఁదోఁచిన విశేషాంశములున్న వానిని జేర్చి పూర్వగ్రంథమే సవరించి నిర్దుష్టముచేయక పూర్వకృతినట్లే లోపములతోనుంచి క్రొత్తసూత్రముల మరల రచింతురా? యని యాలోచింపవలసి యున్నది.

ఎంత యాలోచించిన నీగ్రంథము మాత్రము సూరిగారికృతి యని నమ్ముటకు నామన మంగీకరింపకున్నది. నాకుఁ దోఁచిన మంచినో చెడునో సహృదయులయెదుట విన్నవించికొన్నాఁడను. పైని సిద్ధాంతముఁ దేల్చుటకు సహృదయులే సదయహృదయు లగుదురుగాక.

---

## షోడశరాజకుమారచరిత్ర

ఈపేర నొక్క తాళపత్రగ్రంథ మొకటి కలదు. దీనిని వెన్నెలకంటి యన్నయసూరనార్యుని కుమారుఁడు, అన్నయ్యాకవి రచించి తన తండ్రికే యంకితము గావించెను. ఇది యేడాశ్వాసముల గ్రంథమైనట్లు సప్తమాశ్వాసము చివరనున్న

క. ఈకథలు వ్రాయఁ జదివిన, నాకర్ణన మొనరఁజేయ నాయువుశ్రీయుం
జేకుఱఁగ సుఖింతురును, శ్లోకుల ...

అను నసంపూర్ణపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. మొదటి నాలుగాశ్వాసములు లేవు. పంచమ షష్ఠ సప్తమాశ్వాసములు మాత్రమేకలవు. 209 వ పుట మొదలుకొని యున్నది. మొదటి 208 పుటలు గ్రంథముకనఁబడదు. ఈమూఁడాశ్వాసములు 50 పుటలలో నిమిడినవి. మొదటినాలుగాశ్వాసములును 208 పుట లుండునా, లేక మొదట రెండవగ్రంథమేదైనఁ జేరియుండునా తెలియదు. గ్రంథపాతములు గలవు. కొన్నిపత్రములు విఱిగినవి. ప్రయత్నించినంతవఱకు రెండవప్రతి యెక్కడను గనఁబడలేదు. కవులచరిత్రములో నీగ్రంథములేదు. దశకుమారచరిత్రమువలె నిదియు నొకరాజకుమారుని వెదకుచు షోడశకుమారులలోఁ గొందఱు వెడలుట- వారి వారి మార్గములలోని వింతలు- వివేకనిధి ప్రభాకరుఁడు, దృఢముష్టి, దీర్ఘబాహుఁడు ననువారికథలిందున్నవి. గ్రంథనామ మెక్కడో షోడశకుమారచరితమనియునుగలదు. వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణముఁ దెనిఁగించిన

యతఁడొకఁడు గలఁడు. అతడు అమరమంత్రి కుమారుఁడు. ఈయన్నయ మంత్రి కుమారుఁడు సూరన్న యెవ్వరో తెలిసికొనవలెను. గోత్రము సూత్రము సరిపోవుచున్నవి.

శా. ఆపస్తంబపవిత్రసూత్రహారిత ఖ్యాతాన్వవాయామృతా కూ
పారామరభూజ...వ్యాపారావత షట్సహస్రకులచూడాకల్పరత్నాంకురా.

అను పద్యముంబట్టి యీకవి షట్సహస్రశాఖలోని వాఁడగుచున్నాఁడు. విష్ణుపురాణముం దెనిఁగించిన వెన్నెలకంటి సూరన్నకవి నియోగి యని వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రములోఁ దెల్పిరి. షట్సహస్రమువారు ఆఱువేలనియోగులు నేకశాఖీయులు గారను వాదము కలదు.

పాఠకమహాశయులు పైవిషయములను మూలగ్రంథమును బరిశీలించి తెల్పుదురుగాక యని కోరుచున్నాఁడను. ఇందలి కొన్నిపద్యములు:—

మ. వనితాచంగుఁడ దీనికంపునకు నోర్వంజాలఁ జేఁబట్ట నే
నని యందొక్కఁడు వల్కె నొక్కరుఁడు శయ్యాచంగుఁడన్ దీని పై
ఘనదుర్గంధము నుస్సహంబనుచు పోఁకంబాసె నొక్కండు భో
జనచంగుండను దీని ముట్టనని యిచ్చన్ రోసె భూమీశ్వరా. 5 ఆశ్వా

ఉ. తామరచూలి నెమ్మొగముదామరలన్నను నంచలేమ నె
త్తామరపూవుకోడ లెలదామరవిందుల కొమ్మఁబోలి వెల్
దామర వన్నియన్నెఱయు తల్లి యొకప్పుడు నీతలంపుగ్రొ
త్తామరలోన నెమ్మొగముదామర నింపుగనుండుఁ గావుతన్. 6 ఆశ్వా

చ. ఎదురుగవచ్చి కాంచుధరణీశుల రాజ్యములిచ్చి నిల్పుచు
న్మదమున మాఱుకొన్న నృపమండలి నింద్రునిపీటి కన్పుచుం
బదవులుమార్చి దుర్నృపుల బంధనశాలలఁ బెట్టఁబంచుచు
న్విదితబలాఢ్యుఁ డానృపుఁడు విశ్రుతలీలల వ్రాలుచున్నడన్. 7 ఆశ్వా

శా. భూతప్రేతపిశాచరాక్షసగణస్ఫూర్తిన్ జనశ్రేణికిన్
భీతిం బర్వఁగఁ జేయు నన్నెలవునన్ భీమాంధకారంబునన్
వీతాతంకత నీవు ద్రిమ్మరుటకున్ డెందంబున న్మెచ్చి సం
ప్రీతింబొందితి వేఁడు మిప్పుడు మనోభీష్టంబులన్నావుకున్. 7 ఆశ్వా

ఈతాళపత్త్రగ్రంథమును, ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున కిచ్చుచున్నాఁడను. కావున దీనిని గుఱించి వ్రాయఁదలఁచువారు పరిషత్తునకు వ్రాయఁగోరెదను.

దుగ్గిరాల [illegible]సూర్యప్రకాశరావు.

# సూత్రసమన్వయము:

కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి.

ఆంధ్రశబ్దచింతామణియందలి "వాయిరవు ర్వక్రతమా" అను సూత్రము సమన్వయమున నహోబలపతిమూలముగ సంశయ ముదయించెను. కావుననే వసుచరిత్రవ్యాఖ్యాత యగుసోమకవి 'ర్వల' యతిసాంకర్యమున 'రాయంచ కాళ్లఁ దాలకయున్నె' యనుపద్యపాదమునందలి 'తౌంకికప్ర'ము గూడ మసాధు వనియెను. వక్రతమాదేశవిధి యొందును లేదని ఖండించెను. కాని 'జొంగడా' అనుష్ఠలము నెట్లు సూత్రపఱుచునో యెఱుంగను.

పైసూత్రమున కర్థము సేయుటలోఁ బూర్వులు చాలమంది సంశయింపక యేకాభిప్రాయులై యుండిరి. వారంద ఱేకాభిప్రాయులై యుండుటకు నైకమత్యసమవాప్తికి సంతసింతునే కాని యేల యేకాభిప్రాయులైరియను సంశయము తీర్పమిని వగతును. పండితు లందఱుఁ గుక్కను గో వని యన్న నందఱును నిఁక వెనుక తాళము వేయవలసినదియే యానా? పండితుండే యగుచో గో వని యనుట పొసఁగ దని యందుమేని సర్వజ్ఞుఁ డెవఁడు? గోవును శునకమును బోల్కిని రూపించుటయందుమాత్రము భ్రాంతిపడవచ్చును. ఇతరవిషయముల నఖండుఁడే కావచ్చును. ధీమంతులకుఁ బ్రమాదము క్వాచిత్కమని యెఱుఁగుదుము కదా.? శ్రీ కొండముది నరసింహముగారు ఇందఱేకాభిప్రాయముఁ గలవారై యుండిరి—అను వాక్యము వ్రాసిరి. కావున నిఁక భిన్నాభిప్రాయము వలదని యందురా? ఇదేటిమాట. వారియందఱి యేకాభిప్రాయత సూత్రవ్యాఖ్యానమునఁగదా? ఇది స్థాని యాదేశ మిది యని వారు చెప్పుటకు దేని నాధారపఱుచుకొనిరో దాని నెఱిఁగి పిదప నైకమత్యమును బ్రదర్శింపవచ్చును. 'వాయిరవు ర్వక్రతమా' అని యుండఁగా 'వక్రతమములకు' షష్ఠ్యర్థముగ నొకదానిఁ జెప్పుటకుఁ గారణ మేమి? అది మనకు ముఖ్యము కాని యందఱు నొక్కదారినే త్రొక్కిరా లేదా? అను విచారము ముఖ్యముగాదు. వారెవ్వరును గారణము సూపలేదు కావున వారిత్రొక్కినది ధారియనఁబడదు. వారినైకమత్యమునకుఁ గారణ ముండవచ్చును. మనకుఁ దెలియ దని యందుమా? మంచిది. తెలియదు కావుననే దెలిసికొనునుపాయమే మా ప్రయత్నము. మాయనేకత.

అహోబలపతి 'వాయిరవు ర్వక్రతమా' అనుసూత్రమునకు వ్యాఖ్య

వ్రాయుచు వికృతిశబ్దేషు యఐత్ ,ఔచ్చ,తయో ర్వా అయి, అవు, ఇత్యే తా వాదేశౌ స్తః-అని నిర్వచించెను. ఐఔ ఇత్యేతయోః, అని యనుటకుఁ ప్రమాణ మేమి ? అయి, అవు ఇత్యేతయో, అని యేల యనరాదు ? ఎ ట్లనుట కైనఁ గారణ మేమి ? ఇది సంశయాస్పదము.

అట్లగుట శ్రీవిద్వాన్ వేంకటరమణశాస్త్రిగారు భారతిలో (౨ సంపు-౬సంచి) విమర్శించిరి. శ్రీకొండముది నరసింహముగారును శ్రీ జి. జోగిసోమయాజిగారు బి.ఎ.యల్.టి. గారును విమర్శించిరి. చాల శ్లాఘ్యములుగ నున్నవి.

నాయభిప్రాయమును బ్రకటింపఁదలఁచితిని. మూఁడేండ్లకు ముందుగ నే నీసూత్రసమన్వయము విమర్శ్యమని పండితులకు నివేదించితిని. నాఁటినుం డియు నప్పు డప్పు డిట్టివిషయములఁ జర్చింపఁ గడంగితిని. ఆంధ్రవ్యాకరణ పారరహస్య మను గ్రంథమును వ్రాయుచుండితిని. ప్రసక్తమగుట నిప్పుడేదీని విమర్శింపఁదలఁతును. స్థాన్యాదేశములఁ గూర్చి సంశయము ముదితమయ్యెను.

స్థానినిర్ణయ మెవ రెట్లు చేసిరి? అహోబలపతి యప్పకవి మొదల గువారు ఐఔలను స్థాను లనిరి. కారణము చూపలేదు. ఇఁక వారి నేమన్న ను లాభములేదు. వేంకటరమణశాస్త్రిగారు నిర్ణయించి కారణమును జూపిరి వారివాద ముపాదేయ మగునేని గ్రహింతము. అయి, అవు, లే స్థాను లని యు ఐ,ఔ,లే యాదేశము లనియు నన్నయ యభిప్రాయమై యుండు నని తోఁచుచున్నది-అని నిర్ణయించి కారణమును జూపిరి. అగుట, అవుట, ఔట అనురూపముల నరసినఁ దెలియు నని యనిరి. అవుట, ఔట యయ్యె నం దమా? ఔట, అవుట, యయ్యె నందమా? అగు జనితరూపములఁ గొ న్నింటి 'కా'యాదేశముగ వచ్చుట కొ వర్ణసవర్ణీయ గ వర్ణము అగు ధాతు వునఁ గల దనియు అవు గ గకారోఽవః అను విధిచే నగు ననియు నెఱుంగ ఔట తరువాతిరూప మనియే చెప్పఁదగును.

శ్రీశాస్త్రిగారుచూపినకారణము యుక్తిసహముగనున్నను శ్రీకొండముది నరసింహముగారు అగు ధాతువు ప్రత్యేకరూపముగా నేలయుండఁగూడదు? అనిప్రశ్నించిరి. ఈప్రశ్నములో వారియభిప్రాయ మగు నవ్వులు భిన్నధాతువు లనునభిప్రాయ మున్నట్లు తోఁపదు కాని ,,చూతామని వాదాని కల్లాఁపున్నారు పాఁబోలు" శ్రీనరసింహముగారికి ప్రత్యుత్తర మిచ్చునపు శ్రీసోమయాజిగారు

చిన్నయసూరిగారి వ్యాకరణముప్రకారము అగుచు, అవుచు, ఔచు, రూపములను జూపిరి. అవి సరియైన ప్రత్యుత్తరము కావు. చిన్నయసూరిగారి వ్యాకరణమును జదువకయే విమర్శనమునకు దిగుదురా? శ్రీనరసింహము గారికిఁ జిన్నయసూరిగారివ్యాకరణము తెలియును. చింతామణిప్రకారము "అగు"ను స్థిరపఱచి కాదేశమును బ్రదర్శింపకున్న శ్రీనరసింహముగారి అప్ర వాదమపాస్తము గానేరదు. దాని నెఱింగి వారట్లనిరి. ఇఁక గతి యేమి? చింతామణి సూత్రసమన్వయమునకుఁ జిన్నయసూరిగారిఁ బ్రమాణముగాఁ దీసి కొనుట యసంబద్ధము. యతిసంబంధ మున్న నుండవచ్చును. ఇఁక అగు-అవు, ల విచారింతము-

అగువాదమునకు రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు పాత్రము. అయినను నాతోఁచినదాని నిట వ్రాయుదును. ధాతువు లాంధ్రమున వింతగ నున్నవి, ఆంధ్రధాతువులు వేదభాషాధాతువులును జాలసమీపములు. దీనిఁ గొంచెముగ ఋజువుపఱుచుచు 'త్రిలింగరంగము'నువ్యాసములోఁ జూపితిని. ఆవ్యాసము మనయాంధ్రపత్రికాసంపాదకుల చిత్తుబుట్టలో నుండవచ్చు నైనను దిరిగి యింకొక వ్యాసము వ్రాసి కళింగసంచికకు-రాజమహేంద్రవరము పంపితిని. అం దరయవచ్చును. అది యప్రకృతప్రసంగము క్షమింపుఁడు- అగుధాతువు నవుధాతువును భిన్నములా యని సంశయింప నివారించునుపాయము భాషకే కలదు. చింతామణి యీవిషయమున నేమియు ననలేదు. భారతాదిగ్రంథము లరయ రెండురూపములును గలయట్లు తెలియుదుము. భార-౨ఆశ్వా-౧౩౭పద్యమున "అవు నని" ప్రాసస్థలమున గలదు. మఱియు "అగు" ఆది ౧ఆశ్వా ౪౭,పద్యమునఁ గలదు. ఇంకను గలవు. ఇది చాలు. అగు,అవు, లు రెండురూపములును గలవని చెప్పవచ్చును. 'కా'దేశము గలదు కాని "యగు" నకే యననేల "అవు"నకుఁ గాఁ గూడదా? గ,క,లసంబంధము యాదృచ్ఛికముగ నిటఁ గలదని వాదబలమును జూపవలదు. భాషాసాంప్రదాయ మరయవలయును. సంస్కృతవ్యామోహమున (మాధ్యమికము) నాంధ్రసాంప్రదాయము విడువరాదు. వచ్చు, ధాతువునకు "రా"ఆదేశ మగుట యేసంబంధము? ఇట్లే "అండు"నకు లే" తెచ్చులోని 'చు'వర్ణమునకు 'గ' యు నింకొక చక్కి 'వ'యు 'ప'యు నెట్లు వచ్చును? ఇట్లెన్నియైన వ్రాయవచ్చును వైధాతువులకుఁ బదాదేశములకు

న్నసంబంధముండనక్కఱ లేకపోయెనో యట్లే అప్పు–వాల సంబంధము
క్కఱలేదు. ఏదియో సంబంధము దొరకె నని సంకెలు గొట్టినను దొరక
లేదని బింకము ఉంచినను లాభము సున్న. ఆంధ్రాసునకు నాంధ్రులకు బాం
ధవ్యము గల్పించినట్లే యగును. అను+అన్=నాన్, అయినట్లు "అగు+
అన్=గాన్,కాన్, అయినవి యని శ్రవణాభిరామముగ నాపాతమధురముగ
నుపన్యసింపవచ్చుఁ గాని భాషాసాంప్రదాయ మా బాంధవ్యముపై నిష్టమును
జూపదు. స్వార్థకమైన 'ఇ'వర్ణకము చేర్ప భాషాసాంప్రదాయము తెలియ
బడును- ముత్తు పరమగునప్పుడు మఱి గొన్ని సమయముల ధాతువు వికార
మును బొందుట గలదు కాని 'ఇ'కారము పరమగునప్పు డేవికారమును బొం
దదు. పొందిన క్రమము సాంప్రదాయము గలదు. తెలియు, వ్రాయు,
చేయు, ఇత్యాదిధాతువులకు 'ఇ'కారము చేర్ప 'సి' సమాసముగ నగును.
య్యంతము లికారపదునకంబుగ సాంతి ముగు నని సాంప్రదాయము తేలును.
అట్లే, పోవు, అవు, (అగు) ఇత్యాదిధాతువులకు 'ఇ'కారము పరమగుచో
'వు' న కాదేశము 'య' వచ్చును. పోయి, అయి, అగును. కావున 'అవు'
అనియే మొదటిరూప మని సాంప్రదాయ మూలముగఁ దెలిసికొనుచున్నా
ము. 'అగు' ప్రత్యేకముగ నున్నది యగుచో 'తగు+ఇ=తగి, యైనట్లు
'అగు+ఇ=అగి'అని సిద్ధము కావలసివచ్చును. అకారాది ద్వ్యక్షరమాత్ర
ధాతువుల సాంప్రదాయము వేఱందురా? పొసఁగదు. అఱు–అఱి,అను–అని
ఇత్యాదులు గలవు. అంతబలమూ లేదు. సంప్రదాయౌచిత్యమూ లేదు.
ఇఁక 'అగు' మొదటి దనరాదు. అవు అనునదియే ధాతురూప మని తేలు
చున్నది. అవు, అవఁగ మాటె ననుశాస్త్రీయవాద మీవాదమునే బలపఱు
చుచున్నది. 'అగ' రూపాంతరము లేదు. శేషయ్యవ్యాకరణమున 'అవు' అని
యే రూపమును జూపినట్లు జ్ఞాపక మగుచున్నది. నరసింహముగా రన్నట్లు
'అగు' ప్రత్యేకమును గానేరదు. సోమయాజిగా రన్నట్లు 'అగు' మొదటిది
కాదు. శాస్త్రిగా రన్నట్లు 'అగు' అవు అగుటయుఁ గాదు. అవు మొదటి
రూప మని చెప్పనొప్పగును.

అట్లుచో 'అగు'రూపము సిద్ధమగుట యెట్లు? 'గకారాగోవత' అనుసూ
త్రము ప్రకారమే వ్యాపకమైన 'వ'ఆదేశము కాని 'గ'ఆదేశము గావరాదు. గ
[illegible]

తవ' ఇత్యాదుల సిద్ధము లగును. గకారఘటితరూపములే తొంటివిగ నుండి వాదేశగతరూపములు గ నున్న యెన్నో శబ్దము లగతికము లగును. ఇఁక నన్వయమెట్లు? దీనినిగూడ సమన్వయింపవలయును. వీని నిట్లుంచి సూత్ర స్థానము నరసి విమర్శింతము.

ఈసూత్రము "అజంతప్రకరణము"న నున్నది. "డుముపులవః ప్రథమాస్యాత్" అనుసూత్రమునుండియు నంతట శబ్దములయుఁ దదంతములయు రూపములఁ జర్చించి యీమధ్యమున గండోళిగానివలె నీసూత్రమునకుఁ బ్రవేశ మెట్లయ్యెనో యని సంశయ మగును. వాయీాత్యాదిసూత్రముదాఁక నన్నియు నంతవిధులు శబ్దవిధులు నై యుండ నీసూత్ర మారెండింటిని విడిచి మూఁడవదారి త్రొక్కినది. ప్రవేశ మిట్లున్నది.

ఇఁక విధానక్రమము చూతమా యన్న మఱియు నెంతయు నచ్చెరువగు చున్నది. అన్నియున్ను స్థాన్యాదేశములఁ దెలుపువిభక్తివిభేదములతో నుండ నిదిమాత్ర మాక్రమమును దప్పించినది. విధాయకపటుత యిట్లున్నది

ఇన్నిసంశయములకుఁ దావై యున్న వాయిసూత్రము సమన్వయము గామికి వింతయేల?

ఈసూత్రము సమపాఠముగ నున్నదా భిన్నపాఠముగ నున్నదా యని చూడ నదియు వింతగనే యున్నది. వాయిరవు ర్వక్రతమా, అయి గవు గాదేశో స్తః. . . —,వా య్యవ్వావక్రతమా, అని మూఁడువిధములుగ నున్నట్లు తెలియుచున్నది. అయిగవుక్కులను మాత్రము మఱియెవ్వరును సమ్మతింపలేదు. పాఠాంతరములలో నేది గ్రాహ్యమో? అదియుఁ దేలవలయును.

ఇన్నితికమకలతిక్కగ నున్నయీసూత్రము సన్వయము చేయునప్పుడు గోడమీఁదిపిల్లిగఁ జేసిన నేమిలాభము.

సమన్వయము :—,స్తోవావా రైనావోః, అనుసూత్రమునుండి "ఐ, ఔ" వర్ణము లంతమందుఁ గలశబ్దముల స్మృతి సూత్రకర్తకుఁ గల్గెను. గీర్వాణపదములఁ జెప్పి యిఁక నాంధ్రపదముల విషయమున వచ్చెను. సూత్రమేమని వ్రాయఁగలఁడు. ఐకారాంతపదములు గాని ఔకారాంతపదములు గాని యాంధ్రమున లేవు. అజంతవిధిలో సమాంతము నింకొక్కప్రకరణము ప్రారంభించు టెట్లు? అంతపూర్వవర్ణవిధి చేయఁదగునా? అంతము లేనప్పుడు తత్పూర్వమునకే యవకాశ మని యేల తెలియును? ,వక్రతమా, అని ప్రయో

గించుటచే నీవిధి యాంధ్రవిషయ మనియు 'వర్ణమాత్రకము' గనుంట నం తాభావము వలన సంతిపూర్వవిధి యనియుఁ దెలియవచ్చును. ఔ, ఐ, వర్ణములు తిజంతసుబంతములై యాంతము "ఔ, ఐ,లుగనే యుండరాదా? అని యందమన్నఁ దగును గాని నీప్రకరణమునఁ దిజంతప్రసక్తి లేమిఁ దగదు. ఎక్కడనైన యాలు వచ్చినను (దేశ్యమున్న) అయి, అవు లగునని యర్థము సేయుటయే యెల్లవిధములఁ దగియున్నది. భాషాసాంప్రదాయము నట్లేయు న్నది. ఇఁక స్థానులు "వక్రితమములు" గనే తీసికొనవలయును. వక్రితమశ బ్దమే సమన్వయమునకు నాధారము నుద్దేశము నగుట నవియే స్థాను లనవ లసివచ్చును.

స్థానులు వక్రితమములే యగుచో ,,అవు+ఇ,=ఐ, కావలసివచ్చును దాని కాదేశముగ ,,అయి" వచ్చెనని చెప్పవలసివచ్చును. ఇది సాంప్రదా యవిరుద్ధము. అయిమాత్రము మిగ్లనుటకు నాధారము లేదు. ఇఁకస్థానులై యాలని చెప్పుట యెట్లు?

స్థానులు వానినే చేయఁ దలఁచుచున్న సన్నిసూత్రములలో స్థాని ద్యోత కవిభక్తినిడి యిటమాత్ర మూరకుండనేల అయి, అవు,లు స్థాను లనుటకు నాధారమేమి; ఐన్దునుండి వచ్చిన 'ఏఁదు' మొదలగు శబ్దములు రూపాంతర మును బొందనేరనివి యగును. అయి, అవులుస్థాను లన్నను, ఐ, ఔ, లు స్థానులన్నను జాల ననుపపత్తులు సంభవించుచున్నవి. అదియుఁగాక చింతా మణికర్త యన్నిఁటఁ జూపినస్థాని నిటఁ జూప కేలమానెను! అను ప్రశ్నము రాకమానదు.

పరస్పరస్థానికములుగ నీసూత్ర మన్వయము చేయఁదగునని యే స్థా నినిర్ణయముపక సూత్రించెను. ఇదియే చింతామణికభిప్రేతము కానోపును. ఇదేమి యీ వెలఁగు తెలఁగు? అని యనుటకేని వేఱొక మార్గమున కవకాశ ము లేదు. సమవిభక్తికముగ (ప్రథమావిభక్తి) నుపయోగించుటచే నాచేసిన యన్వయమే యుచితము. ,,తుల్యాస్యప్రయత్నం సవర్ణం" అను సూత్రమును సంజ్ఞావిధి పాణినీయమున నట్లే పరస్పరసవర్ణసంజ్ఞగ నన్వయింతుము. ఇది యొక సాంప్రదాయము. హలంత్యమను నప్పుడు రెండుసూత్రములుగ నర్థము చేయుటలేదా; అట్లే యిక్కడను మఱియు ననివార్య పరిస్థితులను నట్లే చే యవలయును. చింతామణి యర్థము చేసికొనుటకుఁ బరిభాష నెఱుఁగవలయును

నాకడఁ బూర్తిగనున్నది. ప్రకటనచేయఁ దలఁచువారు నాపేరికి వ్రాయఁ బ్రార్థితులు (కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి ఆంధ్రగీర్వాణ పండితుఁడు, బోర్డు హైస్కూలు చంద్రగిరి చిత్తూరుజల్లా)

—: పరిభాషా తాత్పర్యము :—

ఎందెందుఁ బ్రథమావిభక్తి లో స్థానాన్యాదేశభేదరహితముగఁ జెప్పెనో యటఁ బరస్పరస్థానాన్యాదేశము గ్రాహ్యము, విభక్తిసంశయ మున్న విన్యాసక్రమం బశరణ్యంబు.

పరిభాషాప్రకార మిఁక నన్వయించిన నెచ్చటను బాధరాదు. పాఠములలో „వాయ్వ్యఫ్రా వక్రతపా” అనుపాఠమే మాకు గ్రాహ్యము. వా ‚అయి, అవు, ఇత్యేతయోః ‚ఐ' ఔ, ఆదే శౌస్తః, అనియు ‚ఐ' ఔ, ఇత్యేతయోః, అయి, అవు „ఇత్యేతౌ వా అదేశౌస్తః” అనియు నర్థము సేయవలయునుఁ అట్టియన్వయము వచ్చుటకు వా ‚అయి' అవు ఇత్యేతౌ క్రమాత్ ఐ, ఔభవతః అని యర్థము సేయువలయును. అట్లే „క్వచిద్గకారోవః” గకారస్య వకారః క్వచిత్, వకారస్య గకారః క్వచిత్స్యాత్ „వాదమునకు” క్వచి ద్గోవః, అనియుండినచో „గఇత్యస్య” అనియే విన్యాసదృష్టి వ్యాఖ్యానింప వలయును. „రోలః” అనుసూత్రము „రణత్యస్య” అనియే వ్యాఖ్యానింపఁదగును.

ఈ నాయభిప్రాయమును స్థిరపఱచు సామగ్రి యింకను గలదయినను వ్యాసమూలముగ నీమాత్రము చూపినఁ జాలునని యెంచి పండితులయాదరణమునకుఁ బ్రతీక్షించుచున్నాను,

పైఁబేర్కొన్న మువ్వురివాదములలో „శాస్త్రి”గారి వాదము, జోగి సోమయాజిగారి వాదము నొక్కటి నరసింహముగారి వాదము సమగ్రరూపము తాల్పలేదు కాని యది యొకటి యనవచ్చును. ఈ రెండు వాదములలోఁ గొంత సత్యమున్నదనియు నసత్యమున్నదనియుఁ దెలియఁబఱచి నాయభిప్రాయము నెట్లాదరింతురో యని నిరీక్షించుచున్నాను.



నాకడఁ బూర్తిగనున్నది. ప్రకటనచేయఁ దలంచువారు నాపేరికి వ్రాయఁ బ్రార్థితులు (కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి ఆంధ్రగీర్వాణ పండితుఁడు, బోర్డు హైస్కూలు చంద్రగిరి చిత్తూరుజిల్లా)

—: ప రి భా షా తా త్ప ర్య ము :—

ఎందెందుఁ బ్రథమావిభక్తి లోస్థానాన్యాదేశభేదరహితముగఁ జెప్పఁబడునో యటఁ బరస్పరస్థానాన్యాదేశము గ్రాహ్యము, విభక్తిసంశయమున్న విన్యాసక్రమం బశరణ్యంబు.

పరిభాషాప్రకారి మీఁకి నన్వయించిన నెచ్చటను బాధరాదు. పాఠములలో „వాయ్వౌప్రా వక్రతమా" అనుపాఠమే మాకు గ్రాహ్యము. వా ‚అయి, అవు, ఇత్యేతయోః ‚ఐ'ఔ, ఆదేశాస్తః, అనియు ‚ఐ' ఔ, ఇత్యేతయోః, అయి, అవు „ఇత్యేతౌ వా అదేశౌస్తః" అనియు నర్థము సేయవలయునుఁ అట్టియన్వయము వచ్చుటకు వా ‚అయి' అవు ఇత్యేతౌ క్రమాత్ ఐ, ఔభవతః అని యర్థము సేయువలయును. అట్లే „క్వచిద్గకారోవః" గకారస్య వకారః క్వచిత్, వకారస్య గకార' క్వచిత్స్యాత్ „వాదమునకు" క్వచి ద్గోవః, అనియుండినచో „గఇత్యస్య" అనియే విన్యాసదృష్టి వ్యాఖ్యానింప వలయును. „రోలః" అనుసూత్రము „రఇత్యస్య" అనియే వ్యాఖ్యానింపఁదగును.

ఈ నాయభిప్రాయమును స్థిరపఱచు సామగ్రి యింకను గలదయినను వ్యాసమూలముగ నీమాత్రము చూపినఁ జాలునని యెంచి పండితులయాదరణమునకుఁ బ్రతీక్షించుచున్నాను,

పైఁజెప్పఁబడిన మువ్వురివాదములలో „శాస్త్రి"గారి వాదము, జోగి సోమయాజిగారి వాదము నొక్కటి నరసింహముగారి వాదము సమగ్రరూపము తాల్పలేదు కాని యది యొకటి యనవచ్చును. ఈ రెండు వాదములలోఁ గొంత సత్యమున్నదనియు నసత్యమున్నదనియుఁ దెలియఁబఱచి నాయభిప్రాయము నెట్లాదరింతురో యని నిరీక్షించుచున్నాను.



# ఆంధ్రభాషయందలి వింతయక్షరము

(జయంతి రామయ్యపంతులుగారు)

---

ఆకారోచ్చారణములందు డకారమును గొంతవఱకుఁ బోలియుండియు దానికంటె విలక్షణమయిన యక్షర మొకటి పూర్వకాలమం దాంధ్రభాషయం దుండె నని కొంతకాలముక్రిందట కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు పత్రికాముఖమునఁ బ్రకటించినారు. ఆవాదము సరికాదనియు లక్ష్మణరావుగారు వర్ణించిన యక్షరము డకారమే యనియు బ్ర. శ్రీ. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులుగా రొకవ్యాసము ప్రకటించినారు. బ్రహ్మయ్యశాస్త్రులుగారి వాదమును ఖండించి లక్ష్మణరావుగారి వాదమును స్థాపించుచు కానూరి వీరభద్రేశ్వరరావుపంతులుగారు వేఱొకవ్యాసమును బ్రకటించిరి. ఈవాదమును ఖండించి తమవాదమును నిలుపుకొను నుద్దేశముతో శాస్త్రులుగారు తిరిగి యింకొకవ్యాసము ప్రకటించినారు. ఈవాదప్రతివాదములు ద్వియుక్తములయి యుండుటచేత వానిబలాబలముల నిర్ణయించుటకుఁ దగినయాధార మేర్పడి యుండుటచేతను, ఈచర్చకు మూలకారణ మయిన యుద్ధమల్లుని బెజవాడశాసనము తొలుతఁ బ్రకటించినవాఁడను నేనగుటచేతను నీవిషయమయి కొన్నిమాటలు నేను జెప్పఁదలంచినాఁడను.

వివాదాస్పద మగునక్షరము ప్రస్తుతము వాడుకలో లేకపోవుటచేత దానియాకారమును ముద్రించుటకు వీలులేదు. కాని, గర్భమం దడ్డగీఁత లేనిశకటరేఫమును బోలియుండు నని యూహించునది.

ఈడకారము తొలుత యుద్ధమల్లుని బెజవాడశాసనమందు కనిపట్టఁబడినది. ఆశాసనమును నేను పరిషత్పత్రిక(1) యందును Epigraphia Indica యను నాంగ్లేయపత్రికయందును(2) వ్యాఖ్యానసహితముగాఁ బ్రకటించితిని. నే నప్పు డీయక్షరము స్వరూపమును జక్కఁగాఁ బరిశీలింపక స్థూలదృష్టిచేత డకారముగా గ్రహించితిని. Epigraphia Indica సంపాదకుఁడు మాత్రము దానిని ఱకారముగానే గ్రహించి యీయుచ్చారణము గల కర్ణాటద్రావిడాక్షరముల యాంగ్లేయరూపముగా నుపయోగింపఁబడు

---

(1) సంపుటము 6. (2) సంపుటము 15.

స్టి ఴ అను నక్షరముగా వ్యాకరణమందుఁ జూపెను. కావున నీయక్షరముయొక్క వైలక్షణ్యమును మొదటఁ గనుపట్టిన దీపత్రికాసంపాదకుఁడే. అది చూచియే కాఁబోలు లక్ష్మణరావుగారు కొంతకాలమునకు దానిని విలక్షణాక్షరముగా గ్రహింపవలదా యని నాపేర వ్రాసిరి.

అక్షరముపోలిక డకారముకంటె విలక్షణముగా నుండుట నిర్వివాదమనియు, నుచ్చారణముకూడఁ దొలుత విలక్షణముగానే యుండి కాలక్రమమున మాఱియుండు ననియు యుద్ధమల్లుని కాలమునాఁటి కాయుచ్చారణము మాఱినదో లేదో పరిశీలించినఁగాని నిర్ణయింపరా దనియు నేను బ్రత్యుత్తరమిచ్చితిని. ఇటీవల నేనీవిషయమును పరిశీలింపఁగా ఴకారము డకారముకంటెభిన్నాక్షరముగా గ్రహింపక తప్ప దనితోఁచినది. ఈయూహకుఁ గల యుపపత్తుల నీక్రిందఁ జూపుచున్నాఁడను. బ్రహ్మయ్యశాస్త్రులుగారివాదము నామొదటియభిప్రాయమును బలపఱుచుచున్నది; గాని నే నాయభిప్రాయమును మార్చుకొనుటచే శాస్త్రుంగారిసాహాయ్యము నుపయోగపఱుచుకొనలేనివాఁడ నయితిని.

ఈయక్షరము స్వభావ మెట్టిదో ముందుగా విచారింపవలసియున్నది. అరవమందును మలయాళమందును ఈయుచ్చారణ మిప్పుడును గలదు. కన్నడమం దిప్పుడు లేదు గాని పూర్వకావ్యములందును లక్షణగ్రంథములందును గలదు. కిట్టెలు పండితవిరచిత మగుబృహన్నిఘంటువులో నీయక్షరముగల పదము లున్నవి. కన్నడలిపికిని, తెలుఁగులిపికిని అత్యంతసామ్యము కలదు. తెలుఁగులో ఴకారము వాడుకలో నున్నకాలమందునుఁ బిదప మఱి కొంతకాలమువఱకును రెండులిపులు నొక్కటిగానే యుండెను. కావుననే యీలిపికిఁ గొందఱు కర్ణాటాంధ్రలిపి యని పేరు పెట్టిరి. లిపియందేగాక భాషాస్వరూపలక్షణములందును గర్ణాటాంధ్రములకు దగ్గఱసంబంధముకలదు. కాఁబట్టి కర్ణాట సంప్రదాయమును బట్టి తెలుఁగు ఴకారస్వరూపమును నిర్ణయించుట యసమంజసము కాదు.

శబ్దమణిదర్పణకారుఁడు ఱ, ళ, ఴలను కలిపి సూత్రించుచు రేఫము పుట్టినస్థానమందు ఱకారమును, ఴకారస్థానమందు డకారమును, లకారస్థానమందు ళకారమును అధికప్రయత్నముతో నుచ్చరించుటచేతఁ బుట్టినవనియు నివి దేశ్యతద్భవశబ్దములందే వచ్చుననియు వానికిని వానిని బోలి

నలఘ్వక్షరణములకును ప్రాసమందుఁగాని యమకమందుఁగాని (3) మైత్రి లేద నియు శాసించెను.(4) మఱియు గ్రంథములు పరిశోధించి ఱకార ముగల 172 పదములను ఎత్తి వ్రాసెను. దీనిబట్టి డకారఱకారములకుఁ గలసంబంధము లఘ్వలఘుసంబంధ మని తెలుచున్నది. మఱియు ఱకారము వలెఱకారమును తొలుత నాలుగుభాషలలోనుండి కాలక్రమమున ముందుగాఁ దెలుఁగులోను, మఱికొంతకాలమునకు కన్నడములోను అంతరించెననియుఁ దేలుచున్నది. ఈయక్షరము ప్రథమమున యుద్ధమల్లునిశాసనములో కనిపట్టుఁబడినది ఆశాసనములో అఱిసెన, అఱిపుట, ఱస్సి యనుపదములందున్నది. తరువాత జరిగినపరిశీలనములో మఱికొన్ని శాసనములలోఁ గూడ— అనఁగా—మాలెపాడు శిలాశాసనములో చోఱ, ఏఱువేలశబ్దములందును, (5)ద్వితీయచాలుక్యభీముని మచిలీపట్టణపు శాసనమందు వేఱాంబా శబ్దమునందును (6) పండరంగుని యద్దంకిశాసనములో గొఱలిచి శబ్దమందును (7) ప్రొద్దుటూరి రామేశ్వరమందలి పుణ్యకుమారరాజు శాసనములలో చోఱశబ్దమందును (8) అరికటవేములశాసనములో ఱచ్చు (దీనిఱచ్చువాండు పంచమహాపాతకసంయుక్తుండగు) అనుపదమందును(9) కనఁబడినవి. ఇతరశాసనములందుఁగూడ నుండవచ్చును. పూర్వోదాహృతశాసనములన్నియు యుద్ధమల్లునిశాసనముకంటెఁ బూర్వము పుట్టినవే. అన్నిశాసనములందును అక్షర మొక్కపోలికగానే యున్నది ఈయుపపత్తులనన్నింటినిబట్టి చూడఁగా ఱకారము పూర్వకాలమందు తెలుఁగుభాషయందుండి కొంతకాలమున కుచ్చారణముతోఁ గూడ నంతరింపఁగా నంతటినుండియు డకారము దానికి బదులుగా నుపయోగింపఁబడుచున్నట్లు కనుపట్టుచున్నది.

ఈసిద్ధాంతమునకు బ్రహ్మయ్యశాస్త్రులుగారు చెప్పెడి యాక్షేపముల నిఁక విమర్శింపవలసి యున్నది.

(౧) ఆంధ్రభాషలోని లక్ష్యలక్షణగ్రంథములం దీయక్షరము లేదు. ‹‹మనవా రీయక్షరముంగూర్చి ముచ్చటింపకుండుటకుఁ గలకారణ మయ్యెది మనసారస్వతమున నెప్పుడును లేకుండుటయని మనము గ్రహించుకొనవల

(3) కన్నడమందు సవర్ణాక్షరయతిలేదు. (4) సంజ్ఞాపరిచ్ఛేదము 18, 19 పద్యములు. (5) Epigraphia Indica Vol 11. (6) Do. Vol. V. (7) ఈశాసనము శీఘ్రముననే Epigraphia Indica పత్రికలోఁ బ్రకటింపఁబడును. (8) ఇది నాయొద్ద నున్నది. 1384 of 1904 on Govt. Epigraphist. (9) ఇదినాయొద్ద నున్నది

సియున్నది. అంతకుమించిన హేతువేదియును గానరాదు,, అనిమొదటియా క్షేపము. ఈయాక్షేపము సరియయినది కాదు. ఈయక్షరము యుద్ధమల్లుని శాసనమందును, అంతకుముందుఁ బుట్టినశాసనములలోను మాత్రమే కనఁబడుచున్నది. ఆంధ్రభాషలోని శాసనేతరసారస్వత మంతయు యుద్ధమల్లుని కాలమునకుఁ బిదపఁ బుట్టినదే. నన్నయభట్టారకుఁడే యీసారస్వతమునకు మూలకర్త. అతనికాలము నాఁటికే యీయక్షరము తెలుఁగునం దంతరించినది. నన్నయభట్టుగాని, తరువాతికవులుగాని పేర్కొనకుండుటచేత నీయక్షరము నన్నయకుఁ బూర్వము భాషలో లేదనుట సహేతుకవాదముకాదు.

(౨) బహుగ్రంథద్రష్టయు, పరిశోధకుఁడు నగుకాల్డువెల్లు(Caldwell) పండితుఁడు తెలుఁగులో నీయక్షరమిప్పుడు లేదు సరిగదా పూర్వముగూడ నున్నట్లు ప్రమాణములు లేవనివ్రాసెనుగాన నీయక్షరము తెలుఁగులో నెప్పుడును లేదనియే యూహింపవలె నని రెండవవాదము. ఱకారముగల శాసనము లన్నియు నిటీవల బయలుపడినవిగాని కాల్డువెల్లుగారికాలమున వెలువడలేదు. ఆంధ్రలాక్షణికులకే తెలియనియక్షరము కాల్డువెల్లుగారికిఁ దెలియకపోవుట వింతగాదు.

(3) ఒకశబ్దమే కొన్నిశాసనములలో ఱకారసహితముగాను, మఱి కొన్నిశాసనములలో డకారయుక్తముగాను కనఁబడుచున్నది గాన డఱలు రూపభేదములేగాని భిన్నాక్షరములు కావని యింకొకవాదము. ఇదియు సరికాదు. ఱకార మంతరించినపిదప దానికిబదులుగా డకారము వాడఁబడుచు వచ్చినది. శాస్త్రులుగా రుదాహరించిన చోట్ల, కాఱుపశబ్దము లిట్టివే. డకారయుక్తోడశబ్దము గలశక్తివర్మశాసనము యుద్ధమల్లశాసనముపిదపఁ బుట్టినదే. రెండురూపములు నేకకాలమందే వ్యవహారములలో నున్నను బాధలేదు. ఒకయక్షరమునే కొందఱొకవిధముగను మఱికొందఱు మఱియొకవిధముగాను ఉచ్చరించుటయుఁ దమతమయుచ్చారణానుసారముగా వేఱువేఱు విధములుగా వ్రాయుటయు మనకనుభవసిద్ధము. ఇది శాస్త్రులుగారు కూడ నంగీకరించుచున్నారు. ఎట్లన కాఱుపశబ్దమును గూర్చి చర్చించుచు శ్రీ లక్ష్మణరావుగారు కాడప, కాఱప, అను రెండురూపము లున్నవని తెలుపుటతోఁ దృప్తినొందక కాలప, కాళప అనురూపములు కూడ నున్న వని లిఖించిరి. తుది రెండురూపములను నెంచఁ బనిలేదు. ఏమన, సాధారణముగా

డకారమె లకారళకారము లగుచుండును,' మఱియును లళలు డ యగుచుండును'' అని వ్రాసినారు. డకారము లకారళకారములుగను లళలు డకారముగను మాఱును, కాఁబట్టి యీమూఁడక్షరములు నొకయక్షరమే గాని మూఁడక్షరములు కావని శాస్త్రులుగారు వాదింతురా? వాదింతురని తోఁచదు. ఈ యక్షరముల యుచ్చారణములు వేఱు వాని రూపములును వేఱు. కాని యొకయుచ్చారణము గలయక్షరమును గొందఱు వేఱువిధముగా నుచ్చరించుటయు, వ్రాయునప్పుడు తమయుచ్చారణమున కనురూపమగునక్షరమును వ్రాయుటయు మనము చూచుచున్నాము. రలళడలకభేద మంగీకరింపఁబడినది. రఱలకుఁగూడఁ గొన్నికావుల భేదాభావము లాక్షణికు లంగీకరించి శబ్దద్వైరూప్యమును బ్రతిపాదించినారు. లోకములో సాధారణముగాఁ గొందఱు చజలతాలవ్యతాదంత్యత్వభేదమును బాటింపకుండుట యనుభవసిద్ధము. అలాగుననే కొందఱు డకారలకారముల పలుకుబడుల భేదమును బాటింపకపోవుటచేత నవి వేఱువేఱు అక్షరములు కావనుట యుక్తియుక్తము కాదు.

(౪) ఒకధ్వనికి రెండుమూఁడు సంజ్ఞలుండవచ్చుననియు, డకారళకారములు రెండు నొకధ్వనినే సూచించు ననియు నింకొకవాదము. దీనికి సమాధానము కొంత యిదివఱకే వచ్చియున్నది. అచ్చులలోఁ గొన్నిటికి రెండేసి రూపము లున్నమాట నిజమే. ఓకారమున కిప్పుడును రెండురూపములున్నవి. కాని హల్లులలో నొకధ్వనికి రెండుచిహ్నములు తెలుఁగులో లేవు. ప్రత్యేకముగా వ్రాయునప్పు డొకరూపమును సంయుక్తాక్షరములలో నంతర్భూత మైనప్పుడు మఱియొకరూపమును తెలుఁగక్షరములకుఁ గలవు. కాని యిది విషయాంతరము. అక్షరోత్పత్తికాలమందుఁ బ్రత్యక్షరమునకును బ్రత్యేకధ్వని యుండియుండవలెను. ఒకధ్వనికిఁ బెక్కుసంజ్ఞలు గాని, యొకసంజ్ఞకుఁ బెక్కుధ్వనులు గాని యక్షరోత్పత్తికాలమం దుండుట యసంభవము. కాలక్రమమున నూతనధ్వనులు బయలుదేఱఁగా వానికి నూతన సంజ్ఞలు కల్పించుటయును గలదు. అట్లు కల్పింపక ప్రాచీనసంజ్ఞలయందే నూతనధ్వనులను గూడ నారోపించుటయును గలదు. ఇట్టివిశేషము లాంగ్లేయభాషయం దనేకములు గలవు. అవి యాభాషలోని వర్ణసమామ్నాయముయొక్క యసమగ్రత్వమును సూచించును. ఒక యుచ్చారణ

మునకు బహ్వక్షరము లుండుట భాషావైభవమును దెలుపు నని ప్రాజ్ఞులు తలంచుచున్నా" రని శాస్త్రులుగారు వ్రాసినది వింతగా నున్నది. అయిన నీవిషయము ప్రస్తుతముగాదు.

తెలుఁగులోఁ బ్రతిహల్లునకును బ్రత్యేకధ్వని కలదు. ఉచ్చారణసాంకర్యముచేత నొకధ్వనికి బదులుగా వేఱొకధ్వని పలుకుటయు, నట్లుపలికినప్పుడొకయక్షరమునకుబదులుగా మఱియొకయక్షరము వాడుటయునుగలదు. ఈకారణముచేతనే క్రమముగా ళశలకు, లడలకు, రఱలకు నభేద మన్నసిద్ధాంతము బయలుదేఱినది. ఇచ్చట నభేద మనఁగా నొకధ్వనికి బదులుగా నింకొకధ్వని యుచ్చరింపవచ్చు నని తాత్పర్యము గాని యక్షరములకుఁ బ్రత్యేకధ్వనులు లేవని కాదు. ఆలాగుననే శకటరేఫమునకు బదులుగా రేఫముపలుకుట గలదు. అట్టిశబ్దములు ద్విరూపము లని లాక్షణికులమతము. యుద్ధమల్లుని శాసనములో చేబ్రోలు అని యున్నది. పొరపాటున శకటరేఫము పడియుండును. రేఫమునకు బదులుగా శకటరేఫముపయోగింపఁబడిన దన్న మాత్రముచేత నా రెండక్షరములకు నుచ్చారణభేద మెచ్చటను లేనే లేదని చెప్పనొప్పునా? అట్లన్నచో రఱలకు యతిప్రాసములందు మైత్రికూడ లేదన్న శాస్త్ర మేమికావలయును. రేఫఱకార నిర్ణయముచేయుటకు లాక్షణికు లంతశ్రమ పడనేల ?

ఇంకొకవిషయము:—డటలు రెండింటికి నుచ్చారణభేద మేమియు లేక యొకదానికొకటి యథేచ్ఛముగా నేకకాలమందే యుపయోగింపవచ్చు నని పూర్వకవులమత మయినచో నట్టియభేదబుద్ధి దేశ్యతద్భవములందే గాక తత్సమశబ్దములందుఁగూడఁ గనఁబడవలయునుగదా, టకారముతో నున్నసంస్కృతశబ్దము లెచ్చటనుగానరావు. కన్నడమందువలె తెలుఁగునందును దేశ్యతద్భవశబ్దములందే కనఁబడుచున్నది. చోటు, మేటుశబ్దములు సంస్కృతసమాసములలోఁ గూడఁ జొప్పట్టుచున్నవి. కాని, యవి సంజ్ఞావాచకములగు దేశ్యశబ్దములే గాని సంస్కృతశబ్దములు కావు. ఈశబ్దములు గలసమాసములు "ఏదులఖానోగ్రకపాల", "భూమండలస్థాండపీటి ధరణీభృద్భుర", "పొట్టినూరివిజయస్తంభోపలోట్టంకిత" మొదలగు సమాసములవంటివే. టకారరూపము సంస్కృతశబ్దములో నందంపూడిశాసనమునందును, ఈశ్వరభట్టసోమయాజి శాసనమునందును గలదని బ్రహ్మయ్యశాస్త్రులుగారు వ్రాసినారు.

ఇది యెంతవఱకు సరియో చూతము. నందంపూండిశాసనములో రెండు వ్రాతకత్తె లున్నవి. పూర్వభాగము లిపి అడ్డకత్తు, ఉత్తరభాగము లిపి గుండ్రకత్తు. ఱకారము "చూడామణి", "క్రీడయా" శబ్దములందున్న దని శాస్త్రులుగారు వ్రాసినారు. చూడామణిశబ్దము శాసనము 3 వ పంక్తిలో "శ్రీకంఠచూడామణిః" అనుసమాసమందును, ౬౦ వ పంక్తిలో "చాలుక్యచూడామణిః" అనుసమాసమందును రెండుచోటుల గలదు.(10) మొదటి యడ్డకత్తులిపిలో నున్నది. ఇందున్నయక్షరము డకారమే గాని ఱకారము కాదు. శాసనప్రతిబింబమును నిదానముగా జూచినచో సందేహనివృత్తి యగును. రెండవ చూడామణిశబ్దము గుండ్రకత్తులో నున్నది. గుండ్రముగా నుండుటచేత ఱకారరూప మనుభ్రాంతిని గలుగజేయుచున్నది గాని యిది యును డకారమే. 69 వ పంక్తిలోని పురోడాశపదము చూచిన సంశయనివృత్తి యగును. ఱకారరూపమునకు ఎడమప్రక్కను గూడ గుడి యుండును. తలకట్టుండదు.

ఈశ్వరభట్టసోమయాజిశాసను యుద్ధమల్లశాసనము దిగువ నారాతి మీదనే యున్నది (11) ఈశాసనములో డకారము మండలి, గుముడూరి, బెజవాడ, అఖండ, ఎడ్లు, కొడుకు, మూనెండు, వాండు అను శబ్దములలో నున్నది. రూప మన్నిచోటుల నొకవిధముగానే యున్నది. ఈరూపము ఱకారరూపమును గొంతవఱకు బోలియున్నమాట సత్యమే కాని యదికాదు. ఈయక్షరమునకు దలకట్టున్నది. ఱ కారమునకు దలకట్టు లేదు. ఈశాసనము నందంపూండి శాసనమున కర్వాచీనము. రెంటికి నంతరము నూఱేండ్లకంటె నధికముగా నున్నది. నందంపూండి శాసనము నాటికే ఱకారము వాడుకలో బోయినది. ఈశ్వరభట్ట సోమయాజి శాసనమునాటికెక్కడిది. గుండ్రకత్తక్షర మగుటచేత ఱకారమును గొంతవఱకు బోలియున్నది, గాని యాయక్షరము కాదు. ఇంతియే గాక డకారఱకారరూపములు రెండును [illegible]కలో నున్నప్పు డవి యెట్లుపయోగింపబడినవో దానినిబ[illegible]స[illegible]సంబంధము నిర్ణయింపవలెను. రెండు రూపములును గలశాస[illegible]క, ఆర్యభ[illegible]కారము కొన్నితద్భవదేశ్యశబ్దములలో మాత్రమును, డకార మి[illegible]ములయందును సంస్కృతశబ్దము

(10) ఆ. సా. పరిషత్పత్రిక సంపు I. (11) ఆ. సా. పరిషత్పత్రిక సంపు 6.

లంను నుపయోగింపఁబడినది. దీనిని బట్టి ఱకారోచ్చారణము సంస్కృతములో లే దనియు, తెలుఁగుశబ్దములలోఁ గొన్నిఁటిలో మాత్రమె యున్న దనియుఁ దేలుచున్నది. సోమయాజిశాసనములో నొక్కరూపము మాత్రమే యున్నది. అదిక్కాంతవఱకుఁ బ్రాచీనఱకారరూపమును బోలియున్నను నది గాదు. ఆరూప మాకాలమంను బెజవాడప్రాంతమందు వాడుకలో నుండి యుండును.

ఱస్సి యను క్రియాపదము ధాతురూపము ద్రావిడకర్ణాటాంధ్రభాషలలో నెచ్చట లేదు గనుక నది డస్సిపదముగానే గ్రహింపవలె నని శాస్త్రులుగారు వ్రాసినారు.

పూర్వోదాహృత మగు అరకట వేములశాసనములో ఱచ్చ అను పదము కనఁబడుచున్నది. అర్థమం దిది ఱస్సికి చేరువగా నున్నది. ఱచ్చ యొక్క క్త్వార్థకరూపము ఱచ్చి యగుఁగాని ఱస్సి కాదని చెప్పవచ్చును. ఈ రెండుశబ్దములకుఁ గలసంబంధ మింకను బరిశీలింపవలసి యున్నది.

యుద్ధమల్లశాసనములో బెఱంగు శబ్దము ఱకారయుక్తముగా నున్న దనియుఁ గర్ణాటద్రావిడభాషలలో నిది డకారయుక్త మనియు శాస్త్రులుగారు వ్రాసిరి. యుద్ధమల్లశాసనములో నీశబ్దము నందలి నడిమియక్షరము డకారమే గాని ఱకారము కాదు. ఈశాసనప్రతిబింబము పరిషత్పత్రికలో కంటె Epigraphia Indica పత్రికలో సుస్పష్టముగా నున్నది.



శ్రీరామ.

# ద్రావిడభాషాతత్త్వవిమర్శనము.

— కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ. —

## విభక్తినిరూపణము.

లోకములోని యాయావస్తువులతత్త్వమును బరిశీలించి వానినిగూర్చిన యథార్థజ్ఞానము కలిగించుటయే శాస్త్రములయొక్క ముఖ్యప్రయోజనము. భాషాశాస్త్రము లోకమునందలి జనులచే మాటలాడఁబడుచుండెడి భాషల యొక్క స్వరూపము, పుట్టుక, వాని యభివృద్ధి మొదలగువానిని బరిశీలించి భాషాతత్త్వమునుగూర్చిన జ్ఞానమును గలిగించును. పరబ్రహ్మస్వరూపమును దెలిసికొని నిశ్శ్రేయసమును బొందుటకుఁ బదార్థతత్త్వజ్ఞాన మావశ్యక మైనట్లు, శబ్దబ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకు భాషాతత్త్వజ్ఞానమావశ్యకము. కావుననే భాషాతత్త్వజిజ్ఞాసువు లగునాధునికశబ్దశాస్త్రవేత్తలు భూభాగము నందు వ్యవహారముననున్న యాయాభాషల (మూలరూపములఁ దెలిసికొనుటకుఁగాను వాని) నొండొంటితోఁ బోల్చి వానిస్వరూపము, పదపరికరము, తత్ప్రయోగవిధానము లేక వాక్యసంఘటనారీతి మొదలగు విషయములందు వానికిఁ గల సామ్యమునుబట్టి వాని సంబంధబాంధవ్యములను నిర్ధారణచేసి భాషలను గొన్నికుటుంబములుగా నేర్పఱిచియున్నారు. ఆయా కుటుంబముల లోని భాషల భిన్నత్వమునకును, భిన్నకుటుంబముల విశేషలక్షణములకునుగల కారణముల నారసి భాషాస్వరూపము, భాషాతత్త్వమునుగూర్చిన నిశ్చయజ్ఞానమును సంపాదించుటకుఁగూడ ననేకవిధములఁ బ్రయత్నించుచున్నారు.

ప్రస్తుతము దక్షిణహిందూదేశమున వ్యవహరింపఁబడుచున్న భాషల న్నియు నొకకుటుంబమునకే చెందిన వనియు, నివి యన్నియు నేదో యొక ప్రాచీన ద్రావిడభాషనుండి బయలుదేఱిన సోదరభాషలై యుండ నోపు ననియుఁ బలువురు శబ్దశాస్త్రజ్ఞులు తలంచుచుండ, మఱికొందఱీభాష లొక ప్రత్యేక కుటుంబమునకుఁ జెందినవి కాక, ఆర్యభాషాకుటుంబమునకుఁ జెందినవై కొంత కాలముక్రిందట నుత్తరహిందూస్థానమున వాడుకలోనుండి కాలక్రమమున దక్షిణదేశమునకు వ్యాపించిన మాగధి, పైశాచి మొదలగు ప్రాకృతభాషల వికృతిరూపములే కాని వేఱుకావనియుఁ జెప్పుచున్నారు. ఈభాషలను ప్రత్యేక

కుటుంబముగా నేర్పఱుచుటకుఁ గల కారణములు కొన్ని చెప్పఁబడియున్నవి కాని, వీనికి మూలభాషగాఁ జెప్పఁబడెడి యా ప్రాచీన ద్రావిడభాషయొక్క స్వరూపమును దెలిసికొని దానికి నీయీభాషలకుఁ గల సంబంధ మిట్టి దని నిరూపించుటకుఁ దగినయాధారము లింకను నేర్పడలేదు. సజీవము లగుజంతువులకువలెనే భాషకును మార్పు సహజ మగుటచే నది యద్దానిని వ్యవహరించువారి యుచ్చారణరీతులనుబట్టి వారి నోళ్లలోఁ బడి నలిఁగి నలిఁగి కాలక్రమమున ననేకవిధములగు మార్పులకు లోనగుచుండును. కాలక్రమమునఁ గలిగిన యీమార్పులే యొక్కొకకాలమునఁ గారణాంతరములచే విశేషముగ సంభవించినచో నా భాషయొక్క పూర్వరూపమునకును, ఆకాలమందలి రూపమునకును విశేషభేద మేర్పడును. ఇట్లే దేశకాలవ్యవస్థలనుబట్టి యొక్క భాషయే భిన్నరూపములను బొందుట లేక భిన్నభాషలుగా మాఱుట తటస్థించును. ఈ భాష లొకభాషయొక్క భిన్నరూపములే యైనను గాలానుసారముగ నవి ప్రత్యేకపరిణామములఁ బొందుటచేఁ గొన్ని శతాబ్దములు గడచిన పిదప నవి పరస్పరసంబంధము కలవిగానే కన్పడవు. ప్రస్తుతము చెన్నపట్టణము తెలుఁగు మాటాడువారు తెలుఁగుదేశమున కుత్తరపు సరిహద్దున గంజాము జిల్లాలో ఓఢ్ర తెలుఁగు మాటాడువారిభాషను సులభముగనే అర్థముచేసికొని వ్యవహారము జరుపుకొనఁగలరు. ఇప్పుడు వీరిరువురు గూడ మాటాడునది తెలుఁగుభాష యనియే మనము చెప్పుకొనుచున్నాము. కాని యే కారణముచేతనైనను ప్రస్తుత మనవరతాన్యోన్యసంసర్గమునకు సాయపడుచున్న రైళ్లు మొదలగు నీసులభమార్గము లంతరించినచోఁ గొంతకాలమున కొకరిమాట మఱియొకరి కర్థముకాకుండ మాఱిపోవచ్చును. ఈ మార్పున కాయాప్రాంతములం దీభాష కితరభాషలతోఁ గలిగిన సంసర్గమే మఱింత సాయముచేయఁ గలదు. ఇట్లు విడిపోయిన యీ భాషలు కొంతకాలముక్రిందట నేకరూపము కలవై యవిభక్తం బగు నొక ప్రాచీనజనసంఘముచే వ్యవహరింపఁబడిన వని రుజువుచేయుట యనున దంతసులభసాధ్యమై యుండదు. ఏలయనఁగా.— చెన్నపట్టణముతెలుఁగులో తమిళపదములు పదబంధములు చేరియుండును. అట్లే గంజాముతెలుఁగునకు ఓఢ్రభాషయందలి సంప్రదాయములు కొన్ని యబ్బును. కావున నీరెండువిధము లగు తెలుఁగుభాషలను స్థూలదృష్టితోఁ జూచినప్పు డొకటి యఱవభాషకు సంబంధించినదిగను, రెండవది యోఢ్రభాషకు సన్ని

హిత మైనదిగను గన్పడును, కాని యివి తెలుఁగుభాషయొక్క మాఱురూప ము లని గుర్తించుట కష్టతర మగును. కావున నేయేభాష లేయేకుటుంబము నకుఁ జెందినవి, ఏది దేనినుండి బయలుదేఱినది, ఆయాభాషలకు గల సంబంధం బెట్టిది యనువిషయమును నిర్ధారణ చేయవలె నన్న నాయాభాషల నిష్కృష్టలక్షణములను బరిశీలించి తెలిసికొనవలయును.

భాషలవర్గీకరణవిషయమున (Classification) భాషాతత్త్వవేత్తలు రెండుమార్గముల నేర్పఱిచినారు. ఆయాభాషలయందలి భావావిష్కరణసామగ్రిని (material of expression) పోల్చి చూచుట యొకటి. ఆయా భాషలయందలి భావావిష్కరణపద్ధతుల (methods of expression) నొం డొంటితోఁ బోల్చిచూచుట మఱియొకటి. వీనిలో మొదటిదానికంటెఁగూడ రెండవదియే భాషల సంబంధమును గూర్చి యథార్థజ్ఞానము గలిగించుటలో నెక్కువగాఁ దోడ్పడఁగల దని పలువురయభిప్రాయ మైయున్నది. ఒకభాష యందలిపదజాలమే యాభాషయందలి భావావిష్కరణసామగ్రి యని చెప్పఁ బడుచున్నది. కాని కేవలపదములే భాషకాదు. భాష యనునది హృద్గతము లగుమనభావములను ధ్వని రూపము లగుసంజ్ఞలచే నితరులకు వ్యక్తపఱుచుట కేర్పడినసాధనము. భాషమూలమున మన మితరులకు వ్యక్తముచేయునవి సంపూర్ణములగుభావములయి యుండును. ఆసంపూర్ణభావము వాక్యము౦ దిమిడియుండును గాని కేవలము పదము౦ దుండదు. ఈపద మనునది సంపూర్ణభావబోధకంబు లగునఖండవాక్యములసమూహం బగుభాషయొక్క వ్యాకరణము(analysis) చే సిద్ధించినది. భాషను వ్యాకరించుట (analyse) అనఁగా సంపూర్ణభావములను వ్యక్తీకరించెడి యాభాషయందలి యఖండవాక్యముల ను గొన్నిటిని దీసికొని వాని నొండొంటితోఁ బోల్చి చూచి యాయావాక్యములలో నేయేభాగముల కెంతెంతయర్థమో, ఏభాగముయొక్క యుపయోగ మెట్టిదో, విచారించి యాయఖండవాక్యమును విభాగించి దానిలో నీయీ ముక్క యాపూర్ణభావములో నీయీఖండభావమును సూచించుచున్నది యని నిర్ధారణచేయుటయై యున్నది. "వ్యాక్రియంతే-వివిచ్య ప్రదర్శ్యంతే అనేన శబ్దాః ఇతి వ్యాకరణం" దీనియందు శబ్దములు విడఁగొట్టఁబడి చూపఁ బడుచున్నవి గావున నిది వ్యాకరణ మగుచున్నది యని మహాభాష్యమున వ్యాకరణశబ్దము నిర్వచింపఁబడినది. ప్రస్తుతము పాణిన్యాదులగు మనవ్యాక

రణకర్తలు చేయునది యాదియందు జనులచేఁ బ్రయోగింపఁబడిన యఖండవాక్యమును విషఁగొట్టి పదములను ఎత్తిచూపి యీయాభాగమున కీయాయర్థమని గాని, వానివాని లక్షణ మిట్టిది యని గాని చెప్పుట కాదు. ఈపని యేభాషావిషయములో నైనను ఆభాషను మాటలాడుజనులు దాని నేకాలమందైన బుద్ధిపూర్వకంబుగను సవిమర్శంబుగను దాని నభ్యసింపఁదొడంగిరో (Conscious study of language) ఆకాలమందే చేయఁబడియుండును. కావున నేమాత్రమైనను నాగరకతఁ గాంచిన జనులభాషలలో నింతకుఁ బూర్వము చాలకాలముక్రిందటనే యాదినైయాకరణు లాయాయఖండవాక్యములలో నిన్నివిధము లగుపదములు కూడియున్న వని యేర్పఱిచియే యుందురు. వాని లక్షణములు కాలక్రమమున నిర్ణయింపఁబడి నిరూపింపఁబడును. చరిత్ర కందినంతవఱ కీభాషాస్వరూపమును గూర్చి విచారణ చేసినవారిలో హిందూదేశీయులు గ్రీకుదేశస్థులు నగ్రగణ్యులుగఁ గన్పడుచున్నారు. గ్రీకుతత్త్వవేత్తలు తర్కశాస్త్రముయొక్కయుఁ దత్త్వశాస్త్రముయొక్కయు సహాయముచే ముందు భావము (లేక యర్థము) నందు విభాగములు కల్పించి వానిని పిదప శబ్దమునకు-అనఁగా వాక్యమున కన్వయింపఁజేసిరి. కర్త యని క్రియ యని భేదము కల్పించినది తత్త్వవేత్తలు. ప్లేటోకాలమునకు నామము క్రియ అనుభాషాభాగములు మాత్రమే తెలిసికొనఁబడినవి. తరువాత అరిస్టాటిల్ సముచ్చయముల నిరూపించెను. జెనోడాటస్ కాలమునకు సర్వనామము, ఆరిస్టార్కస్ కాలమున కుపసర్గయును భాషాభాగములుగాఁ దెలిసికొనఁబడినవి. గ్రీకుదేశస్థు లితరదేశభాషల నభ్యసింప మొదలిడి, హోమామరుగ్రంథములను సవిమర్శంబుగఁ జదువ మొదలిడినతరువాత భాషాభాగములకు వ్యాకరణసంకేతములు బయలుదేఱినవి.

హిందూదేశమున నింతకుఁ బూర్వమే భాషావిభాగములఁగూర్చిన నిశ్చయజ్ఞాన మలవడుటేగాక వ్యాకరణసంప్రదాయము లన్నియుఁగూడ నేర్పడియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఋగ్వేదమునందే భాషయనునది వాగ్రూప మగునొక దేవతగా భావింపఁబడుటయే గాక ఆదేవతయొక్క శక్తిస్వరూపములఁ గూర్చి యనేకవిధముల స్తోత్రములు చేయఁబడియున్నవి. ఋగ్వేదము 10వమండలము 125వసూక్తములో "అహమేవ స్వయమిదం వదామి, జుష్టం దేవేభి రుత మానుషేభిః యం కామయే తం త ముగ్రం కృణోమి తం

బ్రాహ్మణాం తం ఋషిం తం సుమేధాం॥ అహం జనాయ సమదం కృణో మ్యహం ద్యావాపృథివీ ఆవివేశ–" ఒకప్పుడు మనస్సునకు వాగ్దేవతకుఁ గలిగిన యొకస్పర్థను గూర్చి శతపథబ్రాహ్మణమున నొకకథ చెప్పఁ బడియున్నది. మనస్సు వాగ్దేవితో "నా కవగాహనకాని విషయమును దేనిని నీవు చెప్పలేవు. నేను దేనిని తలంచిన దానినే నీ వనుకరించి చెప్పుదువు. కావున నేను నీకంటె గొప్పదానను" అని పలుకఁగా నామె "నీ వేమి తలంచినను, నీకేమి తెలియవచ్చినను నామూలముననే తెలియవచ్చుచున్నది. నేనే తెలుపుచున్నాను. కావున నీకంటె నేనే గొప్పదాన"ని ప్రత్యుత్తర మిచ్చినది. పిదప వీరిద్దఱుఁ బ్రజాపతిని దమతగవు తీర్పుమని కోరఁగా నాతఁడు– మనస్సు ననుసరించి దానిభావముల ననుకరించునదే వాక్కు– గావున ననుసరించుదానికంటె ననుసరింపఁబడునదే గొప్పది గావున వాక్కు–కంటె మనస్సే గొప్ప దని చెప్పఁగా, వాగ్దేవత యాతనిపై నలిగి హవిర్భాగమును దానాతనికి ముట్టఁజేయనని చెప్పినదఁట. కావుననే యేయజ్ఞమునఁ గాని ప్రజాపతికి హోమము చేయునపుడు హవిర్దానమంత్రము మెల్లగాఁ జెప్పఁబడుచున్నది. ఈకథనుబట్టి భావము భాష యనునవి రెండు నవ్యవహితం బగునిత్యసంబంధము కల వనియు (దీనినే పతంజలి "సిద్ధే శబ్దార్థసంబంధే" యను వార్తికభాగమును వివరించుపట్లఁ బ్రతిపాదించియున్నాఁడు)–భాష లేనిదే భావము గాని భావము లేనిదే భాష గాని యుండుట యసంభవ మనియు నీమొదలగు నాధునికశబ్దశాస్త్ర సమ్మతము లగుసిద్ధాంతము లాకాలముననే ప్రబలియుండె నని తెలిసికొనవలసి యున్నది. ఈసందర్భము 'సెస్'మహాశయుని "**Language, it is true, is the embodiment of thought, but it is equally true, that without language there can be no thought.**" అనువాక్యములఁ దిలకింపుఁడు. మొట్టమొదట భాష యెట్లుండెడిది దానికి వ్యాకరణ మెట్లు బయలు దేఱినది యనువిషయమును గూర్చి శ్రుతియే యిట్లు ప్రతిపాదించుచున్నది.

"వాగ్వై పరా చ్యవ్యాకృతా అవదత్తే, దేవా ఇంద్ర మబ్రువన్నిమాం నోవ్యాకురు. తాం ఇంద్రో మధ్యతో వక్రమ్య వ్యాకరోత్ తస్మాదిదం వ్యాకృతా వా గుద్యతా" దీనికి సాయనాచార్యు లిట్లు వ్యాఖ్యానము చేసినారు. "అగ్నే మీాళే ఇత్యాదివాక్ పూర్వస్మిన్ కాలే (పరాచీ) సముద్రాదిధ్వనివ దేకాత్మికా సతీ–(అవ్యాకృతా) ప్రకృతిః ప్రత్యయః, పదం, వాక్య

మిత్యాది విభాగరహితాసీత్. (తాం)వాచం (మధ్యేన క్రమ్య) ప్రకృత్యాది రూపేణ విభజ్య వ్యాకరోత్ ఇతి. ఏవంచ అసత్యారుంధతీదర్శనేన సత్యారుంధతీదర్శనవత్ పంచకోశాదివ్యుత్పాదనన్యాయేన మిథ్యావస్తుపరిహారేణ అఖండసచ్చిదానందప్రతిబోధనవచ్చ అసత్యభూతప్రకృతిప్రత్యయార్థనిరూపణేన సత్యభూతాఖండవాక్యార్థబోధనం వ్యాకరణాదినా క్రియతే ఇతి బోధ్యం." కావుననే పదముల కర్థము వాక్యార్థమునుండియె కలుగుచున్నది గాని ప్రత్యేకము కాదని

"నహి కించిత్ పదం నామ రూపేణ నియతం క్వచిత్
పదానా మర్థరూపంచ వాక్యార్థా దేవ జాయతే॥

ఏవ మఖండార్థక వాక్యానా మానంత్యాత్ వర్షశతేనాపి తత్తదర్థజ్ఞాపనస్య అశక్యతయా ప్రకృతిప్రత్యయాదివిభాగకల్పనేన తత్తదర్థనిర్వచనే లాఘవమితి ధియా లోకహితకామ్యయా మహర్షిభిః వ్యాకరణం ప్రణీతం"అని మొదట దేవతలప్రోద్బలముచే ఇంద్రుఁ డఖండకావ్యమును వ్యాకరించె ననియుఁ బిదప లోకహితముకొఱకు మహర్షులు దాని ననుసరించి రనియుఁ జెప్పఁబడి యున్నది. పిదప, ప్రాతిశాఖ్యలకాలమున నామాఖ్యాతోపసర్గనిపాత లను నాల్గుభాషాభాగము లేర్పడుటె గాక విభక్తులు సప్తసంఖ్యాకము లని కూడ నిశ్చయింపఁబడినట్లు తెలియుచున్నది.

ఇంతవఱకు చరిత్రకందినంతలో గీర్వాణమునను గ్రీకుభాషలోను భాషాభాగములజ్ఞాన మెట్లు బయలుదేఱినదో యన్వేషింప యత్నించినాము. ఎంత చేసినను, ప్రాచీన మగు ఇండోయూరోపియను భాషయొక్క సంతతిలోఁ జేరిన రెండుభాషలలో మాత్రమే యీజ్ఞానాభివృద్ధి క్రమమునుగూర్చి కొంత తెలిసికొనఁగలిగితిమి. ఆ ప్రాచీనభాషనుండి యివి విడివడుట కెంత కాలముపట్టినదో యాతకాలము నాభాషను వ్యవహరించినవారికిఁ గేవల మఖండవాక్యజ్ఞానమే కాని భాషాభాగములజ్ఞానము లేదని చెప్పుట కవకాశము కలదా. మూలభాషాలక్షణములఁ గనిపెట్టిన శబ్దశాస్త్రజ్ఞులు, ఆ భాషలోని పదములు, ప్రత్యయములు, సంధి, విభక్తి మొదలగు విషయములను వానిలక్షణములను నిర్ణయించి సిద్ధాంతము చేయుచుండఁగా నీభాషాభాగజ్ఞాన మిటీవల బయలుదేఱిన దనుట యెట్లు పొసఁగును. కాని ప్రత్యేకభాషలలో బయలుదేఱిన భాషావిభాగజ్ఞానము మూలభాషలోని సంప్రదాయము ననుసరించినదై యుండెనని మాత్రము తలంపవచ్చును. కావున నిటీవలివ్యాకరణ

కర్తలు చేయుపని యంతకుపూర్వము సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్నభాషాభాగముల లక్షణములను నిరూపించుటయై యున్నది.

ఇంతకు నీయఖండవాక్యవిభాగమును గూర్చి యేల చెప్పఁబడె ననఁగా భాషాకుటుంబముల నేర్పఱుచు విధానమం దీయఖండవాక్యలక్షణము నే మనము ముఖ్యముగా గమనింపవలసియుండు ననువిషయమును సూచించుటకే, ఆయాకుటుంబములందలి భాషలలోని యఖండవాక్యలక్షణములు, తత్సంఘటనారీతులు నిటీవల బయలుదేఱినవ్యాకరణములలోఁ బ్రతిఫలింపక వీలు లేదు. కావున నీవ్యాకరణలక్షణములను బట్టి యే యాయాభాషల ప్రత్యేకతను, గాని సాజాత్యమును గాని కనిపెట్టఁగలుగుచున్నా మని చెప్పవలసి యున్నది. దీనితత్త్వార్థ మే మనఁగా, ప్రపంచమునఁ బ్రత్యేకవ్యక్తులయొక్క వలెనే జాతులయొక్కయు మనస్సంకల్పములు భిన్నములైనటుగనె, ఆయా సంకల్పములను బహిర్గతముచేసి యితరులకు బోధపఱుచు రీతులుకూడ భిన్నములుగనె యుండును. ఒకనికి స్వాభావికముగఁ దోఁచినభావములు భావప్రకటనారీతులు మఱియొకని కస్వాభావికములుగాఁ గన్పడును. చీనాదేశస్థుని భాష, వాక్యసంఘటనారీతి మన కస్వాభావికముగా నుండును. మనభాష యాతని కట్లె యుండును. కావున ప్రతిజాతియు, ప్రతిభాషయుఁ గూడఁ గొన్ని ప్రత్యేకము లగువిశేషలక్షణములతో బయలుదేఱి యా లక్షణములమూలముగాఁ దన ప్రత్యేకతను నిలుపుకొనుచుండును. భూభాగమందలి జాతులలో నొకజాతిభావములు నాదర్శములు మఱియొకజాతిభావములతోను నాదర్శములతో నెట్లుపొంది యేకీభవింపక వానిని వేఱుపఱుచునో యట్లే యాయాభావభేదములయందలి రీతులు వారిభాషలయందు ప్రతిఫలించి వానిని భిన్నరూపములు కలవానిఁగాఁ జేయును. * జాతులలోఁ గలయిక గలిగి మార్పుగలిగినట్లుగనే

* It is a different conception of the sentence and the form it takes which characterise the whole language. However much alike may have been the circumstances by which the 1st communities of men are surrounded they yet viewed the world without them and their own relation to it with different eyes. The idea they formed of the sentence and its parts was not the same everywhere. When with the growth of consciousness came also the formal expression in utterance of the relations of the several parts of the sentence it is inevitable that this expression should clothe itself in essentially various forms. *When we remember that the sentence and not the* isolated word is the starting point of Philology—when we make it what the losician would term the "fundamentum divisions" for our classificasion of speech—there is no longer any difficulty in distinguishing families of speech and assigning to each its character & place.

The Science of Language. Sayee. Vol. 1. Page 31.

భాషలకుఁ గలిగెడి పరస్పరసంసర్గమును బట్టి కొన్ని మార్పులు కలిగినను, ఏ భాషనైనను సజీవమై యున్నంతవఱకుఁ దనకుటుంబముయొక్క ప్రత్యేకలక్షణములను బొత్తిగా విడిచిపెట్టు ననుట కవకాశము లేదు. కావుననే భాషల సంబంధమును నిశ్చయించుటకు వానియందలి వాక్యసంఘటనాకృతులను బోల్చిచూచుటయే ప్రబలమైన సాధనముగాఁ దలంపఁబడుచున్నది. మానవుని మనశ్శక్తి యొక్కటే యగుటచే నామస్సంకల్పములలో సామ్య ముండక తీరదు. కాని వారి స్థితిగతులనుబట్టియుఁ బరిసరదేశమునుబట్టియు వారిభావములు భాషారూపము నొందుటలో భేదము లేర్పడును. వాక్యసంఘటనమునఁ గల యీభేదమునుబట్టియే శబ్దశాస్త్రజ్ఞు లెప్పుడు వ్యవహారములో నున్నభాషలను మూఁడువిధములు కలవిగ విభజించియున్నారు.

ఇం దొకటి చీనావారిభాషలోఁ గన్పడురీతి. ఈభాషలో ధాతువులే పదములు. ఇతరము లగు నామము క్రియ మొదలగురూపభేదములు లేవు. ఇవి పూర్వమందుఁ గాని పరమందుఁ గాని యద్విధమగు ప్రత్యయములను గైకొనక యితరపదములతో సమసింపక యేవిధమైన మార్పును బొందకయే వాక్యమునఁ బ్రయోగింపఁబడి యర్థబోధకము లగుచున్నవి. ఈ పదముల స్థానమే వాక్యమున నన్వయభేదమును గొంతవఱకు సూచించుచుండును. వాక్యములోని యొకపద మర్థవంత మగుటకు మఱియొకపదముపైఁ గాని ప్రత్యయముపైఁ గాని యాధారపడియుండదు. ఇట్లు ధాతురూపములనే పదములుగఁ జేసికొని వానితోడనే వాక్యములను గూర్చుకొను భాషలను 'ధాతురూపపద భాషలు **(Isolating or radical languages)** అని చెప్పుచున్నారు. ఈభాషలయందలి పదములకు 'సుప్తిఙంతం పద' మనులక్షణము పట్టదు. "శక్తం పదం" శక్తివిశిష్టము పద మనులక్షణము పట్టునేమో. రెండవతరగతిభాషల లోని వాక్యమందలి భిన్నములగుభావములు ప్రత్యేకపదములచే సూచింపఁబడుచున్నను, ఒకభావము మఱియొకదానిపై నాధారపడియుండి దానితోఁ గలిసియె సంపూర్ణభావమును గలిగించును. ఒకవాక్యములోని పదముల పరస్పరసంబంధము తెలుపుటకును, ఆవాక్యమునఁ గల ధాతురూపార్థముల వివిధోపయోగములను లేక ప్రయోగవైవిధ్యమును **(different applications)** సూచించుటకు వానికిఁ గొన్ని ప్రత్యయములు గాని పదములు గాని చేర్పఁబడుచుండును. ఈప్రత్యయముల కప్పుడు భాషలో ప్రత్యేకప్రయోగము లేక

పోయినప్పటికి నవి యర్థభేదసూచకములుగ నాధాతువునకుఁ జేర్పఁబడి తమ ప్రత్యేకతను నిలుపుకొనుచునే యర్థభేదమును సూచించును. ఇట్లు ప్రత్యయము లని తలంపఁబడుచున్న వికూడ భాషలో మనకుఁ బరిచితము లగుపదముల యవశిష్టభాగములే (remnants) యని కొంచెము పరిశీలించినఁ దెలియక పోదు. ఏభాషలలోని వాక్యములయం దొకపదమునకును మఱియొకపదమునకును గలయర్థసంబంధము వాని ప్రక్కను జేర్పఁబడిన స్వతంత్రములగు పదములచేఁ గాని వానిసంక్షిప్తరూపములచేఁ గాని సూచింపఁబడుచున్నదో అట్టి భాషలను "సంశ్లిష్టపదరూపభాషలు" (Agglutinative languages) అని చెప్పుచున్నారు. టురేనియన్ లేక సిథియన్‌కుటుంబములకుఁ జెందిన ఫిన్నిష్, ఉగ్రియన్, టర్కిష్ మొదలగు భాషలకే గాక దక్షిణహిందూదేశభాషలకుఁ గూడ నీలక్షణము పట్టుచుండుటచే నివి యన్నియు నీ విభాగము క్రిందనే చేర్పఁబడినవి. ఇఁక సంస్కృతము మొదలుగాఁగల ఇండో యూరోపియన్ భాషలలోఁగూడ నీ రెండవతరగతిభాషలలోవలెనే ధాతువుల కాయాప్రత్యయములాయాయర్థసందర్భములను దెలుపుటకుఁగాఁ జేర్పఁబడుచుండినను ఆ ప్రత్యయములకు మూలరూపము లగుపదము లేవో కనుఁగొనుట సుసాధ్యముగ లేదు. ఈకుటుంబములోని వివిధభాషలలోఁ గొంచె మెచ్చుతగ్గుగాఁ దుల్యరూపములు గలయీ ప్రత్యయములు ప్రాచీన మగుమూలభాషలోఁగూడ నిట్లే యుండుటచే మొదట నఖండవాక్యమును విభాగము చేసినవారే యీ వాక్యమందలి భాగముల పరస్పరసంబంధమును సూచించుటకీ ప్రత్యయముల నీ రూపమున నే విడఁగొట్టియుంచి రేమో యని తలంపఁ దగియున్నది. * ఇందుకు నిదర్శ

* An inflexional language does not permit us to watch the word making process so clearly as do those savage jargons in which a couple of sounds as nine signify I do it or you do it according to the context & gestures of the speaker. Herewith the growth of consciousness and the analysis of thought the external gesture is replaced by some portion of the uttered sounds which agrees in a number of different instances and in this way the words by which the relations of grammar are expressed came into being..................In the friction & comparison of the first utterances of mankind similar terminations came in some instances to be set apart to denote the relations of grammar.

నముగా ఆంగ్లభాషలో గ్రీకుపదముల చివరనుండు ie అను ప్రత్యయ మొకటి విశేషార్థద్యోతకముగా గ్రహింపఁబడి యాపదములనుండి విడఁగొట్టఁబడి, యా యర్థమును సూచించుటకుఁ గా లాటిన్ మొదలగు నితరభాషల పదములకుఁ గూడఁ జేర్పఁబడుచున్నది. మొత్తముమీఁద నెట్లయిన నిట్టియర్థము తెలియని ప్రత్యయములమూలముగా వాక్యమందలి భిన్నపదముల సంబంధమును సూచించుట యీకుటుంబభాషలకు విశేషలక్షణముగాఁ గనఁబడుచున్నది. ఈ ప్రత్యయము లైన నాయాయర్థముల సూచించుపట్ల తమ ప్రత్యేకతను నిలుపుకొనక యనేకవిధము లగుమార్పులకు లోనగుచు నొకప్పుడు ధాతువు నుండి వేఱుపఱుచుటకు వీలులేనంతగా దానితో నైక్యమునుబొందుచుండును. ఇట్లు ప్రత్యయములను గ్రహించుచు నాప్రత్యయములను దమతో నైక్యమును బొందించుకొను మూలపదములు గలభాషలను బ్రత్యయాంతభాషలని (Inflexional langua ;es) చెప్పుచున్నారు. ప్రపంచమందలి భాషలన్నియు సరిగా నీమూఁడువర్గములలోనికి నిముడు నని చెప్పుట కవకాశము లేదు, గాని, యీవిభాగము వాని ప్రకృతిభేదమునుమాత్రము సూచించు సామాన్య విభాగముగా గ్రహింపఁదగి యున్నది. ప్రత్యేకస్వతంత్రము లగుపదములతోఁ గూడినచీనావారిభాషలో నచ్చటచ్చట ననర్థకపదములు కొన్ని వాక్యార్థ బోధకు సహాయకరము లైనంతమాత్రమునఁ గాని, రెండవతరగతికిఁ జెందిన భాషలలోని యుపపదములు (post positional words) కొన్ని ద్రుతతరోచ్చారణము, ఊనిక (emphasis) మొదలగు కారణములచేఁ సంకుచితములై ప్రత్యయావస్థను బొందియుండుటచేఁ గాని భాషలయొక్క యీయవస్థాభేదములు మొదటినుండి క్రమానుగతము లని తలంచుట కవకాశము కనఁబడదని కొందఱు శబ్దశాస్త్రజ్ఞులమతము. ఏమనఁగా నతిచిరకాలమునుండియుఁ జీనాభాష గాని ఇండోయూరోపియన్ మూలభాష గాని ద్రావిడభాషలు గాని వానికిఁ బ్రత్యేకము లగువిశేషలక్షణములను విడిచిపెట్టి మఱియొకతరగతిలోఁ జేర్పఁదగినభాషలుగా మాఱిపోయినట్లు కనఁబడదు. వీనిచరిత్ర నెంతవెనుక కన్వేషించిచూచినను వీనిస్వాభావికలక్షణము లిప్పటియట్లే కనఁబడుచున్నవి. కావున నాయాకుటుంబములకుఁ గల ప్రత్యేకలక్షణము లాయాజనులకు స్వాభావికము లగు భావకల్పనారీతులనుబట్టియు, తద్భావబోధకము లగు వాక్యసంఘటనారీతులను బట్టియే యేర్పడుచున్న వని నిశ్చయింపఁ దగియున్నది.

ప్రస్తుతము రెండవతరగతిలోఁ జేర్పఁబడిన ద్రావిడభాషలవిశేషలక్షణములేవి. అందలివాక్యసంఘటనారీతియు, తత్సూచక మగువిభక్తినిరూపణాపద్ధతియు నెంతవఱకీభాషల నీవర్గములోఁ జేర్చుట కవకాశమిచ్చుచున్నవి యను విషయము పరిశీలింపఁదగియున్నది.

వాక్యమందలి పదములకుఁ గలపరస్పరసంబంధమును నిరూపించుటయే విభక్తినిరూపణ మనఁబడును. విభక్తియనఁగా విభాగము. దేనియొక్క విభాగము? అనఁగా వాక్యముయొక్క విభాగము. అని చెప్పవలసియున్నది. సంస్కృతవైయాకరణులు "సుప్తిఙంతం పదం"అని సుప్తిఙ్ప్రత్యయములు చివరగలిగినదే పదమనియు, "సుప్తిఙౌ విభక్తిసంజ్ఞౌ స్తః" ఈప్రత్యయములకే విభక్తిసంజ్ఞకలదనియుఁ జెప్పియున్నారు. అనఁగా విభక్తిప్రత్యయ మంతమందుఁ గలది పదము. వాక్యమందలి విభాగమును సూచించుచు నాభాగములలో నొకదానితో మఱియొకదానికిఁ గలసంబంధమును దెల్పునట్టిది ప్రత్యయము. సంస్కృతమందే గాక దానికి మూలభాష యగు ప్రాచీనఇండోయూరోపియన్ భాషయందుఁగూడ విభక్తు లేడెయని చెప్పుటలోఁ గలవిశేషమేమనఁగా నీభాషాకుటుంబమునకుఁ జెందినవారు వాక్యమునందలి యవయవములసంబంధ మేడురీతులుగానె యుండు ననియు, నారీతులు కర్త కర్మ కరణాపాదానాదిభావభేదములకుఁ జిహ్నము లనియు భావమందలి యీరీతులే భావబోధకమగు వాక్యము నేడువిధములుగా విభాగముచేయుచున్నవి గావున వానికి విభక్తు లని పేరుపెట్టిన బాగుండు ననియుఁ దలంచినట్లు కనఁబడుచున్నది. మొదటినుండియు నీప్రత్యయములే భావబోధనారీతులను సూచించుటచే విభక్తు లేడే యైనవి. కాఁబట్టి యెట్టిభావభేదము లైన నీయేడురీతుల లోనే యిముడవలసియున్నవి. కాని ద్రావిడభాషలలో వాక్యమునందలి యొక భాగమునకును మఱియొకభాగమునకును గలసంబంధమును సూచించునవి చాలవఱకుఁ బ్రత్యయములు గాక స్వతంత్రము అగుపదములేయగుటచేతను భావమునందలి యేచ్ఛాయ నేపదము బాగుగ వ్యక్తీకరించునో యచ్చట నాపదముల నుపయోగించుట కవకాశ ముండుటచేతను, ఎన్నివిధముల భావమునందు భేదము లేర్పడుచుండునో యన్నివిభక్తులు కల వని చెప్పవలసినదే గాని విభక్తు లిన్ని యని నియమించుట కవకాశము లేదు. మఱియు నొక్కవిధ మగుసంబంధమును సూచించుటకే 'సమానార్థకము లగుననేకము' గు

పదము లుపయోగపడవచ్చును. కావుననే, వలన, కంటె, పట్టి మొదలగు నవి పంచమీప్రత్యయము లైనవి. సప్తమికి తమిళమున నిరువదియెనిమిదిపదములు కలవు. అనఁగా నొక్కొకవిభక్త్యర్థమును సూచించుట కనేకపదము లుండవచ్చు ననుట. ఇండోయూరోపియన్ భాషలలో నట్లు గాదు. సంస్కృతమున నొక్కొకవిభక్తికి-ఒక్కొకవిభక్తికే కాదు-విభక్తిలో నొక్కొకవచనమున కొక్కొకప్రత్యయమే కలదు. ఆప్రత్యయ మంగముతోఁ గలిసి యనేకవిధము లగుమార్పులను బొందుచుండును. ఏకవచనప్రత్యయములకును ద్విబహువచనప్రత్యయములకును గొన్నిటిలో నేమాత్రము సంబంధము నిరూపించుట కవకాశము లేకుండుటచే నివి ప్రత్యేకపదములుగా నేకాలమందైన నుండెనని చెప్పుటకు వీలు కనఁబడనందున నివి యఖండవాక్యమునుండి ప్రత్యయములుగనే విభాగింపఁబడియుండునేమో యనువాదము బలవత్తరమై కనఁబడుచున్నది. ద్రావిడభాషలలో రెండువచనములకు నొకటే పదము లేక ప్రత్యయము చేర్పఁబడును. అది యేకవచనమున సామాన్యముగా ప్రాతిపదికమునకును బహువచనమున బహువచనప్రత్యయమునకు నతికింపఁబడుచున్నది. ప్రాతిపదిక మనఁగా కర్తృరూపము. నామవాచకము. దీనికి నంగమునకును (inflexional base) మొదట భేదములేదు. అన్న, అమ్మ, తల్లి, బిడ్డ, తండ్రి, చెట్టు, పుట్ట మొదలగుపదములలోఁ జూడుఁడు. అన్న, అన్నచేతను, అన్నవలనను, తల్లియందు, పుట్టలోపల. తమిళములో విల్-విల్లై, విల్లాల్, విల్లుక్కు, తుళుభాషలో-మర, మరొను, మరొకు, మరత. ఈరీతిగా నాయా పదములు గాని ప్రత్యయములుగాని కేవలము ప్రాతిపదికమునకే చేర్పఁబడుచుండుటయు, నవి చేర్పఁబడినప్పుడు పుట్టుమొదటికాలములో నీప్రాతిపదికగాని యాయాపదముగాని యేవిధములగుమార్పులకు లోనుగాకుండుటయుఁ దెలియవచ్చుచునే యున్నది. ఈసంప్రదాయమే 'రాముచేతను' 'రామువలనను' అని వైకల్పికముగా, తత్సమపదములలోఁ గూడఁ గానవచ్చుచున్నది. కాలక్రమమున నీప్రాతిపదికమునకు నాయాపదమునకుఁ గలసంబంధమును వ్యక్తముచేయవలసివచ్చినపుడు మఱియొకపదము నాప్రాతిపదికమునకుఁ జేర్చుటయుఁ, గాలక్రమమున నాపదములు తమసంపూర్ణరూపమును బోఁగొట్టుకొని ప్రత్యయావస్థకువచ్చినపుడొకచో, స్వరసామ్యమునకు (vowel harmony) ననుసరించిన మార్పును బొందుటయుఁ దటస్థించెను.

కాని 'అన్న' యనుప్రాతిపదికకు వాక్యములోని యితరపదములతోడి సంబంధమును దెలుపుటకు 'చేత' 'వలన' మొదలగు పదములు చేర్పఁబడు చుండెను గదా, ఆయన్నకు నీయుపపదములకును గలసంబంధ మేమి? ఈ రెండుపదములచేరికచే నితరపదములతోడి సంబంధ మెట్లు తెలియఁగల దని ప్రశ్న కలుగవచ్చును. 'అన్న'కును 'చేత' కును గలసంబంధము విశేషణవిశేష్యభావసంబంధము, లేక షష్ఠీవిభక్త్యర్థరూపసంబంధము. "అన్నచేత నాపని చేయఁబడినది" అనువాక్యమునఁ గలపదములసంబంధమును విడఁదీసి చెప్ప వలెనంటే (అనఁగా దీనిశాబ్దబోధ యెట్లనఁగా) అన్న చేయి ప్రదేశము (నందు) పనిచేయఁబడిన (యట్టి) అది" అని చెప్పవలసియుండును. ఈసంబంధమును దెల్పుటకు ద్రావిడభాషలలో మొదట నేవిధ మగుమార్పు నవసరము లేకుండెడిది. ప్రాతిపదికమె కర్తృపదముగను, అది మఱియొకపదమునకు ముందు నిలుపఁబడినపుడు విశేషణముగను గూడ వ్యవహరింపఁదగియుండెడిది. ఇందు కుదాహరణములు, తల్లి-తల్లిపాలు ; వెండి-వెండిచెంబు ; చెట్టు-చెట్టుకొమ్మ; తమి. కడు (harshness, pungency) చుఱుకుతనము అనియర్థము. కడు నఱ్ఱై; కడువాయి-(పులి) ; పొన్-బంగారము, పొన్ముడి-బంగారుకిరీటము. ఈసంప్రదాయమునుబట్టియే తల్లి, తండ్రి, అన్న మొదలగుప్రాతిపదికములే కర్తృపదములుగ నున్నను, తక్కినవిభక్తులలో విభక్త్యర్థపదములుగాని ప్రత్యయములుగాని వానితరువాతఁ జేర్పఁబడినపుడు ఆపదములే విశేషణము లగుచున్నవి. దీనినిబట్టిచూడఁగా నీద్రావిడభాషలలో వాక్యసంఘటన మొకకాలమున-అనఁగా నతిప్రాచీనకాలమునఁ గేవలము విశేషణవిశేష్యభావసంబంధము మీఁదనే యాధారపడి యుండె నని తలంచుట కవకాశము కనఁబడుచున్నది.

ఈసంబంధము మొదట నాయాపదముల స్థానముచేతనే సూచింపఁబడుచుండెడిది. పూర్వపద ముత్తరపదమునకు విశేషణ మగుచుండెను. ఇప్పటికి నట్లె యున్నది. నాపుస్తకము, నీయిల్లు, అన్నప్పుడు నా, నీ, యనుపదములు మొదట ప్రాతిపదికములే. అనఁగా విశేష్యములే. కన్నడముమొదలగుకొన్ని భాషలలో, 'నాన్' 'నీన్' అనుటకు బదులుగా 'నా' 'నీ' యను మూలరూపములే కర్తృపదములుగా-ప్రథమావిభక్తిరూపములుగాఁ బ్రయోగింపఁదగి యుండుటచే 'నాపుస్తకము' అన్నదానికి 'నేను పుస్తకము' అనియే యొకప్పుడర్థ మన్ని తలంపఁదగి యున్నది. పిదప 'నా' యనుదానికి విశేషణత్వము

స్థిరించి యది యేయంగముగా వాడుకొనఁబడుచున్నది. మఱికొంతకాలము న కాపుస్తకముతోడి 'నా' యనుపదమునకుఁ గలసంబంధమును, ఇంక బలవత్తరముగ వ్యక్తీకరించుటకుఁగా (emphasise) 'నా' అనుదానికి 'అది' యనుపదము చేర్పఁబడినది. అప్పుడు 'నాది పుస్తకము' అయినది. ఇట్లా రెండు పదములకుఁ గలసంబంధమును వ్యక్తముచేయునట్టి మఱియొకసాధన మేర్పడినతర్వాత స్థానము మార్చి 'పుస్తకము నాది' యనిచెప్పినను సంబంధము చెడలేదు. అయితే తెలుఁగులో 'నాది పుస్తకము' అనుట వాడుకలో లేదు. దీనికి బదులుగా 'నాదువాక్యము' 'నాదుపుస్తకము' అని చెప్పుదుము. అనఁగా నీసర్వనామములకుఁ బైపదముతోడి సంబంధమును సూచించుటకుఁగాఁ జేర్పఁబడిన నిర్దేశవాచకసర్వనామపదము, 'అది' యనురూపమునఁ గాక 'అదు' అనురూపమున నున్నకాలముననె—అనఁగా 'అదు' అనుప్రాచీనరూపము 'అది' యనురూపముగాఁ దెలుఁగులో మాఱకపూర్వమె—చేర్పఁబడిన దని తెలియవచ్చుచున్నది.

ఇట్లే యీ 'అదు' అనుపదమున కింకను ప్రాచీనం బగు 'అత్తు' అను రూపము తమిళమునఁ గొన్నియమహద్వాచకపదముల కీసందర్భముననే చేర్పఁబడుచున్నది. కన్నడమున నిది 'అదు' అనురూపమునఁ దెలుఁగులోవలెనే కనఁబడుచున్నది. "కుళత్తుమీన్" (కొలను అది చేఁప)—అనఁగా, కొలనిది అను నిట్టిసందర్భములందె గాక, యిది ముఖ్యముగా విభక్తిప్రత్యయములు లేక పదములు చేర్పఁబడునప్పు డొకవిధ మగునౌపవిభక్తికప్రత్యయముగా నాప్రాతిపదికకుఁ జేర్పఁబడుచున్నది. అనఁగా నితరపదములతోడి సంబంధమును దెలియఁజేయుటకుఁ బ్రాతిపదికను విశేషణముగా మార్చుటకొఱకు—చేర్పఁబడుచున్నది యని గ్రహింపఁదగియున్నది. తమి. మరం, మరత్తాళ్—మరత్తినాళ్, మరత్తోడు—మరత్తినోడు, మరత్తిల్—మరత్తినిల్, కన్న. మరదిం, మరదత్తణిం, మరదొళ్; ఆరం—ఆర్త్తిల్, పూర్వమ్—పూర్వత్తిల్, పూర్వదల్లి, etc. 'ఆల్' 'ఓడు' 'ఇల్'—'అత్తణిం' మొదలగు విభక్తిప్రత్యయములు—లేక పదములు—కును గలసంబంధమును—అనఁగా ప్రాతిపదికముయొక్క షష్ఠ్యర్థమును సూచించుచున్న దని భావము. తెలుఁగులో, నౌపవిభక్తికప్రత్యయములుగాఁ దలంపఁబడుచుండిన 'టి' 'తి' ప్రత్యయములును ఈ 'అత్తు' అనుదానికి సంబంధించినవే. మర + అత్తు =

రత్తు అయినట్లుగనే గోయి+అత్తు, నూయి+అత్తు, క్రింది+అత్తు, అనునవి గోయత్తు=గోతు, నూయత్తు=నూతు, క్రిందత్తు అను రూపములు కాఁగా వీనిపైని స్థలవాచకంబును - కావుననే సప్తమ్యర్థద్యోతకంబుగఁ దలంపఁబడిన 'ఇల్,' అల్, అనుపదములు చేర్పఁగా, నూతు-ఇల్-నూతిల్ = నూతి,గోతు=ఇల్=గోతిల్-గోతి, క్రిందత్తు+ఇల్=క్రిందత్తిల్-మూర్ధన్య రకారసాహచర్యముచే తి-టి కాఁగా క్రిందటిల్-క్రిందటి మొదలగు రూపములు సిద్ధించినవి. మఱికొంతకాలమున కిట్టిపదములలోని 'టి తి' యనుదానిని వేఱుపఱిచి ఈ టి,తి-ప్రత్యయములే విభక్త్యర్థద్యోతకపదము పరమందున్నపుడు పూర్వమందలి విశేష్యమును విశేషణముగాఁ జేయుట కుపయోగపడు నని తలంచి, "యీవర్ణంబు లౌపవిభక్తికము లనియు, నివి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నిటికిం బ్రాయికంబుగ నగు నని వైయాకరణులు విధింపఁజొచ్చిరి. ఈ ప్రత్యయములు దేశ్యపదములకే గాని తక్కినవానికి రాకుండుటయే వీనిప్రాచీనత కొకనిదర్శనము. మఱియు నివి సామాన్యముగా ద్వితీయాద్యేకవచనమందు మాత్రమే చేర్పఁబడుచుండుటచే నీవాడుక యేకవచనమందు మాత్రమే బయలుదేఱిన దనియుఁ గావుననే 'అత్తు'యొక్క రూపాంతరములే కన్పడుచున్నవి గాని 'అవు' అనున దెప్పుడు చేర్పఁబడలే దనియు, గోతులుమొద లగురూపములలో 'గోతి'రూపము బాఁగుగా వాడుకలోనికి వచ్చిన పిదపనే యేకవచనముగాఁ దీసికొని 'లు' చేర్చియుందు రనియుఁ దలంపఁదగును. అంతకుపూర్వము బహువచనరూపము లేదా యనిన 'తి' ప్రత్యయాంతము కానిరూపము 'గోయిలు' అనున దుండిన నుండవచ్చును. 'తి, టి, అత్తు, తు'లతోఁగూడిన రూపములు నామముల విశేషణత్వము స్ఫుటపఱుచుటకుఁ దరువాత వచ్చినవి కాని మొదట నివి లేనిరూపములు లేకపోలేదు. కావుననే ప్రాయికవిధానమావశ్యక మైనది. "కనకమయమైన యాప్రో, లునఁ దమనుతులాహవంబు" "తన వీడునఁ గలమానికములు" ఇత్యాది భారతాదిప్రయోగములలో నీయౌపవిభక్తికప్రత్యయము కనఁబడకుండుటచే నివి యంతకుపూర్వపు సంప్రదాయమును సూచించుచున్న వని చెప్పవలసియున్నది.

ఇఁక నీయౌపవిభక్తికవర్ణములలో 'ఇ'కారముమఱియొకటి యున్నది. పై 'టి,తి'అనువాని చివర నున్న 'ఇ' కార మిది యా మఱియొకటి యా

యనువిషయము నాలోచించినప్పుడు 'మరత్తిల్' మొదలగు వానిలోని 'ఇ' కారము స్థలవాచకం బగు 'ఇల్' అనుపదములోని 'ఇకారమే యని స్పష్టమే. గావున నీ 'త్తి, ట్టి'లలోని ఇకారముకూడ "ఇల్"కు సంబంధించిన దని యే చెప్పవలసియుండును. కాని ఈ 'ఇ' అనునది 'ఇల్' యొక్క యవశిష్టభాగమేనైనచో విడిగా మఱియొక ప్రత్యయముగా నెందుకు గ్రహింపఁబడినది. అన్నచో 'అత్తు' పదము చేర్పని కొన్ని పదములకు 'ఇల్' చేర్పఁగా నందలి 'ల్' జాఱిపోయి పూర్వపదము నికారాంతముగా (ఊరు–ఊరిల్–ఊరి) వాని నుండి విడదీయఁబడినది. మఱికొన్ని పదములలో తుది 'ల్, ఩్'గా మాఱి 'ఇల్' అనునది 'ఇ఩్' అనురూపమునఁ గన్పడుచు నిప్పుడొపవిభక్తికప్రత్యయముగా వాడుకొనఁబడుచున్నది. (మరత్తినాల్) అనఁగా మొదట స్థలవాచకమై ప్రాతిపదికములు తరువాతఁ బ్రయోగింపఁబడిన ఇల్ అనునది సప్తమ్యర్థద్యోతకమై, కాలక్రమమున ఇ఩్ గా మాఱి, సప్తమ్యర్థము సంబంధార్థముగా గ్రహింపఁబడినపుడు సంబంధార్థమును గూడ సూచించున దగుటచే నామములను విశేషణములు గా మార్చుట కనువగు ప్రత్యయముగా (అత్తు అనుదానివలెనే) గ్రహింపఁబడినది. కావుననే, సంబంధము షష్ఠీవిభక్త్యర్థము గనుక, షష్ఠీవిభక్త్యర్థద్యోతకప్రత్యయము కూడ నైనది. తెలుఁగులో తుది ల్ జాఱిపోయి కాలు + ఇల్ కాలిల్–కాలి అనురూపమయినది. తమిళమున ల్ ఩్ గామాఱి ఇల్ ఇ఩్ ఐ, అచ్చటకూడ నీ తెలుఁగులోని ఇకారమువలెనే ఔపవిభక్తికప్రత్యయముగా వాడుకొనఁబడుచున్నది. కాల్ + ఆల్ (తృతీయా ప్రత్యయము ఆల్ యొక్క రూపాంతరమే) కాలాల్, కాల్ + ఇ఩్ + ఆల్ కాలినాల్ అని రెండురూపములును గలవు. ఇంతేగాక మరం మొదలగు పదములకుఁ జేర్పఁబడిన అత్తు అనుదాని యర్థము దానియుపయోగము కాలక్రమమున మఱచిపోఁబడినపిదప నీమరత్తు అనుదానిపైని ఇ఩్ కూడ చేర్చి దానితరువాత విభక్తిప్రత్యయములను జేర్చుటకు మొదలుపెట్టిరి. కావుననే మరత్తాల్, మరత్తినాల్, మరత్తోడు–మరత్తినోడు, మరత్తినదు, మరత్తినిల్ అనురూపములు తమిళమున బయలుదేఱినవి. ఈచివర రెండురూపములలో మఱియొక విశేషము కలదు. మరత్తినదు అనునది షష్ఠీ విభక్తిపదము. దీనిని విడఁదీసినచో, మర + అత్తు + ఇ఩్ + అదు అనియగును. మొట్టమొదట మరకు సంబంధార్థమున అత్తు కలిపినారు. దీనియర్థము మఱచిపోయినతరువాత స్థలవాచకపద మగు ఇల్ కలిపినారు. కాలు + ఇల్ అనగా కాలుయందు(నొప్పి) మరత్తు + ఇల్ అనఁగా, చెట్టుయందు(ఉన్నకొమ్మ)

అను సప్తమ్యర్థభావమునుండి కాలునందలిది-కాలిది, చెట్టునందున్నది-చెట్టుకు సంబంధించినది గావున కాలి, మరత్తిన్ అనువానికి సంబంధార్థము లేక షష్ఠీ విభక్త్యర్థము సంప్రాప్తించినది. కావున స్థలవాచక మగుఇక్-ఇన్-ఇ,ఇన్‌లు ఐ షష్ఠ్యర్థద్యోతక ప్రత్యయములైనవి. ఈఇన్ యొక్క మూలార్థము మరత్తుతోఁ జేరి రూపుమాసిపోయినతర్వాత, మరల సంబంధార్థమును వ్యక్తము చేయుటకుఁగాను అదు అనునది (ఇది పూర్వపు అత్తుయొక్క అర్వాచీనరూపమే) మరలఁ జేర్పఁబడినది. ఇట్లు మరశబ్దమునకు షష్ఠ్యర్థరూపము మరత్తినదు దగ్గఱకు వచ్చినది. మఱికొంతకాలమునకు మఱేమి చేర్పఁబడునో తెలియదు. ఇఁకమరత్తిల్ అన్నప్పుడు మరత్తిన్ అనుదానిలోని ఇన్ యొక్క మూలస్వరూపము ఇల్ ఏ అయిన నప్పటికి నాస్వరూపము, దానియర్థముఁ గూడ మఱచిపోఁబడి, యది కేవలము షష్ఠీప్రత్యయముగా వాడుకలోనికి వచ్చినతర్వాత మరల ఇల్ అనుదానినే సప్తమ్యర్థద్యోతక ప్రత్యయముగాఁ జేర్పఁజొచ్చిరి. ఇట్లు మరత్తినిల్ అనునది మర + అత్తు + ఇల్ (న్) + ఇల్ -అని యిట్లేర్పడినది. మొదటి ఇన్ యొక్క మూలార్థము విస్మృత మగుటచే ఇల్‌పైని మరల ఇల్ చేర్చుట యేమనెడి శంక గలుగుటలేదు. తెలుఁగున, కన్నడమునను గూడ ఇన్ అనునది సంబంధార్థద్యోతక మైనపిదప సప్తమ్యర్థ సూచకముగ ఉల్ అను మఱియొకపదము చేర్పఁబడినదిగాని మరల ఇల్ అనునదే చేర్పఁబడలేదు. కావున ఇంటిలో, నూతిలో ననియు, మరదోళ్ అనియు నైనవి. ఆధునికకన్నడ ప్రత్యయ మగు అల్లి అనునది స్థలవాచక మగు అల్ అనుదానినుండి యేర్పడినదె. అల్లి యనునది యాధునికకన్నడప్రత్యయమే యైనను అల్ అనున దింతయాధునికము కాదు. ఇన్ ఉ పదములవలెనే యదియు మొదట స్థలవాచకపదము, కావుననే సప్తమ్యర్థద్యోతకముగ ప్రాతిపదికలతరువాతఁ జేర్పఁజొచ్చిరి. కన్నడమున అల్ అల్లి కాఁగా తెలుఁగులో అల్ అన్ గామాఱి, పంటన్, వింటన్, రాతన్, ఇత్యాదిపదములలో గన్పడుచున్నది. పంటన్‌గాఱికె నన్నప్పుడు పంటియందు అనియేగాక కొఱుకుటకు పన్నుసాధనమైన దనునర్థము గ్రహింపఁబడినపుడు పంటిచేతను అను నర్థముగూడ జెప్పఁదగియుండుటచే నిదియే తృతీయార్థద్యోతకమైనది. కోల, లంక మొదలగు అకారాంతశబ్దములకు ఈ అన్ చేర్పఁగా కోలన్, లంకన్, అయి చివర నూతగా ఉకారము నొకదానిని గ్రహించి కోలను, లంకను-

(ఇట్లే ఊరు-ఊరను-ఊళ్లను) అయినవి. ఈతుది ను అనుదానిని విడఁదీసి-(లంకను అనఁగా లంకయందు చూచుటయే లంకనుజూచుట యగును గావున, సప్తమ్యర్థమునుండియే తృతీయతోపాటు ద్వితీయకూడ బయలుదేఱిన దగుటచే)-దీనినే ద్వితీయాప్రత్యయముగా గ్రహించి "జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు"నని సూత్రించి కోలం గూలనేసె "లంకం గలకలంబు పుట్టె"నన్నప్పు డివి ద్వితీయాప్రత్యయాంతము లనియు వీనికి కోలచేతను లంకయందు అని యర్థము చెప్పుకొనవలె ననియు వైయాకరణులు విధించినారు. ఈకార్యము ఉదంతమునకు బహుత్వమందే యగునని "శత్రుసేనలను బాణంబులను రూపుమాపె, మీనంబులు జలంబులనుండు"నని యుదాహరించినారు. జడవాచకంబులపైననే గాక అజడంబులలోఁగూడ నిక్కార్యము గన్పడుటకు "అతని దోర్మధ్యసరసి నోలలాడుచున్న ఘనతరస్తనచక్రవాకముల నలరు," "మనుజుల విప్రుండు సమధికత్వభాజనమంత్రు వేదప్రపంచవిదులు" భారతశాంతి అని యుదాహరించిరి. మఱియు "రాముఁడొక్క బాణమున వాలిఁగూలనేసె" "ఏపున గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు" ననునప్పుడు బాణమున ఏనుఁగున అనుపదములయందలి తుది నకారము పైన తృతీయాసప్తములయందు వచ్చునని విధించిన ప్రత్యయముకంటె భిన్నంబని గ్రహించి దీనికి మరల "ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు" నని ప్రత్యేకవిధానము చేయఁగడంగిరి. ఇంతకు పైపదములలో అస్ అని యొకచోట అను లేక ను అని మఱియొకచోట, ఇచ్చట న యని పలురూపముల గన్పడుచుండుటయే వీనిట్లు తలంచుటకుఁ గారణ మైనది. ఉల్-లో అయినట్లుగనేఁ దీనినే వర్ణవ్యత్యయ మందురు- (Metalhesis) అన్-న కావచ్చును. న యే సప్తమీవిభక్తిప్రత్యయముగా నిటీకలఁ జెప్పఁబడిన నకారమయియున్నది. అస్ అనునదె అందు కూడనైనది. అస్ అనునది స్థలవాచక మగుటచే నాస్థలమును నిర్దేశించినప్పుడు పదాంతమునఁ గలిగెడి యూతమూలముగా అన్ను అనిపలుకునపుడు అనునాసికతో నూఁదుట కష్టతర మగుటచే నాసికాద్వారము మనకుఁ దెలియకుండఁగనే మూఁతపడిపోయి, యానిశ్వాసవాయువు ముఖద్వారమున బయలువెడలునపుడు మధ్యనొక దకారధ్వని బయలుదేఱుట తటస్థించును. ఇట్లు అన్ను అనుదానిలోని నకారఉకారముల మధ్య ద్ అనున దొకటి బయలుదేఱి (దీనినె స్వరభక్తి

(Anaptyxis) అని శబ్దశాస్త్రజ్ఞులందురు) అందు అనుపద మేర్పడినది. ఇట్లే లేక దీని సాదృశ్యముచేతనే ఇందు ఎందు మొదలగునవి భాషలోఁ గలిసి యుండును.

దీనినిబట్టి మనకుఁ దెలియవచ్చిన దేమి? ద్వితీయాతృతీయాసప్తమ్యర్థముల నొకటే పదము లేక ప్రత్యయము వాడఁబడినట్లు కనఁబడుచున్నది. అనఁగా సందర్భానుసారముగా నొకపదమే యీ మూఁడువిభక్తులయర్థమును సూచించున దగుటచే నాంధ్రవైయాకరణులు 'లంకను' మొదలగువానియం దలి చివర 'ను' అనుదానిని విడఁదీసి ద్వితీయావిభక్తిద్యోతకప్రత్యయముగా గ్రహించి-తక్కిన విభక్తులయర్థములను సూచించుటకు చేత, మెయి, అందు, లోపల మొదలగు నితరపదము లుండుటయు నీ ద్వితీయ కీ 'ను' అనున దొక్కటే యుండుటయు నె వీరిట్లు తలఁచుటకుఁ గారణమై యుండును—ఈద్వితీయయే తృతీయాసప్తమ్యర్థములను గూడ సూచించుచున్న దని వానికి ద్వితీయను విధింపఁగడంగిరి. ఏ దెట్లైనను భాషలో నొకప్పుడు 'అన్' లేక 'అను' అనునది సప్తమీతృతీయాద్వితీయార్థముల సూచించెడిది యన్న విషయమే మనము దీనినుండి గ్రహింపఁదగినది.

ఇంతకు తేలిన దేమనఁగా నీద్రావిడభాషలలో నొకకాలమున ప్రాతిపదికల కితరపదములతోడి సంబంధము తెలుపుటకుఁ గాను స్థలవాచకములగు అల్ ఇల్ అనురెండుపదములు విశేషముగాఁ జేర్పఁబడుచుండెడివి. ఇంతకు పూర్వము—వీనితోపాటు కూడా—అత్తు-అదు అనునవికూడా సంబంధార్థద్యోతకములు గాఁ జేర్పఁబడెడివి. ఉల్ కంటె అల్ ఇల్ అనువానికిఁ బ్రయోగబాహుళ్యము హెచ్చు. కావుననే యవి రూపుమాసిపోయి షష్ఠీవిభక్తికప్రత్యయములై పోయినవి. ఈ అల్ ఇల్ అనువానిలోని లకారపొల్లు నకారపొల్లుగా మాఱుటయు (cf ములుగోరింట-మునుగోరింట, తోల-తోన; లేదు-నేదు etc.) చివర ఉకారము నూఁతగాఁగొని అను అనికాఁగా, ద్రుతతరోచ్చారణమువలనఁగాని, స్వరమందలి మార్పు (accent change) వలనఁగాని యానకారపొల్లు కొన్నిచోట్ల జాఱిపోవుటయు మిగిలిన ఇ, అ అనునవి తుదకు సంబంధవాచకప్రత్యయము లగుటయుఁ దటస్థించినది. తమిళమున ఇన్ అనురూపమే మిగిలి షష్ఠీవిభక్తికప్రత్యయముగాఁ జేర్పఁబడుచున్నది. వీనిలో ఇన్ సాధారణముగా నేకవచనమునను, అన్ బహువచనమునన్ను సం

బంధార్థమునఁ గేవలప్రాతిపదికకుఁగాని (cf కాల్ ఆల్, కాలినాల్ కాల్ + ఇస్ + ఆల్ ; గురువు + ఇస్ + ఇల్ = గురువినిల్ ; కాలు + ఇస్ + చేత = కాలిచేత, కాళ్ళచేత ; ఊరు + ఇన్ + లోన = ఊరిలోన, ఊళ్ళయందు ; "సీరిలోన దోఁచు తారక ప్రతిబింబ మొక్కొ యనఁగ" అన భార. అది. 5 ఆ.) అత్తు-అదు చేర్చిన యంగమునకుఁగాని చేర్పఁబడినవి. (cf మరత్తాల్-మరత్తినాల్ ; నూయి-నూతిలో నూతులలో etc.) తెలుఁగులో బహువచనమున నొక్క అ (అస్) కారమె చేర్పఁబడుచున్నది. అస్ అనునది యేకవచనమందుఁగూడఁ జేర్పఁబడుచుండె ననుటకు, ఊరస్, గోరస్, ఇంటస్, పంటస్, అను తెలుఁగురూపములే కాక (ఈ అస్ అనునదె నకారమై పైన నుదాహరించిన ఏనుఁగున నేనుఁగు బాణంబున అనుచోట్లనెగాక, కువర్ణకంబు పరంబగునపుడు ఉకార ఋకారములకు ఆగమముగాఁ జెప్పఁబడినదై-రామునకు విధాతృనకు, అనుచోట్లకూడఁ గనఁబడుచున్నది) కన్నడమందలి మరద, అవన, ఊర, మణ్ణ మొదలగు షష్ఠీరూపములు కూడ నిందుకు నిదర్శనము లగుచున్నవి. తెలుఁగులో డుమంతంబునకుద్వితీయాద్యేకవచనము పరమైనపుడు సర్వత్రవిభాషగను అనుదంతమగు తెనుఁగుడుమంతమునకు నిత్యముగాను వచ్చి రామున్నిని, రామున్నిచేతను, మగన్నిని, మగన్నిచేతను, మగన్నివలన ఇత్యాది రూపములలోని ని. తెచ్చి పెట్టినది. ఇస్ యొక్క మాఱురూపమగు ఈ ని యే యయియున్నది. కన్నడమున షష్ఠీప్రత్యయము అ, ఆధునిక కన్నడమున సప్తమీప్రత్యయము అల్లి ప్రాచీనకన్నడమునందలి ద్వితీయాప్రత్యయమగు అమ్ ఈ అస్ యొక్కరూపాంతరమే యై యుండును. అప్పుడుకూడ వ్యవహారములో అస్ కూడ ఉండియేయుండి ఆధునికకన్నడములో అదే అస్ అన్న గా మరల పొడసూపినదేమో? తెలుఁగులో ద్వితీయాప్రత్యయమగు ను అనునది పంటస్-పంటను, అన్న + అస్ = అన్నస్-అన్నను, (అనఁగా పంటియొక్క ప్రదేశమందు పట్టిలాగెను, అన్న (ప్రదేశమును లేక-ప్రక్క) ను చూచెను) ఇత్యాది పదములనుండి ను అనుదానిని వేఱుచేయఁగా నేర్పడియుండును. ఈ ప్రత్యయమే తరువాత తక్కిన ప్రత్యయములన్నిటితో పాటు షష్ఠియగునిన్నంతముతరువాతఁ జేర్పఁబడుచు వచ్చినది. ఎప్పుడు ఇన్నంతమగు షష్ఠిలోని నకారము తెలుఁగులో జాఱిపోయి—తమిళమలయాళములలోఁ బది యెట్లు యున్నట్లు చూపఁబడినది—దాని మహాల్పార్థము మఱచిపోఁబడినదో, అప్పటినుండియు నది కేవల ప్రత్యయమై

సంబంధార్థమును సూచింపఁదొడఁగినది. ఇట్లే కన్నడములో అకారముగూడ సంబంధార్థ ప్రత్యయమైనది. వీనిపైని తక్కిన విభక్త్యర్థద్యోతక—లేక విశేషార్థద్యోతకపదములు చేర్పబడినవి కావుననె యివి యాపవిభక్తికవర్ణములుగాఁ బరిగణింపఁబడినవి.

ఇంతవఱకు అనఁగా అంగముయొక్క రూపనిష్పత్తి యగువఱకు తమిళము కన్నడము తెలుఁగు మొదలగు భాషలలోఁ గొంతసామ్యము కనఁబడుచున్నది. అనఁగా, కేవలము ప్రాతిపదికనుండి యీయంగము (inflexional base) భాషలో నేర్పడువఱకు నీభాషలు మాటాడువారందఱు బాగుగా విడిపోయినట్లు కనఁబడదు. అనఁగా నీభాషలు ప్రత్యేకభిన్నములగుభాషలు కాలేదనుట. అట్లుతరువాతనే అనఁగా తమిళముమాటాడువారు తెలుఁగువారు కన్నడమువారు ఒకరినుండి యొకరు విడిపోయినతరువాతనే అంతకుపూర్వమే యేర్పడినయంగమునకు ఆయాభాషలలో నాయావిభక్త్యర్థమును బాగుగా సూచించునని వారుతలంచినపదములను జేర్చుకొనుచు వచ్చిరి. కావుననే విభక్తిప్రత్యయములు ప్రతిభాషలోను వేర్వేఱుగా నుండుట తటస్థించినది.

ఈ విభక్తిప్రత్యయము లని తలంపఁబడుచున్నవి ఇప్పుడిప్పుడు కొంతవఱకు ప్రత్యయావస్థను బొందుచుండిన స్వతంత్రపదములే యయి యున్నవి. కన్నడమునను తెలుఁగుననుగల ద్వితీయావిభక్తిప్రత్యయములు, అన్ అనుపదముయొక్క రూపాంతరములేయని సూచింపఁబడినది. తమిళములోని 'ఎయ్' అనునది యీఁఅన్ లోని నకారపొల్లుజాఱిపోగా మిగిలిన 'అ'కారముయొక్క రూపాంతరమే మో యని యూహింపఁదగియున్నది. ఏలయనఁ దెలుఁగున అకారాంతము లగుపదము లనేకములు తమిళమున ఏయ్‌దంతములుగఁ గన్పడుచున్నవి. cf తల-తలై, వల-వలై etc. తృతీయావిభక్తి యందలి 'ఆల్'కూడ 'అల్' యొక్కరూపాంతరమే మైయుండును. ఏలయన దీనికి 'ఆన్' అనిరూపాంతరముకూడ నున్నట్లు తెలియవచ్చుచున్నది. ''చేతన్'అనునది 'చేయి' శబ్దముయొక్క అన్నంతరూపము అన్న చేతస జేయఁబడియె, ననఁగా అన్న చేతి (చేయి+అత్తు+ఇల్) (యి) యందు చేయఁబడిన దని యర్థము. కన్నడమందు 'ఇల్'యొక్క రూపాంతరమే యగు 'ఇమ్' అనునది చేర్పఁబడుచున్నది. సహార్థమున 'ఓడు'అని తమిళమునను తోడన్ అని తెలుఁగునను గలవు. 'ఓడు' 'తోడు' అను నీరెండుపదములకుఁగూడ 'సంశ్లేషించుట' కలుపుట,

ఒకదానితో నొకటి చేరుట, అనునర్థములు కలవు. తెలుఁగువారు 'తోడు' అనియు తమిళులు 'ఓడు' అనియు గ్రహించియుండవచ్చును. లేదా మర త్తోడు' మొదలగుపదముల యనుచితవిభాగముచే మర + తోడు, మరత్తు + ఓడు) రెండురూపము లేర్పడియుండును. 'తోడ మాటాడకునికి' 'తల్లి తోడు' అనుచోట్లదీనికి వ్యస్తముగ ప్రయోగము కూడఁగలదు. ఒడంబడిక 'ఒడబడు' అనువానిలో 'ఒడు' అనురూపముగూడఁ దెలుఁగులోఁ గన్పడుచునె యున్నది సంస్కృతసాంప్రదాయమునుబట్టి యీ 'తోడ' నుగూడ తృతీయావిభక్తిల్లో వైయాకరణులు కలిపివేసినారు. ఇఁక చతుర్థ్యర్థమునగల ‹కు' క్కు, కె, గెయను నవి యర్థము తెలియని ప్రత్యము లని యొప్పుకొనక తప్పదు. కాని యివి సిథియన్ కుటుంబమునకుఁ జెందినభాషలనేడింటిలోఁ గన్పడుచుండుటచే పైనుండి యెరవుగా వచ్చి సంక్రమించిన దని చెప్పక తీరదు. కు,కి యనునవి చతుర్థ్యర్థద్యోతకములేమైనను దెనుఁగున షష్ఠీప్రత్యయములుగా గ్రహింపఁబడి నవి. 'కొఱకు' అనునది 'కొఱ'శబ్దమునకు 'కు'ప్రత్యయము చేర్పఁగా వచ్చి నది-ప్రయోజనమునకు- అనియర్థము- కొఱశబ్దము 'కొఱమాలిన' 'కొఱ గాని' యనుదానిలో గన్పడుచునేయున్నది. "కయి" యనునది "కు + అయి"- వాని కయి అనఁగా- వాని నుద్దేశించి యని యర్థము. పంచమి యందలి "వలనన్" అనునది 'ప్రక్క' 'వైపు' అనునర్థముగల 'వలను'అను పదముపై 'అన్' చేర్పఁగాఁ గలిగినపదము. ప్రక్క లేక వలను అనుపదము నకు బదులుగా 'ఇల్' అనుపదమునే ప్రయోగించుకొని దానిపైని "వలనన్ ఉండి యని మనము చెప్పినట్లుగా తమిళులు ఇరుందు" అనుపదమునుజేర్చి 'ఇల్ ఇరుందు' అని పంచమ్యర్థమున వాడుకొనుచున్నారు. 'వలనన్' అను దానితో సమానార్థకమే యగు ‹అత్తణిం'=(అత్తణ + ఇం=అత్తణ=ఆప్రదే శము- ఇం=అందు=ఆప్రదేశమందు అనియర్థము) అను పదము కన్నడమున వాడుకొనఁబడుచున్నది. కంటె యనునది కి పైఁ జేర్పఁబడిన అంటె యను పదము. వానికంటె- అనఁగా వానివిషయమై చూచి మాటాడవలసినట్లయిన వీఁడే గొప్పవాఁడు అని యర్థ మగును. దీనితో సమానార్థకమై యాధు నికకన్నడమున కింత=(కి + ఇంత) యనుపదమొకటి వ్యవహారములో నున్న ది. ఉల్ అనుస్థలవాచకపదము ఇల్, అల్ అనువానివలె విశేషక్రమముగ లోనై యనేకము లగురూపములబొందినట్లు కనఁబడదు. ఇది లోగా మాత్రే

తెలుఁగున సప్తమ్యర్థద్యోతక మైనను షష్ఠీప్రత్యయముగనే గ్రహింపఁబడినది. తమిళమున నింకను ఇల్ అనునదే సప్తమ్యర్థద్యోతక మగుచున్నది. కన్నడమున "ఉళ్, ఒళ్" అనువానికి విశేషప్రచారము కలదు గాని యిటీవల అల్ నుండి అల్లి యనురూపము కూడ సప్తమ్యర్థద్యోతక ప్రత్యయ మైనది.

ఇట్లు ప్రత్యయములుగాఁ దలంపబడుచున్న యీపదములే కాక కొన్ని విభక్త్యర్థములను సూచించుట కింక ననేకము లగుపదములు కలవు. తృతీయార్థమున చేసి, మెయిలు, పంచమ్యర్థమున పొంటె, తమిళమున సప్తమ్యర్థమున కణ్, కాల్, కడై, వయిఙ్, ముఙ్, ఇడమ్, మేల్, పిఙ్, అగమ్, పుఱమ్, మొదలగు స్థలవాచకపదములు సుమారుముప్పదివరకు గలవు. కావున వీనిని గేవలము ప్రత్యయము లనుట కేవలసంస్కృతభాషాసాంప్రదాయ బలముచేఁగాని వేఱుగాదు. ఈపదము లన్నియు సంబంధార్థద్యోతక మగు షష్ఠీవిభక్త్యంగమునకుఁ జేర్చఁబడుచుండుటచే షష్ఠి నొకవిభక్తిగాఁ దలంపవచ్చును. అనేకములై భిన్నములగు పదములచే సూచింపఁబడెడి యర్థభేదములనుపదురీతులుగ మాత్రము విభజించి సప్తవిభక్తులలోను బిగించుట యెట్లుసాధ్యపడును? వీనిలో కొన్ని పదములు మఱికొన్నిటికంటె నెక్కువగా వాడుకలో నుండి మార్పులకు లోనగుటచేతను వానిమూలార్థ మొకప్పుడు మఱచిపోఁబడుటచేతను, సంస్కృతమందలి విభక్తిప్రత్యయముల స్థితికి వచ్చుచున్న వని చెప్పఁదగియున్నను, సంస్కృతాదిభాషలయందువలె సంగమునకును వీనికిని గల సంబంధ మెట్టిదో తెలిసికొనుటకు దానినుండి వేఱుపఱచుటకును వీలులేకపోలేదు. ఈపదములుషష్ఠ్యర్థమును దెలుపుసంగమునకుఁ జేర్పఁబడుచుండుటచే నీద్రావిడభాషలయందు వాక్యమందలి పదములసంబంధము విశేషణవిశేష్యభావరూపంబై యున్న దనియు, నిట్టివిశేషణవిశేష్యభావసంబంధమే యీభాషలలో వాక్యసంఘటనారీతి కాధారంబై లక్షణము గూడనై యున్నదనియుఁ దెలియవచ్చుచున్నది.

కాని యిప్పుడు సప్తవిభక్తు లనిచెప్పి వానిలో ద్వితీయమొదలు సప్తమీవిభక్తివఱకుఁ గల ఆఱువిభక్తులు సంబంధార్థముపై నాధారపడిన వనియు నివన్నియు సంబంధార్థమును సూచించు సంగమునకు నాయావిభక్త్యర్థమును సూచించు ప్రత్యేకపదములఁ జేర్చుటచే నేర్పడుచున్న వని చెప్పితివిగదా ఇందులో నేడవది యగుప్రథమావిభక్తిని గూర్చి చెప్పలేదేమి యనిఱుడుగ

వచ్చును. దీనికి సమాధానము నింతకుపూర్వమే ద్రావిడభాషలలో ప్రాతిపదికమునకును లేక నామవాచకమునకును కర్తృపదమునకును మొట్టమొదట నేమియు భేదములేదని చెప్పినప్పుడే సూచింపఁబడినది. ఈభాషలలో ప్రాతిపదికమే విశేష్యము, దీనికి మఱియొకపదము చేర్చినప్పుడిదే విశేషణము కూడనగును. కావున నీభాషలలో ప్రథమావిభక్తి యనునదే లేదని చెప్పఁదగియున్నది. ఇంతేగాక సంస్కృతవైయాకరణు లొకషష్ఠీవిభక్తితప్పఁ దక్కినవన్నియు కారకవిభక్తులు అనఁగా క్రియతో నన్వయించునవనియు, తక్కిన విభక్తులు వ్యధికరణములై యుండ ప్రథమావిభక్తిమాత్రము సామానాధికరణ్యము గలదనియు దెల్పుచు వాక్యమున క్రియకే ప్రాధాన్యము కలదనియు "క్రియానుషంగేన వినానపదార్థః ప్రతీయతే", క్రియలేనిదీ వాక్యార్థమే లేదనియుఁ జెప్పుచున్నారు. కాని ద్రావిడభాషలలో సంస్కృతాదులలో వలె మొట్టమొదట వాక్యమున క్రియకు ప్రాధాన్యము కలిగినట్లు కనఁబడదు. ప్రాచీనకాలమున అనఁగా సంస్కృతభాషతోడి సంబంధము కలుగుటకుపూర్వమీభాషలలో క్రియాపద మనునదే లేదని చెప్పవలసియున్నది. ఇటీవల క్రియారూపము లని తలంపబడుచున్నవి నిశ్చయముగా క్రియావిశేషణముల పైని జేర్పఁబడిన సర్వనామరూపములతోఁ గూడిన పదములు వెళ్లుచున్నాఁడు, అనఁగా వెళ్లుచున్నవాఁడు-"గమనానుకూలవ్యాపారవాన్ సః" అని వెళ్లుచున్నయను క్రియావిశేషణము తచ్ఛబ్దార్థకసర్వనామమునకు విశేషణ మగుచుండుటచే నావాక్యమున క్రియకు ప్రాధాన్యము కలదని గాని కర్తృపదము క్రియతో నన్వయించుచున్న దని గాని చెప్పుట కవకాశము కనఁబడదు. కావున దీనినిబట్టి నామవిభక్తులకు వలెనే క్రియావిభక్తులకును ఈద్రావిడభాషలలో మొట్టమొదట విశేషణవిశేష్యభావమే మూలాధారంబనియు క్రియావిశేషణములేగాని సమాపకక్రియారూపము ప్రాచీనకాలమునలేనేలేక యిటీవల సంస్కృతభాషాసంసర్గముచే నేర్పడినవేమో యని తలంపఁదగియున్నది. ఇట్లు భాషాకల్పనయందే యీద్రావిడభాషలకును ఆర్యభాషలకును గొంతభేదమున్నట్లు గ్రహింపవలసియున్నది గావున ద్రావిడభాషాతత్త్వవిమర్శకు లీవిషయమును బాగుగఁ బరిశీలింతురుగాక యని విన్నవించుచున్నాఁడను.



# మహాభారతమీమాంస.

—: చర్ల నారాయణశాస్త్రిగారు :—

(గతసంచిక శేషము.)

చెల్లక యుండెను బౌద్ధోపాసకులును జైనోపాసకులును జాతుర్వర్ణ్యధర్మము నన్ని విధములను త్యజించిరి. ఇదేప్రకారముగా నాశ్రమవ్యవస్థయుఁ బడకపోయెను. సమాజమునందు గడబిడ ప్రారంభమయ్యెను. మొదట జతుర్థాశ్రమమునం దధికారము బ్రాహ్మణులకు నితరమైనయార్యవర్ణములకే యుండెను; కాని బౌద్ధభిక్షువు లీయాశ్రమాధికారము నందఱకు నిచ్చివేసిరి. దీనివలన, నశిక్షితులై కేవలోదరపోషకు లగువారును, నీచజాతులలోనివారును నగు వందలకొలఁదిబౌద్ధభిక్షువులు బిచ్చ మెత్తుకొనుచు నిటునటుఁ దిరుగ నారంభించుట పరిణమించెను. ఈక్రొత్తధర్మముల ననుసరించినవారు ధర్మముయొక్క యాచరణ మనఁగా కేవలము నీతియొక్క యాచరణము దక్క మఱియొండుగాదని నిశ్చయించుకొనిరి. తత్త్వవిచారవిషయమునఁ గూడ నీధర్మములు లోకులయొక్క మతములయందు నుప్పెనవంటి యొకయుపద్రవము పొడము నంతదనుక ముందంజవైచెను. ఈధర్మములు పరమేశ్వరుఁడు లేనేలేఁడని ప్రతిపాదించుటకు మొదలిడెను. లేనిచో, నీశ్వరుఁడుండెనా లేదా? యనువిషయముగుఱించి విచారమే మనుష్యునికిఁ జేయరాదని చెప్పెను. అవి ప్రకటముగాఁ మనుష్యునియం దాత్మయే లేదను సిద్ధాంతము స్థాపించుటకుఁగాను ప్రవర్తించెను. సారాంశము, ఈక్రొత్తధర్మములు రెండు నన్నిప్రకారములను సనాతనధర్మముయొక్క మతములకు విరుద్ధములుగా నుండెను. అవి యప్పటిలోకులయందు నిరీశ్వరవాదమును నిరాత్మవాదమును వ్యాపింపఁజేసెను.

శకమునకుఁ బూర్వము మూఁడవశతాబ్దియందు భారతవర్షమున నేధార్మికావస్థ యుండెనో యయ్యది పైని వర్ణింపబడినది. దానిఁబట్టి సనాతనధర్మముమీఁదికి బౌద్ధజైనధర్మము లెట్లు దాడివెడలినవో తెలియనగును; అశోకునియొక్క యప్పటిశాసనబలమువలన నపుడే బౌద్ధధర్మమునకు సంపూర్ణమైన విజయము కాలేదు; అయినయెడల దానికిఁ గేవల మారంభమే యైయుండెను. కాని సనాతనధర్మమునకు నతఃస్థితములైన యాదాడులను సహించుటకై యప్పుడు సామర్థ్యము లేకుండెను. మన ప్రాచీనసనాతనధర్మమందుఁ గూడ నాసమయమున ననేకములైన మతమతాంతరములు ప్రచలితములై యుండెను. వానియందుఁ బరస్పరము కలహమగుచుండెను. శత్రువులయొక్క దాడులకుఁ బ్రతీకారము చేయుటకై యావశ్యకమైన యైక్యమును స్నేహము నాసమయమున సనాతనధర్మమునందు బొత్తిగా లేకుండెను

కొందఱు విష్ణువుని ప్రధానదేవతగా నెంచి పాంచరాత్రమతము ననుసరించిరి; కొందఱు శివుని ప్రధానదేవతగా నెంచి పాశుపతమతమునవలంబింప మొదలిడిరి; మఱికొందఱు దేవిని ప్రధానశక్తిగా నెంచి శాక్తమతము ననుసరించిరి; కొందఱు సూర్యుని, కొందఱు గణపతిని, మఱికొందఱు స్కందుని నుపాసించిరి. ఈయుపాసకులయందు సంపూర్ణమైన శత్రుభావముండెను. వీరియందు కేవలము దేవతలను సంబంధించికాక, తత్త్వవిచారములను సంబంధించియు మిక్కిలి బద్ధవిరోధమేర్పడెను. యజ్ఞయాగాదులవిషయమునఁ గూడ లోకులవిచారము లిటునటుఁ గదల నారంభించెను. తత్త్వజ్ఞానము విషయమై వేదాంతమునకును సాంఖ్యమునకును జగడము జరుగుచుండెను. అన్నిటికంటెను 'గొప్ప' కష్ట మిదియైయుండెను. ఏది యనఁగా, సనాతనధర్మముయొక్క యాదిగ్రంథములైన వేదములు సర్వసాధారణముగా దుర్బోధములై యుండెను. సామాన్యులందఱుఁ దెలిసికొనుటకుఁ దగిన యేయొకగ్రంథమును నాసమయమున లేకుండెను. ప్రాచీనకాలమునందలి పెద్దపెద్ద పూర్వికులయొక్కయు నవతారపురుషులయొక్కయు వర్ణన యిటునటుఁ జిందరవందర యగుట తటస్థించెను. వారు గాథారూపములైన చిన్నచిన్న యాఖ్యానములయందు లుప్తప్రాయములై యుండిరి. నీతిని ధర్మమును శిక్షించి సమాజమునందు నీతిమంతులు నగుటకు స్ఫూర్తిని బుట్టింపఁ జాలినగ్రంథములు బొత్తిగా లేవయ్యెను. ఋషులయొక్కయు, రాజులయొక్కయుఁ జిందరవందరయైన వంశావళులు సూతులయు భట్టువాండ్రయు జీర్ణములైన చిన్నచిన్న పుస్తకములయందుఁ దఱచు నష్టప్రాయములైయుండెను తఱచు పరాక్రమవంతులైన పూర్వికుల విస్మరణమే యయ్యెను. ఇట్టి యవస్థయందుఁ బై రెండునాస్తికధర్మముల నెదుర్కొనుట సనాతనధర్మమునకు నింకను మిక్కిలి కఠినమైనపని యయ్యెను. సనాతనధర్మాభిమానులైన విద్వాంసులు బౌద్ధజైనధర్మములకే విజయము కలుగునని భయంపడ నారంభించిరి.

ఇప్పు డిచ్చటఁ గొన్నిప్రశ్నలు కలుగుచున్నవి. ఏవి యనఁగా—మన ధర్మప్రతిపాదకములైన యనేకప్రసిద్ధగ్రంథము లప్పుడు లేవా? ఆసమయమున రామాయణము మనుస్మృతియు జూడ లేవా? వేదాంతము, న్యాయము సాంఖ్యము, మీమాంసాసూత్రములు నెందుఁబోయినవి? ఏమి? ఆసమయమునఁ బురాణములు నితిహాసములు లేనే లేవా? ఈప్రశ్నము లన్నిటికినిఁ జెప్పు

అనియే యుత్తరము ఈగ్రంథము లిప్పుడేసమయమున నగుపడుచున్నవో, ఆస్వరూపమున నవి మహాభారతము తరువాతఁ జేయఁబడినవి. ఈ కాలనిర్ణయమునుగూర్చిన విచారము సందర్భానుసారముగా ముందు చేయఁబడును. ఇక్కడ మాత్రము ఇప్పటి రామాయణము శకమునకుఁబూర్వము మొదటి శతాబ్దియనియు, నిప్పటిమనుస్మృతికిఁగూడ సమయ మదేయనియు నింతచెప్పినఁ జాలును. వేదాంతసూత్రములు యోగసూత్రములును శకమునకుమునుపు రెండవశతాబ్దివి. ఆసమమునసాంఖ్యసూత్రముల జాడయే లేదు. వర్తమానస్వరూపముగల పురాణము లప్పుడులేవు. ఈగ్రంథములన్నియు నప్పుడు బీజరూపమున నుండియుండును; వాటియొక్క యేవిస్తర మీసమయమునసగుపడుచున్నదో, యది నిస్సందేహముగా మహాభారతమునకుఁ దరువాతిది నైయున్నది. వేయేల, మహాభారతముయొక్క ప్రత్యక్షోదాహరణమువల్లనే యీ ధార్మికగ్రంథము లన్నింటికిని సంపూర్ణస్వరూపము నిచ్చుటకై స్మార్తసనాతనధర్మీయులైన యాచార్యులకుఁ గలిగెననుటకు సందేహములేదు. అనగా, ఐతిహాసికదృష్టివలన, నీయన్నిగ్రంథములయొక్క పూర్వస్వరూపమును నిశ్చయించుటకు నిపుడు మహాభారతమే యొక సాధనముగాఁ జూడఁబడుచున్నది. ఈ ప్రకారముగా నశోకునిసమయమున, లేక యాసమమునకు సమీపమున, బౌద్ధజైనధర్మములుచేసిన ముట్టడికిఁ బ్రతిక్రియ గావించుటకు సనాతనధర్మావలంబులయొద్ద నేమియు సాధనములేక యుపాయము లేదయ్యెను, వారి ధర్మమును భిన్నభిన్నమతములు ముందువెనుకలకు లాగుచుండెను. ఇట్టి యవస్థయందు సౌతి భారతమునకు మహాభారతబృహత్స్వరూపము నిచ్చెను, సనాతనధర్మములో నియుంతటికలహములను దూరముగాఁ జేసెను. అన్నిమతముల నొకచోఁజేసి వానియందు మైత్రి నెలకొల్పుటకుఁ బ్రయత్నముచేసెను, కథల నన్నింటి నొకచోట సంగ్రహించి యాకథలకు సముచితములైన స్థానముల నిచ్చి భారతగ్రంథముయొక్క శోభను వృద్ధిపఱచెను; మఱియు సనాతనధర్మముయొక్క యుదాత్తస్వరూపమును లోకుల మతియునందుఁ జొనిపి సనాతనధర్మావలంబులయందు నొక నూతనశక్తిని బుట్టించుటకు మహత్త్వపూర్ణమైన పని జేసియుండెను. కొందఱు మహాభారతగ్రంథమునఁ జాలఁగథల యాడంబరము మాత్రమున్నది యని చెప్పుచున్నారు. కాని యిది యసత్యము నిస్సందేహముగ మహాభారతము గజశరీరమువలె మిక్కిలి పెద్దది; కాని యది

యేనుగులాగునసే సుందరము, సుశ్లిష్టము సుబద్ధముకూడ నై యున్నది. ఈసం పూర్ణగ్రంథ మొక్క సూత్రమునఁ జేయఁబడినదై యగుపడుచున్నది. సనాతన ధర్మముయొక్క విరోధరహితమైన యుపదేశమునుజేయుట యే యీసూత్రము యొక్కప్రధానోద్దేశము ఈయుద్దేశ్యము సిద్ధించుటకై యానుషంగికముగాఁ దత్త్వజ్ఞానము, ఇతిహాసము, రాజధర్మము, నీతిలోనుగా ననేక విషయముల యొక్క సమావేశము దానియందుఁ జేయఁబడియుండెను. దీనివలన, మహా భారతగ్రంథమునందు వర్తమానహిందూధర్మములోని యన్ని శాఖలకు, ననఁ గా శైవులకు, వైష్ణవులకు, వేదాంతులకు, యోగులకు, మిగిలిన యందఱు లోకులకునుగూడ సమానమైన పూజ్యభావము పరిణమించెను. ఈమహాభా రతముయొక్క రచన వ్యాసమహర్షియొక్క యప్రతిమమైన మూలమగు జయరూపమైన పునాదిమీఁదఁ జేయఁబడియున్నది, ఇందువలన వ్యాసమహ ర్షియొక్క యప్రతిమమైన కవిత్వము, తత్త్వజ్ఞానము, వ్యవహారనిపుణత, వీటి యొక్క స్ఫూర్తికూడ సౌతికి నుత్సాహజనక మయ్యెను. ఉక్తమైన వివేచ నయొక్క యాధారముమీఁద నిపుడు మనము, సౌతి తనయుద్దేశ్యము సిద్ధిం చుటకు భారతమునుండి మహాభారతము నెట్లు నిర్మించె ననువిషయముయొ క్కవిచారము గావింతము.

ఆరంభమున, నీప్రకారముగా వివేచనచేయుట చాలఁ గఠినమైన కా ర్యమని చెప్పవలసియున్నది. మనము మునుపు, వ్యాసమహర్షియొక్క మూ లగ్రంథమునకును, వైశంపాయనునియొక్క భారతమునకును మిక్కిలి యంతర ముండదని చెప్పియుంటిమి. కాని భారతమునఁ గేవలము 24000 శ్లోకము లుండెను. మహాభారతమునందు వాటిస్థానమున నొక లక్ష శ్లోకములున్నవి. అప్పుడుమనము, ఈయధికసంఖ్య సౌతి చేర్చినదేయని యెంచవలసియున్నది. కాని యిట్లు తలఁచిన వారమయ్యు, నే నైతిహాసికప్రమాణములు పైని జేయఁబడిన వివేచనయందున్నవో, యవిగాక మఱి యితరములైన దృఢప్ర మాణముల నేవిని నీయఁజాలము; ఈవిషయమైన విచారము సాధారణాను మానమువల్లనే చేయఁబడఁగలదు. సౌతి యేభాగములను, దనసమయమునఁ బ్రసిద్ధములైన విషయములయొక్కయు గాథలయొక్కయు నాధారమున గ్రంథములోఁ గలిపియుండెనో, యాభాగములను గుఱించి, యవి వ్యాసమ హర్షియొక్క యుదాత్తమైన మూలగ్రంథముయొక్క స్ఫూర్తివల్లనే చేర్చఁ

బడినవి యనియే యెంచవలయును. ఇట్టియవస్థయందు నొకదృష్టివలన, నా భాగముల కర్తృత్వముకూడ వ్యాసునికే యిచ్చివేయఁజాలుదుము. ఏప్రకారము కొందఱులోకులు తమవిశిష్టమతములకొఱకు నొకసగము ప్రక్షిప్తభాగమును నడుమనే యసంబద్ధముగా దూర్చుచున్నారో యట్లుసౌతియొక్క యీ కార్యముకాదు. సౌతియొక్క మహాభారతగ్రంథమునందుఁ బ్రాచీన సనాతన ధర్మముయొక్క యుదాత్తస్వరూపమే విశేషరూపమున నావిష్కరింపఁబడి యున్నది. యని సంక్షేపముగాఁ జెప్పఁగలము; మఱియు నేనోత్తభాగములు చేర్పఁబడియున్నవో, యవి మూలగ్రంథములయొక్కయు, గాథలయొక్కయు, నాధారము మీఁదనున్నవి.

## (1) ధర్మముయొక్క నైక్యము.

భారతమును మహాభారతముగాఁ జేయుటలో సౌతియొక్క మొదటి యుద్దేశ్యము ధర్మమునకు నైక్యము సిద్ధింపఁజేయుటయై యున్నది. మూల భారతగ్రంథమునందు శ్రీకృష్ణుని ప్రశంస అనఁగా విష్ణువుయొక్క స్తుతియొక్కవగా నున్నదని స్పష్టముగా ననుమానింపవచ్చును. కాని హిందూధర్మమునందు విష్ణువుకంటె నితర దేవతలుకూడ నుపాసింపఁదగినవారు గా నెంచఁబడుచున్నారు. సమస్తమహాభారతమునకు సనాతనధర్మగ్రంథముయొక్క సర్వమాన్యమైన స్వరూపమును బ్రాప్తింపఁజేయుటకై దానియందు భిన్నదేవతలుకూడ స్తుతింపఁబడుట యావశ్యకమయ్యెను. అదికూడ భిన్నభిన్నోపాసనలయందు విరోధమును బెంపొందింపనిదిగా నుండవలయును. ఇట్టిప్రధానదృష్టితో సౌతి మహాభారతమునకు వర్తమానస్వరూపము నిచ్చెను. విశేషించి శైవవైష్ణవమతములు రెండింటికి నేకీభావమునతఁడు మిక్కిలి బాగుగాఁజేసెను. తఱచు లోకులు, శాంతిపర్వము, అనుశాసనపర్వము ఈ రెండును మూలభారతములోనివా? కావా? యని ప్రశ్నించుచుందురు. ఏపర్వములు మిక్కిలి పెద్దవో యవి మూలభారతములోనివి కావని మనముముందే చెప్పియుంటిమి, కాఁబట్టి యీపర్వములు సౌతివియని సిద్ధమగుచున్నది. కాని యీపర్వములలో నివిషయములు మూలభారతములోనివే. ధార్మికదృష్టిచేత నన్నిమతములకు సమావేశము గావింపవలయునని సౌతి యీపర్వములను జాలహెచ్చుచేసెను ఈ కారణముచేతనే మహాభారతమునకు ధర్మగ్రంథముయొక్క సంపూర్ణస్వరూపము ప్రాప్తమయ్యెను. తరునాతఁ జేయఁబడిన గ్రంథములన్నిటియు దాని

వచనములను స్మృతిసమానముగా నంగీకరించుచున్నవి. సనాతనధర్మముతోc గూడ శైవవైష్ణవమతములనైక్యముc జేయుటకు సౌతిమహాభారతమునందుశి వస్తుతివిషయములైన యనేకోపాఖ్యానముల నెలకొల్పెను. ఈయుద్దేశముతో నను శాసనపర్వమున నుపమన్యువుయొక్క యాఖ్యానము నిచ్చెను; అక్కడc జేయcబడిన శంకరస్తుతిని ప్రత్యక్షముగా శ్రీకృష్ణునిముఖమునుండియే చేయించెను. అందు జాంబవతికిc బుత్త్రుcడు కలుగవలయు ననుకోరికతో శ్రీకృష్ణుcడు శంకరు నారాధించెనని వర్ణింపcబడినది. ఏప్రకారముగా భారతమున విష్ణుసహస్రనామములు చేర్పcబడినవో, యదేప్రకారముగా నిందు నందికేశ్వరుని చేతc జెప్పcబడిన శివసహస్రనామములయొక్క యుపదేశము నుపమన్యువు శ్రీకృష్ణునికిc జేసెను; శివు నారాధించి యనేకఋషులు వరములను బొందిర నికూడc జెప్పcబడినది. ఏమతమునననుసరించి, సనాతనధర్మావలంబులయొక్క శివుని, విష్ణుని, బ్రహ్మ నొకటిచేసి ధార్మికమైన భేదము రూపుమాపcబడి యెనో, యది యీయాఖ్యానమునందే ప్రతిపాదింపcబడెను. ఇందుc బరమేశ్వరుని కుడివైపునుండి బహ్మయు, నెడమవైపునుండి విష్ణువును, నడుమనుండి రుద్రుcడును, బుట్టిరని వర్ణనకలదు. ముందువెనుక సందర్భములcబట్టి యుపమన్యువుయొక్క యీయాఖ్యానము సౌతిచేతc గ్రొత్తగాc జేర్పcబడినదని తెలియుచున్నది. శ్రీకృష్ణుcడొక వేయి సంవత్సరములదనుక తపము చేసెనని కూడ నిందుc జెప్పcబడినది. ఇందువల్ల నీయాఖ్యానము మూలభారతమునందుండదని సిద్ధించుచున్నది. భారతమున నేవ్యక్తియొక్కయు నాయుఃపరిమాణము నూటికిc బైని జెప్పcబడలేదు; అనcగా వేయివత్సరముల కల్పన తరువాతిదియై యున్నది. శంకరుని స్తుతించుకొఱకు స్థానాంతరములయందుcగూడ సౌతి యనేక నవీనప్రసంగముల వర్ణనచేసెను. ద్రోణపర్వమున, నర్జునుcడు జయద్రథుని జంపుటకుc బ్రతిజ్ఞచేసినపుడు, ఈయసంభవకార్యము నతని ద్వారా సిద్ధింపcజేయుటకై శంకరునుండి యర్జునుcడు వరమునుబొందుకొఱకు శ్రీకృష్ణుcడు సమ్మతినిచ్చెను. అర్జునుcడు శంకరుని బ్రసన్నుcజేసి యతనినుండి పాశుపతాస్త్రము సంపాదించెను. అ॥ 90-93) కాని కిరాతార్జునీయమునc జేయcబడినవర్ణన ననుసరించికూడ, శంకరునుండి పాశుపతాస్త్రమును బొందిన కథ వనపర్వమున నైతమున్నది. దీనిcబట్టి పాశుపతాస్త్రమును దరువాతcబొందినట్లు చెప్పుచున్న యీకథ యెుకింత చమత్కారముగ నగుపడుచున్నది.

సౌతి బుద్ధిపూర్వకముగా దీనిఁగూడఁ జేర్చెనని విశ్వాసము కలుగుచున్నది; ఎందుచేత ననఁగా నీకథయందు శ్రీకృష్ణుఁడు తనకుఁ దానే శివస్తుతిని బ్రోత్సహించెనని యున్నది. సారాంశము, శ్రీకృష్ణుఁడు శివోపాసకుఁడనియు, శివుఁడు విష్ణూపాసకుఁడనియు, నుభయులకుఁ గలయికను సూచించుకథలను జేర్చి సౌతి శైవులకు వైష్ణవులకును విరోధముఁబోఁ గొట్టుటకుఁ బ్రశంసనీయమైన ప్రయత్నము చేసెను. ఇటువంటి వింకను జాల నాఖ్యానములు కలవు. సౌప్తికపర్వమున, నశ్వత్థామ నిద్రించుచున్న వీరులయొక్క గొంతుకలు నులుముటకు వెళ్లునప్పుడు ఆతఁడు ముందుగాఁ దనతలఁ గాటువేసికొని శంకరుని సంతుష్టుఁజేసెననియున్నది. (సౌప్తికపర్వము, అధ్యాయము 7). ఇచ్చటఁ గూడ శంకరుఁడు "కృష్ణుఁడు నాయందు భక్తి కలవాఁడు, కావున నతండు నాకత్యంతప్రియుఁడు" అని చెప్పెను. ఈపర్వమునకుఁ జివర లింగపూజయొక్క మహిమ వర్ణింపఁబడినది, శ్రీకృష్ణుని ముఖమునుండి శంకరుని ప్రశంసకూడఁ జేయింపఁబడినది. తాత్పర్యమేమనఁగా ప్రతిచోటను శివునికి, విష్ణునికి నైక్యము సిద్ధింపఁజేయుటకై సౌతి ప్రయత్నించియుండెను. (చూడుఁడు సౌప్తికపర్వము, అధ్యాయము 18) మోక్షపర్వమునందున్న నారాయణీయోపాఖ్యానము మూలభారతములోనిది కాదు, ఇఁకనేమంటే సౌతి చేర్చినదిగనే యున్నది. (అధ్యాయము 334-348) ఇవి పాంచరాత్రమతమునుండి సంగ్రహింపఁబడినదిగా నగుపడుచున్నది. స్వభావముగా నాది పాంచరాత్రమతము, శంకరుఁడు విష్ణువుకన్నఁ దక్కువయని వర్ణించియుండును. వానికి భక్తుఁడనికూడఁ జెప్పియుండును; కాని సౌతి మతైక్యముఁజేయు ప్రయత్నముననుసరించి, తన వర్ణనయందు, గొంత మార్పుచేసియుండెను. అదేదియనఁగా, నారాయణుఁడును శంకరుఁడు నొకరి నొకరు యుద్ధమునందు జయింపలేనియపుడు బ్రహ్మ శంకరుని బ్రార్థించి యతనిని నారాయణునికి భక్తుఁడుగాఁజేసెను. అపుడు నారాయణుఁడు చెప్పెను— "ఎవఁడు నీకుభక్తుఁడో, వాఁడు నాకుఁగూడ భక్తుఁడు ఎవఁడు నిన్నెఱుఁగునో, వాఁడు నన్నుఁగూడ నెఱిఁగినవాఁడు నీకు నాకు నావంతయు భేదములేదు. నీ శూలప్రహారచిహ్నము నావక్షస్థలమునందుఁ జిహ్నితమైయున్నది. కనుక నందఱు నన్ను శ్రీవత్సుఁడందురు; మఱియు నాహస్తచిహ్నము నీకంఠమున నంకితమైయున్నది. కాఁబట్టి యందఱు నిన్ను శ్రీకంఠుఁడందురు" ఈప్రకారము పాంచరాత్రమతమునుగూడ సౌతి శివవిష్ణువుల నైక్యముప్రక్కకు లాగెను.

సౌతి మహాభారతమున భీష్మపర్వము (అధ్యాయము ౨౩) నందు దేవీస్తుతికి నవకాశమిచ్చెను. యథార్థమున నీస్తుతి యిక్కడ లేకున్న బాగుం డును. దీనికిఁ గారణమేమనఁగా, యుద్ధోత్సుకుఁడైన యర్జునునికి దుర్గాదేవిఁ యుద్ధమునందు నీకు జయమగునని వరమిచ్చినపుడు తరువాత భగవద్గీతకుఁ బ్రసంగమే యుండదు. అప్పు డర్జునుని మనసునందు ,,యద్వాజయేమ య దివా నోజయేయుః" అని శంకయే కలుగక యుండును. శ్రీకృష్ణుని యాజ్ఞవ ల్లనే యీదుర్గాస్తుతి యితరత్రకూడ నగుపడుచున్నది. స్కందుని స్తుతిప్రశంస ల భాగమును సౌతి వనపర్వముననుంచెను. ఈప్రకారముగా వేరువేరైన యు పాస్యదేవతలకు నొక గ్రంథముననే విరోధరహితమైన స్థానములనిచ్చి సౌతి సనాతనధర్మైక్యమునకుఁ బ్రశంసనీయమగు కార్యమును జేసెను. దీనితోపాటు భిన్నభిన్నములైన మతములను మోక్షమార్గములను గూడ నొకటిగాఁ జేయు టకు యత్నమునయితము సౌతికిఁ జేయవలసియుండెను. ఆసమయమున భిన్న భిన్నోపాసనలతోఁగూడ భిన్నభిన్నతత్త్వజ్ఞానములకును బ్రచారమగుచుండెను. ఈవిషయములగురించి యేగ్రంథము లిపుడు ప్రమాణములుగా నెంచఁబడు చున్నవో యవి యాసమయమున లేకుండెను. ఈవిషయము మునుపుచర్చిం పఁబడినది. ఆవిషయముల యుపదేశము మఱి యితరగ్రంథముల ద్వారాము ఖతః చేయఁబడుచుండెననియు, వాటియందుఁ బరస్పరవిరోధములు కూడఁ జాలవృద్ధినొంది యుండెననియు నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. సౌతికీవిరో ధమును నశింపఁజేయుట యావశ్యకమయ్యెను. ఈవిధముగా వేదాంతము, సాంఖ్యము, యోగము, పాంచరాత్రము, పాశుపతము, మొదలగు ననేకమ తముల నేకము చేయుటయతనికి నావశ్యకమయ్యెను. భగవద్గీత మూలభా రతము లోనిదా ? లేక సౌతి వృద్ధిచేసినదా ? యను ప్రశ్నమిచ్చట మిక్కిలి మహత్త్వము కలది. తుట్టతుదకు రెండుగ్రంథములలోనిది లేక భారతమహా భారతములలోనిది; ఇంతియేకాక, ఇద్దఱు గ్రంథకారు లదిలేక వ్యాసవైశం పాయనులది యల్లే సౌతిది యనికూడ నవశ్య మెంచవలయునని సిద్ధించియు న్నది. అయినను భగవద్గీతాసంబంధమైన ప్రశ్నమెటుల నున్నది యటులనే యున్నది. ఆలోచింపఁగా భగవద్గీత మూలభారతములోనిదే దానిని సౌతి మఱియే స్థానమునుండియుఁ దీనికొనివచ్చి మహాభారతమునం దుర్పి యుం డలేదు. ఈవిషయము విస్తరించి తుదిని వివేచింపఁబడును. పాంచరాత్ర పాశు

పతమతములు రెండిటియొక్క ప్రచారము గీతాసమయమున లేదు. ఆస మయమున వేదాంతము, సాంఖ్యము, యోగము, నీమూఁడు తత్త్వజ్ఞానములు ప్రసిద్ధములైయుండెను. వీనినైక్యమునకు భగవద్గీత యత్నించియుండెను. ఆ ప్రయత్నమును సౌతి తన సమయమున నెక్కువగా రక్షించెను. పై రెండు క్రొత్తమతములలోని యభిప్రాయముల నతండు తనప్రయత్నమునఁ గలిపివై చెను. ఇందుకొఱకు సౌతి మహాభారతమునఁ జాల నుపాఖ్యానములను, బ్రకరణములను జేర్చెను. మునుపుప్రసిద్ధములైన వేదాంతము, సాంఖ్యము, యోగము నీ మూఁడుమతములయొక్క యావిష్కరణములను వానియున్న తీననుసరించి, యతఁడు తన గ్రంథమునఁజేసెను. ఇటువంటి ప్రయత్నమునకు మచ్చు 'అనుగీత'యై యున్నది. ఇది సౌతి నిర్మించిన క్రొత్తప్రకరణము. ఇది కాక సాంఖ్యము, యోగము, వేదాంతము నీమూఁడు మతములలోని యభి ప్రాయములను సవిస్తరముగాఁ బ్రతిపాదించు ననేకాధ్యాయములు ప్రతిచోట విశేషించి శాంతిపర్వమందు, నగుపడుచున్నవి. పూర్వోక్తానుసారముగాఁ బాంచరాత్రమును నారాయణీయోపాఖ్యానములోఁ గలిపి యావిష్కరిం చెను. మహాభారతమునఁ బాశుపతమతమును సౌతి విస్తరించి ప్రకటింపకుం డుట యాశ్చర్యకరముగా నున్నది. ఈమత మాసమయమునఁ బ్రచలితమై యుండెననుటకు సందేహములేదు. దానిని స్పష్టముగా నుచ్చరించి కూడనుం డెను. సౌతి మహాభారతకాలమునఁ బ్రచలితములైన మతముల నీప్రకారము గాఁజెప్పెను:—

సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానామతాని వై॥
ఉమాపతి ర్భూతపతిః శ్రీకంఠో బ్రహ్మణః సుతః
ఉక్తవా నిదమవ్యగ్రో జ్ఞానం పాశుపతం శివః
పాంచరాత్రస్య కృత్స్నస్య వేత్తాతు భగవాన్స్వయమ్॥

(శాంతి, అధ్యా. 349. 64-68)

ఈప్రకారముగాఁ బాశుపత పాంచరాత్రములను రెండు భిన్నమతము లను మహాభారతమందు స్పష్టమైనరీతి నుచ్చరించెను, కాని, సౌతి తరువాత నివన్నియు నొక్కనారాయణునే యుపాసించుమార్గములని చెప్పెను:—

సర్వేషుచ నృపశ్రేష్ఠ జ్ఞానేష్వేతేషు దృశ్యతే
యథాగమం యథాజ్ఞానం నిష్ఠా నారాయణః ప్రభుః॥

అనఁగా— ఓనృపశ్రేష్ఠుఁడా, విచారింపఁగా నిన్నిభిన్నభిన్న పథము లున్నవి. అయినను నివియన్నిట నొకవిషయము సమానముగాఁ గనుపట్టుచున్నది. అదేదియనఁగా నీమతము లన్నిటియందు నాగమజ్ఞానముల రెండిటిననుసరించి యేపరమగతి నిశ్చయింపఁబడ్డదో, యది ప్రభువగు నారాయణుఁడే.”

సాంఖ్యము, యోగములోనగు భిన్నభిన్న తత్త్వజ్ఞానములయందు నేవి రోధముండెనో, దానిని రూపుమాపి యీయన్నిమతములయందు సౌతియొక్కమహాభారత మేకత్వము నెట్లుస్థాపించెనో, యీవిషయము నిచ్చట విస్తరించి చర్చింపవలసిన యావశ్యకతలేదు. ముందునకుఁ బోయి యీవిషయము సవిస్తరముగా వర్ణింపఁబడును. సనాతన ధర్మమునకు నింకను నావశ్యకములైన యంగములుకూడ నున్నవి; ఏవియనఁగా యజ్ఞము, యాగము, తీర్థము, ఉపవాసము, వ్రతము, దానము, మొదలగునవి. వీనిని గూడ విస్తరించి మహాభారతమునఁ బ్రతిచోట సౌతి వర్ణించియుండెను. ఈవర్ణన విశేషించి యనుశాసనపర్వమందు నగుపడుచున్నది. హింసావిషయము యజ్ఞసంబంధమున మిక్కిలి మహత్త్వముకలది. సనాతన ధర్మావలంబులయందు బౌద్ధులకుఁ బూర్వమునుండియు, యజ్ఞములయందుఁ బశువధము చేయఁదగునా ? తగదా ? యను విషయమున వాదప్రతివాదములు జరుగుచుండెను. వైదిక మతాభిమానులు పశువధ మావశ్యకమని తలఁచుచుండిరి. సౌతి రెండుమతములను గౌరవించి మహాభారతమున వానికి స్థానమిచ్చెను. ఈవిషయమై యతండొక సంపూర్ణమైన యధ్యాయమే కలిపెను. యుధిష్ఠిరుని యశ్వమేధ యజ్ఞమున సంపూర్ణముగా వర్ణించినపుడు దానియందుఁ జేయఁబడిన హింసయొక్కవర్ణన సర్వసాధారణముగాఁ గొంత యనిష్టముగఁ దోఁచియుండుననుట సంభవము “అనేకదేవతల నుద్దేశించి యనేకపశుపక్షులు స్తంభమునఁ గట్టఁబడెను; ఉత్కృష్టము ముఖ్యము నగునశ్వరత్నముగాక మూఁడువందలు పశువులు యజ్ఞస్తంభమునఁ గట్టఁబడి యుండెను” ఇత్యాదివర్ణన విని యహింసా మతవాదులైన లోకులకు నేవ కలిగియుండును. ఇందు ముంగిసయొక్క కథ చెప్పఁబ యున్నది. దాని యుద్దేశము హింసాయుక్తమైన యశ్వమేధమును నిందింపటయే. ఒకఋషి ధాన్యపు గింజలు కొన్ని భోజనమునకు నేఱుకొనియుండెన అవి యతిథియైన యొకవిప్రునికి దానముచేసి తాను ప్రాణత్యాగము చేసెన ముంగి చెప్పెను—“ఆ సక్తుయజ్ఞమున నాతల సువర్ణమయ మయ్యెను. నా

గిలినయంగము యుధిష్ఠిరయజ్ఞమున సువర్ణమయ మగునో కాదో యని యి పుడు తెలియుటకు నేనిచ్చటఁ గూడ నిటునటుదొర్లికొట్టికొంటిని." కాని దాని శరీరము బంగారపుదికాలేదు, కాఁబట్టి తుదిని యజ్ఞసమాప్తి సమయమున నయ్యది యజ్ఞమును నిందించెను. ఈకథవలనఁ బ్రత్యక్షముగా యజ్ఞముహింసాయుక్తము కావలయునా లేక కాఁగూడదా యనుప్రశ్నము బయలుదేఱు చున్నది. వైశంపాయనుఁడు వసువుయొక్క శాపకథను వినిచెననియు, ఋషులహింసాయుక్తమైన యజ్ఞముయొక్క పక్షమునే స్వీకరించిరనియుఁ, దరువాత వర్ణింపఁబడినది. (అ. 90) దీని తరువాతి యధ్యాయమందు నగస్త్యుని యజ్ఞకథయున్నది. ఇందు, బీజములనుండియే యజ్ఞము జరుగుచుండెడిదనియు నింద్రుఁడు క్రోధమువలన వర్షములు కురియకుండఁ జేసినయపుడు, తనసామర్థ్యముచేత బీజములఁ బుట్టింతునని యగస్త్యుఁడు ప్రతినవట్టియుండె ననియుఁ జెప్పఁబడియున్నది. దీనిఁబట్టి పైనకులాఖ్యానాధ్యాయములు రెండును మూలభారతమునకుఁ బిమ్మటివి యగునని స్పష్టమగుచున్నది. భారతకాలమున నహింసాపక్ష మింతప్రబలముగాలేదు. తరువాతఁ గ్రమముగా నీపక్షము ప్రబలముకానారంభించెను. అప్పుడీకథలు తయారైయుండెను. సౌతి వానిని దనమహాభారతమందుఁ గలిపియుండును. ఈపక్షము బహుధా దక్షిణదిశది యైయుండును. ఎందుచేతననఁగా నగస్త్యుఁడు దక్షిణదిక్కునందలి ఋషియై యున్నాఁడు. కాని యీకథలవలన వైదికహింసయందు నభిమానముగల పక్షమునకుఁ గ్రోధము వచ్చెను. ఇందుచేత సౌతి నకులము చేసినసింద క్రోధమునకు శాపమున్నకారణమున నాస్వరూపమునఁ గ్రోధముచేతఁ జేయఁబడిన దని యంతిమాధ్యాయమునందుఁ జేర్చెను. సారాంశము, ఇందు రెండుపక్షముల వర్ణనయుఁ జేయఁబడినది. అయినను నిర్ణయమేమియు నగుపడదు. సౌతి రెండుపక్షములకు నొడంబడిక చేయుటకై యత్నించెనని తెలియుచున్నది.

## (2) కథాసంగ్రహము.

మహాభారతమును విస్తరించుటయందు సౌతియొక్క రెండవ యుద్దేశము కథలను సంగ్రహించుటగా నగుపడుచున్నది. అనేకులైన రాజులయొక్కయు, ఋషులయొక్కయు నేకథలు లోకులయందు లేక చిన్నచిన్న గాథలయందు నిటునటుఁ జిమ్మఁబడి యుండెనో యవన్నిటి నేదేనొక స్థానమున సంగ్రహించుట యావశ్యకమై యుండెను. ఈకథలచేత సనాతనధర్మమున

కొకవిధమైన యుత్తేజనము ప్రాప్తింపఁగలదియై యుండెను. ఇదిగాక, ప్రాచీనములైన చారిత్రికవిషయముల నొకచోటఁ జేర్చి సనాతన ధర్మావలంబులైన పూర్వులకు నభిమానమును బురికొల్పుటకూడ నావశ్యకమై యుండెను. భారతీయ కథావిషయమునఁ గూడఁ జాల భిన్నభిన్న విషయములు తరువాతఁ బ్రచలితములై యుండు ననుట సంభవము. ఈవిషయముల నన్నిటి నొకచోఁ జేర్చి మహాభారతమును బ్రచలితములైయున్న సమస్తకథలకు నొక పెద్ద భాండాగారముగాఁ జేయుటకుఁ బ్రయత్నించెను. బౌద్ధులును జైనులును భారతఖండమునందుఁ బ్రాచీన ప్రసిద్ధపురుషులయొక్క కథలను దమతమ ధర్మముయొక్క స్వరూపమునందుఁ గలుపుటకు నేప్రయత్నము చేసియుండిరో దానిని సౌతి తన మహాభారత కథలద్వారా చక్కఁగా నాటంకపఱిచెను. ఈవిధముగా నేయాఖ్యానములను నేయుపాఖ్యానములను సౌతి మహాభారతమునఁ గలిపెనో వానినన్నిటిని వేర్వేఱుగా నెన్నికచేసి యిచ్చుటఁ జెప్పుట కఠినమైన కృత్యము. అవి యన్నియుఁ గ్రొత్తగా రచింపఁబడి యుండునని చెప్పఁజాలము. ఈకథలన్నియుఁ బ్రాచీనములైయున్నవి. ఆసమయమునందలి జనులు వానినంతకుఁ బూర్వము నుండియు, నెఱుఁగుదురు. అంతేకాక, రాష్ట్రీయభావములతోఁ గూడ వానికి గాఢమైన సంబంధ ముండెను, కనుక మహాభారతము వంటి రాష్ట్రీయగ్రంథమునందు నయ్యవి సంగ్రహింపఁబడుట మిగుల నావశ్యకము. ఇటువంటి కథలకుఁ గొన్ని యుదాహరణములు క్రింద నీయఁబడుచున్నవి.

(1) షోడశ రాజీయోపాఖ్యానము ద్రోణపర్వమున నున్నది. ఇది యొక ప్రాచీనాఖ్యానము, దీనియొక్క మూలస్వరూపము శతపథబ్రాహ్మణమున నగుపడుచున్నది. ఆర్యావర్తమునందు నశ్వమేధము చేసిన ప్రసిద్ధుల పేరు లిందు నీయఁబడియున్నవి. ఉత్సాహాకరమైన వారి వర్ణనకూడ నిందుఁ జేయఁబడినది. ఈయాఖ్యానము మూలభారతమునందుఁ గూడ నుండుననుట సంభవము కాని యిది పిమ్మట సౌతిచేత శతపథమునుండి గైకొని చేర్పఁబడియుండు నని యథార్థికమైన యూహ తెలుపుచున్నది.

(2) రామాయణములోని సమగ్రకథ వనపర్వమునందు రామోపాఖ్యానమున నున్నది. విస్తారదేహముగా నిది సౌతిచేతఁ గలుపఁబడినది. ఎందుచేత ననఁగా, ఇంత పెద్దయుపాఖ్యానము మూలభారతము నందుండుట సంభావ

ము కాదు. ఈయుపాఖ్యానమును జదివినయెడల నిందు నేదో మఱియొక ప్రసి ద్ధగ్రంథముయొక్క సంక్షిప్తస్వరూప మీయఁబడెనని స్పష్టముగాఁ దెలియు చున్నది. మహాభారతమున స్పష్టముగా వాల్మీకియొక్క యుచ్చారణ మఱి యొకచోట నగుపడుచున్నది; కాని యిది యే గ్రంథముయొక్క సంక్షిప్తస్వ రూపమో యాగ్రంథము వర్తమాన వాల్మీకిరామాయణము కాదు, ఇఁక నే మంటే, దానికంటె మునుపటి దానియొక్క మూలస్వరూపమగు నని నిశ్చయ పూర్వకముగా జెప్పఁబడఁగలదు. ఇందుల కొక్కింతకారణ మిందుఁ జెప్పఁగ లము. వర్తమాన వాల్మీకి రామాయణముయొక్క సమయము క్రీస్తుశకము నకుఁ బూర్వము మొదటి శతాబ్దియనియు, మహాభారతముయొక్క సమ యము శకమునకుఁ బూర్వము మూఁడవశతాబ్దియనియు మునుపు చెప్పి యుంటిమి. ఇది గాక యీయుపాఖ్యానములో నున్న ప్రమాణములవల్లఁ గూడ నీవిషయము సిద్ధమగుచున్నది. కాలము గడచిన కొలఁది, యేకథా భాగమునందును నధికాధికములు నసంభవములు నగు పుక్కిటిపురాణములు ప్రవేశించుటకు మొదలిడునను విషయము లోకులందఱి యూహకును రాఁగ లదు. కథాభాగమునం దలౌకిక చమత్కారములు తక్కువగా నుండుటయే యది ప్రాచీన మగుటకు సాధారణప్రమాణముగా నెంచవచ్చును. ఈదృష్టివ లనఁ జూచినయెడల రామోపాఖ్యానములోని కథాభాగమునందు వర్తమా నరామాయణ కథాభాగముకంటె నలౌకిక చమత్కారములు తక్కువగా నున్నవి. ఉదాహరణము లేవియనఁగా;—(1) శ్రీరామచంద్రుని జన్మమునకు ఋష్యశృంగునిచేఁ జేయఁబడిన పుత్రేష్టియొక్క వర్ణన యీ యుపాఖ్యానము నందు లేదు. (2) రావణునికిఁ గుబేరునికిఁగల సంబంధము మఱియొక రీతిగాఁ జెప్పఁబడినది. ఈయుపాఖ్యానమునందు దుందుభి యనెడు గంధర్వస్త్రీ మంథర యయ్యె నని చెప్పఁబడినది; కాని రామాయణమునం దీవిషయము లేకుండుట యాశ్చర్యముగానున్నది. జటాయువుయొక్క కలయికయందలి వర్ణన సరల ము భిన్నమునగు శైలితో నున్నది. (3) శ్రీరామచంద్రుఁడు సముద్రతీరమున దర్భాసనముమీఁదఁ గూర్చుండి సముద్రుని ధ్యానించినపుడు, సముద్రుని యొక్క కలయిక స్వప్నమునందుఁ గలిగెను, ప్రత్యక్షముగాఁ గాలేదు. (4) లక్ష్మణునికి శక్తి తగులుటయు, హనుమంతుఁడు ద్రోణగిరికిఁ జనుటయు నీయా ఖ్యానమందుఁ జెప్పఁబడలేదు. (5) కుంభకర్ణుని లక్ష్మణుఁడు చంపెను. (6) ఇం

స్త్రీత్తుని గూడ నతఁడు చంపి యున్నాఁడు, కాని, యీయింద్రజితునియొక్క యదృశ్యమైన రథముమాట, అనఁగా రథప్రాప్తికొఱకుఁ గుంభిలికాయజ్ఞమున కుఁ జనినకథ యీయాఖ్యానమున లేదు. ఇక్కడ నన్నిటికన్న నధికమైన మహత్త్వముగల విషయ మేమనఁగా రాముఁడు రావణుని బ్రహ్మాస్త్రముచేతఁ జంపెను; రావణుని మస్తకములు తెగి మాటిమాటికిఁ బుట్టి యుండెననియు, రావణుని గళమున నమృతకలశముండె ననియు, నిందు వర్ణింపఁబడ లేదు. అగుఁగాక, ఇందుఁ గొలఁది విషయభేదము కలదు; కాని పై కథనమునకు, వనపర్వములోని రామోపాఖ్యానము మూలభారతములోనిదికాదు, దానిని సౌతి మూలవాల్మీకిరామాయణమునుండి కైకొనియె ననియే తాత్పర్యము.

(3) శల్యపర్వము నందున్న సరస్వత్యాఖ్యానము స్పష్టముగా సౌతికలి పినదే. ఆఖ్యానములోని వర్ణన యిట్లున్నది. భీమదుర్యోధను లిరువురు యుద్ధ సన్నద్ధులైరి, భారతీయ యుద్ధముయొక్క యత్యంతమహత్త్వముగల యంతి మదృశ్య మారంభమగుచున్నది. ఇంతలో సరస్వతీయాత్రనుండి మఱలి బల రాముఁడచ్చటికి వచ్చెను. గదాయుద్ధము యొక్క వర్ణన యొకవైపునఁ దటస్థిం చియుండెను. అయినను జనమేజయుని ప్రశ్నమువిూఁద వైశంపాయనుఁడు సరస్వతీనదియొక్క మహాత్త్వమును, యాత్రను వర్ణింపనారంభించెను. దీనికిఁ గొలఁదిపాటి స్థానమిచ్చి యూరకొనలేదు. యుద్ధవర్ణనా సమయమునఁజేయఁ బడిన యీవిషయాంతరమునందు నించుమించుగా 19 అధ్యాయములు (35 నుండి 54 వఱకు) కలుపఁబడినవి. ఇందు రెండుమూఁడుపకథలుకూడ వచ్చి యున్నవి. ఇచ్చట స్కంధాభిషేకము తారకాసురయుద్ధమును వర్ణింపఁబడినవి. ఇందు సౌతికి సరస్వత్యుపాఖ్యాన మావశ్యకమైయుండు ననుట సంభవము. ఎందుచేత ననఁగా ఏసరస్వతియొక్క మహిమము ప్రాచీనకాలము నుండియు భారతవర్ణమునఁ జాలఁ బ్రసిద్ధికెక్కెనో దానియొక్క వర్ణన మహాభారతమున నెక్కడనో యవశ్యముగాఁ గావలసియుండెను. కాని స్థానమును బ్రసంగము నుబట్టి చూచినచో నీయుపాఖ్యానము నిచ్చటఁ జేర్చుటవలన సౌతి కృతార్థుఁ డుకాలేదు.

(4) విశ్వామిత్రుఁడు బ్రాహ్మణుఁడైన యాఖ్యానము.

(5) సౌతి మొదటఁ జేర్చిన పౌష్యాఖ్యానము, పౌలోమాఖ్యా కూడ నిదే విధముగానున్నవి. ఇవి మిగులఁ బ్రాచీనములైన పుక్కిటి పురాణ

ములలోని విషయములు. వీనిని సంగ్రహించుదృష్టితో సౌతి తనగ్రంథమున బ్రవేశపెట్టెను.

(6) నలదమయంతుల యాఖ్యాన మాఖ్యలయొక్క పుక్కిటిపురాణములయందు నత్యంత మనోహరమైన యొకయాఖ్యానము. ఈయాఖ్యానము మూలభారతములోనిది యైనది యు లేక కానిది యు నిశ్చయింపఁజాలము; దీనియొక్క దైర్ఘ్యమునందు ధ్యానముంచినచో, నిది మూలభారతములోనిది కాదని తోఁచుచున్నది. ఈయాఖ్యానమునందు వర్ణితమైన కథయొక్క సౌందర్యమును మనోహరత్వమును సురసత్వమును గమనించితిమేని యది వ్యాస మహాకవి కృతమే యని చెప్పవలసియున్నది. ఈకథ మునుపు చిన్నదైయుండునని కూడఁ జెప్పుటకు శక్యముకాదు. ఇందు మర్యాద, శక్యత, సంబంధము వీనికి దూరమైన వర్ణన యేదియుఁ జూడఁబడదు. ఈదృష్టిచేత నీకథ మూలభారతములోనిది కావచ్చుననియే తోఁచుచున్నది. ఈస్థితియే సావిత్ర్యాఖ్యానమునకుఁ గలదు. ఈయత్యంత ప్రాచీనమైన యాఖ్యానము మూలభారతములోనిదై యుండును. ఇది యంతపెద్దదిగాఁ గూడ లేదు. నలదమయంతుల కథవలె నీకథ సయితము మోహకమును మిక్కిలి నీతిపోషకమునై యున్నది. ఈరెండాఖ్యానములఁ గూర్చి యేమియు నిర్ణయముగాఁ జెప్పఁజాలము. ఈ రెండాఖ్యానములు రాష్ట్రీయము లనుటకు సందేహములేదు.

ఉక్తవివేచనవలన భారతేతిహాసము కన్న వేఱుగా నేపుక్కిటి పురాణములు ప్రసిద్ధములై యుండునో వానిని మహాభారతమునఁ గలుపుటకు సౌతి యత్నించె నని ప్రకటమగును. ఈవిధముగానే వ్యాసవైశంపాయనుల సమయము మొదలిడి సౌతిసమయము దనుక, భారతీయేతిహాసమును సంబంధించి యేపుక్కిటిపురాణములు ప్రసిద్ధములైయుండెనో, వానికిఁ గూడ నీగ్రంథమున స్థానమిచ్చుట యావశ్యకమై యుండెను. ఈకథ లన్నిటిని సౌతి యచ్చటచ్చటఁ గలిపి యుండెను. ఇవి యాధారముగాఁ జేసికొని యతఁడు తనగ్రంథమున భారతీయకథను రచించెను. ఇటువంటి కథలేవియో యిపుడు విచారింపఁబడును. (1) ఆస్తికుని కథయిట్టిదే. యథార్థమున నాగులు మనుష్యజాతివారే యయియుందురను విషయము ప్రతివివేచకుని ధ్యానమునకును రాఁగలదు; కాని కాలపరివర్తనమున లోకుల కల్పనలయందు నయ్యవి ప్రత్యక్షము.

నాగములులేక సర్పము లనునర్థము కలిగెను. పరీక్షిత్తుని జంపినతక్షకుఁ డొక మనుష్యుఁడై యుండును. జనమేజయుఁడు చేసిన సర్పసత్రమున నిజముగా సర్పములయొక్క సత్రముకాదు, కాని నాగజాతిమనుష్యులను సంహారించుటకుఁ జేసిన ప్రయత్నమై యుండెను. కాని యెప్పు డొకమాఱు సర్పసంబధమగు కల్పన వ్యాపించెనో, యప్పుడు దానిని త్యజించుట సంభవము కాదయ్యెను. కాఁబట్టి వర్తమానోపాఖ్యానము వలనఁ దక్షకుని, సురక్షితు లైన యితరనాగులను నాస్తికుఁ డెట్లు రక్షించెనో, యీవిషయము దృష్టమగుచున్నది. అంశావతారవర్ణన కథయు నిటువంటిదే. ఈయితిహాసము వలనఁ దఱచుగా నందఱు ప్రాచీనులయందును జారిత్రికమైన ప్రతివ్యక్తియు నేదో యొక దేవతయొక్క యవతారము లేక పుత్రుఁడను కల్పన వ్యాపించియుండె నని గుర్తింపఁబడుచున్నది. ఈకల్పన ననుసరించియే మహాభారతమందుఁగూడ భారతీయవీరపురుషుల యొక్క యుత్పత్తి చెప్పఁబడినది. ఆదిపర్వమున 59, 66 అధ్యాయములు రెండిటియందును సౌతి ప్రసిద్ధాభిప్రాయముల ననుసరించి యంశావతారమును వర్ణించెను. మూలగ్రంథమునం దక్కడక్కడ దీనికి విరుద్ధముగాఁ గూడ గొన్ని యగుపడుచున్నవి. దీనిఁబట్టి యీయంశావతార కల్పన నూతనమని తెలియుచున్నది. (3) ద్రౌపది యైదుగురు పతులను వివాహమాడెనన్న కథయు నిటువంటిదే. దానిని సమర్థించుటకుఁ బ్రాచీనసమయమున వేఱువేఱు కథలు ప్రచలితములై యుండును. ఈకథ లన్నిటిని దన గ్రంథమునఁ జేర్చుట యావశ్యక మని సౌతికిఁ దోఁచియుండును. ఈపుక్కిటి పురాణము లన్నిటికిని ద్రౌపది స్వర్గలక్ష్మియొక్క యంశావతారమను కల్పనయే మూలాధారము. (4) దుర్యోధనువిషయమునఁ గొన్ని చమత్కారకథలు వ్యాపించుట యసంభవము కాదు. చిత్రరథుఁడు దుర్యోధనుని బట్టుకొని తీసికొని పోయెను. ఈకథయు నిటువంటిదే. ఎపుడు దుర్యోధనుఁడు విడుదలయై వచ్చెనో, యపు డతఁడు ప్రాయోపవేశము గావింప నారంభించెననియుఁ, గృత్య యతనిఁ బాతాళలోకమునకుఁ గొనిపోయె ననియుఁ జేసిన కల్పన కొంచెము విలక్షణముగా నగపడుచున్నది. (వనపర్వము అధ్యా. 241 మఱియు 250.)

సశేషము.

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము.

## ప్రథమాశ్వాసము*

దశప్రణిపాత నెన్నెదన్.

సీ. నవరత్నకీలితనవ్యకంకణఝుణత్కారికరాబ్జయుగ్మంబుతోడ
బంగారురంగులఁ బొంగార మెలఁగెడు కమనీయభూషితాంగంబుతోడఁ
జాయఁజెందగు(?) సేవసేయుకై వడి మేల నివనజంబుతోడ
ముఖకాంతిజలమత్స్యములఁబోలు కన్నులఁ జుంబించు కరుణారసంబుతోడఁ
గాననగుచును నిజభక్తకల్పవల్లి, రామవామాంకతలభాసురతనువల్లి
మల్లికామృద్వి సీత (భామామతల్లి), కరుణ రక్షించు నను మప్పుఁగన్నతల్లి.

సీ. రాముదేహమునకుఁ బ్రాపౌట నాత్మశేషత్వంబుఁ దెలుపు లక్ష్మణమహాత్ము
నతిశుచిగుణసంపదాస్పదత్వముఁ బూని నిజశంఖభావంబు నెఱపుభరతు
సద్వృత్తతామనో నిజచక్రరూపంబు మెలఁపు శత్రుఘ్నువీరు
నిజకణ్వభావంబు(?)నిజసహోదరుమాని రాముఁజేరుటఁజూపు రాక్షసేంద్రుఁ
గామరూపసమాసక్తిఖలవృత్తి, నాత్మదివిజత్వ మంచఱ కాత్మమెఱయఁ
జేయుధన్యులనలయా(ంజనేయము)ఖ్య,రామభక్తులమదిలోనఁ బ్రేమఁదలఁతు.

క. ప్రాజ్ఞుల విశ్వనిఁ దైజసుఁ, బ్రాజ్ఞుని సౌమిత్రిఁ జేష్ఠు భరతాహ్వయునిం
దజ్ఞస్తుతు శత్రుఘ్నుస,మాజ్ఞు స్వది నెంతు నీప్సితార్థము లొదవన్.

సీ. ప్రచ్యవత్సం(?) త్మవిరుద్ధవర్ణాతిసంరుద్ధ మగుచు
నప్రతీతం బౌచు నతివేలముఖ్యార్థహతియాచును బ్రకర్షహాని యగుచుఁ
†బ్రతిహతవృత్తమై ప్రక్రమభంగమై వ్యాకీర్ణవాక్యసంవాస మగుచు
నవిచారితవిధేయమై చర భిన్నమై హేయతాపన్న మగుచుఁ
గుకవికావ్యంబుకై వడిఁ గూలె లంక, యేమహాత్మునివాలాగ్ని యేర్చునపుడు
నతనిసేవింతురామనామైకచేయు, నానతవిధేయు ననపాయు నాంజనేయు.

శా. లంకాలంకృ ణోల్లాసోరువాలాగ్ని ని
శ్శంకుండై కపిసార్వభౌముఁడు ధరాజాతామనశ్శోకధూ
మాంకజ్వాల గతావశేషముగఁ జల్లార్చె న్విచిత్రంబుగాఁ
గైంకర్యార్చితరామచంద్రుఁ డతఁ డుత్కంఠ న్నముం బ్రోవుతన్

---

* మొదట గ్రంథపాతము గలదు. †బహుతవృత్తమై-మూలము.

చ. జలరుహనాభనాభిజలజాతమధువ్రతభావ మూనుటం
గలిగెను గూఁతు కేల్గొనెడు కామన మాట వహించు టారయన్
జలరుహసూతి నీ కనుచు శారద తచ్చనలాడ మాటికిం
గలకల నవ్వు ధాత        మెప్పుడు మాకు నీవుతన్.

చ. కన దతిచిత్రత న్మృదులగాత్రమునం దొకగుబ్బ కర్కశం
బన దృఢసాహితీమయత నందుట మార్దవవాసగీతమై
తనరెడుగుబ్బ రెండవది దాల్చె దృఢత్వము చాల (వింతయూ)
ననుచును మాటబోటికుచ మంటెడు నవ్వు మదిం దలంచెదన్.

చ. అతికఠినంపుఁ దర్క మగునారయ నీదురదాళి తత్కృతా
హతులను సీత్కృతు ల్వాడమె హా మధురోష్ఠము బ్రహ్మకాం
లేని సౌఖ్యముల పట్టయి తేనది యానునంచు నే
యతివ మృగాక్షి బల్కు విధి *నవ్వారవర్ణిని వాణిఁ గొల్చెదన్.

సీ. వెలిమబ్బుబలునుబ్బు వడి గెబ్బు రుచి నబ్బురం బొసంగెడు వసనంబుతోడఁ
దెలిచెట్టు వలిగట్టు వెలిపట్టు వెలినెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలుమేనితోవ జేనిచెలు వేని దెగఁబూనినగఁబూనుచిఱునవ్వు మొగముతోడ
నునువంక గలపొంకమునఁ గొంక కకలంక కాంతు లీనెడుపువ్వుఁగబరితోడ
మీఁడని యపారకారుణ్యవృష్టితోడ, నింపుగ వసింపు నాహృదయంపు మేడఁ
దొంటిచదువులగమికానియింటిగరిత, గరితరతనంబ నాయంబగురునితంబ.

చ. సిక నెలకొన్న (క్రొన్నెలను) సింగపుగో రని సారె కుల్కుకై
మెకము నిరీక్షణద్వయము మేనకకూఁతురి బెళ్కుఁజూపుచా
యకు మరలించి దాని కుడియారని సిగ్గు ఘటిల్లఁ జూపల
ప్రకటత మానఁజేయు గిరిరాజసుతాశ్రయు నాశ్రయించెదన్.

శా. పంచబ్రహ్మసమాఖ్యపంచపృథివీవాక్యాదితత్త్వాధిపో
ద్యంచత్పంచమహార్ణశోభితసురాధ్యక్షత్వసంశోభితుం
బంచాక్షర్యభిధానమంత్రవిదితుం బంచాక్షరాద్యక్షరా
కించిద్బోధితు సాంబు నేమనములోఁ గీర్తింతు (నశ్రాంతముక్).

చ. మగఁడు *సగంబుగాఁ దపము మానక చేసియుఁ దత్ప్రియత్వముం
దెగఁగొని మేటిచట్టునకుఁ దీవ్రపుఁ గూరిమికూఁతు రేనియుం

---

*యవ్వారవర్ణిని-మూ.

దగు లగువారి నేరములు తాళుచుఁ గోరికె లెల్ల నీను నే
మగువలమేలుబంతి (శాంభ)వి మమ్ము నేడు తఱిన్.

చ. అతనువిభూతి మై నలఁదినంతన తద్విజయంబు గల్గ దే
నతనువిభూతిమూర్తిమతి నై యతనిన్ జయలక్ష్మి చెందఁగాఁ
బ్రతినవహించి తద్గతిని బాయక నాయకు మై సగంబు
సుందరీమణి మనంబున నెంతు నభీష్టసిద్ధికిన్.

గీ. వత్స మొక కేల నొకట మువ్వంకకోల, శిరమునఁ దుండు తెల్లచేసినజలంబు
పశుపతిత్వంబు నీకసంబంధ మెట్టు, లనుచు గేస్తుని నగు చెలి నాశ్రయింతు.

మ. తృణ(తుల్యంబగు) బుద్ధిజాడ్యతమ మెంతే దూర మై పోవఁగాఁ
దృణమాత్రంబుగ విద్యలిచ్చి జనులన్ దీవ్యత్కృపం బ్రోచు నే
గుణమా నా కని ముజ్జగంబుల కసంకోచంబుగాఁ దెల్పఁగాఁ
దృణమాత్రాపచితిం బ్రహ్మాదిలుమహా(దేవుం బ్రశం)సించెదన్.

శా. శ్రీరామాయణకావ్యకల్పలతికాక్షీరాంబురాశిన్ మహో
దారుం బ్రాకృతశబ్దశాసను గుణాధారు న్నమస్కారసం
భార ప్రక్రియఁ దృప్తిచేసెద మహాభారత్యఖండాన్వయో
(ద్ధారున్ స్ఫా)ర వచోవిలాసు మదిలోఁ దార్కొందు నావ్యాసునిన్.

గీ. ధరణి కేతెంచు కవితాభిధానహంసి, కతులవిశ్రాంతిభూము లై యద్రసజ్ఞ
లనెడిసరసులు క్రమమున నబ్బె నట్టి, యార్యవర్యుల వాల్మీకి వ్యాసు నెంతు.

సీ. మానాదిషోడశమహితపదార్థ శోధనవృత్తిగల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకువాని
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండును నిశ్శ్రేయసంబను నేర్పువాని
గర్మంబు జ్ఞానాంగగతిఁ దాల్చు జ్ఞానంబు తారకం బనియెడు తాపసేంద్రుఁ
బ్రకృతి మహదాదితత్త్వసంపద్వివేక, మమర నిర్వాణమని పల్కునట్టివానిఁ
జిత్తసంశుద్ధి యల(రారఁ జేయు)వాక్య, పటిమ యలవడ హృద్వీథిఁ బ్రస్తుతింతు.

గీ. ముదము ద్రష్టకు నొసఁగుచు మూలకార, మర్మభేదన మొనరించుమహిమఁ గాంచు
నేమహాత్ముని దర్శనం*బిచ్చ లోనఁ, జాలఁ బ్రార్థింతు నయ్యహిసార్వభౌము.

గీ. కూడు నెవ్వానిసద్వృద్ధి గుణనిబంధ, వంబు నాద్యంతముల వివృతంబు సంవృ
తంబు వివృతంబె కడుసంవృతంబు మాన, నట్టిపాణినిమునిచంద్రు నాశ్రయింతు

సీ. త్రిప్రకారత నాత్మ దీపితంబుగఁ జేసి మూఁడుగుణంబులు మొనయఁ జేసి
పటుతరజీవికోపాయవృత్తు లమర్చి సాంగరూపక మొసంగంగఁ జేసి

---

*బిచ్చలోన - మూ.

యుచితనానావర్ణయుక్తు లొప్పఁగఁ దీర్చి యుత్తమాధికభేద మొనరఁజేసి
మఱియు నలంకారమంజిమ ల్వెలయించి శయ్యోపకరణసంసర్గ నిలిపి
తెలివి శబ్దార్థమయకావ్యదేహరచన, చేసి నిర్దోషభావతఁ జేసి విధికి
నవమతియొనర్చు కాళిదాసాద్యనేక, సుకవిమూర్ధన్యులనుతింతుఁ బ్రకటసూక్తి.

చ. ప్రకృతియుగంబు దీర్చుమునివర్యులకు న్సముఁ డైనపుణ్యుని
న్వికృతికి శిక్ష గాఁగఁ బదవిద్య రచించినవాని నంధ్రవా
క్ప్రకటకవిత్వకల్పతరురాజముబీజము సర్వవాక్యశా
సకబిరుదాంకనన్ననవిచక్షణచంద్రు నమస్కరించెదన్.

గీ. ప్రాణివర్ణకతద్ధర్మభవ్యనామ, సరళపరుషామహాన్మహాత్ స్థిరమయాంధ్ర
వాఙ్జగత్కర్త భూకవివాగ్వినేతఁ, జాఁగి మ్రొక్కెద నల శబ్దశాసనునకు.

గీ. వికృతికాధారతవహించి వికృతరహిత, శుద్ధభావత బ్రహ్మంబుసాబగుఁ గాంచి
జగములోనఁ బ్రకాశిల్లు సర్వవిదులు, నన్నయాథర్వణాద్యుల సన్నుతింతు.

గీ. ఎన్న వికృతివివేకంబుఁ గన్నవాని, కమరు భావిక్రియాజ్ఞాన మనుచు జ్ఞాను
లభినుతింపఁగ వెలయు మహర్షితుల్యు, సన్నుతింతు నథర్వణాచార్యవర్యు

గీ. *సరసమతిశబ్దశాసనజాతమాత్ర, నంధ్రకవితాశిశువుఁ బ్రీతియమరఁ బెనిచి
చాలఁ బ్రౌఢ నొనర్చినచతురమతులఁ, దిక్కయజ్వాదికవులఁ గీర్తింతుఘనుల.

ఉ. అప్పటివారలే నుతుల కర్హు లనర్హులు సన్నుతింపఁగా
నిప్పటివార లన్న నది యెంతటిమాట యఖండపాండితుల్
దప్పని కారణంబు లగుఁ దద్భజనంబున కంచు నెంచి నే
నిప్పటిపండితోత్తముల నెంతు నిరంతరభక్తియుక్తతన్.

మ. గుణదోషంబులఁ దెల్వి లేనిఖలులుం గోపింపఁ గీర్తింపఁగా
నణుమైనం బనిలేమ దోషములయుం దత్యంతసాధుత్వమున్
గుణజాలంబుల దోషభావము కడుం గూర్పంగ నేర్పొప్పు స
ద్గుణవత్పండితమాళిసన్నుతిఁ గొనం గోర్కెల్మదిం బుట్టెడున్

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియారస మూనఁబోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గె నని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
యొప్పు ఘటిల్లఁ గల్గ మది నుబ్బుఁడు పండితులార మీరు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పనె శిష్యునకీర్తి కీర్తియున్

---

*ప్రకటమతిశబ్దశాసనజాతమాత్ర మున్ద్ర-మూ.

గీ. ఏమహాత్మునిఁ దర్శింప నెసఁగు నఘ, పాదక ణచర జైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటిత మోద, మతసి మద్గురు మాధవు నభినుతింతు.
చ. కొదవ లెఱుంగ కెప్పుడు నకుంఠమహాహ్లాదయుతు లై భవంబు వే
పొదలఁగ భూరిసత్కృతులు పూని తమోహతిలేక యార్జవం
బొదవఁ గళంకితస్వదలి యూర్జితవాక్ప్రజయోగ మింపుగా
మదిఁ గొను మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రమున్.
సీ. తర్కపాతంజలకర్కశశస్త్రసంస్తరమండలంబున జిర్కబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబు చేసి
యతులసాహిత్యవిద్యాచారుదీర్ఘిక లాలితప్రీతిచే నోలలాడి
కపిలసాత్త్వతవేదయఘన తంత్రవాక్సుధాధారలఁ గోరిక లూరఁ గ్రోలి
చెలఁగుయద్దర్శనాభామయలఁతమాలి, యతని శ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి.
శా. మోహాంభోరహ హృదంబుజాంతరములో ముద్వాటికిం గొల్చెద
స్నేహాదిప్రతిషిద్ధదోషగుణసస్ఫూర్త్యానిరాసక్రియా
సాహిత్యప్రతిపన్నచిద్రసధురీసంబంధకృన్మానసు
"స్నాహి శ్రీరమృతా సతా" మితి వచస్సంపాదితశ్రీయుతు
న్సాహిత్యాంబుధిపారగు న్సకలశాస్త్రజ్ఞు న్గురు న్మాధవున్.
గీ. ఎవ్వనియశంబుజగమెల్ల నెనసి చుట్టు, కొండయవ్వాలితమ మెల్లఁ గొదవపఱుప
నల్పమాధేయమని పల్కదధిక భూమ, యతని కొనరింతు నతిమాధవార్యమణికి.
గీ. ఏకదినమేళనంబూను నెపుడుఁ బూర్వ, పక్షలాలితిఁ గొను గళల్పదియు నాఱుఁ
దాల్చు శశి నవ్వు నుతచతుర్దశకళైక, హారిఁ బ్రార్థింతు మాధవయజ్వచంద్రు.
క. కవివాక్పతు లై యెవ్వని, సువిధస్థితు లైనపురుషసత్త్వము లెల్లం
గవివాక్పతులం గేరుదు, రవురా నుతియింతు నతని నస్మత్స్వామిన్.
ఉ. వైదుషి లేకయే కవిత వచ్చె నటంచు వచించువారలం
గా దనఁగూడ దెట్లనినఁ గాకవిపల్కెడు శాస్త్రవాగ్వివం
వాదిదురుక్తుల న్వినఁగఁ బండితమౌళికి వేఁము దామరం
బ్రోదిగ నవ్వు దేనియలు పుట్టును రూపక మంగితం గొనన్.
గీ. దుష్టకవిత నిషేధించు దొరలసభలఁ, గలుగు పత్కవివరులకు ఘనయశంబు
తద్యశంబునకరయంగ దాతయగుటఁ, బండితామాన్యునకు నేని ప్రణతితగదె.

వ. అని యిష్టదేవతానమస్కృతియు సనాతనాధునాతన సత్కవీంద్ర గురుచం
ద్రపురస్కృతియుఁ గుకవితిరస్కృతియు నొనరించి నే నొక్కబంధురప్ర
బంధనిబంధనాయత్తచిత్తుండ నగుచు, నిప్పు డొనర్పంబూనిన సకలసద్గు
ణాలంకారసంపన్నం బగునిక్కావ్యకన్యారత్నంబునకుం దగిన నాయకర
త్నం బఖిలదేవతాశిరోరత్నం బగు శ్రీరామభద్రుం డగు నని పురాతనకృ
తసుకృతజనితమహాభాగ్యాతిశయంబువలనఁ దెలిసినవాఁడ నగుచు నప్ర
మేయప్రభావుం డగు నమ్మహానుభావునకు షష్ఠ్యంతంబు లగు పద్యంబులు
విన్నవించెద.

క. వీరాదివీరునకు నని, వారితసద్ధైర్యశౌర్యవచ్ఛత్రుచమూ
మారణకారణదారుణ, భూరిబలోదగ్రునకును బుషితోగ్రునకున్.

క. మిత్రాన్వవాయనలినీ, మిత్రునకుఁ గటాక్షితాత్మమిత్రునకు ధుతా
మిత్రునకు వృత్రశత్రుజ, మిత్రతనూజాత శత్రుమిత్రాఖ్యునకున్.

క. మాయాగృహీతమానుష, కాయునకుం గుశికతనయకర్తృకయాగా
పాయపరపరహితాకుచ, నైయర్థ్యవితానకీర్తివరదాయునకున్.

క. రామునకు నింద్రనీల, శ్యామునకు నరాతిసోమసంవ్రాతఘన
స్తోమసమీరున కత్యభి, రామగుణారామునకును రఘురామునకున్.

క. దుగదచ్చిలెక్క కిక్కగు, మొగములరాకాసితేనిముద్దుంజెలిమే
ల్మిగనిగలుమిగులుమొగమున,సొగసులనగువగలునిల్పసొగయనిదొరకున్

వ. అభ్యుదయపరంపరాభివృద్ధ్యర్థంబుగా లీలారాజన్యసార్వభౌముం డగుచు
రామరూపంబునం బ్రకాశమానుం డగు నద్దేవతా సార్వభౌమునకు నంకి
తంబుగా నొనరింపఁ బూనినకాళిందీకన్యాపరిణయం బను మహాప్రబంధం
బునకుఁ గథావిధం బెట్టి దగు నట్టివిధం బభివర్ణించెద.

—: కథాప్రారంభము :—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భమై సత్యలోకంబుతో సరసమాడు
నార్యాంగనామనోహరనీలకంఠమై కైలాసనగరివైఖరి వహించు
సంతతశ్రీనివాసస్ఫూర్త్యుదారమై వైకుంఠపురముతో వన్నెకెక్కు
సురుచిరాలంకారసుమనోనివాసమై సురరాజునిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియునుఁగూడివర్ధిల్ల నమరియుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాలి, కాఁపురం బైనయలద్వారకాపురంబు.

క. ద్వారవతీపదము ప్రశ, స్త్యాయూఢ*మతంబుగాంచు నది సర్వమహా
దారసురాసురమానవ, పారము లేవేళ నర్థి†వసియించుటచేన్.

చ. పగడపుదారబంధములుఁ బచ్చలచూరులుఁ బద్మరాగపుం
జగతులు వజ్రవప్రములు సానలఁదేఱిన కెంపుఁగంబము
ల్నెగడెడు నీలవేదికలు నిగ్గులుదేఱెడు రత్నవాటిక
ల్సొగసువహింప నప్పురము శోభిలుఁ బట్టణరాజరాజమై.

మ. ధర నప్పట్టణరాజ మంబరగతాత్మచ్ఛాయ నానాకముం
బరఁగం దోయధినీటఁ దోఁచుప్రతిబింబస్ఫూర్తి నభోగిరా
ట్పురముంగ్రమ్మి త్రివిక్రమత్వమున నొప్పంగ సాంప్రతం బేకదా
హరి యందుండుఁగదా త్రివిక్రమసమాఖ్యం బ్రీతచేతస్కుఁడై.

ఉ. మేలిమిరత్నదీధితుల మిన్నులు ముట్టెడు గోపురాళి నే
వేళఁ జరించుతమ్మునికి వేడుక నప్పురలక్ష్మి రక్షగా
నీలపురేకుఁగట్టె నది నేఁడును గానఁగవచ్చు దానినే
చాలనిబుద్ధి లోకము శశం బని పల్కును జందమామలోన్.

గీ. వఱలునప్పురి బలితంపు వార్థిపరిఖ, రత్నగర్భాదిశబ్దము ల్రాజిలంగ
నబ్ధిమేఖల గాకున్న ననువుగాద, టంచుఁ దద్భూషణంబు భరించె ననఁగ.

క. అతిరుచిరచంద్రకాంత, ద్యుతినై కవియుతము విబుధతోషాకరమై
హితసకలవస్తునికరో, ర్జితమై పురి కల్పవల్లిచెలువు వహించెన్.

గీ. ప్రచురరోచిస్సమాలీఢబాడబంబు, భూరినవరత్నరాశిసంపూరితంబు
హరినివాసంబు చిత్రసత్త్వాశ్రయంబు, నగుచునప్పురిజలరాశినగుచునుండు

మ. రతికాంతాంతవిభూతి సంతతతనుప్రాంతోపగూహాక్రియా
రతికాంతం బయి శేఖరామరధునీరమ్యాంబుసమ్మోద మై
ప్రతతైశ్వర్యవృషాంక మై నటన దీవ్యన్నీలకంఠంబు నై
‡ప్రతిలేకొప్పు శివస్వరూపవిభవప్రాప్తిం బురం బెప్పుడున్.

క. సకలాలంకృత యయ్యుం, బ్రకటవిశేషోక్తి విబుధరంజన మగు హం
సకరుచిర పదంబై, యకలంకస్ఫూర్తి మీఱు నప్పురి జగతిన్.

మ. ప్రకటౌదార్యవిశేషకాంతి సమతార్థవ్యక్తి సౌశబ్దరూ
పకసారాధికచిత్రచిత్రలిపిసంబంధంబు శ్రీకృష్ణనా

* మతుండుగాంచునదె-మూ. † వసియించుటయే. మూ. ‡ శ్రీప్రతి వేకొప్పు-మూ.

యక వైశిష్ట్యనితాంతభాసురమునై యప్పట్టణం బొప్పుఁ దా
నకలంకుల్ (ముదమ)ంద సత్కవితఁ గావ్యంబుం బలెం జూడఁగన్.

క. హరిదశ్వుఁడు తనయరదము, సరణి పురీసౌధములను సంకటపడుట
న్వెర వమర నొంటిగుఱ్ఱము, నరదమునకు నేకచక్ర మమరించికొనెన్.

ఉ. పచ్చలగో(పురంబు) జిగ పచ్చిక యంచుఁ దలంచి వచ్చు లో
మచ్చికజింకఁ బట్ట వడి నైె శశి యూఁకువ సేయఁ జంద్రుడై
నిచ్చలు బాఱు నయ్యమృతి మించుకి సోఁక సచేతనాకృతుల్
హెచ్చిన పైఁడిబొమ్మలకు నింతులకు (న్గనరావు భేదము)ల్.

సీ. గోపురోపరిఖేలకోకస్తనులగొప్పవిప్పుకప్పుమిటారికొప్పు లబ్బు
రంపు మబ్బు లటంచు రమణుల నును మేనుదీఁగెలు గ్రొమ్మించుదీఁగెలనుచుఁ
గరికరముక్తగంగాజలశీకరాసార లనుచుఁ
దదుదారతరబృంహితంబులు బలుగర్జితంబు లంచుఁ దలంచి యంబుధరము
లలనలు వస్త్వాధికారమన్యులకు నిచ్చె, విచ్చె మాగచ్చులని మది నొచ్చి నొచ్చి
వర్షగర్జితమిషము ములుక, వఱలు మేడల క్రిందట నొఱలుచుండు.

చ. సురతరు లంతికస్థలులఁ జొప్పడ నందలి దివ్యభూషలా
తరుణు లొకప్పు డొక్కటియుఁ దాల్పఁగఁ జూడ రలత్క్య మాటచే
సురుచిరభూష లొల్ల మటు చూచుచు గ్రమ నైనయు
త్తరువులపుష్పము ల్గొనరు తద్దయు వాడినవంచు నచ్చటన్.

ఉ. మేడలయందు నిచ్చలు భ్రమించు కలాపులు డాయఁ జూచి య
య్యేడుగుఱాల తేరియురగేశ్వరరశ్ములు వాఱ వాని వె
న్నాడఁగఁ గుంటిసారథికి నబ్బమి వే పయనంబు సాగమిం
దోడనె తానె పోయి వడిఁ దోయజబంధుఁడు పట్టి రశ్ములన్.

చ. పడమటివెట్టకు న్వెఱచి భామలు సౌరణగండ్లు మూయ న
క్కడ గతి నిల్వఁ గాక వడిఁ గ్రమ్మినఁ బొనిడఁ బొవుచుండఁగాఁ
గడుఁ గవిపించె మందగతి ఘర్మమరీచికి గ్రీష్మవేళ న
జ్జడత చిరార్జితం బగుట సంగత మయ్యెడు నిప్పు డేనియున్.

చ. పురిగరుడాశ్మసౌధరుచిపుంజము ఘాసమటంచు నెంచి లో
హరిణము చొకళింప శశి యాత్మమనోహరవక్త్రపంకజ
స్ఫురదుపమానవృత్తిఁ గొనఁ జూడఁగఁ జాలక కజ్జలంబుచేఁ
దరుణులు కప్పి నర్చిరదిఁ తప్పక చందురునందు *నుండఁగన్.

* నిందుగన్ - మూ.

క. బాలికల డాఁగుమూఁతల, వేళల సౌధములయందు వెతకెడువారిన్
లీలఁ గిఱరింతు రచ్చట, మేలిమిబంగారుబొమ్మ మెఱుఁగువ గొనుచున్.
క. అచ్చటి మదిరాక్షులు నై, యచ్చరకన్యకలు నాబ లాడఁగ భేదం
బిచ్చఁ గననయ్యెఁ జూపఱు, కచ్చపుఁగనుఱెప్పపాటు లందమిఁ గొనుటన్.
చ. అనుదిన మింద్రనీలమణిహర్మ్యరుచిప్రతతీతమిస్రసం
జనితహరిద్భ్రమాకులత సౌధగవాక్షముఖప్రచారవృ
త్త్యనుగతఖేదము ల్పడల నంబురుహాప్తుఁడు దక్షిణోత్తరా
యణములఁ బోయెఁ గాన నిపు డవ్విధి యాతని కిష్టమార్గముల్.
ఉ. మానితదివ్యరత్నగణమండితసౌధతలంబుల న్సుఖా
సీనత నుండు నెచ్చెలుల సిబ్బెపుగుబ్బలు డాయుసత్ఫల
వ్యానతకల్పశాఖల ఫలావళిఁ దున్మదు రంచితస్ఫుర
త్పీనపయోధరప్రతిమఁ దేలఁగరాఁ గడు నీసుచే బలెస్.
ఉ. వెన్నెలకుప్పలాడునెడ వేలుపుటింతులు దాము గెల్పుచేఁ
గొన్నయనర్ఘరత్నములు గోరికి మీఱఁగ నీరు మేడపై
నున్నపయోజగంధులకు, నొప్పఁగ వీరు జయించి వారిచేఁ
గన్నయనర్ఘరత్నములు గల్గినవాట గ్రహింప రేమియున్.
చ. కడుమిగులారు సౌధములఁ గంజదళాక్షులఁ గూడి యాడుచు
న్నెడఁ గలసొమ్ము గన్గొనుచు మెచ్చుచుఁ గోరనిదేవకామిను
ల్నుడువఁగలేరు వారిమది నూల్కొను కోరిక దీఱ భూషణం
బిడక మెలంగు నెచ్చెలువ యెంచఁగ నొక్కతయేని లే దటన్.
క. అన్నగరిలోని వజిరపు, మిన్నాసౌధములు డాసి మింటం జనుచుం
గ్రొన్నెల తద్రుచు లెనయుచుఁ, బున్నమనాఁ డంటికొన్న పోఁడిమి గనియెన్.
చ. మృగమదచిత్రకంబు గొను మేలుమొగంబులతేట చూడఁగా
మృగధరదర్పణంబు గని మీనవిలోచన లెల్లఁ దుల్యత
న్నొగములు గానరామి మది మూకొను నీసున నీకళంకిచే
నగు నిటు లర్థబోధ యని యద్దము చూతురు వేడ్క మీఱఁగన్.
క. పిన్నలమెడ కగుఁ బులిగో, రన్నన్న యటంచు మెచ్చ నంబుజపాణుల్
క్రొన్నెలఁ బట్టుచు మార్గవ, మన్నను లేదనుచు విసువ నరుగు న్నెలయున్
చ. అరచలినిగ్గు మానుదురు లందము గాంచునొ కానలేఁడొకో
యరయుద మంచు నెన్నుదురు లాదముమీఱఁగ నంము నిల్పుచుం

దరుణులు నొచ్చి ఘాలములు దాఁ గటికించు విడంగఁ బోవునా
యరనెల తన్మృగీమదము నంటినమేను గృతార్థతం గనన్.

మ. తరుణీమంజులలోచనాంచలమిళత్తారళ్యలాలిత్యముల్
గర మబ్రంబుగఁ జూచి సిగ్గువడుచుం గన్నుల్ముడుంగ న్సుధా
కరులో *జింక చలింపకున్కిఁ గనియె న్నాకున్న సౌధాగ్రవి
స్ఫురదుచ్చావచసింహపుత్త్రికల పెంపుల్చూచి కాలూఁదునే.

చ. జనములు శూన్యముల్ శశివిషాణముఁ బోల్తురు కల్మి లేమియుం
గననగు నంచు హస్తకటకంబుల పచ్చలడాలు ఘాసమం
చనువుగ మూరుకొంచు వినతానన పూ శశిలో శశంబుఁ జే
ననగొననంటి చూతురు మనంబునఁ గౌతుక మొప్పఁ గన్నియల్.

క. జలజాక్షులు ముఖరాగం, బుల తా లెల్లం గరంగఁ బూనఁగ నాత్మో
పలమాత్రముఁ గరఁగించిన, నెల సాటియె యట్టివదన నీరజములకున్.

క. పురగోపుర హైమాంబుజ, పరిరక్షణసేయు దేవపతికరివలనన్
హరిమధ్యామధ్యంబులు, హరివిభ్రమ మొదవఁ†జేయు ననుదిన మచటన్.

గీ. గంధవతిపంకవతియనగగనగంగ, గుణముదోషంబువింతగాఁగూడుకొనియె
సౌధకోకస్తనీతనుస్నానగళిత, దివ్యచందనపంకం బుదీర్ణమగుట.

చ. గగనము నొందునేటఁ బురకాంతలు సంతస మొప్పఁ గ్రుంకఁగా
మొగములు వింతలిమ్ము లని మూర్కొన మూఁగును దేఁటిగుంపు లిం
పగు నదిలోని హైమజలజావళి రోయుచుఁ జారునాసిక
న్నొసగులచన్పకంబు లని స్రుక్కుచు మూర్కొనలేవు భీతిచేన్.

క. పురసౌధచిత్రరత్న, స్ఫురదమిత విభాకదంబ పుషితము లగుచుం
గరము లిరవొందెఁ గావున, హరిదశ్వుఁడు చిత్రభానుఁ డనఁగా బరఁగెన్.

చ. గురుతరగారుడాశ్మకృతకుట్టిమభూముల గొండ్లిసేయున
త్తరుణులనవ్యగాసము ముదంబున వించుఁ జలింపకుండఁగా
కరుదె పయోజబాంధవరథాయతదృక్ఛ్ఛృతిరశ్మి లెల్ల న
వ్వరమణిజాలదర్శనము వాటిల గాటపుభీతిఁ బోవుటన్.

గీ. అగు మహాపద్మపద్మశంఖాదినిధులు, కొలఁకు లిరవొంద నీలముకుందనిధులు
సౌధములుగుందనిధులనుజారువనులు, వరనిధియనంగఁబురమంతవఱలుచుండు.

---

*మూలములోఁ బలుతావుల "చింక" యని కాన్పించుచున్నది. †జేసియనువెన మూ.

చ. తరుణీరత్నమనోజ్ఞకంఠనవరత్నస్ఫారహారంబు ల
చ్చెరువుంజక్కెరవింటికయ్యములవిచ్ఛిన్నంబుగా జాఱు న
వ్వరరత్నంబులు శోధనీముఖముచేఁ బ్రాభాతవేళం జెలుల్
శరధిం జార్పఁగ నూత్నరత్ననిధియ న్సంజ్ఞం గను న్వార్ధియున్.

చ. చెలువలు మేడలోఁ జెలిమిచే నిడుసొమ్ము భరించి వేల్పురా
చెలువలు చిత్తరంపడుచుఁ జెల్వగుసొమ్మది వేఁడఁబోయిన
న్వెలవెలఁబాఱెఁ గల్పకము వేలుపుగిడ్డియు మోము మోడ్చెఁ గే
వలము ఫలస్వభావమున వర్తిలె నిర్జరలోకరత్నమున్.

శా. కేళీభూధరము ల్విరాజిలుఁ బురిం గేళీవిలోలాంగనా
పాళీచారుతనూపరీమళమిళత్ప్రాథఃప్రపూరాపగా
నాళీకాక్షులఁ గాంచి తోయనిధికి న్నవ్యప్రమోదంబుగా
హాళిం బెండ్లి యొనర్చి పూర్వసరిదాహ్లాదంబు స్రుక్కించుచున్.

క. ద్వారకచుట్టు మెలంగెడు, చారువిశేషమునఁ దద్ద సాదరజాతో
దారనదులంటఁ దోయధి, కోరికతోఁ గ్రొత్తపెండ్లికొడుకై యలరెన్.

క. అరు దందుచుఁ బురియందము, నిరతంబును నిర్నిమేషనిస్తంద్రములై
పరఁగెడుకన్నులఁ జూడఁగ, సురలు నిమేషంబు నిద్రసోఁగయరు దానన్.

లయగ్రాహి. ఇందుమణివేదికలయం దొనరి యిందుముఖు
లందమగుగానముల నిందుమణు లెల్లం
బొందుగఁ గరంగనట సుందరపుమోముజిగి
చందములు చూచుకొని చందురునియందీ
చందమగుపొందికలు చెందినవొ లేవొ కనుఁ
గొందమని చూచి బెళుకుందనము కంటం
జెందదిది జింకసరి సందడిక నిందుఁడని
సుందరులు గేలిగయికొందురొగివీటన్.

క అర్థపతియైన సరియే, యర్థివదాన్యులకు నప్పురాగ్రణి నర్థం
బర్థులు వేఁడినయప్పుడె, యర్థులఁ జేయుదురు వారి నతిచిత్రముగన్

చ. తలఁపగ నర్థివాచకపదంబుల గౌణత గాంచె దాతలం
బలుకుపదంబులొప్పె మముఁ బల్కెడిశబ్దములందు గ్రౌణత
న్నెలఁగు నటన్న మేము మదిమెత్తుమె వ్యత్యయమైనఁగాక యుం
చలరుదు రందు దాతృమను లద్భుతవస్తువితీర్ణసంపదన్

క. అతులప్రసాదగంభీ, `త లర్థవ్యక్తి మధురరసముల రసవా
క్త్రతులనఁగ సరసులొప్పె, న్సతతము సరసులకు మనము సరసతనలరన్.
శా. సాయంకాలనటన్మహానటజటాసంగంబుచే నావిల
ప్రాయంబై జిగి మానుగంగ యట సౌవర్ణాబ్జనాళు ల్గన
న్మేయంజిత్త మిగుర్పఁ దత్సరసి యామిన్నేటిమిన్నాసిత
చ్ఛాయామేయముఖగంబు లప్పురిసరస్సంవాసముల్ గైకొనున్.
ఉ. మేడల గాయను ల్మిగుల మెచ్చుగ గానముసేయఁ దచ్ఛ్రుతి
న్వేడుకనుండు *హూహుక యివీడని వీణియదండ మప్పుడే
కూడిప్రవాళవత్వ మదిగోలె ఘటిల్లెఁ బ్రవాళసంజ్ఞ యా
జాడనె దండమాత్రమున సంధిలెనెన్నఁ దదాఖ్యయేభువిన్.
సీ. గౌతమమునిభావకలనచే నొకవేళ నొకతఱి కణచరానూనమహిమ
నురగేంద్రవృత్తిచేనొకమాటునొకతేపఁ గపిలవాచంయమోత్కటవిభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటవృత్తి
వల్మీకసంభవవ్యాహృతినొకయెడ నొకసారె భరతవాగ్వ్యక్తిమహిమఁ
బ్రొద్దుపుచ్చును యువజనమోద మమర, మేటియవ్వీటి మేడలమేలురత్న
పంజరంబుల నెలకొని ప్రతియెఱుఁగక, గణనమించినశుకశారికాగణములు
చ. అతిమధురంబు లౌఫలము లబ్బియుఁ బువ్వులులేమి దుర్యశం
బతిఘనమంచు సర్వకుసుమాస్పదతం గనె నన్నమాడ్కి మా
రుతగతిఁ బైకివచ్చిన తరుప్రసవంబుల రాజిలు న్వన
స్పతు లగువృక్షము ల్పురముపజ్జల నొప్పువనాళినెప్పుడున్.
సీ. కౌశికమందారఘనతమైరావతభూషితం బయిసురపురముమాడ్కి
మాధవీపున్నాగమహావీయరూపమై ఫణిరాజశాయిపట్టణమురీతి
స్థిరతమహైమవతీకుమారక శివాస్పదమౌచుఁ గైలాసపదముకరణిఁ
బ్రచురప్రతాపసపాక జాసనసదాలంబమై సత్యలోకంబుపగిది
వెలయు నప్పురిలోపల వేలకొలఁది, యాలసపవమానకంపితవిలాసదసమ
కుసుమవిసరవినిస్సరత్కుసుమరసత, రంగిణీపుష్పవార్ధినీరములువనులు
సీ. గుణవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై పాణినిగ్రంథంబు పటిమగాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణమౌచు నేతుపాదీయంబు ననుకరించి

*హాహాలు మా.

కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వీక్షణాక్షీణసమ్మోదహేతువై వ్యాసవాచార్భటి వన్నె కెక్కి
కవితనవరసఫలకమై ఘటితమత్త, శిఖిమధువ్రతవిలసితస్ఫీతమగుచు
నసమకవిరాజకావ్యంబుననుకరించి, చూడనింపొందునచటియాక్రీడవనులు

క. అమితధ్వనివైచిత్రియుఁ, గ్రమహీనత్వాదిదోష (రహిత)ము వని కా
వ్యమనఁగఁ బరఁగె నసిద్ధో, పమత విసంధితయు గుణతఁబరఁగె నరిదిగఱ

సీ. బహువిధాలంక్రియాపదనిజాకారమై యుపమోపమంబొచు నొప్పుగాంచి
కవితల్లజప్రాప్తి కవితోక్తిధుర్యమై యతిశయోక్తివిలాస మాదరించి
యుత్తరోత్తరసువస్తూత్కర్షలలితమై సారభూషారీతిఁ జొకళించి
యనుపమఫలమనోహరభావమగు చనన్వయభూషణంబు గర్వమువహించి
తనరు నుద్యానవిపినకదంబకంబు, శాఖిశాఖాశిఖాహతి జర్జరితశ
శాంకతనుగళదమృతధారాకృశప్ర, వాహపూరితవితతాలవాలకంబు.

సీ. కేళీరతకుమారికాళీకృతవిలాసపాళీరుచిరకుంజభాసురములు
నంగీకృతస్వానసంగీతమత్తసారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభానూనాభ్రమణి పదాధీనామితాద్రిసమ్మానితములు
గంగానదీకీర్తిభంగానుగతమహాభంగాపగావళీసంగతములు
సురుచిరామరభూరుహాసుమవిరచిత, గర్భితవిరాగసురసతీకరపయోజ
లగ్న(శాఖమహీరుహాగ్రగ)సుమములు, తీవఁజెలువొందునచటిలీలావనములు.

సీ. మత్తమయూర సన్మత్తకోకిల హంసపదభృంగ విలసితభ్రాజితంబు
హారిణీగణోత్సాహ కురరీరుతస్ఫీత ముత్పలమాలికాయోజితంబు
బంధురజాతి చంపకమాలికోపేత మురుమణిగణనికరోర్జితంబు
జలధరమాలికా చారుమత్తేభవిక్రీడితరభస సంకీలితంబు
మంజుల సుగంధి మాలినీ రంజితంబు, నసమశార్దూలవిక్రీడి తాంచితంబు
లలితసుమగుచ్ఛపరిమళరాజితంబు, సుకవికవనంబునాఁబురిసొబగుఁగాంచు.

సీ. పటురోషకృత కేశపాశతాడనములు బహుళకోపార్జితపాదహతులు
దోర్వల్లరీకృతాఖర్వవేల్లనములు కందుకారచితసంఘట్టనములు
వక్షోజగిరికల్పితక్షోభణంబులు నక్షీణనఖరదంతక్షతములు
గాటంపు గండచపేటపాతనములు కచచయాంబరసమాకర్షణములు
బంధవిధములుమణితనిస్వానభిదలు, భాగవిపరీతగతులునుబ్రబలియుండఁ
దత్తరంబున నిక్కుకోపాడదాడ, ధాటికదనావసరము దంపతులకు.

క. సరసధ్వను లుప్పొంగఁగ, వరగుణవిచ్ఛిత్తిగా నవారణ జాతిం
బరిమళితభూషణంబులు, సురతనిబంధనములందుఁ జోద్యమగుఁబురిన్

చ. సురుచిరచిత్రబంధములు శోభిల వాచ్యవిశేషవైఖరు
ల్కరముఁ బ్రకాశమంద రసగౌరవహాని నిదానదోషము
ల్పరఁగుట మానఁగా నవనవస్ఫుటచారురసధ్వను ల్పరి
స్ఫురణవహింపఁగా మిగులఁ జోద్యము లయ్యె రతిప్రబంధముల్.

క. చోరాభావముతో వ్యభి, చారిత పురి సడల రతులసాత్త్వికభావం
బారాజధాని నైకొను, నారూఢస్ఫూర్తి దనరు!వ్యభిచారిగతిన్.

క. అమితరసము సంలక్ష్య, క్రమచేష్టలఁ దనరె వస్త్వలంకృతు లితర
క్రమతగయికొనియె నప్పురి, కమలాక్షుల కమరుమదనకదనములందున్.

వ. మఱియు నప్పురీమతల్లిక రత్నాకరంబుఁబోలె ననంతసత్త్వాశ్రయం బై రత్నసానుసానుమంతంబు కైవడి ననేక దేవతాయతనం బై కైలాసధరాధరంబుమాడ్కి రాజకుమారక వినాయక విరాజితంబై తుహినమహీధ్రంబులీల సర్వమంగళోత్పత్తినిలయంబై యుదయాచలంబు తేవఁ గళానిధిసూర్యమహాదయకారణం బై లోకాలోకనగేంద్రంబుపోలిక నిజాంతర్నిష్టద్రవ్యసాకల్యంబై సుధర్మాప్రదేశంబుక్రేవ సధర్మత వాక్పతిసురపతిదిశాపత సమధిష్ఠితంబై పద్మజునాస్థానంబు పోల్కి వేదాంత నిరంతర పారాయణపరాయణసరస్వతీధరసమాక్రాంతం బై జలజోదరు నివాసంబుపసఁగమలాలయానంత శకుంతరాజ విష్వక్సేనాభిరామం బై కుబేరభవనరాజంబునోజ మహాపద్మాదిసంఖ్యావిషయనవరత్ననిధితా ప్రథితం బై మానససరోవరంబుపగిది రాజహంససంకులంబై ధరావలయంబుపోలుపున జలధిపరివేష్టితంబై రాకాచంద్రబింబంబుచాయ సకలకలతామనోహరం బై రక్షోవైరివక్షఃస్థలంబువడువున వైజయంతీ వనమాలికారమాలంకృతం బై రవిబింబంబు వడువునఁ గమలాసంకోచకర నిజోదయం బై తారామండలంబుభాతి విష్ణుపదపదంబై సత్పురుషుహృదయంబుతీవఁ బంక లేశస్పర్శానభిజ్ఞతావిశదంబై మహాదారచిత్తంబుభంగి విత్తతృష్ణాజ్ఞానరహితంబై రసాతలంబువైఖరి బలిపురుమనికేతనంబై దామోదరునుదరంబుగతి నశేషవర్ణపరిపూర్ణంబై గౌరీరమణుకొల్వుకూటంబు తేట ధనాధిపవృషభశక్తిధరధరాపాలకసముపసేవితం బై సాకేతనగరిచాడ్పున రామచంద్రసంబంధ

బంధురరాజసదనంబై గంగాప్రవాహంబు పరిఖవంబునఁ ద్రిలోకీప్రసిద్ధగో
చరంబై శ్రీమద్రామాయణంబుకరణి సప్తకాండపర్యంతవ్యాప్తగోవిలాసం
బై మహాభారతమువన్నియ బహుసుపర్వప్రతిపాదితకథాప్రసంగం బై
భాగవతంబుపొంపున విపులస్కంధానుసంధానితంబై యాద్యప్రకృతివ్యా
కరణంబుసొగసున నుత్తమాత్మపురుషవిఖ్యాతంబై ప్రకృతివ్యాకరణంబుర
హి నద్విర్వచనంబై వికృతివ్యాకరణంబువహి నపూర్వరూపంబై యుత్త
మకావ్యంబుచెన్నునఁజమత్కారివ్యంజనంబై మహా*నాటకంబు దొరసున
నతిమనోహరాంకంబై దండనీతిఖ్యాతి సరాజలక్షణంబై గ్రహశాస్త్రంబు
నందంబునఁబ్రత్యక్షీకృతాదృష్టపదార్థంబైరతిప్రబంధంబు తెలివిఁ గళాహృద
యంగమంబై సాంఖ్యంబుసాటిఁ బ్రధానప్రశస్తివిస్తీర్ణంబై యోగతంత్రంబు
సరి సమాధ్యవస్థా†హరణప్రవణంబై ఛందంబుచందంబున లసద్వృత్తలక్ష
ణంబై పాతంజలంబు నీడున నఖిలశబ్దాకరం బై నిగమంబుజోడున సత్య
వచనప్రచురంబై గీతశాస్త్రంబుపొందిక నకలంకకాంతపురుషరాగానుబం
ధం బై భరతఫక్కికచక్కన ననుగృహీతసర్వరసనిష్పత్తికం బై యాయు
ర్వేదంబుతోడున సర్వధాతు నిధానంబై యాన్వీక్షకిచాడ్పునఁ బ్రకాశిత
నిఖిలపదార్థస్వరూపం బై పూర్వతంత్రంబురాణ విభక్తాంగికప్రధానకా
వ్యంబై యుత్తరమీమాంసజాడ సారోపాపవాదం బై బ్రహ్మంబుతీరున న
వాఙ్మానసగోచరంబై యవర్ణం బయ్యు సవర్ణం బై యపరభాగం బయ్యు
సపరభాగంబై యనీతిప్రచారం బయ్యు సనీతిప్రచారంబై యదృష్టచరం
బయ్యు సదృష్టచరంబై యశ్రుతపూర్వంబయ్యు సశ్రుతపూర్వం బై యబ
లాభిరామం బయ్యు సబలాభిరామంబై యాశ్చర్యంబులకు నావాసం బై
యానందంబులకు నాటపట్టై యనభిజ్ఞులకు నవేద్యం బై యాచారంబులకు
నాస్పదం బై యభిజ్ఞులకు నతిసుఖంబై యార్తులకు నధికశరణ్యంబై యగు
ణంబులకు నతిదూరం బై వెలయుచుండు.

సీ. వాదించిరా సృష్టి కాదట ప్రతిసృష్టిపరఁగించి గెల్తు రాబ్రహ్మనైన
వెలిపించిరా జగద్విఖ్యాతి నలకాలుఁ గన్నుఁ జూపుదురు ముక్కంటికైన
మెచ్చిరా సంపద లిచ్చి సంరక్షించు బలిమియుఁగలరు శ్రీపతికి నైన
నలిగిరా వ్రేల్మిడి నాపోశనంబుగాఁ ద్రావిపుత్తురు జలరాశి నైన

---

*మహానాదంబు—మూ. †హారణ—మూ.

సకలవేదపురాణశాస్త్రములకలిమి, వేయినోళ్లనుఁగొనియాడువిమలమహిమ
సత్యనిత్యసదాచారసద్గుణములు, వెలయుచుండుదు రప్పురి విప్రవరులు.

సీ. జలజాతసూతి నై మెలఁగుచుండియుఁ దాను జలజాసనత్వంబు సమ్మతించె
నను మనసారగా గని మోహాగతి నింటిగరితఁజేసె
దోషాకరత్వంబుఁ దొలఁగకుండఁగఁజేసి ద్విజచక్రముల భీతిఁబెరయఁజేసె
జలన మందఁగనీక సతతంబుఁ దలవాకిటను నన్ను నిలువఁ గట్టడియుచేసె
ననుచువిధినిందగావించియుచటువాసి, పలుకుచిలుకలకొలికియింపొలుకఁదమదు
చెలువునె మ్మోముదమ్ములఁజేరినిలువఁ, బెంపుగాంతురు పృథ్వీనిలింపు లచట.

క. చతురాననచతురానన, సతతాధిగతాధికప్రశస్తసువిద్యల్
చతురైకనిజముఖంబున, నతులస్థితి నలవరింతు రచ్చటివిప్రుల్.

గీ. అప్పురంబులోన నలరారు నాకభూమి, దేవునేని గన్నఁ దెలివికాని
నఖిలదర్శ నాగమకర్తృసం, దర్శనానుభూతి దప్పకుండు.

ఉ. ఆనతశస్త్రవాహిను లహర్పతితేజులు సంగరక్రియా
నూనమహాప్రతాపులు మనోభవరూపవిలాసవిగ్రహు
ల్దానగుణాభిరాములు సదా మతిమంతులు ధీరు లుత్తమ
జ్ఞానులు సత్యవాదు లవిషణ్ణులు తత్పురిరాకుమారకుల్.

సీ. వసులకాఁపరితోడ బలుపొందు గైకొన్న యొకనరుచేతులయోపి కెంత
విషమదృష్టులయొద్ద విలువిద్యగైకొన్న పరశురాముని బాహుబల మదెంత
కుశలవవిజయంబు గొన బల్మిచాలక వెనుకఁ ద్రొక్కినరాము వీర్య మెంత
నిలువుగన్నులు వడి యిల నిల్వలేనిసేనల నేలు గుహుబల్మికలిమి యెంత
యనుచు నెటువంటి వీరుని నౌర యనుచు
మెచ్చుకొనుమాటఁ బూనరు ముచ్చటైన
హార్యవార్యసమాధుర్యశౌర్యు లగుచు
సూర్యసోమాన్వయులు రాజవర్యు లచట.

ఉ. మానిత*హాలికోక్తియును మానసలవృత్తియు గోపకత్వముం
బూనినవార లప్పురికి ముఖ్యులు గావునఁ దారు సట్ల స
న్మానితహాలికప్రకటమానసలగోపకవృత్తిసంపదల్
గానసుపొంది వైశ్యులు విశాసత నుండుదు రప్పురంబునన్.

---

* హాలికోక్తి - మూలము.

# శ్రీస్కాందమహాపురాణ మేది?

(ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు)

సుజనవతంసులారా!

"స్కాందమహాపురాణము" అనుశీర్షికతో నీపరిషత్పత్త్రికయందే (౧౫సం॥ ౨సంచిక) బ్ర. శ్రీ. విద్వాన్-కట్టి సాంబమూర్తిశాస్త్రిగారిచే వ్రాయఁబడిన వ్యాసమును నేఁడే నేను గాంచితిని. అందు నాకుఁ గల కొన్ని సంశయములను- సహృదయులకుఁ దెలుపుచు- నాయభిప్రాయమును వ్యక్తీకరించుటకై నే నీవ్యాసమును వ్రాయుచుంటిని. విమర్శకులు విమర్శించి సత్యమును గనుఁగొందురుగాత.

## స్కాందపురాణచర్చకుఁ గారణ మేమి?

ప్రప్రథమమున మనము స్కాందపురాణవిషయమై చర్చవచ్చుటకుఁ గారణ మేమి యో విచారింతము. స్కాందపురాణములు రెండుగలవు. ఆరెంటిలో నొకదానియందు- సప్తఖండములు- ఎనుబదియొకవేయ శ్లోకములును గలవు. మఱొకదానియందు నాఱుసంహితలు- ఏఁబదిఖండములు- లక్షశ్లోకములు గలవు.

వీనిలో మొదటిది యగుస్కాందము-(అనఁగా నేడుఖండములు-నెనుబదియొకవేయి శ్లోకములు గలది) ఖేమరాజు శ్రీకృష్ణదాసుగారిచే బొంబాయియందలి వేంకటేశ్వరముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. రెండవది యముద్రితము.

శ్రీకృష్ణదాసుగారు తాము ముద్రించుటయేగాక, తాము ముద్రించిన స్కాందమే మహాపురాణ మనియు, రెండవది యుపపురాణ మనియు సంస్కృతమున గొప్పపీఠిక వ్రాసిరి. మఱియు "స్కాందమహాపురాణవిషయక సందేహనిరాస" మను పేరితోఁ బైవిషయమును సమర్థించిరి.

స్కాందమహాపురాణ మచ్చుపడిన దని తెలిసిన వెంటనే యనేకు లీముద్రిత మగుస్కాందమును దెప్పించి చూచిరి; కాని, వారిదివఱలో సంప్రదాయముగా మహాపురాణాంతర్గతము లనివ్యవహృతసూతసంహిత- శంకరసంహిత- మొదలగునవి యందు లేకపోవుటయు, నవి యుపపురాణాంతర్గతము లని వ్రాయుటయు, స్కాందపురాణచర్చకు హేతువులు.

స్కాందపురాణద్వయమునందుఁ గలపరస్పరభేదములనుగూర్చి కృష్ణదాసుగారిమతానుసారముగా మామిత్రులు విపులముగా వ్రాసియుండుటచే, దానిని వ్రాయకవిడిచి, వారుమహాపురాణమని సాధించుటకువచించిన కారణసామగ్రికి సంగ్రహముగా నాకుఁ దోఁచినసమాధానమును వివరించెద.

ముద్రితస్కాందము మహాపురాణము కాదని చెప్పుటకుఁ గలకారణములు.

1. బ్రహ్మపురాణాదులయందు "వరంస్కాందపురాణంచ- స్కాందంతు సప్తధాభిన్నం" ఇత్యాదివచనములచే స్కాందపురాణమును గూర్చియే చెప్పఁబడినది గాని, మహాపురాణ మని గాని యుపపురాణ మని గాని చెప్పలేదు.

మఱియుఁ బదునూఁడవదియే స్కాందమహాపురాణమనియు, మూఁడవది స్కాందమహాపురాణము కా దనియు నెచ్చటను జెప్పలేదు. కావున మహాపురాణపరిగణితమును బదునూఁడవదియు నగు స్కాందమే షట్సంహితాత్మకము, లక్షశ్లోకసహితము నగుమహాపురాణ మనియు- ఉపపురాణపరిగణితము- మూఁడవదియు నగుస్కాందమే సప్తఖండాత్మకము- శతాధికైకాశీతి సహస్రశ్లోకసమేత మగునుపపురాణ మనియుఁ దద్గ్రంథకర్తల యాశయమై యుండవచ్చు ననియుఁ దోఁచెడిని. కొలఁదిమార్పులు ముద్రాపకుల వనియే విశ్వసింపఁదగియున్నది.

2. గారుడపురాణాదులందును కేవలము స్కాంద మనియే చెప్పఁబడియున్నది. కాశీకాఖండానుక్రమణికయందును "పురాణానిసకైవాని స్కాంధాదీని వదాధునా, స్కాందం కియత్ప్రకథితం గురుణా తే మహర్షిణా"అని కలదు; గాని, మహాపురాణ మని కాని, యుపపురాణ మని కాని వ్రాయఁబడలేదు.

3. వ్రాఁతప్రతులలోఁ గేవలము "ఏకాశీతిసహస్రసంహితాయాం" అనియే కాదు, "శతసాహస్రసంహితాయాం" అనియుఁ గూడఁ గలదు. కావున, స్కాందద్వయ ముండుటచే వానిభేదము దెలియక విలేఖకులు వ్రాసినవ్రాఁత పొరపాటై యుండవచ్చును. ఈవిషయమును వారు వ్రాసిన"ఏకాశీతిసహస్రసంహితాయా" మనుముక్కయే బోధించుచున్నది.

ఏలయన:—ఏకాశీతిసహస్రంచ పరమేవ శతాధిక"మ్మని బ్రహ్మవైవర్తమున నెనుబదియొకవేయినూఱుశ్లోకములు గల వని వచింపఁబడ వ్రాఁతప్రతుల లో నెనుబదివేలశ్లోకములే యని చెప్పుట ప్రమాదముగాక మఱేమి?

4. కాశీఖండము బ్రహ్మోత్తరఖండము మొదలగు కొన్నిఖండములు చేర్చుట మహాపురాణ మని రూఢిపఱుచుటకే యని తలంపవలెను. సుప్రసిద్ధము లగునీకాశీఖండాదిఖండములే లేకుండిన మహాపురాణ మని జనులు విశ్వసింపరు గదా! కావున ముద్రిత మగుస్కాందము మహాపురాణము గాదు.

మీరుచెప్పు మహాపురాణమున లక్షశ్లోకములే యుండవలయును గదా? రెండులక్షలశ్లోకము లెందుకు గల వందురా? వినుండు. మామిత్రులు చెప్పినటులు పురాణాదిగ్రంథములందు- అనేక ప్రక్షిప్తములు గలవు. అందువలననే రెండులక్షలశ్లోకము లున్నవి గాని లేనిచో స్కాందమున లక్షశ్లోకములే యుండును. ఈవిషయమును మఱొకసారి ముచ్చటించెదను.

మహాపురాణతాసాధనకై యితరు లవలంబించిన కొన్నియుపాయములు.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చే తి పురాణం పంచలక్షణమ్॥

అని పురాణముల కన్నిటికి సాధారణముగ లక్షణము చెప్పఁబడియుండెను. ఈలక్షణము వారిమహాపురాణమునకుఁ బట్టకపోవుటచే, వారు "బ్రహ్మవిష్ణ్వర్కరుద్రాణాం" అనుక్రొత్తలక్షణము నొకదానిని సృజించి తమయొద్ద ముద్రిత మగుస్కాందములోఁ జేర్చి దానిని తాము క్రొత్తగా సాధింపఁదలఁచిన మహాపురాణలక్షణముగాఁ బేర్కొనిరి. ఇంతకంటె మఱేమికావలయును?

అముద్రితస్కాందమే మహాపురాణ మనుటకు హేతువులు. కవిసార్వభౌముఁ డగుశ్రీనాథుఁడు తనకాశీఖండమున నేమి చెప్పెనో కొంచెము వినుండు.

సీ. పద్మాదికంబులు పదియు నెనిమిదియు నాదిపురాణంబు లాపురాణ
జాతంబు నాల్గులక్షలసంఖ్యగలయదియును బురాణములందు నుద్భవించి
పదునొకండవదియైబహుసంహితలతోడబహుఖండములతోడబహువిచిత్ర
కథలతో నేకలక్షగ్రంథపరిమాణకలితమై శ్రీమహాస్కాందమొప్పు
మూఁడులక్షలు పదియేడు మొనసిపోవ, దాఁబ్రవర్తిల్లు లక్షగ్రంథంబుతోడ.
సమధికస్ఫూర్తి నేపురాణములు సాటి, గరిమకందంబునకుమహాస్కాందమునకు.

వ. ఇమ్మహాస్కాందంబునకు నవయవంబు లాఱు సంహిత లవి క్రమంబున సనత్కుమారసంహిత పంచపంచాశత్సాహస్రిక, సూతసంహిత షట్సాహస్రిక, శంకరసంహిత త్రింశత్సాహస్రిక, వైష్ణవసంహిత పంచసాహస్రిక,

బ్రహ్మసంహిత త్రిసహస్రిక, సౌరసంహిత యేకసహస్రిక అను వచనము లచే శ్రీనాథమహాకవి లక్షస్కాందమునే మహాపురాణముగాఁ గైకొనినాఁడు.

మఱియు శంకరసంహిత, సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము (సంస్కృతము) మొదలగు ముద్రితగ్రంథములందు మహాపురాణ మనియేగలదు. స్కాందమహాపురాణకథలఁ దెనిఁగించినకవులందఱు మహాపురాణ మనియే వాకొనిరి. ముద్రితస్కాందమే మహాపురాణమని తలంచిన కవీంద్రుల వ్రాతలు జమ్మిక్రింద వ్రాఁత లనవలెను.

ఇంతియుగాక, లోకమందంతటను సాధారణముగా నద్వైతమతమే వ్యాపించియున్నది. అట్టియద్వైతమతస్థాపకు లగుశంకరభగవత్పాదులవారు, అద్వైతమతమునకు మూలాధారమగు శారీరక బ్రహ్మసూత్రమీమాంసాభాష్యమును వ్రాయుటకుముందు శంకరులు సూతసంహితను పదునెనిమిదిసారులు చదివె నఁట. చూడుఁడు.

శ్లో॥ శ్రీసూతసంహితావ్యాఖ్యా విద్యారణ్యకృతా శుభా
తామష్టాదశధా లోక్య శంకర స్సూతసంహితాం
చక్రే శారీరకం భాష్యం సర్వవేదాంతనిర్ణయమ్॥ సూతసంహిత.

అని విద్యారణ్యులవారు వ్రాసియుండిరి. సూతసంహితలో విశేషమేలేకుండిన శంకరులు ౧౮మాఱులు చదువుటయు, అనంతరము తదర్థమును భాష్యమును గా వ్రాయుటయు విద్యారణ్యులు టీకను వ్రాయుటయు సంభవింపదుగదా?

మనమిపుడు క్రొత్తగా సూతసంహితను నుపపురాణాంతర్గత మనిన లోకులు విశ్వసింపరు. విశ్వసించినను మహాపురాణములకుఁ గలగౌరవ ముపపురాణమునకు రానేరదు గదా? అయినచో "అర్వాచీనులు దమతమబుద్ధి వైభవము ననుసరించి తమకాలమం దేర్పడినక్షేత్రములనో వ్రతములనో యధికరించి కొంతగ్రంథమువ్రాసి పురాణముల కంటఁగట్టుటచే నీయుపపురాణము లుద్భవించుచున్నవి" అని మామిత్రులు వ్రాసిన నటులు నద్వైతమతముగూడ మధ్యకాలముననఁ గల్పిత మని చెప్పవలసివచ్చును.

కావున నాయల్పబుద్ధితో నేనెంతవఱకు విచారించినను ముద్రితస్కాందమే యుపపురాణ మనియు నముద్రితమే మహాపురాణ మనియుఁ దోఁచుచున్నది.

